అంతర భారతీయ పుస్తకమాల

# జీవితం : ఒక నాటక రంగం

మూలం

పన్నాలాల్ పటేల్

అనువాదం

వేమూరి ఆంజనేయశర్మ



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

ప్రథమ ముద్రణ : 1971 (శక 1893)
ద్వితీయ ముద్రణ : 1990 (శక 1912)



**రూ. 20.00**

*Original Title in Gujarati :* Manaveni Bhavai
*by Pannalal Patel*
*Telugu Translation :* Jeevitam : Oka Nataka Rangam

డైరక్టరు, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా
ఎ-5, గ్రీన్ పార్క్, కొత్త ఢిల్లీ-110 016 చే ప్రచురింపబడినది.

# వాచవి

పన్నాలాల్ పటేల్ ఆజన్మ కథా రచయిత అనే విషయం ఆయన రచనలను చదివి ఆయన సారస్వతాన్ని అవగాహనం చేసికొన్న వారి కందరికీ తెలిసిన విషయమే. అందువల్లనే వత్సల్ మేఘాణీ భాయీ (కీ. శే. ఝవేర్‌చంద్ మేఘాణీ) ఈయన రచించిన 'వళా మణాం' (వీడ్కోలు), 'మళేలా జీవ్' (ప్రియ జనులు) అనే నవలలకు మురిసి వాటిని స్నేహాభిషిక్తం చేయడం జరిగింది. ఆ తర్వాత ఆయన వ్రాసిన కథలు చిన్నవీ, పెద్దవీ అన్నీ అందరి అభిమానాన్నీ పొందాయి.

కాని 'మానవీనీ భవాయీ' [1] అన్నిటినీ మించిన విలక్షణమైన రచన. కథను కూర్చే నేర్పు 'మళేలా జీవ్' 'సుఖ దుఖ్ నా సాథీ' (కష్ట సుఖాల తోడు) లో ఉండనే ఉంది. కేవలం కళా దృష్టితో చూస్తే 'మళేలా జీవ్' లో కనిపించే ఆమూలాగ్ర సౌష్ఠవం 'మానవీనీ భవాయీ' లో అక్కడక్కడ అపరిమార్జితంగా ఉన్నందువల్ల కొంత అసమగ్రంగానే తోస్తుంది. కాని కళకు సార్థక్యం చేకూర్చి పురుషార్థ పుష్టితో కళను రమణీయంగా రూపొందించేది – అందలి వస్తు గౌరవమే అవుతుంది. ఆ వేదన ప్రతి జీవినీ స్పందింప చేస్తుంది. కాని ఈ స్పందనను కళా కృతిగా తీర్చి దిద్దేందుకు వ్యక్తినే ఆధారం చేసికొన్నప్పుడు ఆ కళా సృష్టి నిలబడ గలుగుతుందే కాని అందులో భవ్యత అనేది అంతగా కనబడదు. ప్లేటో సౌందర్యానికి నిర్వచనం చెపుతూ 'Beauty is the grandeur of good!' అన్నారు. అలాగే వ్యష్టిగా ఉండే కష్ట సుఖాలను ఆధారం చేసికొని ఉల్కాపాతంతో సృష్టి తరంగాలలో ఉయ్యాలలూగించే నౌకాయానం చేయగలిగినప్పుడే కళకు భవ్యత చేకూరుతుంది.

ఆదికవి హృదయం క్రౌంచ మిథున వియోగాన్ని చూచి ద్రవించిన మాట వాస్తవమే. కాని కరుణా బంధురమైన ఆయన వాక్కును ఆశ్రయించింది రాముని వనవాస వృత్తాంతము. ఉదాత్తమైన కళ వ్యక్తి గతమైన వేదనను ఉపేక్షించదు. దానికి ఉన్నత స్థాయిని కల్పించి అనంత

---

[1] 'భవాయీ' అంటే గుజరాతీలో దుస్థితి, యాజమాన్యము అని రెండు అర్థాలున్నాయి.

సృష్టిలో దానిని మేళవింప చేసి, భావకులలో ఉదయించిన కరుణను కార్య నిరతికి పురిగొల్పి, అసలు దోషం ఎక్కడ ఉంది, దానిని నివారించేందుకు ఎక్కడ ఎలాంటి సంస్కరణ అవసరం అనే విషయం చెప్పక చెప్పటమే కళ చేయవలసిన పని.

ఆది పర్వంలో కనిపించే శంతనుడు, గంగ, శిఖండి, భీష్ముడులాంటి పాత్రలు వారి వారి వ్యక్తిగత భావ గతిని యథాతథంగా నిరూపించేందుకు ఏర్పడ్డవి కావు. అప్రయత్నంగానే కురుక్షేత్రపు కూడలి, జనమేజయుని సర్పయాగానికీ ఈ పాత్రలు సూత్రధారులయినారు.

'లే మిజరబుల్' లోని జావాల్జా కేవలం వ్యక్తి కాదు, సమస్త సమాజానికీ అతను ప్రతీక. లేకుంటే ఈ రచన మామూలు కథలాగా రెండో అధ్యాయం లోనే ముగిసిపోయేది. అతన్ని కథలో ఒక వ్యక్తిగా చూపటమే ధ్యేయం అయివుంటే కారాగారంలో అతను పడ్డ అవస్థలు, బిషప్ ద్వారా అతనిలో జరిగిన హృదయ పరివర్తన- ఈ రెండింటితో కథ ముగిసిపోయేది. కాని కేవలం జావాల్జా, బిషప్పులతోనే ప్రపంచం పూర్తికాలేదు. -సమాజం కూడా ఉంది. జావాల్జా లాంటి వాళ్ళను బాగుచేసేందుకు గాని, చెడగొట్టేందుకు గాని ప్రయత్నించే వాళ్ళు చాలామంది ఉంటారు. కనుకనే హ్యూగోకు థేనారడియర్ లాంటి హృదయహీనుని, వన సమాజంతో మైమరచి జీవితం గడిపే మోబుఫ్‌ను, ఆదర్శజీవి అయిన ఏంజొలర్స్‌ను, ప్రణయజీవి అయిన మేరియస్‌ను, న్యాయ శాసనాలను వేట కుక్కలా అనుసరించే జేవర్ట్ వంటి పాత్రను సృష్టించడం అవసరమయింది. కథా పరిధానం కారాగారంతో ఆరంభించి చర్చి భవనాలలో సంచరిస్తూ చివరకు ప్యారీస్ విప్లవాదుల వీధుల (బ్యారీ కెడ్) దాకా వ్యాపించవలసి వచ్చింది– కారణం, జావాల్జా కేవలం వ్యక్తి కాక పోవటమే. ఉబలాటం, ఉన్మాదం మొండిపట్టుతో తన తండ్రి చనిపోయిన తర్వాత కూడా మరియు అతనిని ముద్దు పెట్టుకోవాలి అనే విచిత్ర వాంఛను వ్యక్తం చేసే థేనారడియారు కూతురు కూడా జావాల్జా యొక్క రూపాంతరమనే చెప్పాలి. అదే విధంగా గావరోశ్ అతని మరో రూపం. అతని మూడో రూపం విప్లవవాదుల్లో కనిపిస్తుంది. సకల సృష్టిని కథా రూపంలో వివరించి చెప్పటం హ్యూగో ఆశయం. అతనిని ప్రేరేపించిన ప్రబల కళా రూపానికి చరితార్థత చేకూరాలంటే మరో మార్గం లేకపోయింది. లోకోత్తరమైన

కళాభివ్యక్తి ఒకానొక వ్యక్తి చరిత్రను తీసికొని అందులో సమస్త సృష్టిని, ప్రాణికోటి కష్ట సుఖాలను ప్రతిబింబింప చేయకలిగినప్పుడే దానికి పరి పూర్ణత లభిస్తుంది.

రవీంద్రుని 'నౌకా డూబీ' నవలను 'ఘరే బాహిరే' తో పోల్చి చూస్తే ఈ విషయం స్పష్టమవుతుంది. 'నౌకా డూబీ' కూడా కళాత్మకమైన రచనే. కాని వేడి, వెలుతురు–ఈ రెంటికి మధ్య సామరస్యాన్ని సమకూర్చ డంలో 'ఘరే బాహిరే' లాగా 'నౌకా డూబీ' పరిపూర్ణమైన అనుభూతిని అందించ లేకపోయింది. 'నౌకా డూబీ' లో కమలా రమేశుల మానసిక సంఘర్షణ ఎంత తీవ్రమైనదయినప్పటికీ వారిద్దరి వ్యక్తిత్వం వరకే అది పరిమితమై పోయింది. వారితోనే అది ఉదయిస్తుంది, వారితోనే లయి స్తుంది. కాని 'ఘరే బాహిరే' లో నిఖిల్, సందీప్, విమల్ కష్ట సుఖాలు వ్యష్టి రూపంలో ఉన్నప్పటికీ సమష్టి గత రంగ స్థలాన్ని అలంకరిస్తాయి.

శ్రీ పన్నాలాల్ 'మానవీనీ భవాయీ' అనే ఈ నవలను కాల పరినిష్ఠిత మైన రచనగా రూపొందించటంతో నవలా రచన ఒక నూతన మార్గాన్ని అనుసరించ సాగింది. ఇది చారిత్రకమైన మార్పు. కాళా పలికిన పలుకులు అతని వ్యక్తిగతమైన భావాలనే కాక, గుజరాతు సరిహద్దులో నాలుగు దశాబ్దాల క్రితం కొత్త పాతల సంధియుగంలో మసలుతున్న పల్లెల విచార వల్లరిని నిరూపిస్తాయి. కాళా నిమిత్త మాత్రుడు. నిమిత్తం ఉపాదాన మయినప్పుడు కష్ట సుఖాలు ఉపశమించవు కాని ఇతి వృత్తానికి ఆధార కేంద్రాలు మారుతాయి.

'మానవీనీ భవాయీ' పల్లెటూరి జీవితానికి సంబంధించిన కథ. కథను ముందుకు నడిపించేది కాలం. కథ అంతటికీ కీలకమైన పాత్ర కాలం అనే అనిపిస్తుంది. మిగిలిన పాత్రలన్నీ ఆ కేంద్రంపైనే ఆధారపడి ఉన్నట్టు తోస్తుంది. సమస్త సమాజాన్ని ఆధారంగా తీసికొని అందులో కాళా అనే పాత్రను సృష్టించి పాతిక సంవత్సరాలగా కథారచనలో చెప్పుకొనదగిన సాఫల్యం సాధించిన పన్నాలాల్ మనలో (గుజరాతీ సాహిత్యంలో) ఎందరికో మార్గ దర్శకుడు కాగలడు.

మన సంఘ జీవితంలో యంత్రాలకు, పరిశ్రమలకు ప్రాధాన్యం లభించటం ఆరంభమయినప్పటి నుండి మానవుని సుఖ దుఃఖాలకు ఆధారాలు కూడా అనేకవిధాల మార్పు చెందాయి. వ్యక్తిగతంగా తాను చేసిన

ప్రయత్నాల వల్ల లభించే సుఖ దుఃఖాల పరిమాణం కంటె సాంఘిక (కుటుంబం వరకే పరిమితం కాని) కార్య కలాపాల వల్ల లభించే సుఖ దుఃఖాల పరిమాణం హెచ్చుతూవుంది. దీనినే ప్రఖ్యాత సమాజ శాస్త్ర వేత్త గ్రేహాస్ వాలెస్ 'మన సాంఘిక వారసత్వం' అని అన్నారు. వంశ పారంపర్యంగా మనకు లభించే వారసత్వం కంటె ఈ వారసత్వమే మన సుఖ దుఃఖాలకు ఎక్కువగా హేతువు కాగలదని ఆయన వివిచ్య మానంగా చెప్పారు. ఈ భావం ఆర్థిక రాజకీయ రంగాల్లోనే కాక ఇతర విషయాల్లో కూడ ప్రాబల్యాన్ని పొందినప్పటికీ సాహిత్య రంగంలో దీని ప్రాభవం ఇంకా బాగా ప్రవేశించలేదు. వ్యక్తిని మించి మరొకటి ప్రధానం కాదనే భావనతోనే సారస్వత రచనలు సాగుతున్నాయి. ప్రపంచమంతా ఫేర్ గ్రీవ్ భూగోళాన్ని అనుసరించి నడుస్తూ ఉంటే పాఠశాలల్లో మాత్రం టోలెమి భూగోళాన్ని బోధిస్తున్నట్టు ఉంది ఈ విషయం. పాత్రలకు పాత్రతను ప్రసాదించే సూత్రధార పాత్ర ఈనాడు సాంఘిక ప్రాభవం వహిస్తూ వుంది. ఈ ప్రాబల్యం అకస్మాత్తుగా ఉన్నట్టుండి ఉదయించింది కాదు. ఈ ప్రాబల్యాన్ని గురించి కథా సంవిధానంలో దానిని సమకూర్చి కళాపరమార్థాన్ని సాధించింది 'మానవీనీ భవాయీ'. ఈ రచనకు గౌరవం లభించడానికి ఇదే ముఖ్య కారణం.

కాళా దేనికీ భయపడని నిజాయితీ గల యువకుడు. రచయిత చెప్పినట్టు ఈ నిర్భయత్వానికీ, నిజాయితీకి మూలకారణం వ్యక్తి గత కలహాలకు దూరంగా ఉండి దుఃఖాన్ని దిగమింగే స్వభావంగల తండ్రి, సంకల్ప దార్ఢ్యం గల తల్లి. మొదటి ఆరు అధ్యాయాల్లో చిత్రింపబడిన వాలా పటేల్ గుణ గణాలు కథకు రూపురేఖలు సమకూర్చుతాయి. తగాదాల్లో దిగకుండా తటస్థంగా ఉండే స్వభావం వల్లనే శతాబ్దాలనుండి గ్రామ జీవితం సుస్థిరంగా ఉంది. ఎన్ని ఇక్కట్లు వచ్చినా లెక్కచేయక, ఉన్న చోటు వదలక, ఇంటి వ్యవసాయాన్ని అంటిపెట్టుకొని జలగలా ఉండి పోయే కర్షక చిత్తవృత్తి దీనికి దోహదం చేస్తుంది. అక్కసు, అసూయ స్త్రీ రూపాన్ని ధరించాయా అని అనిపించే తన గడుసు వదినె మాలీ కాళా జన్మ విషయాన్ని గురించి ఏవేవో అసంబద్ధపు మాటలు అంటే ఆమెకు తగిన సమాధానం చెప్పాలని ముందుకు సాగుతున్న తన భార్యతో అతనిలా అంటాడు : "ఊరుకోవే, నీ కెందుకు లేనిపోంది ? భగవంతుడు వాణ్ణి

సరిగ్గా చూస్తే ఎవరూ ఏమీ చెయ్యలేరు. వెళ్లు. నీవు లోపలికి వెళ్లు. ప్రపంచంలో జగడానికి మించిన పాపం మరోటి లేదు.''

దుడుకుతనమంటే ఏమిటో తెలియని ఈ వాలాపటేల్ దుఃఖాన్ని దిగమ్రింగటంలో కూడా దిట్ట. దుఃఖాన్ని అనుభవించవలసి వచ్చిందే అని విసుక్కుంటూ అతడు అనుభవించడు. సగం ధైర్యంతోనూ, సగం భక్తితోనూ అతడు కష్టాలను ఓర్చుకుంటాడు. 'కౌపీన సంరక్షణ' వృత్తాంతం చెపుతూ బైరాగి సంసారంలో ఇరుక్కుని పారిపోయిన సంగతి చెపుతున్నప్పుడు అతనన్న మాటలు కాళా జీవిత సర్వస్వాన్ని సంగ్రహంగా వివరిస్తాయి. ''నీకు తెలుసా? బైరాగులయ్యే దెవరు-బ్రాహ్మల్లో కోమట్లో అవుతారు. మరెవరన్నా అయితే అలా పరారవుతారా? రైతుబిడ్డ కయితే కష్టాలకు ఓర్చుకొని ఉండడం బాగా తెలుసు. బైరాగి లాగా వాడు కూడా పరారయిపోతే ఇక ప్రపంచం ముగిసి పోవల్సిందే.....అయినా వాడెందు కలా పారిపోవడం? వాడలా పరారయి పోగానే ఇక మంచంలో పడి ఉంటే లాభం లేదని ఆ ఆడకూతురు తెలుసుకుంది- తెలుసుకుని లేచి నిల బడింది. చీరె కుచ్చెళ్ళు దోపుకుని నడుంకట్టి గుట్టపైకి నడిచింది... మీకందరికీ కనిపిస్తున్నదో లేదో కాని నాకు మాత్రం ఆ యిల్లాలు పుల్ల లేరుతూ కనిపిస్తూనే ఉంది.'' మూడు సంవత్సరాల కాళాను పువ్వులా ఎత్తుకొని బుజంమీద వేసుకుని అతనంటాడు. ''అదీ లోకం పోకడ గడుసు రోజులు కష్టపడి గడిపే ధైర్యం బైరాగికెలా వుంటుంది? భగవంతుడు రైతుబిడ్డ కిచ్చాడు ఆ శక్తి. మనకందరికీ కష్టా లొస్తాయి. అయితేనేం ఒక్కొక్కటీ ఓపిగ్గా ఓర్చుకుంటూ రోజులు గడుపుతాం అంతే. కదూ బాబూ!''

కష్టాలకు ఓర్చుకొనే ఈ స్వభావం, దుఃఖాన్ని దిగమ్రింగే సంకల్ప బలం, షావుకార్లను చూచి కనబరచే జాలి, గేలి, కాయకష్టంతో కడుపు నింపుకునే వారి గౌరవ భావం - ఇవన్నీ కథకు గొప్పతనాన్ని చేకూర్చు తాయి. వాలా పటేల్ తన సంగతి అట్టే చెప్పడు-అశాంతి, దోపిడీ, దైవ ప్రకోపంవల్ల వచ్చే ఆపదలు, షావుకార్ల ఒత్తిడి, రాచరికం ధన మదం ఇలాంటి వాటితో అస్తమానం బాధపడుతూ కూడా బతుకు మీద ఎక్కడ లేని మమకారంతో ఆడుతూ పాడుతూ ఆనందంగా జీవితం గడిపే పల్లెటూరి కష్టజీవుల గౌరవ గాథను చాటుతాడు. కోమల కల్పనా

చాతుర్యంతో, క్షణ భంగుర భావా వేశంతో పొంగి పొరలే ఉబలాటం కాదిది. చరిత్రపై సానపెట్టి అగ్ని పరీక్షలో నిగ్గినదని నిరూపించిన గౌరవ గాథను అతను కీర్తిస్తాడు. ఈ మాటలే కాళా జీవితానికి తారక మంత్రంలా తండ్రి దగ్గర అతనికి లభిస్తాయి.

నాలుగు సంవత్సరాల కాళాకు ఈ మంత్రాన్ని ఉపదేశించి వాలా పటేల్ అతన్ని తన అన్న పరమా చేతుల్లో (గయ్యాళి భార్యవల్ల బల హీనమైన అతని చేతుల్లో) పెట్టిపోతాడు. అతనలా వెళ్ళిపోగానే ఆ గ్రామంలోని మరో సాత్విక జీవి కూడా - ప్రపంచం వదలి పెడుతుంది.

ఈ జీవి ఉన్నంతవరకు మాలీ గయ్యాళితనం ఏమీ సాధించలేక పోతుంది. కాళా-రాజూల సంబంధం కుదరకుండా మాలీ శాయశక్తులా ప్రయత్నిస్తుంది. చిందులు తొక్కుతుంది, తల బాదుకుంటుంది - కాని ఆ ఊళ్ళో మంత్రకత్తెగా చలామణి అవుతున్న ఫూలీమాకు వాలా మీద ఉన్న సద్భావంవల్ల ఆమె ఏమీ చేయలేకపోతుంది. వాలా చనిపోయిన తర్వాతనే ఆమె ఈ సంబంధాన్ని చెడగొడుతుంది. చిన్నప్పటినుండి కలిసి ఆడుకొంటూ, బొమ్మరిండ్లు కట్టుకొని, నాలుగు స్తంభాలాటలాడు కుంటూ, పొలం పొలిమేరల్లో ముసి ముసి నవ్వులలో మునిగి తేలిన ఆ జంటను ఆమె వేరు చేస్తుంది. జగన్నియంతకు అంతటితో తృప్తి లేనట్టుగా కాళాను రాజూ ఇంటి అల్లుణ్ణి చేశాడు. ఎల్లలు దాటి ఎక్కడనో ఏదో జరిగితే అంత బాధ అనిపించదు. ఆమె తన అత్తగారింటిలో అవతలి ఇంట్లోనే ఉండడం, తన ఇంటికి పేరుకు భర్లీ, పనిలో హాళ్ళీ అన్నట్టు భలీ రావడం - మరింత బాధాకరంగా ఉంది. దానికితోడు కాళా తల్లి చనిపోయేటప్పుడు మళ్ళీ పెళ్ళి చేసికోవద్దని చెప్పిపోయింది. కాళాకు ముళ్ళకంచెలో పడుకున్నట్టయింది. లేచేందుకు వీలులేదు, బాధ తీరేట్టు చావయినా రాదు. అత్తగారింటిని గూర్చి మాటి మాటికీ కలలు కంటూ అనుకుంటాడు. "ప్రపంచం అనుకుంటే అనుకోనీ. ఒక్కసారి మళ్ళీ పసుపు గుడ్డలు కట్టుకోవాలని ఉంది. ఎవరేమనుకొన్నా మనసార మళ్ళీ అనుభవించాలని ఉంది." రాజుకు తాను చెప్పిన హితవు తానే మరచి పోతాడు. "అన్నీ వున్న ఇల్లు, అందమైన భర్త దొరికితే అందరూ ఆప్యాయంగా కాపురం చేస్తారు. కాని డబ్బులేని కాపురం, నీతిలేని పురుషుడు తటస్థ పడ్డప్పుడే ఇల్లాలి ఘనత బయటపడుతుంది."

కాని రాజూ తత్వమే వేరు. ఆమెకు ఇలాంటి హితబోధ అవసరమేలేదు. భారతీయ సాహిత్యంలో శరచ్చంద్రుడు ప్రతిష్ఠించిన స్త్రీ గౌరవం ఆమెలో మూర్తీభవించి ఉంది. ఆమెకు యౌవనంలో శోభ చేకూర్చిన స్వేచ్ఛ, లాలిత్యం, ఆవేశం, ఆవేగం—అన్నీ అత్తగారింటికి వెళ్ళేదారిలో ఆమడ దూరంలోనే అంతరించినట్లయింది. ఒకసారి ఆమె భర్తకు జబ్బు చేసినప్పుడు ఆమె తన ముక్కుపుడకను అమ్మేందుకు తయారవడం చూచి కాళా ఆమెను అడుగుతాడు: "నీవు కోపగించుకోకపోతే నేనొకమాట అడుగుతాను రాజూ! నీకు నిజంగా నీ భర్తను బతికించుకోవాలని ఉందా రాజూ?"

రాజూ ముఖంమీద దుఃఖం మేఘంలా ముంచుకువచ్చింది. బాధతో నవ్వుతూ ఆమె అన్నమాటలివి: "మీరు కూడా నన్నిలా అడుగుతున్నారా? ఈయన చనిపోతేబాగుండునని, ఈయన చావుకి నేను ఎదురుచూస్తున్నానని అనుకుంటున్నది లోకం. అలా నేనెందుకనుకోవాలి? ఏం సుఖపడదామని? రాజూ ఏదో కష్టాలనుభవిస్తున్నదని మీరందరూ అనుకుంటున్నారు. కాని నాకువచ్చిన కష్టమేముంది? తల్లి తోడుగా బావా వదినె నన్నుచూస్తున్నారు. ఆయన, పిల్లలు కూడా నేనంటే ఎంతో ప్రేమగా చూచుకుంటారు." నవ్వేందుకు ప్రయత్నిస్తూ అన్నది: "నీలాంటి పూలరంగడయితే రోజుకు పదిసార్లు శాపనార్థాలు పెట్టేవాడు. ఆయన అడుగులకు మడుగులు తొక్కుతూ నా మాట దాటరు. ఇంక నాకేం కావాలి?"

కాళా రాజూవైపు ఎగాదిగా చూస్తూ నిలబడ్డాడు. గౌరవంగా చూస్తూ అతనంటాడు: "మా బంధువుల్లో నీలాంటివాళ్ళు అరుదు రాజూ! నాకు చూడ ఎవరూ కనిపించడం లేదు."

నిజం. రాజూలాంటి మానవతి ఆ కుటుంబంలో మరొకరు లేరు. నిజానికి రాజూ శరచ్చంద్రుని రాజలక్ష్మి, అలక, భైరవీ, అన్నద, పారో...ఇంకా ఇలాంటి గొప్ప గొప్ప వనితా రత్నాలను ఎందరినో ఆరాధించి కళాకారులు గ్రామకేదారాల్లో పండించిన సస్యరాజం. ఈ సస్యరాజానికి సరితూగే వనస్పతి ఆ గ్రామసీమలో కనిపించకపోతే అది కాళా తప్పుకాదు.

ముసలి వాలా పటేల్ కూడా ఆ గ్రామీణులలో వాడే. ముసలి మాలీ కూడా ఎంత ఈర్ష్యాళువు అయినా ఆ గ్రామ సమాజానికే చెందుతుంది. మంత్రకత్తె ఫూలీ, కాసిమ్, బేచాత్ కూడా గ్రామీణులే. కాళా కూడా అక్కడివాడే, కాని అతను యుగసంధిలో ఉద్భవించిన జీవి. అంతే

వ్యత్యాసం. కాని రాజూ మాత్రం పల్లెకు చెందినది కాదు. ఎరువు, నీరు, గాలి పల్లెలనుండి లభించినప్పటికీ బీజం మాత్రం అది కాదు.

శ్రీ పన్నాలాల్ పటేల్ సృజనశక్తిని గురించి నేను శంకిస్తున్నానని మాత్రం ఎవ్వరూ అనుకోకూడదు. పన్నాలాల్‌గారి సృజనశక్తి గుర్తించి కీర్తించేది కాదు. అది స్వతస్సిద్ధమైన ప్రతిభ. రవీంద్ర శరచ్చంద్రుల ప్రభావం సమస్త యుగ పరివ్యాప్తమయింది. గుణజ్ఞుడయిన ఏ రచయిత కూడా ఆ ప్రభావానికి గురికాకుండా నిర్లిప్తంగా ఉండలేదు. అందులో సందేహం లేదు. కాని మనం గమనించవలసిందల్లా ఆ ప్రభావాన్ని ఎవరు ఎలాంటి రాసాయనిక ప్రక్రియ ద్వారా ఎంతవరకు తమ కథా క్షేత్రంలో చేర్చుకోగలిగారని మాత్రమే. ఆ ప్రభావం అనుకరణగా పరిణమించిందా లేక రచయిత తనలో జీర్ణించుకుని సొంతం చేసుకొన్నాడా అనేదే వివక్ష.

పన్నాలాల్ తన 'మళేలా జీవ్' అనే రచనలోనూ, ఈ నవలలోనూ ఈ గుణాన్ని ఆత్మగతం చేసికొన్నారని పఠితలు గమనించగలరు. జీవీ, రాజూ-ఇద్దరూ ఏ మాట చెప్పినా, ఏ నిర్ణయం చేసినా పరిస్థితులను గమనించి తమ స్వబుద్ధిని ఉపయోగించి చేస్తారు. మొదటనే ఇలా చేస్తామని వాళ్ళు సంకల్పించరు. వేరే విధంగా చేద్దామని ప్రయాస పడుతారు. కాని పరిస్థితులను గమనించి వాటికి అలవాటు పడతారు. భయములేని బలవంతుల లక్షణమదే అని వారు భావిస్తారు.

సంఘంలో ఏర్పడిన ఆచారాలు గాని, మతం ఏర్పరచిన నిబంధనలు గాని వారి కార్యకలాపాలను అరికట్టలేవు. వారిలోని ఆరోగ్యవంతమైన జాలివల్లనే వారి సంకల్పం మారిపోతుంది. కాళా సంబంధం కుదరక పోవడంలో తన అత్తగారి తరుపు వాళ్ళ దోషమేముందని భావిస్తుంది రాజూ. కాళా భార్య భలీ తప్పు మాత్రమేముందని ఆమె భావన. మరి కాళా మాత్రం దోషి ఎలా అవుతాడు?

కరువు రోజుల్లో రాజూ ఇంట్లో ఒక్క రోజుకు కూడా సరిపోయే ధాన్యం లేదని కాళా గమనిస్తాడు. పస్తులు పడుకుంటున్నారు – ఊరి మొత్తంలో ధాన్యం ఎక్కడా పుట్టడంలేదు-ప్రతి రోజూ పస్తులతో మరణించే వారిసంఖ్య హెచ్చుతూ ఉంది–ఇంట్లోవాళ్ళు ఎక్కడన్నా ధాన్యం దొరుకుతాయేమోనని ప్రయత్నించేందుకు వెళ్ళారు. ఈ ఆకలిబాధతో క్రుంగి కుమిలిపోతున్న

రాజూను పలకరిస్తూ కాళా అంటాడు: "బొత్తుగా గుర్తుపట్టేందుకు వీలులేకుండా పొయ్యావే!.... ఇంట్లో బొత్తుగా గింజలు లేవా?"

రాజూ నవ్వింది... కాని ఒళ్ళంతా పాలిపోయింది. నవ్వు కూడా అలాగే తెలిపోయింది. "ఉండకేం? కొద్దిగా ఉండకుండా పోతాయా?" కాని కాళా నమ్మలేక పోయాడు. ఇల్లంతా గాలించి చూస్తాడు. ఎక్కడా ఏమీ కనిపించదు. కుంపటి రాజేసేందుకు నిప్పు తీసుకురావడానికి పొరుగింటికి వెళ్ళే రాజును ఆపి అడుగుతాడు: "ఇంట్లో వండేందుకు ఏమన్నా ఉంటే గదా కుంపటి రాజేసేందుకు?" (రాజూ తిరిగి వచ్చిన తర్వాత అంటాడు: "ఈ పొగ వదిలేసి నాతో రా. పద ముందుకు". రాజూ ముఖ వైఖరీని చూస్తే కాళాకు నవ్వాలో ఏడ్వాలో తెలియలేదు. "నీవిలా దిక్కులేని చావు చస్తుంటే నేను చూడలే" నంటాడు.)

"దిక్కులేని చావు నా కొక్కదానికేనా? దేశమంతటికీనా?... ప్రపంచం ఏమంటుంది? ప్రపంచం మాట అలా వదిలెయ్యండి. మనస్సు అందరికీ ఒకటే గదా?"

"ప్రపంచం చస్తే చావనీ. దానితో నాకేం పనిలేదు. దాన్ని ఎదుర్కొనే ధైర్యం నాకుంది." 'కాని ఇక్కడ ఉన్న వాళ్ళందరి హృదయం నా హృదయం లాంటిదే' – ఇదే సర్వాత్మానుభూతి.

రాజూ సంఘానికి భయపడదు. యుగ చైతన్యం గల ఏ వ్యక్తికీ సంఘ భీతి ఉండదు, మరణభీతి కూడా ఉండదు. రాజూ అంటుంది: "మీకు చావంటే ఏదో వింతగా ఉంటుంది. కాని మాకు – మేము జీవితంలో అన్నింటికీ సిద్ధపడి ఉన్నాం–ప్రతీ రోజూ రెండు మూడు ప్రాణాలు మసి అయిపోతున్నాయి–అలాగే ఈ శరీరం కూడా ఒక రోజు మాయ మవుతుంది." చైతన్యంగల వ్యక్తులకు ఆసన్నమయిన మరణం వరణీయం అవుతుంది. కాని రాజూకు ఆ ఉబలాటం కూడా లేదు, దానిని గురించిన విచారమూ లేదు. ఆమె విచారమల్లా తన చుట్టుపక్కల ఉన్న వారిని ఎలా కాపాడడమనే సహజమైన ఆలోచన. ఈ వివేకం ఆమెకు శాస్త్రాలవల్ల మంత్రాలవల్ల లభించింది కాదు. తోటి మానవుల చైతన్యంతో తాదాత్మ్యం పొందడంవల్ల ఈ వివేకం ఉదయిస్తుంది. ఎవరు నివారించినా పూలు తమ సువాసనలను నిరాటకంగా నిరంతరం ప్రసరింప చేసినట్లుగానే, చైతన్య జీవులు చావు బ్రతుకులకు లెక్కచేయక తమ తోటివారి శ్రేయస్సుకై ధైర్య

సాహసాలతో పాటు పడుతూనే ఉంటారు. ఒక నెలకు సరిపోయే ధాన్యం దొరికాయనే సంబరంతో రాజూ అంటుంది: "ఒక్క నెలలో సామ్రాజ్యం సృష్టించవచ్చు." కష్టజీవుల ఆత్మవిశ్వాసానికి ఇది నిదర్శనం. నిత్యం నాగలి దున్నుతూ, పారలూ కొడవళ్లూ సవరించుకుంటూ శ్రమపడే వాళ్ళకి క్రమంగా ఒక విధమైన ఆత్మ విశ్వాసం ఏర్పడుతుంది. చేతులూ కాళ్ళూ ఆడినంతవరకూ భయపడవలసిన పనిలేదనే ధైర్యం వస్తుంది. ఏ దేశం నుండి బీజ సంగ్రహణం చేసినప్పటికీ ప్రజానీకానికి గల ఆత్మ ప్రత్యయానికి కళా పోషణ లభించనందువల్ల దానికి సరియైన అభివ్యక్తి సమకూరదు.

ఈ పాత్రలలోని తేజస్సు, చైతన్యం, నిర్భయత్వం, మానసికా ద్వంద్వం, పరిణామం - అన్నింటినీ అచ్చు గుద్దినట్టు తీర్చి దిద్దేందుకు రచయిత యాభై యారు క్షామాన్ని సంధానంగా చేసికొని తన కళా సృష్టిలో ఉత్కృష్టత సాధించారు. ఆనాటి దుర్భిక్షాన్ని వర్ణించిన తీరు మన సాహిత్యంలో వర్ణన శైలికి మార్గదర్శకంగా కలకాలం నిలవగలదు.

ఈ దశాబ్దంలో బాగా ఖ్యాతి సంపాదించిన చరిత్రకారుడు 'టాయన్బీ' సంస్కృతి అనే పదాన్ని నిర్వచిస్తూ అందులో సవాలు, సమాధానం (Challenge and response) అనేవి ప్రధానమని చెప్తాడు. ఎదుర్కొన్న సవాలుకు బదులు చెప్పగల సమాజానికే సంస్కృతి లభించగలదని అంటాడు. సమాజం ఉన్నచోటల్లా సంస్కృతి ఉండవలసిన పనిలేదు. సవాలును గ్రహించ లేనివారు దానికి లొంగిపోతారు. నెమ్మదిగా వారి కాలికింది మట్టి జారిపోతుంది. 'మానవీనీ భవాయీ' లో వ్యవసాయం చేసికొని జీవించే కాళా- రాజూల కృషక సమాజం అష్టకష్టాలకు ఓర్చి యాభైఆరు నాటి దుర్భిక్షాన్ని ధైర్య సాహసాలతో ఎదుర్కొంటారు. ఈ దుర్భిక్షం ఆ నాడు అంతరించి పోతున్న పాత తరాన్ని స్మరింపచేసే మహాపద. ఆకలి బాధ సహించలేక నానాలాంటి భర్తలు తమ భార్యలను విడిచిపెట్టారు. తల్లికి మానభంగం కాకుండా చూచేందుకు సరిపడ్డ గుడ్డలు కూడా బిడ్డలు సేకరించ లేకపోయారు; భలీ-రూఖీ లాంటి స్త్రీలు మానాన్నే త్యజించారు. మానవుడిలో ఒకే ఒక వాసన మిగిలిపోయింది-ఆకలి. యాచన వల్లగాని దొంగతనం చేసిగాని, కుక్కల్లా ఎంగిలి ఆకులకై ఎగబ్రాకి గాని, ఆడవాళ్ళ యితే శరీరాన్ని అర్పించిగాని - ఏదో విధంగా నాలుగు మెతుకులతో

జఠరాగ్నిని చల్లార్చుకోవడమే పరమావధి అయిపోయింది. మానవజాతి ఇలా పతితం కావడం చూచి కథలో శంకర్ అంటాడు: "అన్నింటినీ సహించి అనుమతించే ఈ భూమాత ఎంత మంచిదో?" భార్యకు భర్తన్నా, తల్లికి కూతురన్నా, కూతురికి తండ్రి చూచినా సిగ్గులేక ప్రవర్తిస్తూ ఉన్నారు. రేపు చావు తప్పదు. కాబట్టి ఈ రోజు ఎలా బతికితేనేం. దొరికిందల్లా అనుభవించు, ఇష్టం వచ్చినట్టు విహరించు. న్యాయం లేదు, అన్యాయం లేదు, నీతి లేదు, అవినీతి లేదు. అందరూ అంతులేని అణచలేని ఈ ప్రబల వాసనలకు లోనయినప్పుడు- ఇద్దరు వ్యక్తులు ఏం చేయగలరు?

రాజూ తాను ఆకలితో బాధపడుతూ కూడా - భర్త, బావ - ఇద్దరూ క్షామబాధతో చనిపోయిన తర్వాతకూడా - బావగారి పిల్లలను ఏదోవిధంగా పోషిస్తూ ఉంటుంది. ఇదంతా చూచి సంఘాన్ని, సర్వేశ్వరుని, వర్తకులనూ, షాహుకార్లను, పాలకులనూ తూలనాడి మానసిక సంతులనాన్ని కూడా కోల్పోయే పరిస్థితిలోఉన్న కాళాను ఆమె మందలిస్తుంది:

"జాగ్రత్త! ఇక ఎప్పుడూ ఇలాంటిమాట రానీకు. సగం మంది చావ లేక చనిపోయారు. నీ శరీర పరిస్థితి ఒక్కసారి గమనించు. అన్నింటిని మించిన భూతం ఏమిటో నీకు తెలుసా?"

రాజూ తిట్టిన తిట్లు కాళాకు బెల్లం కంటె తియ్యగా ఉన్నాయి. నవ్వుతూనే అన్నాడు: "అన్నిటిని మించిన భూతం ఆకలి. కాని..."

"కాదు. దిగులు" అన్నది రాజూ.

ఆపదలు వస్తాయి. కాని అవి మన గుండెలను బ్రద్దలు చేయలేవు. శరీరం చెక్కలై విరిగిపోతేనే గాని మనుష్యుడు చావడు. ఆపదలకు తట్టుకోలేక గుండె బద్దలైనపుడే చావు వస్తుంది. దానితో సంస్కృతి ఓడిపోతుంది.

కాళా మనస్సులో మనిషన్నా, భగవంతుడన్నా, సంఘమన్నా, స్వభావమన్నా ఏమాత్రం గౌరవం ఉండదు. కాని మామూలు మనిషిలా అతను తన మానవత్వం పై శ్రద్ధను మాత్రం కోల్పోడు. "మనిషి చెడ్డ వాడు కాదు, ఆకలి చెడ్డది" అంటాడతను. సామాన్య మానవుడిలోనైనా సరే శ్రద్ధ లోపిస్తే మానవజాతి సముద్రాలలో కలిసి పోవలసిందే. ప్రాకృతిక సాంఘిక దురవస్థల వల్ల మానవజాతి దుఃఖసాగరంలో మునిగి పోయినా సరే మానవుని ఆత్మోన్నతి అందుకొనగలిగిన ఉత్తుంగ శిఖరా

లను దర్శించే కవిర్మనీషి అని తీరుతాడు: "నా వెనుక సంస్కృతి విచ్ఛిన్నంకాగా మిగిలిన శిథిలాలు కనిపించినా సరే మానవుడిమీద నా శ్రద్ధకు తరుగురాదు." చైతన్యవంతుడైన పల్లెటూరి రైతుబిడ్డ కాళా కూడా అంటాడు: "ఆకలి చెడ్డది. మనిషి చెడ్డవాడు కాడు." కాని ఈ సత్యాన్ని అవగాహనం చేసుకునే శక్తి అందరికీ ఉండదు. స్వాభిమానం వదలక - లేక పనికిరానివాడి అనుగ్రహం కోసం స్వాభిమానంతో సమాధానపడి ఆత్మప్రత్యయాన్ని కోల్పోనివాడే ఈ సత్యాన్ని ఆశ్రయించగలడు. అందువల్లనే ప్రాణాలు కంఠగతమైనప్పుడు కూడా ఇతరుల ఎదుట చెయ్యి చాపి భిక్షాన్నం తిని జీవించడం అతనికి మనస్కరించదు. అవిటి చేతితో కంచాలు కడిగి అయినా సరే గ్రాసం సంపాదించేందుకు ప్రయత్నిస్తాడే కాని యాచకుల వరుసలో నిలబడి సత్రంలో పంచిపెట్టే ధర్మాన్నం కోసం మాత్రం ఎగబ్రాకడు. తెలివిగల రాజూ చెప్పిన హితవును కూడా అతను చెవిపెట్టడు. రగుల్కొనే అగ్ని పర్వతంలాగా అతను మాటిమాటికి మండిపడుతూ అంటాడు:

"అన్నింటికంటె చెడ్డది ఆకలి అని నేను కూడా అనేవాణ్ణి. కాని ఈనాడు దానికంటె కూడా చెడ్డది మరొకటి కనిపించింది - ఆకలికంటె చెడ్డది యాచన. ఆకలి రక్తమాంసాలనే పీల్చివేస్తుంది - కాని ఈ యాచన ఉందే - రాజూ! నేను నిజం చెప్తున్నాను-మన అభిమానాన్ని, ఆత్మనే తినేస్తుంది." రాజూ ఎంతో బతిమాలుతుంది, మిగిలిన వాళ్ళు చీవాట్లు పెడుతారు. అప్పుడు చివరికెలాగో సమాధానపడి వెళ్ళుతాడు. కాని యాచకుల బారును చూచి ఆ వరుసలో తాను నిలబడలేక పోతాడు. "బ్రాహ్మణులకు వారు తీసికొనిపోగలిగినంత ధాన్యాన్ని దానంగా అర్పించిన తాను...రాజులు, మహారాజులు, షాహుకార్లు తన ఎదుట నిలబడి యాచించగా చూచిన తాను.. ఈనాడు చేయి చాచటమా?" అతని మనసు సమ్మతించలేదు. పంక్తిని వదలి బయటకు వస్తాడు. బంట్రోతు అతన్ని ఆపివేస్తాడు: "అరే పిచ్చి పుల్లాయ్! ఎక్కడికి వెళ్తున్నావ్?"

"ఎక్కడికా? నా తావుకే."

"అరే! ఆగవోయ్. పిచ్చివాడా! చెప్పేది విను."

"నాకీ సత్రపుకూడు ఇష్టం లేదు."

"ఏం ? ఎందుకిష్టం లేదు ? వీళ్ళంతా మనుషులు కాదూ ? మహారాజుగా మాట్లాడుతున్నావే ?"

కాళాకు విసుగు వేసింది.

"మహారాజునే అయితే తప్పకుండా నిలబడేవాణ్ణి. రైతుబిడ్డ నవడం వల్ల ఇలా వెళ్ళిపోతున్నాను. నీవెంత పిరగబడ్డా నేను లొంగను. నా మీద చేయి చేసుకోవాలని ఉంటే కానీ! నేను సిద్ధంగానే ఉన్నాను."

సుందర్ సేఠ్ చాలా మంచివాడు కనుక అతన్ని దగ్గరకు పిలిపించి మెల్లగా అడిగాడు: "ఏమబ్బాయ్ పటేల్! ఈ మోయన తీసికోవడం నీ కిష్టం లేదా?"

కాళా ఏం సమాధానం చెప్పగలడు? సమాధానం చెప్పినా రైతు హృదయం అర్థం చేసికొనే శక్తి వాళ్ళకు ఉందనే నమ్మకం అతనికి లేదు. అక్కడ ఉన్న ధాన్యమంతా తనదేనని అతను చెప్తే నలుగురూ అతన్ని నాలుగు మాటలు అంటారేకాని ప్రయోజనమేమీ లేదు! అంతేనా? ప్రయోజనం లేదా? ఈ ధాన్య యజమాని చేయిజాపే బదులు చేయి చేసుకుంటే ఈ తుపాకుల వాళ్ళు తోక ముడుచుకుని పారిపోతారు!... నిప్పులు గ్రక్కే కాళా కండ్లనుండి టపటప కన్నీటిబొట్లు మాత్రమే రాలాయి. "ఏం చెప్పను సెట్టిగారూ! కండ్ల ఎదుట మేము పండించిన ధాన్యాన్ని చూచి మౌనం వహించేందుకు మాకెంత గుండె నిబ్బరం కావాలో చెప్పండి."

ఈ అన్యాయానికి - అసంగత సంఘటనకు - ప్రతీకారమే కథకు భరత వాక్యమవుతుంది. కథా రచయిత సెట్టిగారి నోట మర్యాదగా ఆ విషయం పలికించారు కూడాను: "అబ్బాయ్! నీకు నీవు పండించిన ధాన్యం కోసం చేయిజాపుతూ ఉంటే ఎంత సిగ్గు వేస్తూ ఉందో, ఈ ధర్మ సత్రం నడిపేందుకు మాకు కూడా అలాగే సిగ్గుగా ఉంది. సమస్త భూభాగాన్ని పోషించే వాళ్ళను మేము ఎన్నాళ్ళు పోషించగలం?... కాని చేసేదేముంది పిచ్చివాడా? మనమందరమూ ప్రకృతికి దాసోహం అనవలసిందే... మీ వస్తువు మీకే ఇస్తున్నామని అందరితో చెప్పటమే మన విధి."

పరిస్థితులకు లోనయి విధిలేక సెట్టిగారు చేసిన సిద్ధాంతం ఆనాటి చారిత్రక వాతావరణానికి అనుగుణంగానే ఉంది. కనకనే కాళా అప్పటికి

సమాధాన పడ్డాడు. కానీ రచయిత ఆ కాలానికీ, ఆ స్థలానికీ తగిన ఉదాత్త సాంఘిక జాగృతికి ప్రతినిధిగా కాళాను తీర్చిదిద్దారు. అందువల్లనే అందరూ ఆకలి బాధతో చస్తుంటే చూస్తూ ఊరుకునే కంటే దోపిడి చెయ్యటమే అతనికి సబబుగా తోస్తుంది. ఆకలి బాధకు తాళలేక కొండజాతి వాళ్ళు పశువులను దొంగలించేందుకు పల్లెల మీద దాడిచేస్తూ ఉంటే ఆయుధాలు ఉండి కూడా ఊరికే పనికిరాని వాళ్ళలాగా ఉండడం, అటు ఏ ఆయుధాలూ లేకుండానే కొండ వాళ్ళు పశువులను చంపుతూ ఉంటే చూస్తూ ఉండడంతో కాళా ఎక్కడలేని ఆవేశంతో కొండ వాళ్ళపై పండెత్తి ఒంటరిగా పోరాడి పశువులను తప్పించుకొని తోలుకు వస్తాడు. తన తండ్రి గౌరవం నిలబెట్టాలనే ఆతురతతో అతను ఇంటినుండి బయలుదేరుతాడు. కాని తానెందుకు బయలుదేరాడో మరిచిపోయి తన మనస్సులో అనుకుంటాడు: "వీళ్ళకు మన పశువులను చంపటం, తినటం సాధ్యమవుతుందా? ఈ పశువులను ఎలా తప్పించటం?"

ఖంగుమని కత్తి నేలమీద విసిరి అంటాడు: "పోనీ వీని తస్సదియ్య! ఈ పాడు దైవం ఈ కాటకం ఎందుకు సృష్టించాలి? మనిషిని ఇంత పాడుగా చెయ్యడానికి ఆయన బుద్ధి గడ్డి తిన్నదేమో!"

దేవుణ్ణి కూడా ఇలా నోటికి వచ్చినట్టు తిట్టే కాళా సెట్టిగారి లాగా 'మనమేం చేయగలం, దీనికి మరో ఉపాయం లేదు' అని అనుకొని శాంతించగలడా? దీనిలో ఏదో అవివేకం ఉంది, అన్యాయం ఉంది! తిరుగుడు ఉంది. ఈ ధనవంతుల ధాన్యాన్ని కాపాడేందుకు పట్నంనుండి వచ్చిన సిపాయీల చేతుల్లో మర తుపాకులను చూచి అతను బిగ్గరగా అరుస్తాడు:

"ఓరేయ్, కసాయి వాళ్ళల్లారా! బండిలో తెచ్చినవన్నీ తుపాకులేనా, ఏమైనా ధాన్యం కూడా ఉన్నాయా? హంతకులురా మీరు వెధవల్లారా. ఇక్కడ అలా తిరిగేవాళ్ళు ఇలా రాలిపోతున్నారు. దానికితోడు మీరు కూడా ప్రాణాలు తీసేవే తెచ్చారా? ... ప్రాణాలు పోసే వేమన్నా తీసుకు రాగూడదూ?... ప్రాణాలు తియ్యటానికి మీరు ముప్పైఆరు కళలూ కనిపెట్టారు. బాగానే వుంది. కాని వాటితోపాటు ప్రాణాలు పోసే కళ కూడా ఒకటి కనుక్కోగూడదూ! ఈ ముప్పై ఆరు కళలు కనుక్కున్న మీరు కూడా

పనికి వచ్చే వాళ్ళని మే మనుకొందుము గదా.....మీరేమో దేవతలని మే మనుకుంటూ వచ్చాం. కాని మీరు దేవతల వేషంలో వచ్చిన రాక్షసులు.''

ఇదే విశ్వ వ్యాప్తమైన మానవుని ఆత్మనుండి వెడలిన ఆర్తనాదం. ప్రపంచాన్ని పీడిస్తున్న భయంకరమైన అస్తవ్యస్తతను అస్తమింప చేసేందుకు మానవాళి కిది పిలుపు!

సముద్రాలు దాటి మనదేశానికి వచ్చిన తెల్లవాళ్ళు ఈ పల్లెటూరి వాళ్ళ కంటె తెలివిగల వాళ్ళట. కాని పల్లెటూళ్ళలో మగ్గుతూ తన్నుకుంటూ గుద్దుకుంటూ ఉండే ఈ అమాయకుల్లో అంతకంటె ఎక్కువ సంస్కారం ఉందంటారు. కాళా 'కాదు' అని తీర్మానం చేస్తాడు. చరిత్రకారుడయిన రమేశ్ చంద్ర కూడా ఆ తీర్మానం కిందనే సంతకం చేసి ''వాళ్ళ పరిపాలన లోనే ఎక్కువ కరువులు వచ్చాయి'' అంటారు.

ఈ విధంగా ఇక్కడ చారిత్రాత్మక సత్యంతో కావ్యదృష్టి మేళ వించింది.

ఈనాటికి కూడ ఈ దృష్టి నిరర్థకమని చెప్పలేము. నేడు కూడా కాళా ఎలుగెత్తి పలికిన పలుకులు వినిపించటం లేదా?

ఒక్క ఆటంబాంబు తయారుచేసేందుకు ఆరు వందల యాభై కోట్ల డాలర్లు ఖర్చవుతాయి. ఒక్క విమానంమీద అయే ఖర్చుతో ఒక చిన్న రాష్ట్రంలో పాఠశాలలు నడపవచ్చు. పిల్లలకు పాలు లేకపోయినా సరే, రోగులకు మందులు దొరకకపోయినా సరే, ఆశ్రయం లేనివారికి ఆవాసం లేకున్నా సరే, ఆకలితో బాధపడేవారికి అన్నం లేకున్నా సరే బాంబులు, విషవాయువులు, నౌకాయాత్రలూ యథావిధిగా వృద్ధిపొందుతూ ఉండవలసిందే. వాటి ఖర్చులో అరపైసా కూడా తగ్గకూడదు. మనుష్యుల మేధాశక్తి, కళాసృష్టి మరణ హోమంలో ఆహుతి అయిపోయాయి. లేకుంటే వాననీటిని నిలవచేసి ప్రతి బిందువునూ ఉపయోగించుకుంటే ఈ కరువులను అరికట్టటం సాధ్యం కాదూ? కాని ఈ ముప్పై కళలు కనిపెట్టిన మేధావులు తమ తెలివితేటలను ఈ అన్యాయవాదుల దగ్గఱ తాకట్టు పెట్టుకొన్నారనే విషయమే శోచనీయమయింది. వారందరూ కలసి ఈ శిఖర సమ్మేళనాలలో చిరంతన సమస్యలకు సమాధానం వెదికే వామన వటువులకు 'వీలు లేదని' ఒక్కసారి ఖచ్చితంగా సమాధానం చెపితే చాలు! సంస్కర్తలు, యజమానులు, కళారాధకులు, శాస్త్రజ్ఞులు—

వీరి సాయం లేకుండా కదనానికి కాలుదువ్వే ఈ రాజన్యులు ఏం చేయ గలరు?

కాళా చేసిన ఈ హెచ్చరిక ప్రపంచాన్ని దిగమింగే ఆర్తనాదం. మానవజాతిని ప్రబోధించ లేదా? అప్పటికీ మానవజాతి మేల్కొనకపోతే కాళా చెప్పినట్టు 'ఆకలితో మాడ్చి వాళ్ళను దారిలో పెట్టవలసి ఉంటుంది.' ఈ కోరిక కార్య రూపాన్ని పొందాలా?

కళాకారుడు, శాస్త్రజ్ఞుడు ఈశ్వర వరప్రసాదులయి ఉంటారు. వారి మేధాశక్తి లోక కళ్యాణం కోసం ఉపయోగించటం జరిగితే అందరికీ మేలు చేకూరుతుంది. ప్రస్తుతం ప్రపంచాన్ని ఎదుర్కొంటున్న సమస్యకు అదే ఏకైక పరిష్కారం. ఇందులో వరాలు ప్రసాదించే ఈశ్వరుడు కూడా అడ్డురాడు. ఇదే 'మానవీనీ భవాయీ' లో సహృదయ పాఠకులకు వినిపించే ఆహ్వాన గీతిక.

ఈ పిలుపును పలువురికి అందజేసేందుకు రచయిత ఎలాంటి కథా సంవిధానాన్ని కూర్చాడో, ఎలాంటి భాషలో సమస్యను వివరించాడో గమనించాలి.

సమస్యను నిరూపించేందుకు అనువైన భాషను పన్నాలాల్ సృష్టించు కొన్నాడా అనిపిస్తుంది. నిపుణ కళాకారుడు ఉత్తమ శిల్పాన్ని సృష్టించేందుకు ముందుగా తగిన సామగ్రిని సమకూర్చుకుని దానిని చక్కగా అమర్చినట్టుగానే పన్నాలాల్ తన రచనకు కావలసిన సాధన సంపత్తిని సేకరించి పెట్టుకున్నారు. నూతన శబ్దజాలం, నవీన వాక్య రచన, మనోహర వర్ణనలు ప్రతి పుటలో ప్రస్ఫుటిస్తూ ఉంటాయి. ఏ అధ్యాయాన్ని తీసికొన్నా దాని శీర్షిక, అందులోని సంభాషణలు, వర్ణనలు, వ్యంగ్యం, వాతావరణం – అన్నీ అచ్చు గ్రుద్దినట్లు కనిపిస్తాయి.

'మానవీనీ భవాయీ' కృషక సమాజానికి సంబంధించిన రచన అవటం వల్ల ఏ ఋతువుకు చెందిన వర్ణనలు, ఆ వాతావరణానికి అనుగుణంగా ఉంటాయి.

"ఆషాఢ మాసంలో తదియనాటి రాత్రి ఆకాశం ఉయ్యాలలూగుతూ వుంది. రాత్రి గడిచేకొద్దీ గాలివాన నేలతో పోరాటం సాగిస్తుంది. కోడి కూత వినపడగానే నింగి నేలలు ఏక ధారలో కలిసిపోతాయి.

"బాగా తెల్లవారేసరికి మేఘం గరిస్తూ ఉత్తరపు కొండల వైపు పయ

నించింది. గాలి, దుమారం, మెరుపులు - అన్నీ పట్నంవైపు తరలిపొయ్యే సామానులాగ మాయమైపోయాయి.

"ఒక్క రాత్రిలో నేల చల్లబడిపోయింది. నిన్న మొన్నటివరకు నేలకు ఊపిరాడనట్టుగా ఆవిరి కక్కుతూ ఉంది. ఇప్పుడు నేలమీద హాయిగా పండుకోవాలని అనిపించేటట్టు వాతావరణం చల్లబడి మృదుమనోహరంగా ఉంది. అక్కడక్కడా ఉన్న గుంటలు, దొరువులు నిండుగా ఉన్నాయి. కప్పలు పలురకాల జంటస్వరాలు పలుకుతూ ఉన్నాయి. ఇప్పటివరకూ బోసిగా ఉన్న చెట్లు, చేమలు ఒక్క రాత్రిలో క్రొంజిగురులు తొడుగు కున్నాయి. కంటికింపుగా పచ్చ పచ్చగా మందహాసం చేస్తూ ఉన్నాయి. పక్షులు కూడా - ఆకాశంలో ఏదో మూలనుండీ గుంపులు గుంపులుగా దిగి వచ్చాయి - ఆడుతూ పాడుతూ-

"చల్లబడ్డది ఒక్క నేలేకాదు. భయం పుట్టేటట్టు వీచిన ప్రచండ మారుతం కూడా ఈ రోజు చల్లని గాలిగా మారిపోయింది. నేలలోని వాసనలను ముక్త హస్తాలతో విరజిమ్ముతూ ఉంది. కిసలయాలకు గిలిగింతలు పెడుతూ ఉంది, కొమ్మలను సంబరంతో ఊపుతూ ఉంది ; ఇటు నదీ తీరాన ఉన్న చెట్లకూ, అటు గుట్టలమీది చెట్లకూ మధ్య దాగుడు మూతలాడుతూ ఉంది. ఇక సూర్యుడో ? నిన్నటివరకు ఆకాశపు బట్టీలోనుండి నిప్పులు చెరుగుతున్న వాడు ఈరోజు వసంతం చల్లుతూ ప్రపంచాన్ని పరిహసిస్తున్నాడు."

ఆ తర్వాత పశువులతో పరిహాసం, ఎద్దుల ముద్దులు, విత్తనాల గమ్మత్తులలో ఓలలాడే పల్లె ప్రజలను రచయిత ఎంతో తాదాత్మ్య భావంతో వర్ణిస్తాడు.

సృష్టి అంతా ఆనందమయంగా, లయాత్మకంగా ఉన్నట్టు తోస్తుంది. క్షామవర్ణన చూడాలంటే 'దుఃఖ పీడితులు' 'కష్టపు రోజులు' 'రోట్లో తల, అధ్యాయాలు చదివి తీరాలి.

"అసలే వేసవి రోజులు. దానికి తోడు పనీ, పాటా లేదాయె. అంతటితో చాలనట్టు నెత్తి మీద కత్తి! రోజు ముందుకు సాగితేగా! రామా చెప్పనే చెప్పింది - ఈ రోజుకు ఆకలితో కాళ్ళు విరిగిపోయాయని. అందుకే ముందుకు నడవటమే లేదు."

"వైశాఖ మాసం రాగానే గాలి దుమారాలు మొదలయ్యాయి. కాని ఈ సంవత్సరం పొలాల్లో గడ్డి ఎగిరిపోవడం లేదు - అసలుంటేగా ఎగి

రేందుకు? లేకుంటే ఎండిపోయిన ఆకులు, తునకలు ఎగరటమే లేదేమో?''

అంటే ఆకులు, అలాలు ఎగిరేలోగానే ఎవరో ఒకరు తినేశారన్న మాట!

''ఎగురుతూ ఉంది వెచ్చటి వడగాలి, దానితోపాటు నేల దుమ్ము-ఇకపోతే మనుషుల రెప రెపలాడే తల జుట్టు.''

''పన్నెండు నెలలనుంచీ కనిపించని వర్షం జ్యేష్ఠమాసంలో గడచిన పదిహేను రోజుల్లో తప్పకుండా కురుస్తుందని అనుకున్నారు. కాని మేఘ రాజు నిద్రపోయాడేమో? లేకుంటే ఆయనలో తేమంతా ఆరిపోయిందేమో? లేదా తిరుగు ప్రయాణంలో దారి దూరంగా తోచిందో?''

''భూమి మీద మృత్యువు వర్షిస్తూనే ఉంది. అడవుల్లో, పొలాల్లో, సందుల్లో, గొందుల్లో- ఎక్కడ పడితే అక్కడ శవాలపై శవాలు! ఎక్కడ దహనం చేస్తారు? ఎక్కడ పూడ్చి వేస్తారు! ఇక అంత్యక్రియలు, సూతకాలు, కర్మాంతరాల ప్రసక్తే లేదు. వెనుక చిక్కిన వాళ్ళను ఓదార్చ వలసిన పని గాని, పోయిన వాళ్ళకోసం దిగులు పడవలసిన పని గాని లేకుండా పోయింది. 'చూచే పని లేదు, ఏడ్చే అవసరం లేదు' అని అను కుంటూ ఉండేవాళ్ళు.''

పల్లెటూళ్ళలో ఋతువులు, పండుగలు, ఆచారాలు 'పృథ్వీభారం మోసే వాళ్ళు' అనే అధ్యాయంలో చక్కగా వర్ణింపబడ్డాయి. అయిదు పంక్తులలో గ్రామ జీవితంలోని ఋతుచక్రం ప్రత్యక్ష మవుతుంది.

ఈ నవలకు 'మానవీనీ భావాయీ' అనే పేరు పెట్టకపోతే 'పృథ్వీభారం మోసేవాళ్ళు' అని పేరు పెట్టమని నేను సలహా ఇచ్చేవాణ్ణి.

వస్తువర్ణనలోనే కాదు సంభాషణల్లోనూ, వ్యంగ్యోక్తుల్లోనూ, మానసిక సంఘర్షణల్లోనూ కనిపించే భాషా పాటవం సూక్ష్మంగా పరిశీలించి ఆనందించ తగింది. ఒకచోట నిలకడగా నిగనిగలాడే ముత్యాల సరాలు విసరితే, మరోచోట నిప్పులు కుప్పలుగా కురిశాయి. ఒకచోట అందమైన చంద్రహాస తళ తళలు, మరోచోట అంతరాంతరాలను ఛేదించుకొని పోయే శల్యవేదనలు, ఇంకోచోట మనోవ్యథను ప్రతిబింబించే ఉత్తుంగ భావతరంగాలు.

వాగ్విభూతికి మకుటాయ మానమైనవి మాలీ పలుకులు. ముసలి మాలీ

ఎంత ప్రయత్నించినా కాళాకు సంబంధం కుదరక మానదు. తన కంఢ్ల ఎదుటే వేడుక జరుగుతుంటే చూచి అది తన పెనిమిటితోనూ, కొడుకుతోనూ ఇలా చెప్తుంది:

"చావండిరా, చావండి. చేవలేని మొగోళ్ళు. ఇక్కడినుంచి వెళ్ళి ఏ బైరాగుల్లోనో చేరండి. ఎక్కడ చచ్చాడు ఆ రణ్ ఛోడు గాడు? ఇలాంటి దద్దమ్మ నా కడుపున ఎలా పుట్టాడో? పెండ్లాన్ని పుట్టింటికి పంపేయమని చెప్పు. . నిశ్చితార్థం అయితే అయిందికాని ఈ కక్రి మొహానికి పెండ్లి అయిందంటే నాకంటే కుక్క మేలు. చూడు మరి నా తడాకా!"

నిజంగానే మాలీ ఒళ్ళు తెలియని వైరంతో కాళా - రాజూలకు పెండ్లి కాకుండా చేస్తుంది. కాని కాలం పరిహసించినట్టు నిరూపించే కావ్యధర్మం 'మాలీ మరణం' అనే అధ్యాయంలో పరాకాష్ఠ చెందుతుంది.

కరువు రోజుల్లో చుట్టుపక్కల ఉన్న కొండల్లో ఉండే కోయవాళ్ళు ఎప్పుడువచ్చి పల్లెల్ని దోచుకుంటారో అని జనం ఆందోళన పడుతుంటారు. ప్రతి రోజూ కొండమీదినుంచి దీటీలు కిందికి దిగుతుంటాయి, కేకలు వినిపిస్తాయి - అందరూ ధాన్యం, సొమ్ములు దాచుకుంటూ ఉంటారు. కాని మాలీ మాత్రం ఇంట్లో అందరి సొమ్ములూ ఎక్కడా దాచకుండా తన ఒళ్ళోనే పెట్టుకుంటుంది. "మీ సొమ్ములన్నీ నాదగ్గర భద్రం చేయండి - నాకన్నీ తెలుసు. ఆ పిరికిపందలు సన్నెం చెయ్యలేరు. నా తల నరిసిందంటే ఊరికే నరిసిపోయిందా?"

చివరకు ముసలి మాలీ సొమ్ముల మూటతో సహా దోపిడీపాలవుతుంది. వాళ్ళమధ్య కాళ్ళు రాచుకొని దెబ్బలు తిని చనిపోతుంది. దోపిడిగాండ్లు దాని శరీరానికి ఆచ్ఛాదనగా ఒక నూలుపోగయినా వదలలేదు. శవంమీద కప్పేందుకు గుడ్డ కూడా కక్రిమొహం కాళాయే ఇస్తాడు.

ముసలమ్మ శవం చితిమీద పెట్టగానే ఆమె నోటిలో వెండో బంగారమో పెట్టాలని అందరూ అంటారు.

నానియా చిరాకు పడతాడు: "దిక్కుమాలింది చేతికి ఒక ఉంగరమైనా ఉంచితే కదా నోట్లో పెట్టేందుకు. ఏం చేస్తాం, కానియ్యండి. ఉన్న సొమ్మంతా మూటగట్టుకుని వెళ్ళిపోయింది."

కాళాకు వాళ్ళమీద అసహ్యం వేసింది. తన చేతి ఉంగరం విరిచి ముసలమ్మ నోట్లో పెట్టాడు.

కాని రచయిత ఈ సందర్భంలో ఒక వ్యంగ్యోక్తి పలుకుతాడు: "ముసలమ్మ పోయిందని వీళ్ళకు తెలియదు. లేకుంటే కాళా పెట్టిన వెండి ముక్కను 'థూ' అని ఉమ్మివేసేది."

కాళా – రాజూ ఇద్దరూ గట్టివాళ్ళు. మాలీ కూడా అలాగే మంచి దిట్ట. దాని కొడుకు నానియా కూడా గట్టివాడే అయిఉండాలి. "ముసలిది సొమ్ములను దాచి పెట్టనియ్యలేదు. మనల్ని బిచ్చగాండ్లను చేసి వెళ్ళింది. ఇప్పుడేమనుకొంటే ఏం లాభం? అది పోయిన చోటికి గుఱ్ఱాల మీద వెళ్ళినా అంతు చిక్కదు." ఇలా అనుకొంటూ గుండెలు బాదుకొంటూ నానియా అంటాడు: "పారిపోయావు – కాని ఒక్క మాట జ్ఞాపకం ఉంచుకో. దేవుడి ఇంటికయినా వెళ్ళి నీ అంతు కనుక్కో లేకపోతే నీ కడుపున రాయి పుట్టిందనుకో."

కాలనిష్ఠమయిన నవల వ్రాయడం చాలా కష్టమయిన పని. సంఘటనలు ప్రధానంగా చేసికొని నవలలు వ్రాసేప్పుడు రచయిత ఒకటి తర్వాత మరొకటి వరుసగా జరిగిన సంఘటనలను చర్చిస్తూ వెళతాడు. ఈ పురోగతిలో మిగిలిన లోపాలను మరిచిపోవడం జరుగుతుంది. ఇది రచయితకూ, పఠితలకూ కూడా సులువైన పని. అలాగే పాత్ర పోషణం ప్రధానంగా చేసే రచనల్లో కూడ పాత్రల గుణగణాలే కథా గమనాన్ని నిర్దేశిస్తాయి. కాని కాల నిష్ఠమైన రచనల్లో కాలమే గతికి తోడ్పడవలసి ఉంటుంది. కాలగమనం ఒకప్పుడు త్వర త్వరగా ఉంటుంది. మరొకప్పుడు మందంగా ఉంటుంది. కాలగతి ననుసరించి పాత్రలలో సహజమైన పరిణామం తీసికొని రావలసి ఉంటుంది. ఇందులో రచయిత సంఘటనలను తన యిష్టం వచ్చినట్లు కల్పించలేక పోతాడు. కాలం అంటే వ్యక్తిగతంగా గాని, సాంఘికంగా గాని వ్యక్తులు చేసే పనులతో భవితవ్యం అల్లుకొని పోవటమే. వ్యక్తుల ప్రాదుర్భావం ఒకచోట జరుగుతుంది. వారి ఆచరణ పరిపక్వత చెందుతుంది మరోచోట. జూదంలో ధర్మరాజు తన సంపదను, సహచరిని ఓడిపోయిన ఘట్టంలో వేదప్రోక్తమైన ద్యూతస్తవం దగ్గరినుండి శకుని కుతంత్రాల వరకు అన్నీ కర్మనియతికి తోడ్పడతాయి. 'వార్ అండ్ పీస్' అనే గొప్ప నవలలో బాహ్యంగా గోచరించని అంతరంగిక నిర్ణయం ఇచ్ఛాపూర్వకమైన నిర్ణయం కాదు. ఇదమిత్థమని

చెప్పటానికి వీలులేని యుద్ధ స్వభావం, దాని బలాబలాల ప్రభావం వల్ల ఏర్పడిన నిర్ణయమది.

అందువల్ల కాలనిష్ఠమైన నవల వ్రాసేప్పుడు రచయిత పఠితలకూ, పాత్రలకూ మధ్య కొంత గారడీ చేయవలసి ఉంటుంది. తానే నిర్ణయాలకు బాధ్యుణ్ణి అని అతననుకొంటాడు. కాని నిజంగా నిర్ణయానికి తోడ్పడేది ముఖ్యంగా ఈశ్వర సంకల్పం- దానితోపాటు సామూహిక కర్మపరిపాకం. ఈ వ్యూహంలోనుంచి బయటపడే మార్గం ఏర్పరచుకొని 'ఇదంతా గారడీ కాదు, యథార్థమ' నే భావన పఠితలకు కలగచేయటం అనేది సామాన్య కళాకారుడు సాధించగలిగినది కాదు.

'మానవీనీ భవాయీ' లో పన్నాలాల్ పటేల్ సమస్త సమాజాన్ని కాలవిశేషానికి ముడిపెట్టి ఆ కాలంవల్ల ప్రచోదితమై, ఆకృష్టమై దానితో పోరాడుతున్నట్టు చిత్రించారు. ఇది అసిధారా వ్రతచర్య లాంటిది. ఐనప్పటికీ రచయిత సృష్టించిన పాత్రలు- వాలా పటేల్, పరమాపటేల్, కాళా, ఫూలీమాం, మాలీ- అందరూ యథార్థ జీవులు. ఎదుట కనిపిస్తే వాళ్ళని ఒక్కమాటతోనే మనం పోల్చుకోగలం అనిపిస్తుంది.

అక్కడక్కడ కొన్ని లోపాలు కనిపించటంలో ఆశ్చర్యం లేదు. మచ్చుకు కాసమ్, శంకర్‌లాంటి వాళ్ళు చేరి రాజూకు నానియాతో సంబంధం ఏర్పరిచేందుకు ప్రయత్నిస్తారు. ఇందులో ఎంతమాత్రం ఔచిత్యం లేదు. కాసిమ్‌లాంటి వాళ్ళు ఇలాంటి పనికి ఎప్పుడూ పూనుకోరని సామాన్య పాఠకుడు కూడా చెప్పగలడు. అలాగే రచనా సౌష్ఠవాన్ని బట్టి చూస్తే మొదటి అధ్యాయం ఈ నవలలో అనవసరంగా చేర్చబడిందని అనిపిస్తుంది. నేరుగా రెండో అధ్యాయం నుండి మొదలుపెట్టి చదువుకు పోవచ్చు.

ఇంతకంటె కూడా జుగుప్స కలిగిస్తుంది–చివరి ఘట్టం (శూన్య గగనం). కాళా (మానసిక) దాహాన్ని తీర్చేందుకు రాజూ తన రొమ్ము అతని నోటిలో పెడుతుంది. దీని అవసరం ఆట్టే కనిపించదు. దీనివల్ల రస నిష్పత్తిలో కూడా తీవ్రత వచ్చినట్టు కనిపించదు. ప్రపంచంలో ఎన్ని రకాల కామ వికారాలో ఉన్నాయి. కాని కాళా వంటి వ్యక్తి కాయికంగా కాని మానసికంగా కాని అలాంటి వాటిలో చిక్కుకోక పోవటంలోనే సహజత్వం ఉంది.

ప్రమాదవశంగా ఏర్పడ్డ ఇలాంటి లోపాలు చాలా కొద్దిగానే కని పిస్తాయి. కండ్లకు కట్టినట్టు కనిపిస్తుంది- కష్టాలతో కాలం గడుపుతూ కూడా కొంచెం దుఃఖ నివారణం కాగానే ఆకాశాన్ని మారు మ్రోగించే మాదక మధుర గీతాలతో హాయిగా ఆడుతూ పాడుతూ దావానలం నుండి బయటపడుతూనే మలయానిలంలో ప్రవేశించగల చైతన్యంతో వెల్లివిరిసే గ్రామ సమాజం. ఆ సమాజానికి చే దివ్వెలాంటి కాళా కాలి అందెలు ఘల్లు ఘల్లున పుడమి తల్లికి వినిపిస్తూంటే రాజూ లాగా మనలో కూడా ఏదో ఆశలు చిగురిస్తాయి. యముడేమిటి, వాడి తాత వచ్చినా సరే ఈ ఉల్లాసం అంతరించదు.

'భారతం'లో యక్ష ప్రశ్నల్లో ఒక ప్రశ్నకు సమాధానం చెప్తూ ధర్మరాజు అంటాడు, "అన్నిటికంటె పెద్దది కాలం చెప్పే కథ!" ఈ సమాధానంతో మనం కూడా ఏకీభవించి మన పన్నాలాల్ త్వరలో ఆరోగ్యాన్ని పొంది ఈ నవలకు ఉత్తర భాగం కూడా వ్రాయాలని భగవంతుని ప్రార్థిస్తాం.*

గ్రామం : దక్షిణామూర్తి —దర్శక్.

ఆవలా (సౌరాష్ట్రం)

16- 12- 1952.

* రచయిత ఆరోగ్యం అనాటికి సరిగా లేదు. ఈ నవలకు అనుబంధంగా రెండో భాగం 'భాంగ్యానాంభేరు', మూడో భాగం 'ధమ్మర్ వలోణుం' గుజరాతీలో ప్రచురితమయ్యాయి.

—అనుకర్త.

# 1

# కుటీరంలో

అది మార్గశిర మాసం. అర్ధరాత్రి. గోధుమ మొక్కలూ, శనగ మొక్కలూ, ఒకదాని వొడిలో ఇంకొకటి దూరడానికి ప్రయత్నం చేస్తున్నవి. పొలాలలో మంచెలు నిర్మించబడి వున్నవి. అవి కుటీరాలలాగా వున్నవి. పొలం కాపలా కాయడానికి పోయిన రైతులు ఆ కుటీరాలలో కాళ్లు ముడుచుకొని చలికి గడ గడలాడుతూ నిద్రపోతున్నారు. చలి మంటలు బూడిద రాసుల మధ్య నిద్రపోతున్నవి. సస్యశ్యామలంగా ఉన్న పొలాలూ, ఆ పొలాల మధ్య ఎత్తైన కొండ గుట్టలమీద వున్న పల్లె గ్రామాలూ అంధకారంలో శూన్యం శూన్యంగా నిలబడివున్నవి. భూమాత గురకలు బెట్టి నిద్ర పోతున్నది. నక్షత్ర భూషితమైన ఆకాశమంతా నీరవంగా – శాంతిమయ వాతావరణంలో భూమాతను చుట్టి ముట్టి వున్నది.

బ్రహ్మాండమంతా నిశ్శబ్దంగా, నిశ్చలంగా వున్నది. దూరంగా నదికి దగ్గరగా వున్న కొండ గుట్ట పక్కన ఒక కుటీరమున్నది. దానిలో బూడిద కింద కుములుతున్న చలిమంటా ఆ చలిమంట తాలూకు కాంతి నలువైపులా వ్యాపించి వున్నది.

ఆ కుటీరానికి–లేదా మంచెకు ముందు భాగంలో చిరిగిన జంబుఖానా మీద ఒక వ్యక్తి కూర్చొని వున్నాడు. అతను ముసలివాడు. అతని ముఖం పొలాల వైపుకు తిరిగి వున్నది. ఆ ముఖం పెద్ద గుమ్మడికాయలాగా గుండ్రంగా వున్నది. తల వెంట్రుకలు అతని ముఖంమీద చిందరవందరగా పడివున్నవి. లోతుకు పీక్కొని పోయినట్లున్న అతని కళ్ళు నది అవతలి వొడ్డున దూర దూరంగా వ్యాపించివున్న పర్వత పంక్తుల మధ్య భాగంలో దేనినో చూస్తున్నట్లున్నవి. చలి మంట తాలూకు వేడి అతని శరీరంలోని కుడి భాగాన్ని వేడి వేడిగా వుండేటట్లు చేస్తుంటే ఎడమ భాగాన్ని పొలాల మీదనుండి వీస్తున్న చల్లగాలి చలబరుస్తున్నది. ఆ వేడిగానీ, చల్లదనంగానీ అతనిలో ఏ విధమైన చలనాన్నీ కలగజేయడం లేదు.

కొంతసేపైన తరువాత అతడు దీర్ఘంగా నిట్టూర్చాడు. అతని శరీరం లోని నరాలన్నీ ఆ నిట్టూర్పుకు పెకి ఉబికి తిరిగి యథాస్థానానికి చేరు

కొన్నవి. అతని దృష్టి వెనుకకు మళ్లింది. ఎడమ చెయ్యి దగ్గరకు లాక్కొని కుడి చేత్తో చలిమంటకు దగ్గరగా వున్న హుక్కాను తీసుకొన్నాడు. అతని ఎడమ చెయ్యి కుంటిగా వున్నది. హుక్కా చివరిభాగంలో వున్న కుదురును పట్కారుతో శుభ్రం చేశాడు. దానిలో పొగాకు నింపాడు. లెఖ్ఖపెట్టి మండుతున్న బొగ్గులు దానిలో వేశాడు.

హుక్కా గొట్టం నోట్లో పెట్టుకొని పొగ పీలుస్తూ తిరిగి అంధకారంలోకి అచంచలంగా చూడడం ఆరంభించాడు.

అతణ్ణి చూచిన ప్రతివాడూ ఒక ప్రశ్న అడిగే అవకాశమున్నది. "అంత తదేక ధ్యానంగా ఆ అంధకారంలో అంత దూరంలో అతడు ఏమిటి చూస్తున్నాడు?"

ఇటువంటి ప్రశ్నను నలుగురైదుగురు కూర్చున్న సమయాలలో అతణ్ణి అనేకమంది అనేక పర్యాయాలు అడిగారు: "కాళీదాదా! నీవు ఎప్పుడూ మన్నూ మిన్నూ ఏకమయిన చోటుకు నిన్ను నీవే మరచిపోయి చూస్తూ వుంటావు, అక్కడేమున్నది? నీవు చూచే వస్తువు ఏమిటి?" ఆ ప్రశ్నకు అతను జవాబు చెప్పేవాడేగాడు. కాని ఒక్కొక్కప్పుడు దీర్ఘంగా నిట్టూర్చి-"సోదరుడా! దూరంగా కనబడే ఆ పర్వతాల మధ్య భాగంలో నా జీవిత సర్వస్వం దాగి వున్నది. అదే నా జీవితానికి ఆధారంగా వుండేది" అనే వాడు. తన జీవితంలోని నలభై సంవత్సరాలు ఆ వస్తువుమీద ఆధారపడి వున్నవనే వాడు. ఒక్కొక్కప్పుడు అటువంటి ప్రశ్న అడిగినప్పుడు వెర్రిగా నవ్వి ఊరుకొనేవాడు. ఏమీ జవాబిచ్చేవాడుగాడు. ఒక్కొక్కసారి "ఆ అంధకారంలో నా యౌవనమంతా గడచిపోయింది. నా హృదయంతో పెనవేయబడిన "రాజు" పరాయి స్త్రీ అయిపోయింది. నా శత్రువు - నా పెదతండ్రి కుమారుడు నానాభాయి కారణంగా నా కుమారుడు ప్రతాపుడు నా కళ్ళముందు నుంచి అదృశ్యుడైనాడు" అనేవాడు. ఆ తరువాత తన కుంటి చేతితో కన్నీళ్ళు తుడుచుకొనేవాడు. నక్షత్ర ప్రకాశాన్ని జూచి నవ్వడానికి ప్రయత్నించేవాడు. "జీవితంలో ఈ నక్షత్ర ప్రకాశమంత వెలుతురు లభించినా ఆనందించే వాణ్ణి" అనేవాడు. ఇంతలోనే "ఏ మేఘమో ఆ నక్షత్రాన్ని కప్పివేస్తే? ఆ నక్షత్ర ప్రకాశం గూడా అదృశ్యమైతే? నా జీవితం గూడా అటువంటి నక్షత్ర మయిపోయిందని" వాపోయేవాడు. "నా తండ్రికి అరవయి సంవత్సరాల వయస్సులో నేను

జన్మించాను. నా భార్య నేను చెప్పినట్లు విని నా కెంతగానో సహకరించింది. నా కిద్దరు ఆడపిల్లలు. ప్రతాపుడు నా కుమారుడు. యుక్త వయస్సులోకి వచ్చాడు'' (అకస్మాత్తుగా ఒకసారి అతని కంఠధ్వని పెద్దదయిపోయింది.. ''ఆ హంతకుడు నానా!.. రాజు ఎట్లాగూ చేజారి పోయింది.. నా ఒక్కగాని ఒక్క కుమారుడు ఈ నానా చేతుల్లో చనిపోయినా బాగుండేవి.. నానా..నానా.. వాణ్ణి సాధువులపాలు జేశాడు. ఇప్పుడు వాడు జీవించివున్నాడో లేదో తెలియదు. ఏమైపోయినాడో అసలే తెలియదు'' అంటూనే కాళా పెద్దగా ఏడ్చాడు. అతని ఏడుపును చూచి ఎనభైఏళ్ళ ముసలివాళ్ళు గూడా సిగ్గుపడవలసిందే. ఏడ్చి ఏడ్చి అలసిపోయాడు. ఆ ఏడుపుకు అర్ధరాత్రి గూడా స్థంభించిపోయింది. ఆ అర్ధరాత్రికి అతని విషాద గాథ దుర్భరంగా తోచిఉంటుంది. ''నాయనా! ప్రతాప్! గుర్రాల వంటి ఎద్దుల్ని ఎవరు అదుపులోకి తెస్తారు? నావల్ల ఆ పని అవుతుందా? ఆడ ఏనుగులలాగా వున్న ఈ గేదెలు దేనికి నాయనా! రాజు కొరకై ఎదురు చూచి చూచి నా యౌవనమంతా గడచిపోయింది.. ఈ ముసలితనంలో నీ మీద ఆశ పెట్టుకొని జీవిస్తూ వుంటే ఈ అన్యాయం జరిగింది. భగవంతుడా! కడుపులోనే నేను చచ్చిపోయివుంటే నాకు ఈ రోజులు చూడవలసిన అవసరం ఏర్పడేదిగాదు. ప్రస్తుతం నా జీవితం షాహుకారు చేతిలోని లెఖ్ఖల పుస్తకంగా అయిపోయింది. ఈ పశువులు, బావి, ఈ పొలం అన్నీ ఏమి కావాలి? రాజూ! నా జీవితం షాహుకారు లెఖ్ఖల పుస్తకంలోని తాకట్టు పద్దు అయిపోయింది.''

కొంత సేపటికి కాళా ఈ ప్రపంచంలోనికి వచ్చాడు. తన హృదయ దౌర్బల్యానికి తానే సిగ్గు బడ్డాడు. తిరిగి ఇంకోసారి హుక్కా పీల్చాడు. ఆలోచనల్ని మధ్యలో ఆపడానికి అతనికది వొక్కటే ఉపాయం కనిపించింది. నెమ్మదిగా జంబుఖానా మీద వొళ్లు వాల్చాడు. కళ్లు గట్టిగా మూసుకొన్నాడు. నిద్ర వస్తుందా? రాలేదు. అయినా మనసారా ఏడవడం వల్లనో లేక జీవిత నాటకంలో సంపాదించిన అనుభవ ప్రభావం వల్లనో, వైరాగ్య భావం వల్లనో చివరి చివరికి అతని మనస్సు కొంత కుదుటబడింది.

మళ్లీ ఆలోచనలు!! తన జీవితంలో ఎన్ని మార్పులు వచ్చినవి? 56 సంవత్సరం క్షామం గడచిపోయింది. ఆనందమనేది లేకుండా-చౌరాస్తాలో

జరిగే భవాయీ[1] నృత్యంలాగా తన ఏభై సంవత్సరాల జీవితం వ్యర్థమై పోయింది. తన జీవిత నృత్యమంతా అతని కళ్లకు ఒక్కసారి కట్టినట్లనిపించింది. తన జీవితం నిజంగా భవాయీ నృత్య ప్రదర్శనం వంటిదే. సందేహం లేదు. ఏభై సంవత్సరాలుగా జీవిత నాటకంలో పాత్రధారిగా పాల్గొంటున్నాడు. . . . చిత్రమైన విషయం!

---

[1] గుజరాతు ప్రాంతంలోని జాన పద నృత్యం

## 2

# శుభాకాంక్షలు

కరువు రావడానికి ఇరవై ఐదు సంవత్సరాలకు పూర్వం కథ ఇది. వేసవి కాలం సమాప్తం కాబోతున్నది. మాళ్వానుండి గుజరాత్‌కూ, గుజరాత్ నుండి మాళ్వాకూ ప్రయాణంచేసే "దేవో బన్జారా" ఐదువందల ఎద్దుల్ని వెంటబెట్టుకొని గుజరాత్ సరిహద్దుల్లోకి ప్రవేశించాడు. ఎద్దు వీపులకు ఇరు ప్రక్కలా మట్టి కుండలు వేలాడుతున్నవి. ఆ కుండల్లో నెయ్యి ఘుమ ఘుమలాడుతున్నది. రైతులు పొలం పనులు ప్రారంభించారు. కొంతమంది గ్రామాలలో పెంకులు కాలుస్తుంటే కొంతమంది కాలిన పెంకుల్ని ఇళ్ళ మీది కెక్కిస్తున్నారు. కర్రలు సరిజేసి - సరిగా పాతుకొని కొంతమంది తమ యింటి గోడల్ని బాగుచేసుకొంటున్నారు.

పలాశ వృక్షాలు-విచ్చిన పూల గుత్తులతో మేఘ పంక్తులకు స్వాగతం చెబుతున్నవి. నదీ తీరాలలో కురవంజి, నేరేడు మొదలయిన వృక్ష రాజాలు సరికొత్త ధోవతులు, చీరలు ధరించి మేఘాలకు స్వాగతం తెలియ జేయడానికి నిలబడి వున్నవి. అయితే ఆ గ్రామంలో ఒక్క వేప చెట్టు మాత్రం నిశ్చలంగా-ఆకాశాన్ని చుంబిస్తూ గ్రామంలో జరిగే ఘటనలకు సాక్షిగా ఆకుల్ని కొమ్మల్ని ఆడిస్తున్నది. గాలికి ఆ చెట్టులోనుండి ఏదో సంగీతం ప్రతిధ్వనిస్తున్నది.

ఒక రోజు రాత్రి పిల్లలంతా నిద్రించారు. శుభ్రం చేయబడుతున్న వంట పాత్రల రణగుణ ధ్వని ఆగిపోయింది. పెద్ద పెద్ద మంచాలమీద జనం నిద్రకు పడ్డారు. గుర్రులు ప్రతిధ్వనిస్తున్నవి. వేపచెట్టు ఆ రాత్రి ఆ అంధకారంలో బాబరో భూతంలాగా ఊగుతున్నది. అంతా శాంతంగా వున్నది. గ్రామమంతా నిద్రలో మునిగి ఉన్నది.

ఆ వేపచెట్టుకు ఎదురుగా ఒక చిన్న యిల్లున్నది. అంత అర్ధరాత్రి సమయంలో గూడా ఆ యింట్లో ఏదో కొంత అలజడిగా, అలికిడిగా వున్నది. ఆ యింటిముందు వసారాలో వాల్చి ఉన్న మంచం మీద దాదాపు అరవై సంవత్సరాల వయస్సు ఉన్న ఒక వృద్ధుడు కూర్చొని వున్నాడు. అతని మనస్సు వ్యాకులంగా వున్నట్లున్నది. పది నిమిషాలు మంచం మీద

పడుకొంటే పది నిమిషాలు లేచి కూర్చుంటున్నాడు. అతని చెవులు ఇంటి వాకిలివైపు వున్నట్లున్నవి. అతని దృష్టి అంతా వెదురు బద్దల తలుపు మధ్యనుండి ప్రసరిస్తున్న వెలుతురు వైపు వున్నది. అతని గుండెలు దడదడ కొట్టుకొంటున్నవి.

ఆ ఇల్లు వెదుళ్లతో కట్టినది. పైన కొంత భాగం పెంకులతోనూ, కొంత భాగం గడ్డిగాదంతోనూ ఆ ఇంటి పైకప్పు కప్పబడి వున్నది. ఆ ముసలివాని వేషం గొల్లవాని వేషంగా వున్నది. ధోవతి చాలా మందంగా వున్నది. అతని చొక్కాకు గుండీలు లేవు. అది గుడ్డతాళ్ళతో ప్రక్కగా కట్టి వున్నది. పక్కగా గోడనున్న మేకుకు తగిలించి ఉన్న తలగుడ్డమాత్రం సన్నని గుడ్డతో తయారయినట్లున్నది. అతని దుస్తులే గాదు, అతని స్వభావం గూడా విచిత్రమైనదే. అతని వయస్సు అరవై సంవత్సరాలయినా అతని శరీరం మాత్రం దృఢంగా వున్నది. అయితే అతడు జబ్బు పడ్డాడో లేక వయస్సు కారణంగా సహజంగానే దుర్బలుడైనాడో తెలియదు. మొత్తంమీద బలహీనుడుగా కనబడుతున్నాడు. నిమిష నిమిషానికీ లేచి వెదుళ్ళ తలుపు పక్కన నక్కి నక్కి ఏదో వినడానికి ప్రయత్నం చేస్తున్నాడు. ఆ తలుపు సందులోనుండి లోపలికి చూడడానికి ప్రయత్నిస్తున్నాడు.

"ఏమి చూడాలి" అని అతని ఈ ప్రయత్నం! దూరంగా ప్రసూతికి సంబంధించిన మంచం కనిపిస్తున్నది. నిరాశపడి తిరిగి తన మంచం మీదకు వచ్చి కూలబడ్డాడు. అతని తెల్లటి గడ్డంమీదా, అతని ముఖంమీదా క్షణంలో ఆనందం, సంతోషం, క్షణంలో నిరాశ, నిస్పృహ లాంటివి తాండవమాడుతున్నవి.

హఠాత్తుగా ఇంటి లోపలినుంచి పెద్ద మూలుగు వినబడింది. అతని హృదయం కంపించిపోయింది. పెదవులు కదలడం ఆరంభించాయి. "ఓ భగవంతుడా! నావను వొడ్డుకు చేర్పించు. సవాశేరు బరువు ఉన్న బిడ్డను ప్రసాదించు . ." అని ప్రార్థించాడు. ఆ బిడ్డ కొరకై అతను రెండో వివాహం గూడా చేసుకొన్నాడు. ఐదు సంవత్సరాలు నరక బాధ అనుభవించాడు. అతనికి వున్నది ఒక్కటే కోరిక. తన వంశం నిలవాలి, వంశాంకురం జన్మించాలి.

ఇంతలో శిశువు రోదన ధ్వని గూడా వినిపించింది. ముసలివాని హృదయం దానితో స్థంభించినట్లయి పోయింది. గల గల లోపల ఆడవాళ్లు

మాట్లాడుతున్నారు. వారేమి మాట్లాడుతున్నారో ఎంత జాగ్రత్తగా విన్నా అతనికి బోధపడలేదు.

"మగ పిల్లవాడా?" పెద్దగా అరచాడు.

చిర్రుమని తలుపు తెరుచుకొంది. లోపలి ఆడవాళ్ళు గబ గబా బయటికి వస్తున్నారు. వాళ్ళను చూడగానే అతనికంతా అర్థమైపోయింది. వెల వెల బోతున్నట్లున్న అతని ముఖం ఆనందంతో వికసించింది. కళ్ళు మూసుకున్నాడు. మంచంమీద పడుకున్నాడు. పడుకొన్నట్లు నటించాడు. కాని ఎన్ని క్షణాలు! అంతరంగంలోని ఆనందం అతణ్ణి పడుకో నివ్వలేదు. లేచి కూర్చున్నాడు. ఒక ప్రౌఢురాలు అతని దగ్గరకు పరుగెత్తుకొంటూ వచ్చింది. "అన్నా! వెయ్యేళ్ళు బ్రతుకు. ఇవి మా శుభా కాంక్షలు" అన్నది. అతని శరీరం గగుర్పొడిచింది. మధ్యపాపిడితీసి నట్లుగా ఉన్న-చెవులవరకూ వ్యాపించిన అతని గడ్డం మిల మిలలాడింది.

"అన్నా! వదిన మగ శిశువును కన్నది" వృద్ధుడు నోరు తెరుచు కొని ఆ ప్రౌఢురాలి వైపుకు చూస్తున్నాడు. అతడు నవ్వలేదు. ఏడవను గూడాలేదు. అది అతని పరిస్థితి. అతని నోటి వెంట మాట రావడం లేదు.

ఇంతలోనే ఐదారుగురు ఆడవాళ్ళు అతని మంచం దగ్గరకు చేరారు. అందరూ ఒకే మాట మాట్లాడుతున్నారు. బహుశా ఒకే పాట పాడు తున్నారు - "జమునా బహిన్! అరవై ఏళ్ళ వయస్సులో మగపిల్లవాడు" అన్న దొకామె.

"రాజాలాంటి పిల్లవాడు" అన్నది రెండో ఆమె.

వృద్ధుని కళ్ళు కన్నీళ్ళతో నిండిపోయినవి. పెదవులు కదలాడాయి. బలవంతంమీద గొంతు సవరించుకొన్నాడు.

"చెల్లెలూ! నిజమేనా?" అని అడిగాడు.

చెల్లెలు జవాబు చెప్పలేకపోయింది. పక్కనున్న ఇంకొకామె "నిజమే" అన్నది. "ఈ శుభ సమయంలో బహుమతి?" అని అడిగింది.

"ఏమి బహుమతి ఇస్తావు? చెప్పు"

"కోరుకోండి. మీరు ఏది కోరుకొంటే అది" అన్నాడు వృద్ధుడు. హర్షాశ్రుపూరిత నేత్రాలను చెల్లెలు వైపుకు తిప్పాడు.

అంతా ఆలోచనలో పడ్డారు. ఆ వృద్ధుడు ఎంతటి బీదవాడో వాళ్ళ కందరికీ తెలుసును. ఐదారు నిమిషాలు ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు.

"కోరుకో మన్నావు అదే చాలు" అన్నది ఒకామె.

"అతడేమివ్వ గలడులే" అన్నది నానాభాయి భార్య పర్మానీ.

"ఇంట్లో నీళ్ళు తాగడానికి చెంబైనా లేదు" అని గూడా అన్నది. పర్మానీ మాటలు గలగల ప్రవహించే నీటి ప్రవాహంలో రాళ్ళు విసరినట్లుగా పనిజేశాయి. రెండు నిమిషాలు ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు.

ప్రౌఢురాలు అందుకున్నది – "అన్ని రోజులూ అందరికీ ఒక్కటిగానే గడుస్తాయా? వాలాభాయికి మగ శిశువు జన్మించాడు. రేపు అదృష్టం కలిసివస్తే ఐశ్వర్యం మాత్రం రాగూడదా?" అన్నది.

"వాలాభాయీ! బహుమతిగా మాకు రాగి బిందెలివ్వు చాలు" అన్నది జమున.

"ఏమిచ్చినా చాలు. సోదరుని యింట్లో ఒక్క గుడ్డ దొరికితే చాలదా?" అన్నది జమున.

"పూలీ వదినా! అట్లాగాదు. ముందుకు వేసిన కాలు వెనకకు పోదు. మీరు కోరుకోండి" అన్నాడు వాలాభాయి.

"చెవుల పిల్లి ముందుకాళ్లు ఎంత తొందరగా ముందుకు పరుగెత్తుతాయో, వెనకటి కాళ్లు అంత తొందరగా పరగెత్త లేవు" అన్నది ఇంకొకామె.

మధ్యలోనే జమున అందుకొన్నది. "సరే, పూలీ వదిన ఏది కోరితే అది" అన్నది.

పూలీ వదినకు ఏదో జ్ఞాపకం వచ్చింది. "బహుమతిలో ఏముంది? హృదయం వుండాలి" అంటూ "వాలా! ఆషాఢ మాసంలో నాగలి దున్నుతూ నీవు దోహాలు పాడుతూ వుండే వాడివి జ్ఞాపకమున్నదా? ఒక రోజు నీవు నెమిలి పాట పాడుతూవుంటే నేనేమన్నానో జ్ఞాపకమున్నదా?" అని అడిగింది.

వృద్ధుడు కళ్లు కిందికి వాల్చాడు.

అతనికి జ్ఞాపకం వచ్చినట్లు లేదు. కొంచెం ప్రయత్నం చేశాడు. "అవునవును, జ్ఞాపకం వచ్చింది. ఆ రోజుల్లో పాటలు చాలా పాడేవాణ్ణి. ఇప్పుడైతే మీరు ఎగతాళి చేస్తారు" అన్నాడు.

"దేవదేవి దోహా వాలా!" అన్నది పూలీ. "నీకు భగవంతుడు మగ శిశువును ప్రసాదించాడు" అన్నది జమునా బహన్.

వృద్ధుడు ప్రశ్నించకుండా వుండలేని స్థితిలో పడ్డాడు. "వదినా ! పిల్ల వాడు ఎట్లా వున్నాడు ?" అడిగాడు.

"నీవు దోహాలలో వ్యక్తం చేసే వాడివి. అలాగే వున్నాడు. వెలలేని-నెమలిని ధరిత్రికి సమర్పిస్తానని నీ దోహాలో వుండేది గదా!"

"దేవదేవీ నీ పారే మేలతాం
సా కో మర్ఘాం నే బకరాం శా ఢోర్
పణ్ మారే ధరతీనే ఘోళే మేల్‌నో
మోం ఘీ మాటేనో రమ్‌తేరే మోర్"

"దేవదేవి దేవాలయంలో అందరూ కోళ్లనూ, మేకల్నీ, పశువుల్నీ సమర్పిస్తున్నారు. కాని నేను ధరిత్రీమాత వొడిలో నాట్యమాడుతున్న- అమూల్యమైన-మట్టి నెమిలిని సమర్పిస్తాను."

అది దోహా భావం.

3

# బ్రాహ్మణుడు భవిష్యత్తు చెప్పాడు

ప్రతివారికీ సంతానప్రాప్తి కావాలి అనీ – అందులోనూ మగపిల్లవాడు జన్మించాలి అనీ సహజసిద్ధమైన కోరిక వుంటుందనుకొంటాను. లేకపోతే వాలాభాయికి ఈ వయస్సులో సంతానమేమిటి? సంతానం లభించినందు వలన అతనికి ఈ ఆనంద మేమిటి? అతని తలమీద ఎన్ని వెంట్రుకలున్నవో అతనికి అన్ని అప్పులున్నవి. నిజానికి యింటిమీది పెంకులతో బాటు అతని శరీరం గూడా శిథిలమవుతున్నవి ఇది ఆ గ్రామంలోని జనం అభిప్రాయం.

అరవయ్యో సంవత్సరంలో జన్మించిన మగపిల్లవాడు ఎపుడు పెద్దవాడవుతాడు, ఎప్పుడు ముసలివానికి చేతికర్ర అవుతాడు, అతని సేవజేస్తాడు!!!

ఆ ముసలివాని దృష్టిలో సేవ అనే ప్రశ్నేలేదు. మొత్తం అతనికి కలిగిన సంతానం పదిమంది. ఎనిమిదిమంది ఒక సంవత్సరమో రెండు సంవత్సరాలో జీవించి మరణించారు. చివరి పిల్లలిద్దరూ పుట్టగానే భగవంతుణ్ణి చేరుకొన్నారు. అందువల్ల అతడంటాడు: ''నా అదృష్టంలో పిల్లలు లేరు' భగవంతుడు ఆటగా పిల్లల్నిచ్చి మళ్ళీ వెంట వెంటనే వాళ్ళను తన దగ్గరకు పిలిపించుకొంటున్నాడు.'' – అయితే అతని భార్యా, ఆ గ్రామంలోని జనం ఇంకొక రకంగా అభిప్రాయ పడుతున్నారు. వారికి శత్రువురాలు ఒకతె వున్నది. ఆమె ఏ మంత్రమో తంత్రమో చేయించి పిల్లల్ని చంపిస్తున్నది లేకపోతే ఈ అన్యాయమేమిటి? ఇది వారి అభిప్రాయం.

అయితే ఆ శత్రువురాలు ఎవరు? ఆ శత్రువురాలు వాలాభాయి తమ్ముడు పరమా పటేల్ భార్య మాలి. వాలాభాయికి పిల్లలు పుట్టినపుడల్లా అతని మరదలు మాలి మంత్ర తంత్రాలు చేయించి ఆ పిల్లల్ని చంపిస్తున్నదని ఆ వూరివారి నిశ్చితాభిప్రాయం. లేకపోతే ఒక్క పిల్లవాడు గాకపోతే ఒక్క పిల్లవాడైనా బ్రతకడా? మాలి వారి దృష్టిలో డాకిని, శాకిని. కాని వాలాభాయి ఆ అభిప్రాయంతో ఏకీభవించడం లేదు. ''అంతా రాముని దయ'' అని అతని అభిప్రాయం. పిల్లవాడు జన్మించాడనగానే అతడు భగవంతునికి, రామునికి–వంగి వంగి నమస్కారం చేసేవాడు. మానవ మనస్సు

గనక "ఈ పిల్లవాడినైనా బ్రతికించు" అని బ్రతిమాలాడేవాడు. "నీకది యిష్టంలేకపోతే – భగవంతుడా! ముందు నన్ను, తరువాత ఆ పిల్లవాడి తల్లినీ చంపి ఆ తరువాత పిల్లవాణ్ణి నీ దగ్గరకు తీసుకొనిపో" అనేవాడు. "ఈ యమ బాధ – పుత్రశోకం నేను భరించలే" ననేవాడు. "ఈసారి అయినా కరుణించు" అనేవాడు. "మాలి ఎత్తి పొడుపు మాటలు భరించ లేకుండా వున్నాను. ఇక మేము భార్యాభర్తలం ఉరి పోసుకొని చావక తప్పదు" అనేవాడు. ఈ పిల్లవాడు బ్రతికి బట్టకడతాడని అతని కేదో విశ్వాసం కలిగింది. . . .

కొద్ది రోజులు గడచిన తరువాత ఆ పిల్లవాడికి జన్మ పత్రిక వ్రాయించ వలెనని అనుకొన్నాడు. అందుకై రెండు మూడు సార్లు అక్కడికి ఏడెనిమిది మైళ్ల దూరంలో వున్న "డే గడీయా" గ్రామానికి వెళ్ళి వచ్చాడు. డేగడీయా గ్రామంలో వెయ్యి గడపలున్నవి. బ్రాహ్మణులు చాలామంది వున్నారు. కాని కాశీ వెళ్ళి వచ్చిన పండితు లెవ్వరూ లేరు. అయినా ఏమరైతే నేమిటి? బ్రాహ్మణ జన్మ పవిత్రమైనది గదా; బ్రాహ్మణులైతే- వారి మాట అసత్యంగాదనీ అనుకొన్నాడు.

డే గడీయా గ్రామంలో గడప గడపకూ తిరిగాడు వాలాభాయి. విచిత్ర మేమంటే-వోస్సినోటి బ్రాహ్మణులు గూడా ఈ వృద్ధుణ్ని చూచి ముఖం తప్పించడం ప్రారంభించారు. ముహూర్తం మంచిది గాదని, ఈ రోజు వారం మంచిది గాదనీ, వర్జ్యమనీ సాకులు చెప్పి తప్పించుకొనడం ప్రారంభించారు. అటు ముఖం తిప్పగానే వృద్ధుణ్ణి ఎగతాళి చేయడం ఆరంభించారు. "ఈ పటేలుకు బుద్ధీ తెలివీ వున్నట్టు లేదు. ఇంట్లో మింగ మెతుకు లేదు. జన్మ పత్రిక కోసం బయలుదేరాడు" అన్నారు.

ఒక రోజు వాలాభాయి కోరికను భగవంతుడు స్వయంగానే తీర్చాడు. ఒక బ్రాహ్మణుడు మిట్ట మధ్యాహ్నం ముఖియా ఇంటి కొరకై వెదకుతూ ఆ వూరు చేరుకొన్నాడు. ముఖియా ఇంటి ముందు తన భుజంమీది సంచిని దింపాడు. ముఖియా భార్య ఆ బ్రాహ్మణుణ్ణి చూచింది. ఆమెకు వొళ్ళు మండిపోయింది. "నాశనపు వాళ్లు-అడ్డమైన వాళ్లూ ముఖియా! ముఖియా! అనుకొంటూ వస్తారు. వీళ్లకు పనేమీ లేదు." అన్నది పెద్దగా.

దించిన సంచీని గభీమని ఎత్తి భుజాన వేసుకొన్నాడు బ్రాహ్మణుడు. "అమ్మా! కోపం చేసుకోకు. భగవంతుడు మా వంటి వాళ్ళ కోసం ఈ

చెట్లనూ, చెట్ల నీడల్ని గూడా సృష్టించాడు'' అన్నాడు. వాలాభాయి ఈ దృశ్యమంతా చూచాడు. అతని హృదయం ద్రవించిపోయింది. వెళ్లి ఆ బ్రాహ్మణ దేవతకు నమస్కారం చేశాడు. ''అయ్యా! నా యిల్లు పావనం చెయ్యండి'' అని బ్రతిమాలాడు. బ్రాహ్మణుడు అతని మాటలను లక్ష్య పెట్టలేదు. రెండడుగులు ముందుకు వేశాడు, వెంటనే వాలాభాయి అతని చేతిలోని సంచిని బలవంతంగా తీసుకొని తన భుజంమీద వేసుకొన్నాడు. ఇక బ్రాహ్మణునికి వాలాను అనుసరించక తప్పలేదు. ఇద్దరూ వాలా యింటికి చేరుకొన్నారు.

ఎండ కట్టెగావున్న ఆ బ్రాహ్మణుని ముఖంమీద బ్రహ్మ వర్చస్సు తాండవ మాడుతున్నది. అతడు కాశీ వెళ్ళి వచ్చిన పండితుడని చెప్ప కుండానే తెలుస్తున్నది. పొడవైన అంగరఖాసు అతడు ధరించి ఉన్నాడు. పింజ బోసిన ధోవతీ, కోడి జుట్టు వంటి కుచ్చుల తలపాగా, కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నవి.

ప్రశ్నలు వేయగా వేయగా – అతడు ఆ సమీపంలోని గ్రామనివాసి అని తెలిసింది. ఆ బ్రాహ్మణుడు తరచు దేశాటన చేస్తూ వుంటాడట. అతని వృత్తి ఏమిటి? అని తెలుసుకొంటే జన్మ పత్రికలు వ్రాయడమని తేలింది. వాలాభాయి అమితానందం పొందాడు. భగవంతుడు స్వయంగా జన్మపత్రిక వ్రాయడానికి బ్రాహ్మణుణ్ణి పంపించాడని భావించాడు.

బ్రాహ్మణుని దగ్గర పాలల్లో ముంచిన రొట్టెలున్నవి. అవి అతని భోజ నానికి సరిపోగలవు. అయినా ఆ బ్రాహ్మణుడు తన యింట్లో ఆతిథ్యం స్వీకరించవలెనని వాలాభాయి కుతూహల పడ్డాడు. తన యింట్లో రాగి పాత్రలు గానీ, ఇత్తడి పాత్రలు గానీ ఏమీ లేవు. ఫూలీ వదిన యింటికి పోయి పాత్రలు తేవలెనని అనుకొన్నాడు. కాని ఆ ఎండాకాలంలో వంటకు మట్టి పాత్రలయితేనే బాగా వుండగలవని భావించి కుమ్మరి దగ్గరకుపోయి కొత్త పాత్రలు తెచ్చాడు. ''మహారాజా! పులగం పొయ్యి మీద వేయండి'' అని ప్రార్థించాడు. కాని ఆ బ్రాహ్మణునికి ఈ వంట గందరగోళంలో పడడం ఇష్టమున్నట్లు కనబడలేదు. జన్మకుండలి పని పూర్తిచేసి వెళ్ళడం మంచి దని అతడు తొందర పడుతున్నాడు.

వాలాభాయి తెలివిగా వ్యవహరించాడు. ''బ్రాహ్మణ దేవతా! నా మనవి

చిత్తగించండి. మా యింట్లో భోజనం చేస్తేనే - మా గింజలు రెండు మీ ఉదరంలో పడితేనే మాకు జయం'' అన్నాడు.

చివరికి బ్రాహ్మణుడు అంగీకరించాడు.

''నీవు కట్టెలు తెచ్చి పొయ్యి తయారు చేయించు. ఈ లోపల నేను ఈ కుండలి పని చూస్తా'' నన్నాడు. వాలా సంతోషించాడు. ఒకవైపు పొయ్యి పని జరుగుతూ వుంటే రెండోవైపు జన్మపత్రిక పని ప్రారంభమయింది.

వాలా సంతోషానికి అంతులేదు. బియ్యంలో నుండి రాళ్ళు ఏరివేసి పొయ్యి సరిజేశాడు. పులగానికి కావలసిన సంబారాలన్నీ తయారుజేశాడు. బ్రాహ్మణుడు తన పనిలో మగ్నుడైవుండడం చూచి ఆచారం ప్రకారం గ్రామంలోని పెద్దల నందరినీ పిలుచుకొని వచ్చాడు.

''పిల్లవాడికి నామకరణం జరుగుతున్నది. జన్మపత్రిక తయారవుతున్నది. పిల్లవాణ్ణి దీవించండి'' అని అందరినీ గ్రామస్థుల్ని ఆహ్వానించాడు.

ఒక్క ఘడియలో వాలా యిల్లు గ్రామ పెద్దలతో కిటకిటలాడి పోయింది. పరమ్‌జీ ముఖియా, అతని కుమారుడు రణఛోడుడూ వచ్చి కూర్చున్నారు. గ్రామస్థులంతా ముప్పయిమంది దాకా వున్నారు. వాళ్ళ శరీరాలు ఎంత మోటుగా వున్నవో, వారి దుస్తులుగూడా అంత మోటుగా వున్నవి. అంతా గొల్లలు. రకరకాల తలపాగాలు ధరించి వున్నారు. కొంతమంది ముఖాల మీద జులపాలు వేలాడుతున్నవి. పది పదిహేను హుక్కాలు వారిమధ్య వున్నవి. కొన్ని గొట్టాలకు ఆకృతిలేదు. మూడు నాలుగు హుక్కాలకు నగిషీ చెక్కబడి వున్నది. కొన్ని ఇత్తడి హుక్కాలున్నవి.

బ్రాహ్మణుడు లెఖ్ఖలు వేస్తున్నాడు. అందులో తన్మయుడై వున్నాడు. గ్రామపెద్దలు సంభాషణ ప్రారంభించారు. ఎవరి పశువులు ఎపుడు దొంగలించబడ్డవో, ఎవరు దొంగలించారో, తరువాత అవి ఎట్లా దొరికాయో వివరమంతా సంభాషణలో బయటికి వచ్చింది. ఆ తరువాత ఇంగ్లీషువాళ్ళు చలామణీ చేసిన కల్‌దార్ నాణేల సంగతి వచ్చింది. అంతవరకు అమలులో వున్న బాద్‌షాహీ, చిత్తూరు, సాలమ్‌షాహీ నాణేల చర్చ గూడా వచ్చింది. ఇద్దరు ముగ్గురు చాలా విచారాన్ని వెలిబుచ్చారు. నాణేల విషయంలో విచారం వున్న వాళ్ళూ, చర్చలో ఎక్కువగా పాల్గొన్న వాళ్ళూ శంకర్, పరమ్‌జీ, మావ్‌జీ తాత ముగ్గురే. వాళ్ళ దగ్గర గూడా వేళ్లమీద లెక్కపెట్టగలిగినన్ని రూపాయలు మాత్రమే వున్నవి.

పరమ్‌జీ ముఖియా కుతూహలం ఆపుకోలేక పోయాడు. బ్రాహ్మణుడు లెఖ్ఖలో ఎంత తల్లీనుడుగా వున్నాడో గమనించకుండా "మహారాజా! మన రూపాయలిస్తే తెల్లవాడు తన రూపాయలివ్వడానికి ఎంత తగ్గింపు చేస్తాడు?" అని ప్రశ్న వేశాడు. బ్రాహ్మణుడికి కోపం వచ్చింది. కాని దాన్ని నవ్వుకిందకు మార్చి-ఆ ప్రశ్నకు జవాబు తనకు తెలియకపోయినా-తెలుసో తెలియదో-తెలియకుండా వుండేటట్లుగా వాలాభాయిని తన ముందు కూర్చోబెట్టుకొన్నాడు. జన్మపత్రికలోని వివరాలు చెప్పడం ఆరంభించాడు.

"పిల్లవాడి లగ్నం మిథునంలో వున్నది". ఎవ్వరికీ ఏమీ బోధ పడలేదు — "మిధునమా? అదిసరే గాని పేరు ఏమిపెట్టాలి?" అని అడిగాడు పరమ్‌జీ.

"క. చ. ఘ. మిధునం. 'క' ను అనుసరిస్తే కంచనలాల్, కాశీనాథ్, కనకచంద్" ఎవ్వరికీ పేర్లు నచ్చినట్లు లేవు.

"మీ కులాన్నిబట్టి కుబేరుడు, కచరా, కనక, కాళ .." వాలాభాయి అందుకొన్నాడు-"చాలు, చాలు, కచర, కాళ రెండు పేర్లూ బాగా వున్నాయి" అన్నాడు.

అందరూ 'కాళా' పేరుకు అంగీకారాన్ని తెలియజేశారు. బ్రాహ్మణుడు "కాళా నామాభిధేయుడై.." కాగితంమీద వ్రాశాడు. ఆ తరువాత ఫలా ఫలాలు చెప్పడం ఆరంభించాడు.

చంద్రుడు, రాహువు, కేతువు అని బ్రాహ్మణుడంటూంటే అందులో ఎవ్వరికీ ఏమీ రసం కనబడలేదు. శంకర్ "అది సరే గురూ! వీడికి పిల్ల లెంతమంది?" అని అడిగాడు. అంతా గొల్లున నవ్వారు.

బ్రాహ్మణునికి గూడా నవ్వు వచ్చింది. కొందరి మీద దృష్టి సారించి "ఈ పిల్లవాడు ప్రయోజకుడవుతాడు" అన్నాడు. "ముఖియా లేక పోయినా ముఖియాకు గల హోదాను అనుభవిస్తాడు. ఇతని ఇంటి ముందు గుర్రాలు కట్టివేయబడతాయి, తన జాతిలో తన రాజ్యంలో మంచి పేరు తెచ్చుకొంటాడు. గొప్ప వీరుడు శూరుడు అవుతాడు" అన్నాడు.

అంతా వాలాభాయి వైపుకు చూచారు. వాలాభాయి మౌనంలో వీరుడుగా వున్నట్లు బ్రాహ్మణునికి ఎట్లా తెలుసు? అతని ముఖంమీది కత్తిగాయాల మచ్చల్ని చూడలేదు గదా! అనుకొన్నారు. ఏమైనా ఆ బ్రాహ్మణుడి మాటల మీద వారికి విశ్వాసం కుదిరింది.

"ఎన్ని సంవత్సరాలు జీవిస్తాడు మహారాజా?" వాలా ప్రశ్న వేశాడు. "నీ కంటె ఎక్కువ కాలం జీవిస్తాడు" అన్నాడు బ్రాహ్మణుడు. వాలా కళ్ళవెంట బొటబొట నీళ్ళు కారాయి. "నీ వాక్యం ఫలించాలి" అన్నాడు.

"వీడికి పెళ్లి అవుతుందా?" ఇంకొకడు ప్రశ్న వేశాడు.

"ఇద్దరు భార్యలు" అన్నాడు బ్రాహ్మణుడు.

పరమా కొడుకు రణఛోడుడు పక పక నవ్వాడు "ఒక్క పెళ్లాంతోనే చస్తున్నాము, ఇద్దరు పెళ్లాలా?" అన్నాడు.

వాలాభాయి ఎంత గంభీరంగా వున్నా మానవ మాత్రుడు కనక అతనికి గూడా కోపం వచ్చింది.

"పెళ్ళి కాకపోతే మాత్రమేమిటి? నాలుగు కాలాలు సుఖంగా జీవించి వుంటే అదే చాలు" అన్నాడు.

రణఛోడుడు తనను పరిహాసం చేస్తున్నాడని వాలా అనుకొన్నాడు.

బ్రాహ్మణుడు వాలాను శాంతంగా వుండమన్నాడు. "తాతా! ఈ పేద బ్రాహ్మణుడి మాట జ్ఞాపకం పెట్టుకో. నీవు బ్రతికుండగానే ఈ పిల్ల వాడికి సంబంధం కుదురుతుంది. అది జరగకపోతే నేను చెవులు కోయించు కుంటాను" అన్నాడు. బ్రాహ్మణుని కళ్ళు మిల మిల మెరుస్తున్నవి. వాలాభాయి హృదయంలో నుండి శ్రద్ధాభావం పెల్లుబుకుతున్నది.

బ్రాహ్మణుడు దస్తరం ముడిచి కట్టాడు.

'మహారాజా! నేను మీకేమివ్వగలను? పేదవాణ్ణి. ఒక గేదె దూడ వున్నది" అన్నాడు వాలా వినయంగా.

బ్రాహ్మణుడు ఏమీ జవాబు చెప్పనేలేదు. పరమా అందుకున్నాడు. "గేదె దూడ యిస్తావా? నీ యింట్లో ఏమున్నదని ఇస్తావు? మింగ మెతుకు లేదు మీసాలకు సంపెంగ నూనె" అన్నాడు.

శంకర్, మావ్‌జీ తాత, ఫూలీ వదిన మొదలైన వారు "ఈ సమయంలో ఇదేమి మాటలు? బ్రతికి బాగావుంటే కాళాస్థితి మారకపోతుందా?" అన్నారు.

"మారిన నాటి సంగతి వేరు. ఇప్పటి స్థితి ఇప్పుడు ఆలోచించాలి" అని పరమా పటేల్ కసిరాడు. "వాగ్దానం చేయగానే సరిగాదు, వాగ్దానం చేసి నిలబెట్టుకోవాలి. ఈ బ్రాహ్మణ జాతి ఎటువంటిదో తెలుసునా? బొడ్లో చెయివేసి వసూలు చేస్తుంది" అన్నారు.

పరమ్‌జీ మాటలు విని బ్రాహ్మణుడు కళ వళ పడ్డాడు. అతని ముఖాన కత్తి వేటుకు నెత్తురు చుక్క లేకుండా పోయింది. ముఖియా వాలానూ తననూ గూడా అవమానించడానికి ఈ మాటలు మాట్లాడుతున్నాడని బ్రాహ్మణుడు అర్థం చేసుకొన్నాడు. అతని ముఖం ఎర్రబడిపోయింది. బ్రహ్మ తేజస్సు అతని ముఖంమీద ప్రకాశిస్తున్నట్లనిపించింది. పరమా పటేలును ఉద్దేశించి–"పటేలూ విను, జ్ఞాపకం పెట్టుకో. వాలాభాయి నిష్ఠాపరుడు. శ్రద్ధ గలవాడు. నిజమైన హృదయం గలవాడు. కాలం స్థితి మూడు నాలుగు సంవత్సరాలలో మారిపోతున్నది. అతని స్థితి మారకపోతే నేను చెప్పుదెబ్బలు తింటాను" అంటూనే–మంచంమీద వున్న సంచిని భుజంమీద వేసుకొన్నాడు. సంచిలో నుండి చిన్న పూజలసంచి బయటికితీసి మళ్ళీ కూర్చున్నాడు. ఆ చిన్న సంచిలో నుండి ఒక తాయెత్తు తీసి వాలాకు యిచ్చాడు. "ఈ తాయిత్తుకు ధూపంవేసి ఆ పిల్లవాడికి కట్టు" అని చిన్న సంచీని మూతి బిగించకుండానే పెద్ద సంచిలో వేశాడు. లేచి నిలబడ్డాడు, వెళ్లుతున్నాడు.

గ్రామస్థులంతా కోపంలో వున్న బ్రాహ్మణుణ్ణి శాంతపరచడానికి విశ్వ ప్రయత్నం చేశారు. వాలాభాయి నిశ్చేష్టుడైనాడు. పరమా గూడా క్షమించ మని బతిమిలాడాడు. అయినా ఆ బ్రాహ్మణుడు వినలేదు.

"వాలాభాయి స్థితి మారి కాళా పెద్దవాడైనపుడు మాత్రమే తిరిగి నేనీ యింటికి వస్తాను" అంటూ గబ గబా నడచి వెళ్లాడు.

వాలాభాయి కన్నీళ్లు కారుస్తున్నాడు. "తమ్ముడూ, నేనేమి అపరాధం చేశాను? ఆ బ్రాహ్మణుడు నా యింట్లో భోజనం చేయకుండానే వెళ్లాడు" అన్నాడు.

"అన్నా! అన్నీ నీ మంచికే చేశాను. నీకు తినడానికే తిండిలేదు. గేదె దూడ ఎక్కడినుండి వస్తుంది?" అన్నాడు పరమాపటేల్.

పక్కనుండి కొన్ని మాటలు వినబడ్డవి. అందరూ అటువైపు చూచారు. పరమాభార్య మాలి–పరమాను ఉద్దేశించి వ్యంగంగా "నీకు ముగ్గురు పిల్లలున్నారు. అన్న ఆస్తి తరిగిపోతుందని నీకు చింత. అది నీ పిల్లలకు దక్కదని నీ విచారం. మింగ మెతుకులులేవు. మీసాలకు సంపెంగనూనె బడాయిలకు తక్కువలేదు" అన్నది.

ఇక అక్కడ వుండడం మంచిదిగాదని గ్రామస్థులంతా లేచి నిలబడ్డారు.

వాలా బ్రతిమిలాడుతున్నాడు–"చూడండి. ఆ బ్రాహ్మణుడు ఆకలి కడుపుతోనే వెళ్ళాడు. మీరు గూడా బెల్లం తీసుకొనకుండా వెళ్ళుతారా? బెల్లం ముక్క తీసుకొని పోండి" అన్నాడు.

"నల్లమందు నీళ్ళు తాగాము గదా! పిల్లవాడు కాళా పెరిగి పెద్దవాడైన తరువాత తప్పకుండా బెల్లం తీసుకొంటాము. ఊళ్ళో వాళ్ళమే గదా!" అంటూ ఒకరొకరు వెళ్లడం ఆరంభించారు.

ఆ మాటలు విని పరమా భార్య మాలి మండిపడింది. "ఎత్తిపొడవండి. ఇంకా ఎత్తిపొడవండి. కాళాట. కాళా. పేరు చూడండి. ఒరేయి ముసలివాడా! విను. నా మాట విను, జ్ఞాపకం పెట్టుకో. పేరు పెట్టగానే బ్రాహ్మణుడు అన్నం తినకుండా వెళ్లాడు. సాటివాళ్ళు బెల్లంముక్క తీసుకోకుండా వెళ్ళుతున్నారు. గుఱ్ఱంమీద ఎక్కుతాడట. గుఱ్ఱాలు కట్టివేస్తాడట. గుఱ్ఱాలను కాదు, గాడిపల్ని కట్టివేస్తాడు. జ్ఞాపకం పెట్టుకో" అన్నది మాలి.

ఆ మాటలు విని సహించలేక వాలాభాయి భార్య ఇంటి ముందుకు వచ్చింది. "అను. అను. నీ నోటికి హద్దూపద్దూ లేదు. పతివ్రత శాపాలు పెట్టదు. ఆ పని శంఖిని చేస్తుంది" అన్నది.

వాలాభాయి అదిరిపడ్డాడు. తన భార్య నోటికి చెయ్యి అడ్డంబెట్టాడు. "పద. నీవు ఇంట్లోకి పద. భగవంతుని దయ వుంటే అంతా సవ్యంగానే జరుగుతుంది. పోట్లాటకంటే మించిన శాపం మరింకొకటి లేదు" అన్నాడు.

కోపాన్నంతా దిగమింగి వాలాభాయి భార్య ఇంట్లోకి వెళ్ళిపోయింది.

పరమా భార్య వూరుకుంటుందా? శబ్దకోశంలోవున్న తిట్లన్నీ తిట్టింది. శాస్త్రాలలో వున్న శాపాలన్నీ పెట్టింది.

వాలాభాయి మనస్సులోనే భగవంతునికి నమస్కారాలు చేశాడు. "ఓ భగవంతుడా! ఆమె తిట్లకేమిటిలే! నా శిరస్సుమీద నీ వేయి చేతులున్నవి. పసిపిల్లవాణ్ణి ఒక కంట కనిపెట్టు" అని ప్రార్థించాడు.

ఇంట్లోకిపోయి తాయెత్తుకు ధూపంవేసి కాళా చేతికి కట్టాడు.

పరమా భార్య మాలి వాగుతూనే వున్నది. కాని ఏదో విశ్వాసం వాలాకు ఏర్పడింది. తన ప్రయత్నం లేకుండానే బ్రాహ్మణుడు వచ్చాడు. జన్మపత్రిక తయారుచేశాడు. ఇది భగవంతుని దయ. కాళాకు ఏమీ కష్టం కలగదు అనుకొన్నాడు.

# 4

# గీతం

ఆషాఢమాసం ప్రవేశించింది. శుద్ధ తదియనాడు ఆకాశమంతా ఏదో చక్రం మీద తిరుగుతున్నట్లున్నది. విదియనాటి రాత్రి పెద్దసుమ్ము తుపాను రేగింది. కాని ఈ రోజు వాతావరణం మారిపోయింది. మేఘాలు గర్జిస్తూ పర్వతాలకు ఉత్తర భాగంలో ప్రయాణం చేస్తున్నవి. వర్షదేవత సైన్యం తాలూకు గాలి, తుపాను, మెరుపులు మొదలైనవి అవ్యక్తమైనవి. అవుతున్నవి -

ఒక్క రాత్రిలో - రెండు మూడు గంటల్లో ఎంత వర్షం! భూమాత రూపమే మారిపోయింది. నిన్నటివరకు కాళ్ళు నేలమీద పెట్టడానికి వీలులేనంత వేడి వుండేది. ఈ రోజు ఆ వేడి అంతా ఏది? ప్రకృతి చల్లగా - సుందరంగా వున్నది కాళ్ళు బారజాచుకొని నిద్రపోతున్న యువతిలాగా వున్నది ప్రకృతి. గుంటలన్నీ నీళ్ళతో నిండివున్నవి. ఆ నీళ్ళల్లోనుండి రకరకాల కప్పలు రకరకాల ధ్వనులు చేస్తున్నవి. ఎండిన చెట్ల గుంపులు ఒక్క రాత్రి చిగురు తొడిగినవి. కంటికి ఇంపైన ఆకుపచ్చ రంగును ధరించి చిరునవ్వులు నవ్వుతున్నవి. పక్షులు ఎక్కడినుండి వచ్చినవో తెలియదు, ఆకాశమంతా బారులుతీర్చి ఎగురుతున్నవి. వర్షఋతువుకు స్వాగత గీతాలు ఆలపిస్తున్నవి. ఒక్క రాత్రిలో వాతావరణమంతా మారిపోయింది.

ఒక్క భూమి మాత్రమే గాదు. గాలి మారింది. వేడి పేరుకుగూడా లేకుండా పోయింది. భూమి సుగంధాన్ని వెళ్ళగక్కుతున్నది. చిగురుటాకులు చిరునవ్వులు నవ్వుతున్నవి. కొమ్మలు నెమ్మదిగా కదులుతున్నవి. దూరంలో - నదీతీరంలో మేఘాలు పర్వతాలతో దాగుడుమూతలాడుతున్నవి.

సూర్యుడు నిన్నటివరకు ఆకాశమనే అగ్నిగుండంలో కాలుతున్న అగ్నిగోళంగా వున్నాడు. కాని ఈ రోజు బుక్కాయి చల్లుతూ - నవ్వుతూ వున్నాడు. నీళ్ళతో నిండిన గుంటల్లో బాలకులతో బాటు తాను గూడా బాలరవి తన ప్రతిబింబాన్ని చూచుకుంటున్నాడు.

రాత్రి పశువుల శాలల్లో మేకులకు కట్టివున్న పశువులు తాళ్ళు వదిలించుకొని ఈ ప్రకృతి లీలను చూచి ఆనందించి పొలాలకు పోయి ఉల్లిపాయ మొక్కల్ని పీకివేయడానికి తొందర పడుతున్నవి.

ప్రశువుల వెంట ఈ రోజు ఎద్దులు గూడా కనబడుతున్నవి. బహుశా ఈ రోజు వాటితో రైతులకు పని బడినట్టున్నది. ఎద్దుల నోళ్ళకు దాణాసంచీలు తగిలించబడి వున్నవి. కొన్ని ఎద్దుల మెడలకు గంటలు కట్టబడుతున్నవి. ఎక్కడ చూచినా ఎద్దులు బాగా కనబడుతున్నవి. గంటలు గణ గణ మంటున్నవి.

నాగళ్లు బయటికి వచ్చినవి. వాలా తాత వంటి బీసవాక్షు గూడా పావుశేరు నెయ్యి అయినా కొని తెచ్చుకొంటున్నాడు. గోరువెచ్చని నీళ్లతో ఇళ్ళ ముందున్న బండలపై నిలబడి గ్రామస్థులు స్నానం జేస్తున్నారు. సంవత్సరంలో మూడు వందల అరవైనాలుగు రోజులు తగాదాలతో సతమతమయ్యే పరమా సుఖియా ఇల్లు గూడా ఈ రోజు శాంతంగా వున్నది. జీవితంలో నవ్వు అంటే ఏమిటో ఎరగని మాలి గూడా ఈ రోజు చిరునవ్వులు చిందిస్తున్నది. కోపస్వభావం వలన ఎప్పుడూ చిటపటలాడుతూ వుండే భార్యలూ, పరదేశానికి సంపాదనకుపోయే పుత్రుల్ని గన్న తల్లులూ ఆప్యాయతతో తమ భర్తలకూ, పుత్రులకూ వడ్డిస్తున్నారు. మావుజీ తాత మంఛా అమ్మమ్మతో సరసాలాడుతున్నాడు. ఎద్దుల మెడ మీద నాగలి సర్దుతున్నాడు. మంఛా అమ్మమ్మతో రావి చెట్టు కిందనుంచి ప్రయాణం చేయమనీ, గణపతిని ధ్యానించమనీ సదుపదేశం చేస్తున్నది.

ఎద్దుల మెడలకు పాత గంటలు కట్టాడు వాలాభాయి. మావుజీ, మంఛా అమ్మమ్మల దృష్టి వాలా మీద పడింది. వాళ్లు ఏమన్నా అంటారేమోనని భయపడి వాలాభాయి "మావ్‌జీ తాతా! అమ్మమ్మ చెప్పిన మాటలు మరచిపోకు" అన్నాడు.

మావ్‌జీ–"వాలా! నీవు వెంట నిప్పు తీసుకొని రావడం మరచిపోకు" అన్నాడు.

"నిప్పు" అనే మాట అనగానే విన్న వాళ్లంతా ఫక్కున నవ్వారు. మంఛాకు గూడా నవ్వు వచ్చింది. "ఏమిటి ఆ మాటలు! అపశకునం మాటలు" అన్నది.

"ఏమీలేదు వదినా! నిప్పు దేవతలకు దేవత" అంటూనే "జయ్ గణపతి కీ" అంటూ భూమాతతో ఆడుకొనడానికి ఉత్సాహంగా ఎద్దుల్ని అదలిస్తూ వాలాభాయి బయలుదేరాడు.

ఒక్క గంటలో గ్రామసీమలు మువ్వల చప్పుళ్లతో, చిరు గంటల మధుర

ధ్వనులతో ప్రతిధ్వనించినవి. నిన్నటివరకు, మనుష్యులు కాదు గదా, పశువులైనా కనపడని పొలాలన్నీ మానవ సమూహంతో నిండిపోయాయి. విత్తనాల బుట్టలతో కొంతమంది నడుస్తూవుంటే కొంతమంది బుట్టలు కిందబెట్టి అటు ఇటు తిరుగుతున్నారు. పిల్లలు పొగాకూ, హుక్కాలూ, నీళ్ల చెంబులూ, నిప్పుముంతలూ పొలాలలోకి చేర వేస్తున్నారు.

అందరూ తమ తమ పనులలో మగ్నులై వున్నారు. ఎవ్వరికీ తీరిక లేదు. నిన్నటి దాకా నారి కురుపుతో మంచ మెక్కిన గలా నీళ్లు తాగడానికైనా కిందకు దిగనివాడు ఈనాడు నాగలి దున్నటానికి బయలుదేరాడు. రణఛోడునికి నిన్నటి దాకా జ్వరంగా వున్నదన్నారు. నిన్నటి వేడిలాగా బహుశా అతని జ్వరం గూడా తగ్గిపోయినట్టున్నది. వాలాభాయి ముసలితన మంతా ఏమయిపోయింది? గ్రామంలో ఎవ్వరూ లేరు. గుడ్డి డోసాలాల్‌కు గూడా ఏమి పని వున్నదో తెలియదు, కర్రపోటు వేసుకుంటూ పొలాల గట్లకు చేరుకొన్నాడు. బహుశా ఇంట నీడకంటే మేఘాల నీడ అతనికి ఎక్కువగా చల్లగా వున్నట్లు కనబడి వుండవచ్చును.

రైతులందరూ నిషాలో వున్నట్లున్నారు. ఒక్కటే నిషా. ఆ రోజు విత్తనాలు వెదజల్లి తీరాలి. అయితేనే పంటలు బాగా పండగలవు. రెండు రోజులు ఆలస్యమైనా మొక్కజొన్న ఎండిపోతుంది. ధాన్యం పండదు.

రోజులు నెమ్మదిగా జరిగిపోతున్నది. వాలాభాయికి ఈ రోజుల్లో ఒకటే ఆలోచనగా వున్నది. కాళాకు సంబంధం కుదరాలి. అది జరిగితే తాను గంగలో స్నానం చేసినట్లే.. తొందరలో సంబంధం కుదరకపోతే పిల్లవాడికి ఇక వివాహంగాదు, అది అతని భయం. వివాహం జరగకపోయినా బాధ లేదు, కాని మాలి మరదలి ఎత్తి పొడుపు మాటలు ఇక తాను విన లేడు. మారి మధ్య మధ్య అందుకొని, "అవును డబ్బు మూ లుగుతున్నది గదా! పిల్లనివ్వడానికి జనం ఎగబడతారు" అనడం మొదలు బెట్టింది.

"నీకెందుకు ఈ విషయాలు? మరదలూ!" అన్నాడు వాలాభాయి. అతని మాట పూర్తిగాక పూర్వమే - "నాకెందుకా? ఉయ్యాలలోనుండే ఎగరగొట్టుకొని పోతున్నారు గదా! ఆ సంతోషం పట్టలేక" అన్నది.

వాలాభాయికి చాలా విచారంగా వుండేది. ఒకసారి "మరదలూ ఎందుకు నీ కింత అహంకారం? డబ్బు అనేది తోకవున్న వస్తువు. అది

ఎప్పుడు పూడిపోతుందో ఎవ్వరికీ తెలియదు. అంతమాత్రం చేత డబ్బు చూచుకొని ఇంత అహంకారంగా వ్యవహరించవలసింది కాదు'' అన్నాడు.

ఆ మాటలు విని మాలి ఇంకా మండిపోయింది.

ఒకసారి పరమా గూడా అందుకొని – "అవును అన్నా!. డబ్బు మహాత్మ్యం నీకేమి తెలుసు?'' అని చివాట్లు పెట్టాడు. రణఛోడుడు పెద తండ్రిని కొట్టడానికే పరుగెత్తేవాడు. చిన్న కుక్కపిల్లవంటి నానియా-రణ ఛోడుని కొడుకు – తన తండ్రి వెంట తాను గూడా పరుగెత్తేవాడు. రణ ఛోడుడు– "నీకు మా మంచి ఇష్టం లేదు. మేము పచ్చగావుంటే నీ కళ్లల్లో నిప్పులు పోసుకొంటున్నావు. మమ్మల్ని గురించి ఎప్పుడూ చెడ్డగా ఆలోచిస్తున్నావు. మా ఇంట్లో పిట్ట బుర్రుమంటే అప్పుడు చూపిస్తాను మజా'' అనేవాడు.

ఈ విధంగా అనేక పర్యాయాలు పోట్లాటలు జరిగేయి. ఒక్క వారం పోట్లాట లేకుండా గడచినా మహాద్భాగ్యంగా వుండేది. "అడవిలో కాపురం పెట్టు, బాధలేదు. కాని నిత్యం పోట్లాడే సోదరుని పక్కన మాత్రం వుండకు'' అనే సంస్కృత శ్లోకార్థాన్ని వాలాభాయి మాటిమాటికీ జ్ఞాపకం చేసుకొంటూ వుండేవాడు.

యౌవనంలో వుంటే వాలా ఆ యిల్లు వదలి ఎక్కడికైనా వెళ్ళి పోయే వాడే. తన సోదరుని కుటుంబమంతా తనమీద శత్రుత్వాన్ని వహించి వున్నదని అతనికి తెలుసును. అప్పుడప్పుడు తగాదాలు పడలేక కాళా వివాహం కాకపోయినా మంచిదేలే అని తనలో తాను అనుకొనేవాడు. రోజూ తగాదా పడుతూవుంటే కుటుంబానికే చెరుపు అని అతని విశ్వాసం.

ఆ గ్రామంలోని వాళ్ళు గూడా పరమా ముఖియా అన్నా అతని కుటుంబంలోని వాళ్ళన్నా భయపడేవాళ్ళు. పరమాకు మంచిమాట చెప్ప డానికి వెనకంజ వేసేవారు. ముఖియా ఎదిరి పక్షాన్ని సమర్థించడం జరిగేదే గాదు. అందువల్ల కాళా వివాహం సందర్భంలో అన్నీ తెలిసిన వాళ్ళూ, వాలాతో పరిచయమున్న వాళ్ళూ గూడా ఏమాత్రమూ ముందుకు రాలేదు.

అయినా మగసిరి చూపించింది ఫూలీ అవ్వ. కాళా సంగతి ఎవ్వరూ ఎందుకు పట్టించుకొనడం లేదో ఫూలీ అవ్వకు తెలుసు. వాలాకు సహాయం చేయవలెనని ఆమె నిశ్చయించుకొన్నది. కాని తాను మాత్రం ఏమి చేయ గలదు? ఆ గ్రామంలో వివాహం కావలసిన ఆడపిల్ల లెవరైనా వుంటేనా?

ప్రసూతి అయిన పది రోజుల లోపలనే ఆడపిల్లలకు సంబంధాలు నిశ్చయమై పోతున్నాయి. అందువలన ఎవరెవరి యిళ్ళల్లో ప్రసవాలు జరగబోతున్నవో పూలీ అవ్వ మనస్సులో అన్నీ వ్రాసిపెట్టుకున్నది. తన మనస్సులో వున్న మాటను ఆమె తన కుమారుడు శంకర్‌కు గూడా చెప్పలేదు.

ఆ తరువాత రెండు నెలలకు శ్రావణంలోనో భాద్రపదంలోనో గలా భార్య ఆడపిల్లను ప్రసవించింది. పూలీ అవ్వ స్వయంగా పురుటింటికి పోయింది. ధర్మకార్యంలో ఆలస్యం పనికిరాదని భావించి వెంటనే ఆ పురుటింట్లోనే గలా భార్యతో ఈ విషయం పరామర్శ చేసింది. ఈ పిల్ల పెళ్ళి వాలాభాయి కొడుకు కాళాతో జరిగితే మంచిదని తన అభిప్రాయం అని చెప్పివేసింది. పిల్ల తల్లికి కాళా నచ్చాడు. వాలాభాయి స్వభావం గూడా ఆమెకు నచ్చినదే. వాలా భార్య తనకు స్నేహితురాలు. అదిగాక పూలీ అవ్వ అభిప్రాయం అందుకు అనుకూలంగా వున్నది.

"పిన్నీ! నాకేమీ అభ్యంతరం లేదు. కానీ పిల్ల తండ్రి గూడా అంగీకరించవలె గదా!" అన్నది.

"వాడి సంగతి నేను చూచుకుంటానులే," అన్నది పూలీ అవ్వ. పూలీ అవ్వ తలపెట్టిన పని సగమయింది. ఇక పిల్ల తండ్రికి నచ్చజెప్పాలి. అంతేగాక గలా భార్య పుట్టింటి వాళ్ళకు గూడా నచ్చచెప్పాలి గదా! ఆ పని ఎవరు చేయాలి?

ఎందుకో ఆమెకు కొంత నిరుత్సాహం కలిగింది. పిల్ల పుట్టింటి వాళ్లు రణఛోడుని అత్తింటి వాళ్ళు.

అయినా పరమా వియ్యంకుడు తనకూ దూరపు బంధువే అనుకొన్నది. ఎటువంటి బంధువు అని ప్రశ్న వేస్తే! అతని సవతితల్లి మేనమామ కూతురు కూతురు పూలీ అవ్వ మేనగోడలు తల్లి. ఇది బంధుత్వం. పూలీ అవ్వ అన్ని విషయాలూ బాగా ఆలోచించింది. అసలామె జ్ఞాపకశక్తి చాలా గొప్పది. ఆ గ్రామంలోనే గాక, ఆ చుట్టు పట్ల వున్న పద్దెనిమిది గ్రామాల లోని వారందరూ ఆమెకెరుకే. ఎవరు ఏ ఊరినించి వచ్చిందీ, ఏ భూమి ఎవరెవరి చేతులు మారిందీ ఆమెకు తెలుసు. అన్నదమ్ముల తగాదాలైనా, సంబంధాలు కుదిరించే విషయమైనా, ఆ గ్రామానికి సంబంధించిన ఏ సమస్యలైనా పరిష్కరింపబడడంలో పూలీ అవ్వ సలహాకు చాలా ప్రాధాన్య

ముండేది. ఆమె చేతి మీదుగా ఎన్ని తగాదాలు పరిష్కారమైనవో లెఖ్ఖలేదు. గడచిన పది సంవత్సరాల నుండి ఆమె అన్ని తగాదాలనూ పరిష్కరిస్తున్నది.

కాళా మనువు విషయంలో ఆమె తనంత తానుగానే కల్పించుకొన్నది. అందువలన గలా భార్య పుట్టింటివాళ్ళు తనను వ్యతిరేకించరని ఆమె విశ్వాసం. అసలు మాలి అంటే ఆమెకు మంట. ఆ మంటే కాళా వివాహం విషయంలో ఆమె పాల్గొనడానికి కారణభూతమయింది. కాళా వివాహం జరపకపోతే తన పేరు మార్చుకొంటానని ఆమె ప్రతిజ్ఞ చేసింది.

చివరికి ఆమె మాట నెగ్గింది. గలా భార్య పుట్టింటివాళ్ళు వ్యతిరేకించ లేదు. "నీవు చెప్పిన తరువాత వరుడు పనికిరానివాడైనా అంగీకరించక తప్పుతుందా?" అన్నారు. ఆ మాట విని ఫూలీ అవ్వ మహదానంద భరితు రాలయింది.

"అట్లాకాదు. మీరు పిల్లవాడి యింటికి వచ్చి హల్వా తిని వస్తేకదా మాట నికరమైనట్లు" అన్నది. వివాహంలాంటి విషయాలలో బంధువు లంతా ఒకచోట కలిసి తథాస్తు అంటే తప్ప నిశ్చయమైనట్లుకాదని ఆమెకు తెలుసును. పదిహేను రోజుల్లో పిల్లవాడి యింటికి వస్తామని గలా దగ్గర మాట తీసుకొని ఆతిథ్య సత్కారానికి అవసరమైన పనులన్నీ చేయించమని వాలాకు పురమాయించింది.

పదిహేను రోజులూ పూర్తి అయినవి. పిల్లయింటి వాళ్ళు రేపు మాపు అనడం ప్రారంభించారు. దానికి కారణం ఫూలీ అవ్వకు తెలిసిపోయింది. మాలి కోడలు ఉదయం సాయంత్రం పిల్లయింటి చుట్టూ తిరుగుతున్నది.

ఏమైనా పరమా కుటుంబం మాట సాగలేదు. ఫూలీ అవ్వ అనుకొన్న మాట చెల్లితీరింది. సోమవారం తాంబూలాలు అని నిశ్చయం జరిగింది.

వాలాభాయి పిచ్చివాడైనాడు. భగవంతుడే స్వయంగా తన యింటికి వస్తున్నట్లు భావించాడు. నువ్వులు పొలంలో వెదజల్లాలి. తరువాత చూడవచ్చు అనుకొన్నాడు. ఏడెనిమిదిళ్ళు తిరిగి శేరుకు బదులు రెండు శేర్లు నెయ్యి పోగుచేశాడు. హల్వాకు గోధుమరవ్వ తయారు చేయించాడు. కోమటింటినుండి ఐదు శేర్లు బెల్లం తెచ్చాడు. ఐవారు పరుపులు ఎరువు తీసుకొచ్చాడు.

వాలా భార్య ఉత్సాహానికి అంతే లేదు. అనుకోకుండానే సంబంధం కుదిరింది. అంతేగాక పిల్ల పక్షంనుండి మాట వచ్చింది. అది మరీ విశేషం.

పరమా పటేలు ముగ్గురు కొడుకుల్లో ఒకడికేగా పిల్ల తరఫునుండి సంబంధం వచ్చింది!!

అయితే పరమా పటేలు ఇంటి వాతావరణం మాత్రం ఏమీ బాగాలేదు. సోమవారం నాటి ఉదయం వారిల్లు నరకంగా తయారయింది. రణఛోడ్ భార్య తన ఏడాది పిల్లను చచ్చేటట్లు బాదింది. రణఛోడ్ తన భార్యను నానా తిట్లు తిడుతున్నాడు. మాలి పరమా ముఖియాను అనరాని మాటలు అంటున్నది. "నాశనపువాడా! ఆత్మహత్య చేసుకో - ఇల్లు వదలి సన్యాసులలో కలువు. చచ్చిన రణఛోడ్ గాడు ఎక్కడున్నాడు? మీసాలు లేని వెధవ, నా కడుపున పడ్డాడు. ఈ కోడలి ముండ పుట్టింటి వాళ్లు పిల్లనిస్తున్నారు. ఛీ! వాళ్ల ముఖం చూడగూడదు. అయ్యో! అయ్యో! ఎంత పని జరుగుతున్నది. మాతో మాట లేదు. పలుకు లేదు. వాలా కొడుకు కాళీగాడికి మనువా!!" అని అంటున్నది.

ఆ తరువాత కోడలికీ అత్తకూ మధ్య యుద్ధం జరిగింది. తల్లీ కొడుకూ జుట్లు జుట్లు పట్టుకున్నారు. తండ్రీ కొడుకూ రామ రావణ యుద్ధం చేశారు. రెండో కొడుకు నాథా మెల్లగా ఎద్దుల్ని విప్పుకొని పొలానికి జారుకొన్నాడు. అంతా తల బాదుకొంటున్నారు. చిన్న నానియా స్తంభం పక్క నిలబడి గుక్కబట్టి ఏడుస్తున్నాడు. ఇల్లంతా ఢోళ్లు, తప్పెటలు మోగుతున్నట్టున్నది. ఫూలీ అవ్వ పక్కన లేకపోతే పండ్లు పసుపు తెస్తున్న నలుగురైదుగురు ఆడవాళ్లల్లో ఎవరికో ఒకరికి కపాలమోక్షం జరిగేదే! తన తల బద్దలుకొట్టుకొని చుట్టూ రక్తాన్ని ప్రవహింపజేసేదే! మాలి.

"మా సలహా లేదు. మా సంప్రతింపు లేదు. మేము పరాయి వాళ్లమా? అయిన వాళ్లకు ఆకులూ కాని వాళ్లకు కంచాలూనా?" అని వాగుతూనే వున్నది.

ఫూలీ అవ్వ అవేమీ పట్టించుకోలేదు. ఫూలీ వుంటే మాలి అడుగుబెట్టదు. అటువంటి మాలీలను పదిమందిని సమర్థించగలదు. "అసలు మాలీని నా ముందుకు రమ్మనమను, చూస్తాను" అన్నది ఫూలీ అవ్వ.

"వస్తే ఏమి చేస్తావు అవ్వా?" అని నట్టింట్లో కూర్చొని నస్యం పీలుస్తున్న నలుగురైదుగురు ఆడవాళ్ళు ప్రశ్న వేశారు.

"వస్తేనా?" అంటూ మగవాళ్ళు మగవాళ్ళ దగ్గర ఉపయోగించే బూతుమాట ఉపయోగించింది.

పూలీ అవ్వ అంటే అక్కడ కూర్చొన్న వాళ్ళందరికీ భయం. ఆమె దగ్గర మంత్ర బలమున్నదని వారి విశ్వాసం, అనుమానం. మాలి వాలా భాయి ఇంటికి వస్తే పూలీ అవ్వ చూపించే మంత్ర ప్రభావం వలన స్థంభంగా మారిపోతుందని వారి విశ్వాసం. కాలి బూడిద కావడం గూడా సంభవమే.

అక్కడున్న వారే కాదు. ఆ గ్రామంలో వున్న స్త్రీ పురుషులందరూ పూలీ అవ్వ ఢాకిని అని నమ్ముతున్న వాళ్ళే. ఈ విషయం ఆమె చెవిలో గూడాపడింది. ఒకసారి అట్లా అన్నవారి జుట్టు పట్టుకొని వంగదీసి నలుగురిలో వారి పరువు తీసివేసింది పూలీ అవ్వ. "నన్ను ఢాకిని అంటున్నారు, ఋజువు చేయండి" అని నిగ్గదీసి అడిగింది. ఎవరు ఋజువు చేయగలరు? దీనికి ప్రమాణ మేముంటుంది?

ఒకసారి వ్యవహారం పంచాయితీదార్లదాకా గూడా పోయింది. పంచాయితీలో నేరారోపణ చేసిన వారికి జుల్మానా పడింది. ఆ జుల్మానా డబ్బుతో పూలీ అవ్వ వంటసామాగ్రి కొని గ్రామస్థుల ఉపయోగానికి ఇచ్చివేసింది.

ఒకరెవరో "పూలీ అవ్వా! నిన్నసలు మంత్రగత్తెవని జనం ఎందుకంటున్నారు" అని అడిగితే పూలీ అవ్వ నవ్వుతూ జవాబు చెప్పింది.

"అది నాకు మాత్రం ఏమి తెలుసు చెల్లెలూ"

ఎవరెన్ని సార్లు, శాకిని ఢాకిని అని ఆమెకు పేర్లుపెట్టినా సమయం వచ్చినపుడు అందరూ ఆమె సహాయాన్ని కాంక్షించేవాళ్ళే. శంకర్ ఆమె కొడుకు. పూలీ అవ్వ మంత్రగత్తె అయితే ఆమె కుమారునికి అపకారం జరగదా? అని కొంతమందికి సందేహంగా ఉండేది. అసలు దీని కంతకూ కారణం ఆమెకు గల స్వతంత్ర స్వభావమేనని కొంతమంది అభిప్రాయం. ఆమె పరమాముఖియా వచ్చి మాట్లాడినా లెఖ్ఖ చేసేదిగాదు. అందువల్లనే ఆమెకు ఆ పేరు పెట్టి వుంటారు. ఆమె ముందర నోరెత్తడానికి మాత్రం ఎవ్వరూ సాహసించే వాళ్ళు కారు. ఆమె అంటుండేది – అసలు ఈ చవటలకు ఆడది రాజ్యం చేస్తున్నదనే విషయం గూడా తెలియదు, ఈ తెల్ల వాళ్ళు వచ్చిన తరువాత ఇప్పుడు రాజ్యం చేస్తున్నదెవరు? విక్టోరియారాణి గాదా! ఆమె స్త్రీ గదా! ఈ మాత్రమైనా వీళ్ళకు తెలిస్తేనా? ఎవరు నోరు విప్పితే వారి నోటి దుర్గంధమే బయట పడుతుంది అని ఆమె ఉపేక్షించి వూరుకొనేది.

పూలీ అవ్వ అభిప్రాయం నిజమే అయినా ఆమె మీద నిందలు వేసేవాళ్ళు వేస్తూనే ఉన్నారు. చతుర్దశినాటి రాత్రి ఆమె నదికి పోతూవుంటే ఒకడు చూశాడట. నదిలో మొసలి వీపుమీద కూర్చుని జపం చేస్తూవుంటే ఇంకొకడు చూశాడట. ఆ చూచిన వాళ్లెవళ్ళు అని అడిగితే దానికి మాత్రం జవాబు లభించేదిగాదు. కొంతమంది భూతవైద్యులు పూలీ అవ్వ మంత్రగత్తె అని నిరూపించడానికి సహకరించారు. దేనికంటే వారి వృత్తి ధర్మం ప్రకారం అది అవసరమయింది. ఒక భూతవైద్యుడి జుట్టు బట్టుకొని ఆమె రెండు గుంజీలు గుంజింది. వెంటనే [illegible] అసత్యం చెప్పానని అంగీకరించాడట.

ఇటువంటి నిజమైన విషయాలు గూడా ప్రజలలో ఆమె మంత్రగత్తె అనే విశ్వాసాన్ని పెంపొందించడానికే ఉపయోగపడ్డాయి. భూతవైద్యుడి మీద గూడా ఆమె మంత్రం ప్రయోగించిందట. అసలామె అక్కడకు ప్రవేశించటమే గోడలోనుంచి ప్రవేశించిందట. తలుపు గొళ్ళెలు తామంతతామె విడిపోయినవట.

ఎంతమంది ఎన్ని మాటలన్నా మొత్తంమీద ఆమె అంటే అందరికీ తగని అభిమానం. ఎవరికి ఏ కష్టం వచ్చినా ఆమె ఆదుకొనేది. అత్తలు తమ తమ కోడళ్లకు ఆమె చేత సదుపదేశం చేయించేవాళ్లు. కోమటి కొట్టు తగాదాలు ఆమె అనేకం తీర్చేది. అందుకే ఆడవాళ్లూ మగవాళ్లూ గూడా ఆ గ్రామంలో ఆమె యెడల అభిమానంగా వుండేవాళ్లు.

పురుళ్లూ పుణ్యాలూ వచ్చినప్పుడు ఆమె డాక్టరుగా భావించబడేది. పది మైళ్ల దూరంనుంచి గూడా జనం ఆమె సహాయం కొరకై వచ్చే వాళ్లు. పిల్లలకు ఏ జబ్బు వచ్చినా పూలీ అవ్వ సలహా అవసరం గదా! మంత్రబలం వల్ల ఆమె అన్ని జబ్బులూ నయం చేస్తుందని విశ్వాసం.

ఆమె అంటే వున్న భయం వల్లనే మాలి ఈ దినం వాలా యింటికి రాలేదు. లేకపోతే ఆ యింటికి వచ్చిన వాళ్లను మాలి సామాన్యంగా వదలిపెట్టేదా? ఏమైనా మాలి నోరు వాగుతూనే వున్నది –

“ఏమైనా అన్నదమ్ములు గదా! గ్రామంలో అందరి సలహా అవసరమయిందా? కావలసిన వాళ్ళు విషమైనారా?” అంటున్నది మాలి.

వాలాభాయి భార్య వాళ్ల యింటికి పోయి మాలిని భోజనానికి, పేరం

డానికి పిలిచింది. రహస్యంగా ప్రతి రాత్రి పూట మాలి మనిషి తప్పించి ఎక్కడికో వెళ్లిపోతుంది. వాళ్లా విని కోపగించింది. వాలా భార్య కూడా చాలా విచారించింది.

ఇవన్నీ చూచి పూలీ అవ్వ మాత్రం లోలోపల చాలా సంతోషించింది. మాలిని వుడికించడానికే ఈ పనులు తాను చేయించింది గదా!

ఆ రోజు రాత్రి కొంత పొద్దుపోయిన తరువాత ఆడవాళ్లు కొందరు వాలా యింటిముందు చేరారు. పూలీ అవ్వ తాను మాలిని వుడికించడానికే ఈ పనికి పూనుకొన్నానని స్పష్టంగా చెప్పివేసింది.

(స్తంభం వెనక నిలబడి ఈ మాటలన్నీ రహస్యంగా వింటున్న మాలి మండిపోయింది.

“అవునే ముండా! అవునే. నీవు మా కొంపలార్పడానికే వచ్చావే! మా పుట్టింటివాళ్ళు బ్రతికేవున్నారు. నన్నేమి ఉడికిస్తావు? నీ వళ్లను ఉడికించుకో” అని లోలోపల ముసముసలాడింది.

“అదేమిటి పూలీ అవ్వా? మా మీద అభిమానమున్నది కనుక నీవు ఈ బాధ్యత నెత్తిన వేసుకొన్నావు” అన్నాడు వాలానాయి.

“అభిమాన మున్న మాట నిజమే. అయినా నీ కొడుకు కాకా ఇరవై రెండున్నర సంవత్సరాల వయస్సు గలవాడైనాడు గదా, ఎప్పుడైనా వాడి పెళ్లి సంగతి నాతో నీవు హెచ్చరించావా?” అని అడిగింది పూలీ అవ్వ.

“లేదు. నిజమే” అంగీకరించాడు వాలానాయి.

“అది సరే గాని అవ్వా! శంకర్ కొడుకు వివాహం సంగతి నీవు పట్టించుకోలేదేమిటి? వాడు నీ మనుమడు గదా?” అని ఒకామె అడిగింది. పూలీ గంభీరురాలయింది.

“తల్లిదండ్రులు ఆ విషయం నాతో ప్రస్తావించలేదు. నేనుగా నేను ఎందుకు నెత్తిన పెట్టుకోవాలి?” అన్నది.

“సొంత మనమడి విషయం గూడ పట్టించుకోని నీవు మా మీద అభిమానం చూపించావు” అన్నది వాలా భార్య.

“కాదు, రూపా! అభిమానం గాదు, ఏమీ గాదు. ఆ మాలి ఎత్తి పొడుపు మాటలు నేను గూడా విన్నాను. పరమా పటేల్, వాలా వచ్చి తన కాళ్ల మీద పడతాడనుకొన్నాడు. అందుకే మాలికి బుద్ధి రావడానికి ఈ పని చేశా” నన్నది పూలీ అవ్వ.

"నా తల తీసినా మేము వాళ్ళింటికి పోయే వాళ్ళంగాదు. కాళా పెళ్లి లేకుండానే వుండే వాడు" అన్నది వాలా భార్య.

"అది నాకు తెలుసుననుకో. అదిగాక వాలాభాయికి గూడా ఆదుకొనే వాళ్లున్నారు. అనే విషయం ఋజువుచేసి చూపించాను. అంతే" నన్నది పూలీ అవ్వ.

ఈ విధంగా సంభాషణ జరుగుతూనే వున్నది కాని వాలాభాయి మనస్సు ఆ సంభాషణలో లేదు. అతడు తన మనస్సులో ఏమేమిటో ఆలోచిస్తున్నాడు.

"ఓ భగవంతుడా! ఇదంతా నీ లీల. మానవుడు చెడు చేయ దలచు కొన్నా నీవు మంచినే చేస్తావు. ఈ జీవిత నాటకంలో నీవు సూత్ర ధారివి. పాత్రలచేత నాటకం ఆడిస్తున్నావు" అనుకొన్నాడు. అతని కళ్లూ, మనసూ అంతర్లీనమై వున్నవి.

5

# మాలికి భూతం పట్టింది

శ్రావణ మాసం. రాత్రి గుడ్డి వెలుతురుగా వున్నది. చంద్రుడు క్షణంలో ప్రకాశిస్తే, క్షణంలో అంధకారం ఆకాశమంతా వ్యాపిస్తున్నది. ఇల కోళ్లు చెవులు చిల్లులుబడేటట్లు అరుస్తున్నవి. బహుశా ప్రవహిస్తున్న రాత్రి అరుపు అది అనిపిస్తున్నది.

పిల్లల ఏడుపు ఆగిపోయింది. పశువులకు రాత్రి మేత వేయడం అయి పోయింది. మగవాళ్ళు మొక్కజొన్న చేలల్లో మంచెలమీద కాపలా కాయడానికి పొలాలకు వెళ్ళారు. పగలంతా పని చేసి చేసి—గడ్డి మోపులు మోసి మోసి అలసిపోయిన ఆడవాళ్ళు మంచాలకు కరుచుకొన్నట్లు పడుకొన్నారు.

కొంతమంది తిరగళ్ళు తిప్పుతున్నారు. కొంతమంది మజ్జిగ చేస్తున్నారు. గ్రామమంతా నిశ్శబ్దంగా వున్నది. గ్రామానికి దూరంగా నక్కకూతలు వినబడుతున్నవి. ఆ కూతలు విని కుక్కలు మొరుగుతున్నవి.

పొలాల్లో కాపలా కాస్తున్న వాళ్ళ పొలికేకలు మధ్య మధ్య వినబడు తున్నవి. వాళ్ళు మధ్య మధ్య ఏమిటో అరుస్తున్నారు.

రాత్రి గడచిన కొద్దీ ప్రకృతి మాత వొడిలో అంతా నిశ్శబ్దంగా నిద్ర బోతున్నారు. పరమా పటేల్ హుక్కా గూడా గోడ సహాయంతో నిద్ర బోతున్నది.

నిద్రబోనిది పూలీ అవ్వా, ఆమెతో మాట్లాడుతూ కూర్చొని వున్న నలుగు రైదుగురు ఆడవాళ్ళు మాత్రమే. మాలి తన యింటి వసారాలో చాటుగా నిలబడి పూలీ అవ్వ మాటలు వింటున్నది. ఆమె మనస్సంతా పూలీ అవ్వ మాటల్లో మగ్నమై వున్నది. అదృష్టవశం వల్ల ఈ సంబంధం కుదిరిందని వాళ్ళు అనుకున్నంత సేపూ తను నిశ్శబ్దంగా వింటూ నిల్చున్నది.

తరువాత కాళా తల్లి "అవ్వా! నీవు మా కాళాకు సంబంధం తీసు కొచ్చావు. అంతా సవ్యంగా జరిగింది. కాని ఇదంతా చూచి మా ఆడబిడ్డ మాలి ముఖం మాడిపోయింది" అన్నది.

ఆ మాట వినగానే తాను దాగి వున్నాననే విషయాన్ని గూడా మరచి

పోయింది. దయ్యం బయటికి వచ్చినట్లు స్థంభం చాటునుండి బయటికి వచ్చింది.

"ముండా ! ఏమిటే అంటున్నావు? దేనికే నీకంత అహంకారం. ఎవరికో పిల్లవాణ్ణి కని . ."

వాలా భార్య ఎపుడూ అనవసరంగా మాటలు తూలేది గాదు. కాని "ఎవరికో పిల్లవాణ్ణి కన్నావు." అనగానే-మాట పూర్తి కాకుండానే ఉగ్రురాలయిపోయింది. ఆమె కెంత కోపం వచ్చిందో చెప్పడమే కష్టం అయిపోయింది. నిద్రపోతున్న పిల్లవాణ్ణి వొళ్లోనుండి తీసి పక్కన పడుకో బెట్టింది.

"మాలీ ఏమిటే అన్నావు? ఎవరికో కన్నానా? ఈరోజు నిన్ను చంపి వేయకపోతే నన్ను 'ఛీ' అను" అంటూ రణ చండిలాగా మాలి వైపుకు దూకింది.

మాలికి గూడా చాలా రోజులనుండీ కోపంగా వున్నది. వాలా భార్యను చావగొట్టడానికి ఇది మంచి అవకాశమనుకొని "రావే" అని తాను గూడా రెండడుగులు ముందుకు వేసింది. కాని వాలా భార్య ఎంత కోపంలో వున్నదో మాలికి అర్థం గాలేదు. రూపా పిచ్చిదానిలాగా మాలి రెండు చెవులూ రెండు చేతులతో పట్టుకొని మాలి ముఖం మీద తన తలను విసరి విసరి కొట్టింది.

"చచ్చాను" అని మాలి కేకబెట్టింది.

వసారాలో నుండి పరమా పటేలూ, లోపలి గదిలోనుండి రణఛోడుడూ కాళా తల్లి ముందుకు దూకారు. వాలాభాయి, పూలీ అవ్వ, అంతా రూపా వెనక వున్నారు.

పూలీ అవ్వ వెంటనే ఇద్దరి మధ్యకూ వచ్చింది. ఆమె మధ్యకు రాకపోతే పరమా, రణఛోడు లిద్దరూ పినతల్లిని గొంతుపిసికి చంపివేసేవారు. తండ్రీ కొడుకులిద్దరినీ వాళా బలి చేసేవాడు. కోపంలో వున్న వాలాను భగవంతుడు గూడా సంబాళించలేడని ఆ గ్రామంలో ప్రసిద్ధి.

పూలీ అవ్వ ఆడ సింహంలాగా గర్జించింది. "ఆడదాని మీద చెయ్యి జేసుకొన్నారా! జాగ్రత్త!" అన్నది. పూలీ అవ్వ మాట తీవ్రతకు తండ్రీ కొడుకు లిద్దరూ వెనకాడారు.

ముక్కు నుండి రక్తం కారుతున్న మాలి ఏడుస్తూ నానా తిట్లు తిడుతూ

తన యింటి వైపుకు తగ్గింది. కాళా తల్లి అమ్మవారు పూనిన దానిలాగా వణకి పోతున్నది. "నా శీలాన్ని గురించి అధిక ప్రసంగం చేస్తావా? రక్తం తాగుతాను" అన్నది రూపా.

భయం వల్లనో లేక ఏ కారణం వల్లనో మాలి తగ్గింది. నీళ్ల దొడ్డిలో ముఖం కడుక్కుంటూ-ఇంట్లో వాళ్లను అనరాని మాటలు అంటున్నది. "ఇంట్లో వాళ్లంతా చావండి. నాకు ముగ్గురు కొడుకులున్నారు, వెధవలు. ఆ ముసలివాడు మంచం కరుచుకొని వదలడు. అయ్యో! అయ్యో! ఎంత పని జరిగింది! ఈ యింట్లో మూతిమీద మీసంవున్న వాళ్ళు వున్నారా?" అని అంటున్నది. మాలి నోటికి హద్దూ పద్దూ లేకుండా పోయింది. చేతిలో చెంబు అవతల బెట్టింది. పెట పెట మెటికలు విరుస్తూ పట పట పళ్ళు కొరికింది. "ఓ రూపా! నీ నోటబడ! నీవు సర్వ నాశనమైపోను. నీ కుదురు కదలిపోను" అని ఒకటే తిట్లు తిడుతున్నది.

లోపలి గదిలో నిద్రపోతున్న నాథా భార్య లోలోపలనే సంతోషించింది. కావలెననే అనుకుంటూ, నాథా భార్య మంచంమీద నుండి లేవనే లేదు. రణభోడుడు తమాయించి నిలబడ్డాడు. అటు పూలీ అవ్వ, ఇటు నోటికి ఉప్పూ పత్రీ లేని తల్లి. నెమ్మదిగా తాను గూడా వెళ్ళి పడుకొన్నాడు. పరమా పటేలు ఇరు పక్షాలనూ తిట్టి తాను గూడా పోయి పడుకొన్నాడు.

వాలా భాయి ఏమీ జరగనట్లు శాంతంగా ఉన్నాడు. ఒక్క పూలీ అవ్వ మాత్రం మంచంమీద పడుకొని కాళా తల్లితో ఏమిటో అంటున్నది.

"రూపా! ఈ రోజు బాగా కుదిరింది. కర్రకు కర్రే కావాలి. కుక్క కాటుకు చెప్పుదెబ్బ తగలాలి. శేరుకు సవాశేరుగా జవాబివ్వాలి. రూపా! ఈనాటినుండి ఆ ముండ నీ జోలికి వస్తే నన్ను చెప్పుతో కొట్టు" అన్నది.

"ఏమీలేదు. రెండు రోజులు వూరుకొని మళ్ళీ మొదలు బెడుతుంది. సిగ్గూ బిడియమూ రెండూ లేవు. మానాభిమానాలు అసలే లేవు" అన్నది కాళా తల్లి.

బయట వసారాలో పడుకొన్న వాలాకు ఎందుకో పశ్చాత్తాపం కలిగింది. కాళా తల్లికి ఇవాళ ఏమయింది? నోరెత్తి మాట్లాడేది గాదు. ఆడ పులిలాగ లంఘించింది! రాణి చేత సతాయించబడిన వాడు దాసీ దానిని సతాయిస్తాడని నామెత .. ఏమైనా ఆయన అభిప్రాయంలో కాళా తల్లి అనవసరంగా కలహం పెంచుకొన్నది.

తరువాత అతని కళ్ళు నెమ్మదిగా మూతబడ్డవి. ఆ బజారంతా శాంతంగా నిద్రాదేవి వొడిలో చేరిపోయింది. ఒక్క మాలి మాత్రం ఏడుస్తూ పెద్దగా తిడుతున్నది. ''ఓ అమ్మా ! ఓ నాయనా ! మీరిద్దరూ నన్ను తెచ్చి ఈ యింట్లో పారవేశారు. మీకు నేను బరువైనాను. నా ఇంట్లోనే శత్రువులు ప్రవేశిం చారు'' అంటున్నది.

కాళా తల్లికి ఎంత సేపటికీ నిద్ర రాలేదు. గుర్రుపెట్టి నిద్రపోతున్న ఫూలీ అవ్వను నిద్రలేపింది.- ''ఫూలీ అవ్వా ! ఫూలీ అవ్వా ! మేల్కొన్నావా ?'' అంటూ గట్టిగా కదిలించింది.

''చావనీ. ఆ నోరు అంతే. నీవు నిద్రపో'' అంటూ ఫూలీ కళ్ళు మూసు కొన్నది.

సరిగ్గా అదే సమయంలో మంఛాపిన్ని మాటలు వినిపించాయి. ''ఊరు కోవే. ఊరుకో మాలీ, నీకు నిద్ర రాదు. రెండోవాళ్ళను నీవు నిద్రపోనివ్వవు. రాత్రిపూట విశ్రాంతిగా పడుకోనివ్వవే'' అన్నది.

మాలి ఆ మాటలు విన్నట్లే లేదు... ''నన్ను వొంటరిగా వదలేశారు.''

''ఒంటరిగా వదలడమేమిటి ? నీకు పులులవంటి ముగ్గురు కొడుకు లున్నారు''

''ఎంతమంది వుంటే ఏమిలాభం ?''

''లాభం లేక పోవడమేమిటి ? నిజం ఆలోచిస్తే నీకు మించి సుఖం గల వాళ్ళు ఎవరున్నారు ? ఒక విధంగా నీ వంటి దుఃఖం గలవారు గూడా ఎవ్వరూ లేరు. నీవు పోట్లాడుతూ మాట్లాడుతూనే పోట్లాడుతావు. మీ యింట్లో తగాదాలేని రోజు ఒక్కటి గూడా వుండదు'' అన్నది మంఛా.

''పిన్నీ ! మా యింట్లో ఏడుగురు తండ్రులకు పుట్టిన పిల్లలున్నారు. నన్నేమి చేయమంటావో చెప్పు'' అన్నది రాగాలు తీస్తూ.

''ఏమి చేయమంటావా ? నీవు ముసలిదానవైనావు. నాలుక సంబా ళించుకో'' అన్నది.

ఆ తరువాత మంఛా పిన్ని సదుపదేశం చేసింది. ''మంచి మాటలు చెప్పింది. నీకంటే వాలాభాయి ఎంతో సుఖంగా వున్నాడు. నీ కెందుకు దుఃఖమో నాకు తెలియడం లేదు. వాలాభాయి యింట్లో ఎప్పుడైనా తగాదా చూచావా ? మీ యింట్లో ఎప్పుడూ ఈ తగాదాలేమిటి ? తగాదాలు మాని

వేయడం చాలా అవసరం. హాయిగా పోయి పడుకో'' అని మాలిని ఇంట్లోకి నెట్టి మంథాపిన్ని తానుగూడా ఇంట్లోకి పోయింది.

మాలి మంచంమీద పడుకొన్నదే గాని, ఆమెకు నిద్ర రావడంలేదు. మంథాపిన్ని మాటలు ఆమె కోపాన్ని పెరిగేటట్లు చేశాయే గాని తగ్గించలేదు. వాలా యింట్లో తినడానికి తిండిలేదు. తమకంటే వాళ్ళు సుఖంగా వున్నారట. సుఖమట సుఖం. సుఖమంటే ఏమిటి? రేపు ఐదుగురు అతిథులు వస్తే వాలా యింట్లో పది యిళ్ళల్లో ముష్టి ఎత్తితేనేగాని నెయ్యి అయినా దొరకదు.

కాని మాలి అంతరంగంలో నుండి ''నీకంటే వాళ్ళే సుఖంగా వున్నార''నే మాట — వినిపించినట్లయింది. ఇంకా మండిపోయింది.

''వాళ్ళ తలకాయ సుఖం. పూలీముండ ఎన్ని అబద్ధాలు చెప్పి — వాగ్దానాలు చేసి ఈ సంబంధం కుదిరించిందో రేపు తెలియదా?'' అనుకొన్నది.

ఆమె ఆలోచనలకు అంతులేకుండా వున్నది – ఏమేమిటో ఆలోచనలు!!

''మాలీ! నీ ముగ్గురు కుమార్తెలకూ ఆడపిల్లల తరఫున వచ్చిన సంబంధం వొక్కటి గూడా లేదు. నీ ఒక కొడుకుకు అటువంటి సంబంధం వచ్చిన మాట నిజమే గాని నీ మొగుడు పరమా పటేలు కాళ్లు అరిగేటట్లు ఎన్ని సార్లు తిరిగితే ఆ సంబంధం కుదిరింది?''

''ఎట్లాగైనా చావనీ. నిద్ర పోతాన''ని కళ్ళు మూసుకొన్నది మాలి కాని నిద్ర వస్తే గదా!

ఏదో ఒక ఆలోచన రావడం, కోపం ఎక్కువ గావడం జరుగుతూనే వున్నది.

''మాలీ! నీ జీవితానికి సుఖమున్నదా? శాంతివున్నదా? ఈ యింట్లో — ఇంటి ఆడదానికి అవమానం జరిగితే — అందరూ పరుపుల్లో తలలు బెట్టుకొని ఎట్లా నిద్రపోతున్నారో చూడు. వాలా మూలాన నా కిన్ని బాధలు!! వాడి ఇంట్లో నిప్పుపుల్ల గీచి పడవేస్తాను. వాడి యింటికి నిప్పు బెడతాను'' అని మాలి పెద్దగా ఏడవడం మొదలు బెట్టింది.

నాథా భార్య మాట్లాడకుండా వుండలేకపోయింది. ''అబ్బబ్బ! మమ్మల్ని నిద్రపోనివ్వవు. నీకేదైనా భూతం పట్టిందా? అన్నది.

''నువ్వు నోరు మూసుకో. అంత నిద్ర వస్తున్నదా నీకు? నేను బయటికి పోతాలే'' అంటూ మాలి వసారాలోకి వచ్చింది. బయట పరమా గురకలు

వెడుతున్నాడు. అతన్ని చూడగానే ఆమె అరికాలి మంట నెత్తి కెక్కింది. గుండెలమీద నాలుగు గుద్దులు గుద్దాలి అనుకొన్నది. శుభ్రంగా నిద్ర పోతున్నాడు. చీకూ చింతా ఏమీలేదు. "అన్నింటికీ – అందరికీ చెడ్డదాన్ని నేనొక్కతినే!"

లేచి పక్కనున్న దిమ్మె నానుకొని కూర్చున్నది. ఏమీ తోచక తన తలను దిమ్మెకేసి టప టప కొట్టుకొనడం ఆరంభించింది.

పరమాకు, రణఛోడునికీ నిద్ర మెళుకువ వచ్చింది. నాదా భార్య అత్త అఘాయిత్యం చూచి ఆశ్చర్య పడ్డది "ఈమె ఆడమనిషేనా?" అనుకొన్నది.

"తాను సుఖపడదు. ఇతర్లను సుఖపడనివ్వదు" అంటూనే పరమా పటేలు – "మాలీ! నీకేమి పుట్టింది, చెప్పు. అర్ధ రాత్రి అంకమ్మ శివాలు వేస్తున్నావు. నీకేదో దయ్యం పట్టింది" అన్నాడు.

ఎట్లాగో తెల్లవారింది. మాలి ముఖం చూచిన వాళ్లంతా మాలికి నిజంగానే ఏ భూతమో పట్టిందని అనుకొన్నారు. ఆమెను ఎవ్వరూ ఏమీ మాట్లాడించ లేదు.

రణఛోడుడు తల్లిని ఇంట్లోకి ఈడ్చుకొనిపోయి పరుపుమీద పడవేసి దుప్పటి కప్పాడు.

మాలి పైకి శాంతించింది. కాని ఆమె అంతరంగంలో శాంతి ఎక్కడిది? పూలీ అవ్వ సంబంధం కుదిరించింది. "ఈ పెళ్లి పూర్తిగానిస్తే నన్ను ఛీ కుక్క అనవలసిందే" అనుకొన్నది. "నేను బ్రతికి వుండగా ఈ పెళ్లి జరగ నివ్వను" అని నిశ్చయం చేసుకొన్నది. ప్రతిజ్ఞ బట్టింది.

## 6

# సాధు బావా లంగోటీ

కాళాకు పెళ్ళి సంబంధం కుదిరిన తరువాత వాలాభాయి శక్తి ఇనుమడించింది. అతని ఎద్దులు బక్కచిక్కి వున్నవి. పరమా ఎద్దులలాగా వుండేనా ఒక్క నాగలితో రెండు నాగళ్ళ పనిచేసేవాడు.

పెళ్ళి సంబంధం కుదరడం వలన నిజానికి అతనికి విచారమే ఎక్కువ కలిగింది. ఇంట్లో రెండే మంచాలున్నవి. ఎవరైనా బంధువులొస్తే - పిల్ల తరపు వాళ్లొస్తే నిత్యం ఎవరిని ముష్టి అడుగుతాడు ? రజాయి పాడయి పోయింది. పాత ధోవతులు, పాత చీరలతో సంవత్సరంలో నాలుగు సార్లయినా గలీబులు మార్చాలి. సగం పాతబడిన గుడ్డలైతేనే – అదైనా సాధ్యం. వాలాభాయి దగ్గర సగం పాతబడడం అటుంచి మాసికలు లేని గుడ్డలు లేనేలేవు. వాటినే కట్టుకొంటున్నాడు. అంతేగాక ఇంటిపైకప్పు ఎప్పుడు కింద కూలుతుందో తెలియని స్థితి ఏర్పడింది. పాలిచ్చే పశువులు లేనివి ఇల్లు గడిచేదెట్లా ? పిల్లవాడి అత్తవారింట్లో మంచి గుడ్డలు కట్టుకొంటుంటారు. వాళ్ళె వళ్లయినా తమ యింటికి వస్తే! రెండు ఆవులున్నా ఏదో విధంగా తాను గడుపుకోగలడు. పిల్లవాడి అత్తవారింట్లో ఇరవై ఇరవైఐదు గేదెలున్నవి. తమ యింట్లో ఒక్క గేదెగూడా లేదు. గదేలేని పశేలు ముంగిలి వెలవెలపోతుంటుంది. అంతేగాక ఉన్న రెండు ఎద్దులు, బక్క చిక్కి వున్నవి. వాటితో పని గడచేటట్లు లేదు. అవసరాలు చాలా ఏర్పడుతున్నవి. ఏమి చేయాలి ?

ఒకసారి చలిరోజుల్లో వాలాభాయీ ఇంకా ఐదారుగురూ వాలాభాయి పొలంలో కూర్చుని ఊచ బియ్యం తింటున్నారు. వారిలో కాళామామగలా, పూలీ అవ్వ కొడుకు శంకర్, బేచాత్, కాసిమ్‌ఘాంచీ వగైరాలున్నారు. మాటవెంట మాటగా వాలా విషయం గూడా చర్చకు వచ్చింది. వాలా తన సంగతి చెప్తూతూ భగవంతుడు మనుష్యుల్ని మాయలో ఎందుకు పడవేస్తుంటాడో తెలియదన్నాడు. "నన్ను చూడండి, కాళా పుట్టనంత కాలం నాకు ఏ చీకూ చింతా లేదు. మా యిద్దరి పొట్టగడిస్తే సరిపోయేది.

ఈ ముసలితనంలో భగవంతుడు నాకు మగబిడ్డను ప్రసాదించాడు. అది మొదలు ఎన్ని ఇబ్బందులు ఏర్పడ్డవి!! ఎన్ని వస్తువులు అవసరమైనవి" అని నవ్వుతూ తెల్లని గడ్డాన్ని రెండు చేతులతో చెవుల వైపుకు సర్దుకొని, "నా కథ సాధుబావా లంగోటీ కథగా తయారయి పోయింద" న్నాడు.

ఆ కథ ఏమిటో వినవలెనని శంకర్‌కు ఉత్సాహం కలిగింది. కాసిమ్ గూడా శంకర్‌తో కలిశాడు.

"వాలాభాయీ! చెప్పు లంగోటీ కథ" అన్నారు అందరు. అది చలి కాలం. అప్పుడే తెల్లవారింది. పొలంలో వున్న ఆ చిన్న గుడిశలో ఒక మూల మంచమున్నది. మంచంకింద కత్తి పడివున్నది. రెండో వైపున గడ్డి కుప్పగా వేయబడివున్నది. దానిమీద ఒక ధనస్సు, కొన్ని బాణాలు పడివున్నవి. మంచంమీద కాళా మామ గలా కూర్చొని ఊచబియ్యం శుభ్రం జేస్తున్నాడు. మూడు సంవత్సరాల వయస్సుగల కాళా, అంతే వయస్సుగల కోధర్ ఇద్దరూ ఆ గుడిశముందు ఆడుకొంటున్నారు.

"సాధు బావా కథ వాలాభాయీ!" అని అడిగాడు గలా. "మీ కందరికీ కథ వినవలెనని ఉన్నది. అయితే ముందు హుక్కా సరిజేయండి" అన్నాడు వాలా.

"కొంచెం ఉప్పు కారం తగిలించి కథ రుచిగా వుండేటట్లు చెప్పాలి" అని అన్నాడు అప్పుడప్పుడే మీసాలు వస్తున్న బేచాత్.

వాలాభాయి గొంతు సవరించుకొన్నాడు. శంకర్‌ను ఊం గొట్ట మన్నాడు. "ఒక గ్రామంలో – నీలకంఠ మాధవ దేవాలయం వంటి – ఒక దేవాలయంలో నీ వంటి గలా.. పక్కన నవ్వాడు–" కాదు కాదు మరచాను– నావంటి ఒక బావా నివసిస్తున్నాడు. బావా అనగానే మీకంతా అర్థమయ్యే వుంటుంది. ఆయన దగ్గర రెండు లంగోటీలు తప్ప ఇంకేమీ లేవు. ఒకటి ఉతికి ఆరవేసి రెండోది కట్టుకొంటూ వుండేవాడు.

ఒక రోజు ఉదయం స్నానం చేసేటప్పుడు చూస్తే లంగోటీ కనబడ లేదు. బావాకు ఆశ్చర్యం కలిగింది. లంగోటీ ఎక్కడనుండి వస్తుంది? కంఠ జాదవ్ గూడా తనలాంటి వాడేనాయె. కృష్ణుడు గానీ రాముడు గానీ అయివుంటే దేవుడికి కట్టిన గుడ్డలలోనుండి తాను ఒక ముక్క చింపి

తీసుకొనేవాడే. నీలకంఠ మాధవుడు గుడ్డలు కట్టుకొనేవాడు కాడాయె. బస్తీలోకి పోయి బావాజీ భిక్షతోబాటు ఒక లంగోటీ గూడా ఎవరినో అడిగి తెచ్చుకున్నాడు.

రెండో రోజు పొద్దున్నే చూస్తే మొదటి లంగోటీ అదృశ్యమయింది. బావాజీ ఆలోచనలో పడ్డాడు: "కొడుకు! ఎవడో దొంగతనం చేస్తున్నాడు" అనుకొన్నాడు.

రెండో రోజు ఇంకొక లంగోటీ అడిగి తెచ్చుకున్నాడు. ఆ రోజు రాత్రి మేలుకొని దొంగను పట్టుకొనవలెనని నిశ్చయించుకొన్నాడు. లాఠీ పట్టుకొని తెల్లవార్లూ మేలుకొని కూర్చున్నాడు. తాడు మీద వేలాడుతున్న లంగోటీ మీదనే ఆయన దృష్టి అంతా వున్నది.

తాను కళ్ళు ఆర్పడం గూడా లేదు. ఇంతలో అర్ధరాత్రి అయింది. బావా నిద్ర రాకుండా రెండు మూడు సార్లు గంజాయి పట్టించాడు. గంజాయి నిషా తగ్గగానే ఆవలింతలు ప్రారంభమైనవి. కాని బావా హఠం సామాన్యమైనదా! కళ్ళు మూతబడితే చిమటాతో పొడిచేసుకుంటానని చిమటాముందు బెట్టుకొని కూర్చున్నాడు.

అదే సమయంలో బయట కట్టెలు కదిలినట్లు అలికిడి వినిపించింది. లాఠీ సవరించుకొని దొంగ రానే వచ్చాడని బావా తలుపుచాటున నిలబడ్డాడు. "దొంగ లోపలికి రావాలి.. వాడి కాళ్లు విరగాలి. లాఠీ దెబ్బతో - ఆ దొంగగాడి పుచ్చె రెండు చెక్కలు గావాలి.." అనుకొంటూ ఊపిరి గూడా పీల్చకుండా నిలబడ్డాడు.

కాని దొంగ వస్తాడు వస్తాడు అనుకొంటే వస్తేగా? రాలేదు "కొడుకు! జాగ్రత్త పడ్డాడు" అనుకొన్నాడు బావా. లంగోటి దణ్ణెంమీద వేలాడుతున్నది. "బహుశా రేపు వస్తాడులే దొంగ" అనుకొన్నాడు.

నెమ్మదిగా చలిమంట దగ్గరకు వెళ్ళి కూర్చున్నాడు. దమ్ము కొట్టడం ప్రారంభించాడు. కొంచెంసేపుండి తల ఎత్తి చూచాడయ్యా! ఏమిటి చూచాడు? తన కళ్లను తనే నమ్మలేకపోయాడు. ఏమయింది? దండెం మీద వున్న లంగోటీ కాస్తా మాయమయిపోయింది. బావాకు భయం వేసింది. నీలకంఠుడే ఈ దొంగతనం చేయడం లేదు గదా!!"

కథ వింటున్న వాళ్లు ఊచ బియ్యం తినడం మానివేసి కళ్లార్పకుండా వాలాభాయి వైపుకు చూస్తున్నారు.

"బహుశా నీలకంఠుడు బావాను పరీక్ష చేస్తున్నాడను కొంటా" నన్నాడు వారిలో వొకడు.

శంకర్ కాసిమ్ ఇద్దరూ నవ్వారు. "దొంగ నీలకంఠుడు కాదు. పొడుగు చెవుల స్వామి. తెల్లవార్లు జాగరణ చేసిన తరువాత బహుశా బావాకు తెలిసివుంటుం"దన్నారు.

మిగతా వాళ్లకు వాళ్ల మాటలు అర్థంగాలేదు. "ఎలుకమామ రా!" అన్నాడు గలా నవ్వుతూ. అందరూ ఫక్కున నవ్వారు. "ఒహో! ఇది ఎలుక మహాత్మ్యమా? నీలకంఠుడే దొంగ అనుకొన్నాము. సరే బాగానే వున్నది. అయితే వాలాభాయి! ఇకముందు కథ ఏమిటి?" అని అడిగారు.

"ఇకముందు కథలోనే ఉంది మజా అంతా" అన్నాడు వాలా. శంకర్ ఊం కొడుతున్నాడు. "బావా చూచాడు — ఎలుక మామ బయటికి వచ్చాడు.

ఒకటిగాదు. ఎలుక మామల గుంపు బయలుదేరింది. బావా ఎన్ని ఎలుకల్ని చంపుతాడు? బావా ఆలోచనలో పడ్డాడు. రోజు ఒక్కొక్క లంగోటీ ఎవరు దానం చేస్తారు? దానమడగడానికి బావాకు గూడా సిగ్గనిపించింది.

చివరకి గలా లాంటివాడు ఒక ఉపాయం చెప్పాడు. "ఏమి చేస్తాము మహారాజా! మా యింట్లో పిల్లి పిల్లల్ని పెట్టింది. ఒక పిల్లను తెచ్చు కోండి" అన్నాడు.

బావాజీ సంతోషించాడు. సలహా బాగా వున్నదనుకొన్నాడు. పిల్లి పిల్లను తెచ్చాడు. అది ఎలుకల బారినుండి లంగోటీని రక్షించడం ఆరం భించింది. పిల్లి పిల్ల అంటే బావాకు బాగా అభిమానం కలిగింది. దానితో రోజూ ఆడుకొనడం ఆరంభించాడు. పిల్లి పిల్ల కొరకై రెండిళ్లలో బిచ్చమడ గడం ఎక్కువ చేశాడు."

గలా ఊచబియ్యం గుప్పెడు నోట్లో పోసుకొని "అయితే పిల్లి పిల్లకు ఊచబియ్యం పెడుతున్నాడా?" అన్నాడు.

"ఏమో ఏమి పెడుతున్నాడో" అన్నాడు శంకర్.

"ఏమైనా గానీ బావాజీకి పిల్లి పిల్లమీద చాలా ప్రేమ కలిగింది." శంకర్ ఊం కొట్టాడు.

"అంటే బావాజీకి ఒక జంజాటం తగులుకొన్నదన్నమాట. ఇక పిల్లికి

ఆహారం? మ్యావూ మ్యావూ! అనుకొంటూ అది దేవాలయం చుట్టూ తిరగడం ఆరంభించింది.

బావాజీ ఆలోచనలో పడ్డాడు. మ్యావూ మ్యావూ అంటూనే ఈ పిల్లి పిల్ల చస్తుందేమో!! పిల్లి పిల్ల చిక్కిపోతున్నది. బావాజీ అందరినీ సలహా అడగడం ప్రారంభించాడు.

నీ వంటి ఒక ఉపాయశాలి ఉపాయం చెప్పాడు. "బావాజీ! ఒక ఆవును సంపాదించు. పాలు లేకపోతే పిల్లి పిల్ల చస్తుంది" అన్నాడు.

తమ్ముడూ! తరువాత ఆ బావా ఒక ఆవును సంపాదించాడు. అది ఒక బ్రాహ్మణుడికి దానంలో లభించింది. దాన్ని ఆ బ్రాహ్మణుడు బావాకు అంట గట్టాడు. సరే, బావాజీ ఆవును తీసుకొచ్చాడు."

"బాగా పెరిగింది జంజాటం" అన్నాడు జేకాబ్. "ఇంకా ఏమయింది? ముందు చూడు" అని అన్నాడు శంకర్.

వాలా తల నిమురుకొంటూ "బావాకు పని పెరిగిపోయింది. ఆవుకు మేత కావాలి, ఒక కొడవలి తెచ్చాడు. రోజూ గడ్డికి పోవడం, కోసుకొని రావడం ప్రారంభించాడు. రెండు నెల్లలో బావాజీ ఏసిగి వేసారాడు. పిల్లి చెల్లెలు పాలు తాగి తాగి బాగా లావెక్కింది. అది బావాతో బాగా ఆడు కొంటున్నది. అయితే బావా మాత్రం ఎండి పుల్ల గావడం ఆరంభించాడు. ఆవును వదిలేద్దామంటే పాలులేక పిల్లి చస్తుంది. పిల్లి చచ్చిందా అంటే ఎలుక మామలు లంగోటీ భరతం పడతాయి. ఏమి చేయాలి?"

"బాగా తగులుకొన్నాడే బావా" అన్నాడు కాసిమ్. వాలా దీర్ఘంగా నిట్టూర్చి కథ ముందుకు నడిపించాడు.

"ఆలోచిస్తూ ఆలోచిస్తూనే బావా ఇంకా నాలుగైదు రోజులు గడిపాడు. ఇట్లా వుండగా ఒక రోజు అడవిలో కట్టెలు కొట్టడానికి పోతూ ఒకడెవడో దేవాలయం దగ్గరకు వచ్చాడు. హుగ తాగుతూ తాగుతూ అతడు బావాజీతో మాటలు మొదలుబెట్టాడు. బావాజీ తన బాధను గురించి అతనితో సలహా చేశాడు. "రోజు రోజంతా ఆవు మేతతో సరిపోతున్నది. నీలకంఠుడి సేవ చేయలేకపోతున్నా న"న్నాడు. నీలకంఠుడిమీద ధ్యానమే కుదరడం లేదన్నాడు.

"అయితే ఒక పని చేయండి. దూరంగా ఆ కొండల్లో భిల్లులున్నారు. వారిలో ఒకరిని పనికి పెట్టుకోండి. ఆవును మేపడానికి, మీ యిల్లు

వగైరాలు శుభ్రం చేయడానికి గూడా ఉపయోగకరంగా వుంటుంద''ని వారు సలహా చెప్పారు.

బావా సంతోషించాడు. సలహా బాగా వున్నదన్నాడు. నాలుగు రొట్టెలు ఇంకా ఎక్కువ సంపాదించాలి. సంపాదిస్తాను. సౌకర్యంగా వుంటుందన్నాడు. ''ఆ మనిషిని నీవే కుదిరించుకొని రా'' అన్నాడు.

కట్టెలు కొట్టేవాడు సరేనన్నాడు.

తరువాత బావాజీ పని ''జై సీతారాం'' అయింది. ''ఆ ముండాకొడుకు సంసారంలో పడతాడా ఏమిటి?'' అన్నారు ఇద్దరు ముగ్గురు.

''శిష్యురాలు వస్తుందా ఏమిటి?'' అన్నాడు శంకర్.

''బావా కర్మం కాలింది'' అన్నాడు బేవాత్. ''కొంప మునిగింది తమ్ముడూ!'' అన్నాడు నవ్వుతూ వాలా.

''ఆ పోయిన కట్టెలు కొట్టేవాడు ఒక ఆడదాన్ని ముగ్గురు పిల్లలున్న దాన్ని వెంట తీసుకొచ్చాడు. ఒకణ్ణి ఆమె ఎత్తుకొని వున్నది. ఇద్దరు ఆమె వెంట వెంట నడుస్తున్నారు.

కట్టెలవాడు రెండు మణుగులు కట్టెలు తెచ్చాడు. ''బావా! ఈమె చాలా బీదరాలు; ఈమె మొగుడు ఈ పిల్లల్ని వదలి కొద్ది నెలల క్రితం మరణించాడట. బీదది. తిండి లేక మల మల మాడిపోతున్నది. మీరిచ్చే నాలుగు రొట్టెలకూ, మీ సేవ జేస్తుంది, ఆవు సంరక్షణ చేస్తుంది'' అన్నాడు.

ఆ తరువాత ఆ కట్టెలు కొట్టేవాడు – ఆ స్త్రీని ఉద్దేశించి ''మహారాజు నీకేమీ కష్టం లేకుండా చేస్తాడు; చెప్పిన పని చేసి మంచి పేరు తెచ్చుకో; నీకూ ని పిల్లలకూ ఏ లోపమూ వుండదు'' అని చెప్పి తాను వెళ్ళాడు. ఆమె అక్కడే వుండిపోయింది.''

''ఓహో నిజంగానే బావా పని జై సీతారాం అయింది'' అని అందరూ చప్పట్లు కొట్టారు. అంతా పొట్ట చెక్కలయ్యేటట్లు నవ్వారు. ''ముండాకొడుకు బావా పూర్తిగా గడబిడ చేసివుంటాడు'' అన్నారు.

''అంతే అయింది తమ్ముడూ!'' వాలా కథ ముందుకు నడుపుతున్నాడు.

''అసలే వనం, సారాయి వగైరాలు గూడా వుంటే ఏమవుతుంది?'' మధ్యలో చాతుర్మాస్య నెలలు వచ్చాయి. ఎండిన చెట్లల్లోనుండి గూడా చిగుళ్లు బయలుదేరాయి. పాపం, ఆ శిష్యురాలు గుడిసీ, గుడిశనూ ఒకటి చేసి వేసింది.''

"అంటే గుడిని ఇల్లు చేసిందంటావు" అన్నాడు శంకర్. వాలా కథను సమాప్తం చేసే ప్రయత్నం ప్రారంభించాడు. "సరిగ్గా పది నెలలయ్యే టప్పటికి బావా కళ్ళు తెరుపుడు పడ్డవి. ఇంకొక నెల అయిన తరువాత గుడికి వెనకవున్న గుడిశలో పసిపిల్లవాడి ఏడుపు వినపడింది.

"ఓ భగవంతుడా! ఈ ఊబిలో దిగబడ్డాను. ఇక నన్ను ఏ నా తాత వచ్చి రక్షిస్తాడు! ఇక సంపాదన మొదలుబెట్టాలి. అందుకు నాగళ్ళు, గేదెలు, ఆవులు.. ఇంకా.. ఇంకా.."

ఈ ఆలోచనలతో బావా మెదడు వేడెక్కిపోయింది. "ఈ జంజాట మంతా ఈ పాడు లంగోటీ వలన ఏర్పడింది" అంటూనే కట్టుకున్న లంగోటీని కాస్తా పర్రున చింపి పారవేశాడు.

"కొండల్లోకి, పరుగెత్తి వుంటాడు బావా" అన్నాడు ఎవడో. వాలా నవ్వుతూ "అవును అంతే చేశాడు."

"సాధువులు అంతే చేస్తారు. సంసారులు అట్లా చేయరు" అన్నాడు. "మనం రైతులం. సంసారులం. మనం ఒక్క మేఘం ముందు తప్ప ఇంకా ఎవరి ముందూ చెయ్యి జాపము" అన్నాడు గలా.

"ఆ స్త్రీ గతీ, ఆ పసిపిల్లవాడి గతీ ఏమయింది?" అన్నాడు బేచాత్. శంకర్ అందుకొన్నాడు. "ఇకలే పోదాం. ఏదో అయిందిలే" అంటూ లేచాడు. అతనితోగూడా ఏడెనిమిది మందీ లేచారు. తలగుడ్డ సర్దుకొన్నారు. గలా బయటికి వచ్చాడు. బయట మర్రిచెట్టు క్రింద ఆడుకొంటున్న పిల్లల్ని చూచాడు. "అంతా బావాలాగా వ్యవహరిస్తే ఈ ప్రపంచం అంతమై పోతుంది" అన్నాడు.

"ఆ బావా బహుశా ఏ బ్రాహ్మణుడో, కోమటో అయివుంటాడు. ఇంకొక జాతి వాడయితే అట్లా చేయడు. ఎన్ని కష్టాలు వచ్చినా ధైర్యంగా ఎదు ర్కొంటాడు" అన్నాడు గలా.

వాలా ఆలోచనలో పడ్డాడు. మూడు సంవత్సరాల కాళా అతనికి స్వప్న భంగం కలిగించాడు. పిల్లవాణ్ణి వొడిలో కూర్చోబెట్టుకొన్నాడు.

"ఇది ప్రపంచం. మనం రైతులం. కష్టాలు ఎన్ని వచ్చినా ధైర్యంగా ఎదుర్కొంటాము" అన్నాడు వాలా. "అవునా కాళా?" అని ప్రశ్నించాడు. "హుఁ" అన్నాడు కాళా. కాళా "హుఁ" నలువైపులా ప్రతి ధ్వనిస్తున్నది.

7

# పినతండ్రి వొడిలో

కాళాకు తన జీవితమంతా జ్ఞాపకానికి వచ్చింది.

గలా మృదు స్వభావం గలవాడు. వాలా యింటిపెంకుల్ని బాగు చేయించాడు.

గలా ఒకసారి రెండు ఎద్దుల్ని పొలంలోకి తోలుకొనిపోయి దున్నడం ఆరంభిస్తే అవి బెదిరాయి. తన కొడుకు కోదర్, కూతురు రాజూ ఇద్దరూ ఎద్దుల కింద పడకుండా రక్షించాడు... అన్ని దృశ్యాలూ కాళాకు - కళ్లకు కడుతున్నవి. తన నలభై సంవత్సరాల జీవితం అతని కళ్లముందు తాండవ మాడుతున్నది.

తాను ప్రస్తుతం కూర్చునివున్న పొలం, గుడిశ అనేక సంవత్సరాల నుండి తానెరిగినవే. పక్కకున్న వటవృక్షం వెనకటి ఆ రోజుల్లో పావు భాగంగా వుండేది. ప్రస్తుతం బావి వున్నచోట పెద్ద గుంట వుండేది. నదీ తటంలో ఇపుడు సమతలంగా వున్న ప్రదేశం ఆ రోజుల్లో ఎత్తుపల్లాలుగా వుండేది.

మాటి మాటికీ అతని మనస్సు భూతకాలంలోకి పరుగెత్తుతున్నది. హుక్కా చేతిలోకి తీసుకొని దానిలో నిప్పు వేశాడు. ఆ హుక్కా ఆకృతి ఎంత మారింది!! అది ఎంత అందంగా తయారయింది!! కాని ఎందుకు ఆ అందం? ఇది బదరీ హుక్కా. దాన్ని ఎత్తుకుంటే చేతులు నొప్పి పుడు తుంటవి.

శక్తి తగ్గిపోయింది. ఇంటి మధ్య మంచంమీద వాలా మరణాసన్నుడై పడివున్నాడు. బంధువులు ఇల్లంతా నిండివున్నారు. ఏడెనిమిది సంవత్స రాల కాళా బిక్కముఖంతో స్థంభం దగ్గర నిలబడివున్నాడు.

ఘడియముందు స్పృహలేకుండా పడివున్న వాలా కళ్లుతెరచి, కదలి మంచినీళ్లు అడిగాడు. నిద్రలేచినట్లుగా నలువైపులా కలయజూచాడు. కాళా మీద దృష్టిపడింది. నిమిషం రెండు నిమిషాలు అతని దృష్టి అక్కడే నిల బడిపోయింది. పాతాళంలో నుండి ధ్వని వచ్చినట్లుగా మాట్లాడుతూ "పరమా ఏడి?" అన్నాడు.

వెనక తలదిండువైపు కూర్చున్న పరమా లేచి నిలబడ్డాడు. "అన్నా" అంటూ వచ్చి మంచం పట్టెమీద కూర్చున్నాడు.

"తమ్ముడూ!" వాలా కళ్ల వెంట కన్నీరు ధారలు కడుతున్నది. వాలా గొంతు సరిజేసుకొన్నాడు.

"తమ్ముడూ! ఈ పసివాణ్ణి... ఎవరికి అప్పగించను? పిల్లవాడి మామ గలా నాకంటే ముందే మరణించాడు. నీవు తప్ప ఇంక నా కెవ్వరూ లేరు" అన్నాడు.

ఆ మాటలు విని కాళా పెద్దగా ఏడ్చాడు. కాళా తల్లి కాళాను తన వొడిలో కూర్చొన బెట్టుకొన్నది.

పరమా ఆలోచనలో పడ్డాడు. అన్నకు ఏమి జవాబు చెప్పగలడు? అన్నకు మాట యిద్దామని అతని హృదయం తొందర పడుతున్నది. ఎందుకో సిగ్గు పడ్డాడు. తాను మాట ఇచ్చినా అది నిజమని ఎవరు నమ్ముతారు? అతని హృదయం విల విల లాడింది. కంఠంలో నుండి మాట బయటికి రాలేదు. అతని కళ్లనుండి బొట బొట నీళ్లు కారాయి.

వాలా కాళాను దగ్గరకు పిలుచుకొన్నాడు. ఏడుస్తున్న కాళాను తన వొళ్ళోకి తీసుకొన్నాడు. కన్నీళ్లు తుడుచుకొన్నాడు. కాళా కన్నీళ్లు తుడిచాడు.

"నాన్నా! కాళా! నీ బాబాయిని "బాబాయి" అని ఒక్కసారి పిలువు. నాకు మనశ్శాంతి కలుగుతుంది" అన్నాడు.

పరమాను "బాబాయి" అని పిలిచే అవకాశం కాళాకు ఎప్పుడూ కలగనే లేదు. పరమా మాట ఇంట్లో సాగదు. మాలి పరమా మాటను సాగ నివ్వదు. పరమా ఆలోచిస్తూనే వున్నాడు.

"నాన్నా! "బాబాయి" అని ఒక్కసారి అను" అన్నాడు మళ్లీ వాలా. తల్లి గూడా కాళాకు నచ్చజెప్పింది.

ఎంతో నచ్చ జెప్పిన తరువాత కాళా నెమ్మదిగా అతి బలవంతంగా "బాబాయి" అన్నాడు.

వాలా హృదయం ఆనందంతో నిండిపోయింది. బాబాయి.. బాబాయి.. అంటూనే వున్నాడు. వాలా మెడ పక్కకు వొరిగిపోయింది. ఆనందమూ, సంతృప్తీ అతని గడ్డంమీద వెల్లి విరుస్తున్నవి.

వాలా శవాన్ని కిందబెట్టారు. పరమా కళ్ల నుండి కన్నీరు ధారలు కడుతున్నది.

కాని మాలికి మాత్రం అదంతా చూస్తుంటే విషం మింగుతున్నట్లని పించింది. నానాకు గూడా కష్టంగానే తోచింది.

శంకర్, పరమా మొదలైన వారంతా దినవారాలు సక్రమంగా జరిపించారు. ఐదారు వందలమంది భోజనం చేశారు. అంతా సవ్యంగా జరిగి పోయింది.

కాని మాలి పరమాను "నీవు జామీనుండి దినవారాలకు డబ్బు యిప్పించావట, నీ పిల్లలకు చిప్ప చేతికిస్తావా ?" అని అడిగింది.

"నేను జామీనుండలేను. అయినా అగవసరపు విషయాలలో నీవు జోక్యం కలగజేసుకొంటున్నా" వన్నాడు పరమా. "తోడబుట్టినవాడు చచ్చిపోతే నేను ఆ మాత్రమైనా చేయవద్దా ?" అన్నాడు.

"అది మన కనవసర" మన్నది మాలి. ఆ మాట విన్న వారంతా ఆశ్చర్యపడ్డారు.

"ఇంట్లో కాల సర్పం-అవకాశాచు కూర్చుని వున్నది. ఏమి చేస్తాడు పరమా ?" అని జనం అనుకొన్నారు.

# 8
# ధరిత్రి – విత్తనాలు

ధోవతి కట్టుకొనడమైనా చేతగాని ఎనిమిదేళ్ళ వయస్సులోనే కాళాకు ఎద్దుల్ని మేపుకొచ్చే పని చేయవలసి వచ్చింది. తన తల్లి కారుస్తున్న కన్నీళ్ళను అతడు అర్థం చేసుకొన్నాడు.

కాళాను పరమా తన వొడిలోకి తీసుకొన్న మాట నిజమే. అయినా అతడు మాత్రం ఏమి చేయగలడు? దాదాపు పది సంవత్సరాలనుండి అతడు నాగలిమీద చెయ్యి వేసి ఎరగడు. పిల్లలు పెద్దవాళ్ళు గావడం వలన అతడు పొలం పని చేయవలసిన అవసరం కలుగలేదు. వయస్సు మళ్లింది గనుక చిట చిటలాడే ఎండనూ, వాననూ సహించలేక పోయే వాడు. అయినా చేతనైన ఏ కొద్ది సహాయమన్నా కాళాకు చేద్దామంటే తాను యిల్లు వదలి వెళ్లవలసి వచ్చేటట్లున్నది.

అయినా పరమా పటేలు రణఛోడుడికి నచ్చజెప్పాడు. "కాళా నీ చిన్న తమ్ముడు, సొంత పెద తండ్రి కొడుకు. వాణ్ణి నీవు చూడకపోతే ఇంకెవ్వరు చూస్తారు? ప్రపంచం ఏమనుకొంటుంది?" అన్నాడు.

కాళా మీద రణఛోడుడికి ఏదో దయా భావం వంటిది లేకపోలేదు. కాని తల్లి తండ్రి కొడుకుల మాటను చలామణీ కానివ్వదు. ఆమె అనుమతి లేనిదే వాళ్ళు నీళ్ళు త్రాగటానికి గూడా వీలులేదు. అట్టి స్థితిలో కాళాను ఎవరాదరిస్తారు?

మాలి స్పష్టంగా చెప్పివేసింది. "కాళాగాడికి ఎవ్వరు సహాయం చేసినా నేను బావిలో దూకుతాను. వాడికి సహాయం చేసిన వాళ్ళు నాకు కొడుకులే గాదు. ఈ ఆస్తి అంతా ఎవరికో తెలుసా? "ఒరేయి పెద్దవాడా! విను. నీ బిచ్చమెత్తుకొనే తండ్రికి, చిరిగిన మాసికలంతవి రెండు చెక్కల పొలముండేది. ఈ యిల్లు గూడా నేను బాగు చేయించిందే. నా తండ్రి సంపాదనలోనుండి ఈ పని జరిగింది. నేను చెప్పిన ప్రకారం మీరు వ్యవహరించకపోతే కట్టుకొన్న గుడ్డలు గూడా మీ చేత విడిపిస్తాను" అన్నది.

మాలి ఇంకొక రకంగా గూడా ఆలోచించింది. వాలా కుటుంబానికి సహాయం చేస్తే తానే చేయాలి. పరమా పటేలుతో ఒకసారి తన అభిప్రాయ

మేమిటో చెప్పింది. "మన వల్ల సహాయం కావలెనంటే రూపా మనం చెప్పినట్లు వినాలి. మన యింట్లో దాసీ పని చేయాలి. ఇల్లు ఊడ్చాలి, నీళ్ళు తోడాలి. అపుడే మన సహాయం" అన్నది.

ఏనాటికైనా తన పట్టుదల నెగ్గితీరుతుందని మాలి విశ్వాసం. అందుకై ఆషాఢమాసం కొరకు ఎదురు చూడడమారంభించింది. ఆషాఢమాసం దగ్గర బడుతున్నకొద్దీ ఆమె బుగ్గలమీద చిరునవ్వు తాండవమాడడం ఆరంభించింది.

"రూపా తనకు దాసిగా వుండక ఏమి చేస్తుంది? వచ్చినట్లు నోరు మూసుకొని పడివుండక కొడుకును జన్మపత్రిక వ్రాయిస్తుందా? ముంగిలిలో గుర్రాలను కట్టి వేస్తారా? పటేలు తనం లేకుండా పటేలు అధికారాలు చలాయిస్తాడట. ఈ కాళాగాడు ఎట్లా చలాయిస్తాడో చూస్తాను. అందుకే వాడికి ఎద్దుల ఉద్యోగం దొరికింది. ఈ ఎద్దులు కాసేవాడు పటేలు తనం చేస్తాడట."

మాలికి ఎవరి సహాయం లేకపోయినా లోకంలో ఎవరి పనులూ ఆగవని తెలియదు.

మాలి ఏమనుకొంటున్నా – కాళా పొలంలోకి ఎరువు చేరనేచేరింది. ఇంటికి కట్టెలు చేరాయి. ఇల్లు శాంతంగా వున్నది. ఇంట్లో వాళ్లు సంతృప్తిగా ఉన్నారు. కాళాకు అత్తవారు సహాయం చేస్తున్నారు. శంకర్, కాసిమ్, మావ్‌జీ తాత అంతా వచ్చి ఇంటి పెంకులు సరిదేశారు.

ఒక్కసారి రూపావచ్చి మాలి కాళ్లమీద పడితే సరిపోతుందని రూపాతో చెప్పవలెననుకొన్నాడు పరమా పటేలు. కాని అతనికి సాహసం కలగలేదు. అంతేగాక మాలి స్వభావం అతనికి తెలుసును. మాలి మారుతుందని విశ్వాసమెక్కడ? అట్టి సంధికు లోకం మాత్రం హర్షిస్తుందా? రూపాకు మాలిమీద విశ్వాసం లేదు. ఒకసారి ఆమె మాలి తేలుకొండెవంటిదని అననే అన్నది.

ఎన్నింటికైనా వోర్చుకోవచ్చును గాని ఎత్తి పొడుపు మాటల్ని విని వోర్చుకొనడం కష్టమని రూపా అంటూంటే మృత్యు శయ్యమీద పడి వున్న ఫూలీ అవ్వ విని సంతోషించింది. "అవును, నీ మాటలు వాలా స్వభావానికి అనుగుణ్యంగా వున్నవి" అన్నది.

వాలా వియ్యంకుడు బ్రతికి వుంటే కాళాకు ఎటువంటి కష్టాలూ వుండేవి

కావు. కాని ప్రకృతి ధర్మాన్ని ఎవరు తప్పించగలరు? కాళా అత్త వున్నది గాని ఆమె అంత ఆసరందా కాదు. కోదర్ చిన్న పిల్ల వాడు. కోదర్ మేనమామ పెద్ద బలగం వున్నవాడే, కాని కోదర్ యిల్లు సరిదిద్దడానికే అతనికి సమయం సరిపోవడంలేదు. సారాంశమేమంటే కాళాకు కింద భూమీ పైన ఆకాశం తప్ప ఇంకా ఏమీ సహాయం లేదు.

ఆషాఢమాసం రానే వచ్చింది. వర్షాలు ప్రారంభమైనవి. రైతులు నాగళ్లు బయటికి తీశారు. అంతా పొలాలకు బయలుదేరుతున్నారు. ఎద్దుల మెళ్లల్లో గంటలు గణ గణలాడుతున్నవి.

కాళా ఎద్దులకు నీళ్లుబట్టి పుల్లు గర్ర తీసుకొని అటు ఇటు వ్యాకులంగా తిరుగుతున్నాడు. పొలంపోయి నాగలి దున్నవలెనని అతని అభిప్రాయం. ఊళ్లో అతని వయస్సులో వున్న పిల్లలంతా ఆడుకొంటున్నారు.

"అమ్మా! నాగలి ఎద్దుల మెడకు కట్టనా?" అని అడిగాడు కాళా.

"నేను నాగలి దున్నితే నాన్న నవ్వాడు గదా!! నేను దున్నగలను" అన్నాడు కాళా.

తల్లి కళ్ళ వెంట బొట బొట నీరు కార్చింది. ఏమి జవాబిస్తుంది? కాళాకు నాగలి దున్నవలెనని పుబలాటంగా వున్నది. ఇక విధిలేదని భావించి తాను కచ్చ బిగించింది. తాను విత్తనాలు తీసుకొనిపోయింది. నాగలి దున్నడమెట్లా? ఏమి చేయాలి? ఆలోచిస్తున్నది.

కాళా తొందర బడుతున్నాడు. తల్లిమీద గూడా కాళాకు కోపంగా వున్నది. ఆమె వెళ్ళకునదేమిటి?

కాళా వయస్సు నాగలి దున్నడానికి తగింది కాదని రూపాకు తెలుసు. నాగలి బరువు సమానంగా వుండేటట్లు చూడడం, ఎద్దుల్ని సరిఅయిన మార్గంలో నడిపించడం, నాగలి చాలు చక్కగా తిన్నగా వుండేటట్లు చూడడం, ఇవన్నీ చూడడం పసివాడు కాళా చేయగలడా?

తన గాజుల్ని పగలగొట్టిననాడు ఆమెకెంత దుఃఖం కలిగిందో ఈ నాడు తన వాకిట్లో ఎద్దులు నిలబడివుంటే ఆమెకంత దుఃఖం కలిగింది.

గ్రామంలో ఎవరింట్లో చూసినా ఉత్సాహం, ఉల్లాసం వెల్లి విరుస్తున్నవి. విత్తనాల బుట్టలతో కొంతమంది పొలానికి బయలుదేరారు. కొంతమంది హుక్కాలు తీసుకొని పోతున్నారు. కొంతమంది పిల్లలు పిడకలు కాల్చి – ఆ పిడకల్ని తీసుకొనిపోతున్నారు.

అదే సమయంలో మాలి తన ఇంటిముందు అరుగుమీద కూర్చుని పనులు పురమాయిస్తున్నది. "ఓ నాథా పెళ్ళామా! నీళ్ళు తీసుకొని పొలం వెళ్ళు. ఒక్క కడవ నీళ్ళు నలుగురికి సరిపోవు వెళ్ళు" అన్నది. రణ ఛోడుని భార్యను పిలిచింది. "నీ వేమి చేస్తున్నావే? తప్పేలలో ఎంత హల్వా వున్నదో చూడు. రెండు జాములకల్లా భోజనం తయారు గావాలి. అన్నంతో హల్వా కలుపు. కొన్ని పెద్ద రొట్టెలు గూడా అందులో చేర్చు" అన్నది.

ఈ మాటలు విన్న కాళా తల్లి ఇంటిబయట అడుగు బెట్టడానికే భయ పడ్డది. నాగలి బయటికితీసి తానే వెళ్లి దున్నితే ఏమవుతుంది? శాస్త్రాలు వొప్పుకొంటవో లేదో గాని తాను నాగలి దున్నటం సంఘం వొప్పుకోదు. ఏ ఆడదీ ఇంతవరకు నాగలి దున్నినట్లు తాను గూడా విని వుండలేదు. ఆమెకేమీ తోచడం లేదు.

తన భర్త అన్న మాటలు ఆమెకు మాటిమాటికీ జ్ఞాపకమొస్తున్నవి. "పదికోసుల దూరం దూరంగాదు. కాని అదునుకు విత్తనాలు పడకపోతే పంటలకు కలిగే దూరం దూరం" అనేవాడు.

కాసిమ్, శంకర్ వగైరాలు "రూపా పిన్నీ! విచారించకు. మా పని పూర్తికాగానే మేము వచ్చి నీ పని చూస్తా" మని హామీ యిచ్చారు. కాని వాళ్ల పని పూర్తి గావాలి గదా? దానికి కొంత ఆలస్యమవుతుంది గదా? ఆషాఢమాసంలో ఎద్దులు ఇంటి ఎదుట పని లేకుండా కట్టి వేయబడివుంటే ఆ యింటి అదృష్టం దురదృష్టమే నన్న ఇంకొక మాట రూపాకు జ్ఞాపక మొచ్చింది.

రూపాకు ఏమీ తోచడం లేదు. కళ్ల వెంట నీళ్లు కారుతున్నవి.

ఇంటిపనులు ఏమైనా చూదుకొందామనుకొన్నది. కాని ఆ రోజు ఆమెకు ఇంట్లో ఏమీ పనివున్నట్లే కనిపించలేదు. పిండి తయారుచేయించడానికి గోధుమలు ఎప్పుడో తయారుచేయించి పెట్టింది. కాళాకు గోధుమ హల్వా రెండు నిమిషాలలో తయారయిపోయింది. ఏమీ తోచక ఇల్లు ఊడ్చడం ఆరంభించింది. ఊడ్చినచోటే ఊడుస్తూ వసారా దగ్గరికి చేరింది.

మాలి యింట్లో ఏమి జరుగుతున్నదో చూడవలెనని ఆమెకు బుద్ధి పుట్టింది. నలుగురైదుగురు ఆడవాళ్ళు మాలికి దగ్గరగా కూర్చొనివున్నారు. పరమా పటేలు నెయ్యి తూకం వేస్తున్నాడు. ఎంత వినవద్దని అనుకొన్నా మాలి

మాలి అంటున్న మాటలు ఆమె చెవిలో పడనేపడ్డవి. ఆ మాటలు చెవుల రంధ్రాలలోనుండి ప్రవేశించి ఆమె హృదయాన్ని భేదించాయి.

ఆడవాళ్లను ఉద్దేశించినట్లుగా మాట్లాడుతూ మాలి రూపా వినేటట్లుగా ఎత్తిపొడుపు మాటలు ప్రారంభించింది. "తీసుకొనిపోండి. కావలసినన్ని విత్తనాలు గింజలు తీసుకొనిపోండి. సమయంలో నాటితేనే విత్తనాలు, పండుతాయి. ఇంట్లో పూరికే కూర్చుంటే మట్టి పండుతాయా?" అన్నది. అంతలో ఆగక "ఏమే రూపా! ఎద్దుల్ని వాకిట్లో కట్టివేసుకొని కూర్చున్నావేమిటి? గుర్రాలు కట్టివేస్తారని బ్రాహ్మణుడు చెప్పాడుగదా!" అంటూ పక పక నవ్వింది. ఆమెతోబాటు మిగతా ఆడవాళ్ళుగూడా నవ్వారు. అంతతో వదలకుండా – "నేను మా యింటినుండి డబ్బుతెచ్చాను. మీరంతా చెమటోర్చి సంపాదించేవారు గదా! ఆషాఢమాసంలో చేతులు కట్టుకొని కూర్చున్నావేమిటి?" అన్నది.

రూపా కాళ్ళు ఇక ముందుకుసాగలేదు. ఆమె తన వీపును వెనకకు తిప్పింది. ఆమె ముఖంమీది రేఖల్లో యౌవనం ప్రాదుర్భవించినట్లయింది. ఆమె కళ్లల్లో ఆత్మాభిమానం, ఆత్మ గౌరవభావం పెల్లుబికినట్లయింది. ఎద్దులకు మేత వేస్తున్న కాళాను ఉద్దేశించి – "కాళా! ఎద్దుల తాళ్ళువిప్పు. నాగలి బయటికి తీస్తున్నాను. నాగలి ఎద్దులమెడకు కట్టు" అన్నది.

కాళా తల్లి వైపు చూస్తూ అలాగే నిలబడ్డాడు.

రూపా నాగలి బయటకు తీసింది. కాళాకు చాలా ఆనందం కలిగింది. ఎద్దుల తాళ్ళు విప్పాడు. తల్లి నాగలి ఎద్దుల మెడమీద బెట్టి పట్టెడ్లు బిగించి తాడు కాళా చేతికిచ్చింది. "మర్రిచెట్టు పొలంలోకి పద. విత్తనాలు తెస్తున్నాన"న్నది.

మాలి నాగలి వెంట నడుస్తున్న కాళాను చూచింది. బలిచక్రవర్తి వెనక నడుస్తున్న వామనమూర్తి జ్ఞాపకానికి వచ్చాడు. వెనక విత్తనాల బుట్టతో రూపా కన్పించింది. ఆమెకు నవ్వు వచ్చింది. కోపం గూడా వచ్చింది. "నాశనపు మనిషి. అసలే పుట్టెడు అప్పుల్లో ఉన్నది. విత్తనాల పేరుతో తిండి గింజలు పాడుచేసుకొంటున్నది" అన్నది. మిగిలిన ఆడవాళ్ళు మంచి రోజులు చెడు రోజుల్ని గురించి మాట్లాడుకొనడం ఆరంభించారు. . వాలాభాయి యింటి స్థితి ఎంతగా మారిపోయింది! అంతా రోజుల మహాత్మ్యం అనుకొన్నారు.

నాథా భార్య పొలంనుండి ఇంటికి తిరిగి వచ్చింది. "ఆ హాహా! మన కుటుంబం అసలు స్థితి బయటకు రాబోతున్నది!!" అన్నది.

కోడలి మాటలు వినగానే మాలికి చాలా కోపం వచ్చింది. తిరస్కార పూర్వకంగా – "నీ కెందుకే? నోరు మూసుకో" అన్నది. కాళా మీద ఆమెకు దయ కలిగిందో ఏమో తెలియదు.

"మీ అక్క కచ్చగట్టి నాగలి దున్నడానికి పొలానికి బయలుదేరింది. ఈ సంవత్సరం పంటలు పండినట్టే" అన్నది ఒకామె.

"కాళా తల్లి నాగలి దున్నుతుందా?" ఆశ్చర్యపడింది ఇంకొకామె. మాలి ఇంట్లోకి పోయి పరమా పటేలును చూచి పక పక నవ్వింది. "మీ అన్నగారింట్లో భవాయీ నాట్యం ప్రారంభమయింది" అన్నది.

పరమా పటేల్ చిరాకు పడ్డాడు. – "మీ ఆడజాతి వ్యవహారమే అంత. ఎప్పుడు ఏమి చేస్తారో భగవంతునికి గూడా తెలియదు. ఆ కాళా తల్లి ఏడు తరాల వంశగౌరవం మట్టిలో కలపబోతున్నది. రామ రామ! ఆమె కంటే అడవిజాతి స్త్రీ చాలా నయం" అన్నాడు.

మాలి ఆనందానికి అంతులేకుండా వున్నది. కాళికలాగా రూపాను తిట్టడం ఆరంభించింది. తమ కుటుంబానికి రూపా వేరు పురుగు అన్నది.

ఏమైనా మాలీ ప్రవర్తన పరమాకు గూడా నచ్చలేదు, కాని తానేమి చేయగలడు? ఊరంతా ఉడికిపోతున్నది.

జనం కాళా పొలం చుట్టూ గుమిగూడారు. గ్రామ గౌరవం మట్టిపాలు కాబోతున్నది. "ఆడది నాగలి దున్నితే పొలాలు పండుతాయా? ఏమిటి ఈ అఘాయిత్యం" అంటున్నారు కొందరు.

కాసిమ్, శంకర్ వగైరాలు "రూపా పిన్ని నాగలిమీద చెయ్యి వేయ లేదు. కాళా నాగలి దున్నుతున్నాడు. ఆమె సహాయం చేస్తున్నది, దీనిలో తప్పేమున్నది?" అని రూపాను సమర్థించారు.

ఆ గందరగోళమంతా చూచి కాళా ఏడవడం ప్రారంభించాడు. రూపా మాత్రం ఎవరేమన్నా లెఖ్ఖ చెయ్యలేదు ధైర్యంగా నిలబడిపోయింది.

"అయితే మీరనేదేమిటి? ఇంట్లో పడివుండి ఆకలితో మలమల మాడి చావాలా? పరిశ్రమ చేయగూడదా? నిజానికి పరాధీనంగా బ్రతకడమే తప్పు. మీ కంత కష్టంగా తోస్తే మీరంతా ఇళ్ళకుపోయి మీ భార్యల్ని ఇతర్ల యిళ్ళల్లో దాసీలుగా పనిచేసి బ్రతకమని చెప్పండి" అన్నది.

ఏడుస్తూ తనవంక చూస్తున్న కాళ్లాను చూచి – "తోలు ఎద్దుల్ని" అన్నది. జనమంతా ఆమె వంక అలా చూస్తూనే వున్నారు.

ఇద్దరు ముగ్గురు – "ఓ ముసలి దానా! నీ మూలంగా ఈ సంవత్సరం వర్షాలు లేక పంటలు పండకపోతే నిన్ను సామాన్యంగా వదలం?" అన్నాడు.

పరమా పటేల్ వగైరాలు ఏదో మాట్లాడుతూనే వున్నారు. కాని మధ్యలోనే కాసిమ్ అందుకొన్నాడు – "పిన్నీ! నీవన్నమాట నిజం. పరిశ్రమ చేయడంలో తప్పేమీ లేదు!!" అన్నాడు.

"పరిశ్రమ చేయడంలో తప్పేమున్నది?" అనేమాట గ్రామమంతా వ్యాపించింది. ఎవరినోటివెంట విన్నా ఇదేమాట వినిపించడం ఆరంభించింది.

రెండు జాముల సమయంలో అన్నం తెచ్చిన ఆడవాళ్లనందరినీ వారి వారి భర్తలు పరిశ్రమ చేయమని ప్రోత్సాహించారు.

ఆ రోజు సాయంత్రం ఏడెనిమిదిమంది స్త్రీలు రూపా యింటిముందు చేరారు. అంతా రూపాను ఒక్కటే ప్రశ్న అడుగుతున్నారు. "రూపా పిన్నీ! నీకంత సాహసం ఎట్లా కలిగింది?" అని ప్రశ్నించారు. "సాహసమేమి లేదు. వాలాభాయి ఆత్మ నాకీ శక్తిని ప్రసాదించింద"ని రూపా అన్నది. ఎత్తిపొడుపు మాటలు వినడంకంటే ఆత్మగౌరవంతో బ్రతకడం మంచిదని అన్నది.

అదంతా విన్న మాలి నీళ్లనుండి బయటపడ్డ చేపలాగా గిల గిల లాడింది. నెమ్మదిగా ఇక ఈ సంవత్సరం వర్షాలు కురవవని ప్రచారం. ప్రారంభించింది. ఆ విషయం వూరు వూరంతా చాటించింది. మాలి ప్రయత్నం ఫలించింది. గ్రామమంతా అదేమాట ప్రచారంలోకి వచ్చింది. ప్రక్కనున్న గ్రామాలకు గూడా ఈ విషయం వ్యాపించింది.

పరమా పటేలుతోబాటు గ్రామంలోని వారంతా ఆలోచనలో పడ్డారు. శంకర్, బేచాత్ వగైరాలు ఒక నిర్ణయానికి వచ్చారు. రూపాను పొలంలో పడుకోబెట్టి ఆమెమీద నుండి నాగలి గట్టిన ఎద్దుల్ని నడిపించాలి. ప్రకృతి కోపాన్ని శాంతింపజేయడానికీ, దేశంలో కరువు ఏర్పడకుండా చేయడానికి ఇదొక్కటే వుపాయమని వారి అభిప్రాయం. అంతేకాకుండా ఈ పని తొందరగా చేయాలని గూడ వారు నిర్ణయించుకొన్నారు. వరం కురవలేదు. ఇంకా రెండు మూడు రోజులవరకు వర్షం కురవకపోతే

పంటలు పాడైపోతాయి. అంతా బాగానేవున్నది. కాని ఈ విషయం రూపాతో వెళ్లి చెప్పే వారెవ్వరు?

నీవంటే నీవని ఒకరు ఇంకొకరి నెత్తిమీద బాధ్యతలు నెడుతున్నారు. పరమా పటేలు యింటిముందు గుమిగూడిన గ్రామ పెద్దలు ఆలోచన చేస్తూనే వున్నారు.

తన యింటిముందు నిలబడిన రూపా ఈ మాటలన్నీ వింటూనే వున్నది. భగవంతుణ్ణి ఆమె ప్రార్థిస్తున్నది. "భగవంతుడా! నీవు నావంటి వారికే దుఃఖాన్ని కూరుస్తున్నావు. సహాయం చేసే బంధువు లెవ్వరూ నాకు లేరు. నీ మీద విశ్వాసం బెట్టుకొనివుంటే నీవు గూడా నాకు వ్యతిరేకంగానే వ్యవహరిస్తున్నావు. నాకీ కష్టం ఎందుకు కలగజేస్తున్నావు స్వామీ!" అని విలవిలలాడింది. చనిపోయిన భర్తనుద్దేశించి - "నీవు సుఖంగా వెళ్ళిపోయావు. మాకీ కష్టాలు కల్పించావు. ఈ బాధలన్నీ నీవు వదిలించుకొన్నావు. గ్రామమంతా ఏ స్థితిలో వున్నదో చూడు. ఆ భగవంతునికి మా యీ కష్టాలు నివేదించు" అని మొరబెట్టుకొన్నది.

కాని ఆమె అంతరాత్మ మాటిమాటికీ - "రూపా! నీవేమీ తప్పుపని చేయడం లేదు. నీ కారణంగా వర్షం కురవలేదనడం నిజం గాదు. ఎవరు ఏమైనాసరే, నీవు ప్రాయశ్చిత్తం చేసుకొనవలసిన అవసరంలేద"ని ఉద్బోధిస్తున్నది.

రూపా దృఢనిశ్చయం చేసుకొన్నది. తనతో ఎవరు చెప్పడానికి వస్తారో చూద్దామని నిలబడ్డది.

"పటేలా! ఆమె నీ వదిన. నీవు వెళ్ళి చెప్పు. గ్రామం మేలుకొరకై ఆమెను పొలంలోకి పిలుచుకొనిరా... శంకర్ రూపా పిన్ని నీమాట వింటుంది. నీవుపోయి చెప్పు... కాసిమ్! నీవు ప్రయత్నించు."

కాసిమ్ అందరికీ ఎదురు తిరిగాడు. "ఈ గ్రామంలోనే కాదు, మొత్తం దేశంలో కరువు ఏర్పడ్డా నేను మాత్రం రూపా పిన్నిని పిలవను" అన్నాడు. "అసలు మీరు చేస్తున్నపని తప్పు" అన్నాడు.

పది పదిహేను నిమిషాలు ఎవ్వరికీ ఏమి చేయడానికీ తోచలేదు. రూపాను కలుసుకొని మాట్లాడే వాడెవడు? ఎవడికంత సాహసమున్నది? ప్రాయశ్చిత్తం జరగకపోతే గ్రామమంతా ఆకలితో మాడవలసిన పరిస్థితి ఏర్పడుతుందేమో!! ఎవ్వరికీ ఏమీ తోచడం లేదు.

ఇంతలో పక్కనున్న మాలి నవ్వుకుంటూ మొదలుబెట్టింది. "నాశనపు వాళ్ళల్లారా! మీరంతా అప్రయోజకులుగా కనబడుతున్నారు. ఇది గ్రామానికంతకూ చెందిన సమస్య" అన్నది. పక్కకు చూచింది. ఇంటి ముందు నిలబడివున్న రూపా కనిపించింది. కంఠం పెద్దది చేసింది.

ఇంతలో రూపా "మీ రెవ్వరూ పిలవకుండా నేనే వస్తున్నాను. పదండి పోదాం. ఒకరి పాపం వలన మీరందరూ బాధపడవలసిన అవసరంలేదు. అసలు అటువంటి స్థితి ఎందుకు కలగాలి?" అన్నది. ఆ మాటలు అంటుంటే రూపా కళ్ళల్లో ఏదో విచిత్రమైన ప్రకాశం తాండవ మాడుతున్నది. ఆమె ముఖంమీద గాంభీర్యం వెల్లి విరుస్తున్నది. ఆమె ఇంటి బయటికి వచ్చి వేప చెట్టు క్రింద నిలబడ్డది. దగ్గరగా నిలబడివున్న కాసిమ్‌ను పిలిచి - తన కంఠంలో నుండి అప్రయత్నంగానే బయటకు వస్తున్న ఏడుపును నవ్వుగా మార్చడానికి ప్రయత్నంచేస్తూ -"తమ్ముడూ! కాసిమ్! నాకెవ్వరూలేరు.. కాళాను నీ చేతుల్లో పెడుతున్నాను.. వాడి బాధ్యతంతా నీదె.. ఎద్దులు నా మీద గుండా వెళ్ళినప్పుడు నా గతి ఏమవుతుందో ఏమి చెప్పగలను?" అంటూ వాక్యం పూర్తిగాకుండానే గుడ్ల నీళ్ళు గుడ్లల్లో కుక్కుకొని పొలం వైపుకు బయలుదేరింది.

కాసిమ్ శూన్యంగా ఆమెవంక చూస్తూ నిలబడివున్నాడు. మంచాల మీద కూర్చొనివున్నవారంతా కాగితపు బొమ్మలైనారు. భయభ్రాంతులు గూడా అయినారు.. "ఏమో చిత్రంగా వున్నది" అని అంటున్నారు.

రూపా మాత్రం నిశ్చయం చేసుకొన్నది. గ్రామం కొరకై తానీ పరీక్షను ఎదుర్కొనవలసిందే తప్పదు. వర్షం కురిసినా కురవకపోయినా తనకీ పరీక్ష తప్పదనుకొన్నది.

ఆమె పల్లెత్తి పరుషంగా ఎవరినీ ఏమీ అనకపోయినా ఆమె శాపం తగులుతుందేమోనని గ్రామస్తులంతా హడలిపోతున్నారు. రూపాను వారిస్తే - వర్షం కురవదేమో!! ఏమీ నిశ్చయం చేసుకోలేక పోతున్నారు.

కాసిమ్ - "ఆమె పొలంలోకి పోతూవుంటే మీరంతా కూర్చొనే వున్నా రేమిటి? లేవరా?" అన్నాడు.

"లేస్తున్నాము. లేస్తున్నాము" అంటూ అందరూ లేచారు.

అందరూ రూపా వెంట బయలుదేరారు. బయలుదేరిన వారందరికి

మాలి సదుపదేశం చేయడం ప్రారంభించింది. "వర్షం కురువవలెనంటే - మన గ్రామానికి ఏ ఆపదా లేకుండా వుండవలెనంటే మరదలికి ప్రాయశ్చిత్తం జరగక తప్పదు. ఏదో లాంఛనంగా గాక భగవంతుని దయ కలిగేటట్లు- వర్షదేవత అనుగ్రహించేటట్లుగా ప్రాయశ్చిత్త కాండ జరిపించండి" అన్నది.

అయితే ఎవ్వరూ ఆమె మాటల్ని విన్నట్లుగాగూడా లేదు. వాళ్ళ దృష్టి, ఆలోచన అంతా భయంకరమైన దుస్వప్నంగా పరిణమించబోతున్న భవిష్యత్తు వైపుకు ఆకర్షించబడివున్నది.

ఇంటినుండి బయలుదేరిన రూపా పొలాల మధ్యకు చేరుకొన్నది. మర్రిచెట్టు పొలంలో నిలబడ్డది. ఆమె వెంట జనమంతా పొలంలోకి చేరుకొన్నారు.

ఎవ్వరూ ఏమీ మాట్లాడడం లేదు. ఎవ్వరికీ ఏమి చేయాలో తోచడం లేదు. అందరి మౌనాన్ని భంగం చేస్తూ బేచాత్ "తెప్పించండి నాగలి. తోలుకొనిరండి ఎద్దుల్ని" అన్నాడు.

నలుగురైదుగురు ఎద్దులకొరకై పరుగెత్తారు. పదిమంది స్థలం నిర్ణయించడానికి అటు యిటు తిరుగుతున్నారు. మర్రిచెట్టు క్రింద జనం బాగా పెరిగారు. కొంతమంది ఎత్తైన స్థలంలో నిలబడి దృశ్యాన్ని చూస్తున్నారు. సూర్యుడు గూడా ఆ తమాషా చూడడానికి పశ్చిమ దిక్కున ఎత్తైన కొండ మీదికెక్కాడు.

కొంతమంది రూపా వైపుకు చూస్తుంటే కొంతమంది ఎద్దుల రాకకై ఎదురుచూస్తున్నారు. ఒక్క కాసిమ్ మాత్రం ఈశాన్య దిక్కుగా ఏదో నల్లటిమబ్బు వంటి ఆకారం ఆకాశంమీద వ్యాపించడం చూస్తున్నాడు. మనస్సులో ఖుదాను ప్రార్థిస్తున్నాడు. "ఖుదా! గ్రామ గౌరవం కాపాడు. అన్యాయం జరగబోతున్నది. జరగకుండా చూడు. పర్వర్ డిగార్!" లోలోపల ధ్యానం చేస్తున్నాడు.

శంకర్, బేచాత్, రాముల దృష్టి గూడా ఈశాన్య దిక్కుగా ఆకర్షించింది. అది సామాన్యమైన మబ్బు అని వారనుకొన్నారు.

కాని కాసిమ్‌కు మాత్రం మనస్సులో దృఢమైన విశ్వాసం ఏర్పడింది. . అతని విశ్వాసం ప్రకారం అది వర్షపుమేఘం. పది నిమిషాలల్లో ముంచెత్తుతుంది అని అతని విశ్వాసం.

పరమా పటేల్ కొడుకు నానా నాలుగెద్దుల్ని తోలుకొచ్చాడు. కాసిమ్‌కు వొళ్ళు మండింది.

"కోతి వెధవ అంబోతుల్ని తోలుకొచ్చాడు" అనుకొన్నాడు. ఆ ఎద్దుల్ని చూడగానే పరమాపటేల్‌కు గూడా కోపం వచ్చింది– "ఒరేయి నానా నీకేమి బుట్టిందిరా? నిన్నెవ్వరు ఎద్దుల్ని తోలుకొని రమ్మన్నారురా?" అని గద్దించాడు.

"అమ్మ" అన్నాడు నానా.

ఇంతలో రణఛోడుడు గూడా అక్కడికి వచ్చాడు. మాట ఆగిపోయింది. రూపా తొందరపడుతున్నది.

"మానవుని హృదయంమీద- వక్షస్థలంమీద మానవశక్తి మాత్రమే అడుగు పెట్టగలుగుతుంది, పశుశక్తిగాద" ని కొంతమంది అంటున్నారు.

అటు మేఘాలు కమ్ముకొస్తున్నవి. ఇటు ఎద్దులు తయారైనవి. అయితే ఆ ఎద్దుల అవసరం లేకుండాపోయింది. ఈశాన్యదిక్కునుండి చల్లని గాలి వీచింది. రుద్ర గర్జనంలాగా మేఘం గర్జించింది.

రుద్రుని జటలనుండి తుంపురులు ప్రారంభమైనవి. కొద్ది నిమిషాలలోనే భూమీ ఆకాశమూ రెండూ ఏకమైపోయినవి. అవి నీటతుంపురులు గావు, రూపా తాలూకు శాప స్ఫులింగాలు అని ప్రజలు భావించారు. ఆశ్చర్య చకితులైనారు.

రూపా పిన్ని మహిమాన్వితురాలని జనం విశ్వసించారు. జనమంతా ఆమె వంకకు చూస్తున్నారు. కొంతమంది చేతులు జోడించి ఆమెకు నమస్కరిస్తున్నారు.

హర్షాశ్రువులతో చిరునవ్వు నవ్వుతున్న రూపా పిన్ని దేవతా మూర్తిగా కనబడుతున్నది.

శంకర్ ఆమెను క్షమార్పణ కోరాడు. తప్పు క్షమించమన్నాడు. రూపా చాలా విచారపడింది. అంతా భగవంతుని దయ అన్నది.

తమాషా చూడడానికి వచ్చిన మాలి ముఖాన కత్తివేటుకు నెత్తురు చుక్కలేదు. "వెధవలు ఎద్దులు తోలుకొని రావడంలో ఆలస్యం చేశారు. ఒక్క అరగంట ముందరగా పని ముగించివుంటే బాగుండేది. రూపా ముండ మదమణిగేది అన్నది."

జనానికి ఈ ఘటనవలన ఆనందం, పశ్చాత్తాపం రెండూ కలిగాయి.

ఆ రాత్రి గ్రామంలోని స్త్రీలంతా రూపా యింటిదగ్గరే వున్నారు. "రూపా పిన్నీ! నిజం చెప్పు. నీవు ఏ దేవతవు?"

సజల నేత్రాలతో రూపా మాట మధ్యలోనే అందుకొని జవాబు చెప్పింది. నిజమడిగితే ఆ సమయంలో నాకు నా భర్త మాత్రమే జ్ఞాపకానికి వచ్చాడని చెప్పింది.

రూపా వాలాభాయిని స్మరించింది. అతడు భగవంతునితో చెప్పి మేఘాలను పంపించే ఏర్పాటు చేయించాడు, అని అంతా ఒక నిర్ణయానికి వచ్చారు. లేకపోతే సరిగ్గా ఆ సమయానికే వర్షం రావడమేమిటి?

రెండో రోజున చుట్టుపట్ల గ్రామాలలో గూడా ఈ వార్త వ్యాపించింది. మేఘాలు అకస్మాత్తుగా కమ్ముకొన్నవనీ, అసలు మేఘాలు లేకుండానే వర్షం కురిసిందనీ, అటువంటి పనిని ఒక్క నరసీ మెహతాయే చేశాడనీ రకరకాల వార్తలు వ్యాపించినవి. రూపావంటి మహా తల్లులు ఉండబట్టే కలియుగం నడుస్తున్నదని జనులు తీర్మానం చేసివేశారు.

## 9
# గందరగోళం

నువ్వులు పొలంలో వెదజల్లినప్పుడు కాళా నాగలి దున్నాడు. శంకర్ ఎద్దులు కాళా ఎద్దులతో మారకం వేయబడ్డవి. నెమ్మది నెమ్మదిగా కాళా పొలం పని నేర్చుకొన్నాడు.

తల్లి నెమ్మది నెమ్మదిగా నాగలి దున్నమని కాళాను ఆదేశించింది. పొలంలో ఒక చెక్క దున్నడం పూర్తి అయిందాకా తాను గూడా అతని వెంట వున్నది. రెండో చెక్క ప్రారంభంకాగానే—ఇక పరవాలేదని నిశ్చయించుకొని ఇంటికి బయలుదేరింది. ఎద్దులు సరిగ్గా పని చేయకపోయినా, నాగలికి ఏదైనా యిబ్బంది కలిగినా కోదరు దగ్గరకుపోయి వాళ్ళ మనుష్యుల సహాయం అడగమన్నది. "ఈ లోపల నేను ఇల్లు శుభ్రంచేసి నీళ్ళు తీసుకుని వస్తాను. కొర్రు సరిగ్గా వుండేటట్లు చూడ" మని చెప్పి వెళ్ళింది.

అప్పటికే కాళా చేతులు బాగా తిరిగాయి. చాలు శుభ్రంగా తిన్నగా వుంటున్నది. కాని బాగా అలసిపోతున్నాడు. ఎండు కట్టె వెంట తిరగడం చాలా కష్టమైనపని అని అందుకే జనం అంటుంటారు.

అయితే అతని ఉత్సాహమేమీ తగ్గలేదు. చివరి చివరికి ఒక్క చేత్తో నాగలి పట్టుకొనడం గూడా అతని చేతనయింది.

ఒంటరిగా తను వుండిపోవడం వలన కాళాకు సంతోషం కలిగింది. తల్లి వెళ్ళి పోయింది. నాగేటి చాలు ఒకవేళ వంకర టింకరగా వుండి పోయినా తనను అదలించే వాళ్ళు లేరు. ఉత్సాహంగా దున్నుతున్నాడు. ఒక్కొక్కప్పుడు నాగలి అడ్డంగా తిరిగితే తాను ఎద్దులకు ఎదురుగా అడ్డంగా వచ్చేవాడు. ఒక్కొక్కప్పుడు ఎద్దుల మకురుతనానికి తాళలేక కింద పడిపోయేవాడు. తల్లి లేదు గనుక తన తిప్పలు చూచే వాళ్ళెవ్వరూ లేరు. అదే అతని సంతోషం. ఇక వొక్క రణఛోడ్‌గారి నానా వున్నాడు. వాడు నవ్వినా ఏడ్చినా తనకేమీ బాధ లేదు.

అటువంటి ఆలోచనలతోనే రెండో చెక్క దున్నడం కూడా పూర్తి చేశాడు. మూడో చెక్క ప్రారంభించాడు. ఒకసారి తన పొలం వైపు

చూస్తే ఇంకొకసారి వూరివైపు చూచేవాడు. ఎద్దుల్ని బాగా అదలించే వాడు. ప్ప ప్ప ప్ప అంటూ అర గంటలో మూడో చెక్క గూడా పూర్తి చేద్దామని ప్రయత్నం ప్రారంభించాడు.

ఇంతలో వూళ్ళో నుండి వస్తున్న ఇద్దరు పిల్లలు కనిపించారు. వాళ్ళను చూడగానే కాళా హృదయం బరువెక్కి నట్లయింది.

ఆ పిల్లలిద్దరూ ఎవరో కారు. కోదర్, రాజులు. అన్నా చెల్లెళ్ళు. రాజు పూల పరికిణీ కట్టుకొని పూల గుడ్డ వోణీ వేసుకొని వున్నది. సిగ్గు దాచవలేనని గాకపోయినా సిరిసంపదలు గల కుటుంబమనే విషయాన్ని చాటడానికి ఆమె దుస్తులు ఉపయోగిస్తున్నది. ఆమె తల మీద చుట్టుమీద చిన్న నీళ్ళ బిందె వున్నది. ఆ బిందెమీద బాలరవి నాట్యం చేస్తున్నాడు. (వెనక నడుస్తున్న రాజు కోదర్‌ను ఏవో ప్రశ్నలు అడుగుతున్నది. కాళా తనను గురించి రాజు ప్రశ్నిస్తున్నదనుకొన్నాడు. ఆ చిన్న ప్రియ తముని మనస్సులో కలిగిన భావమది. రాజు ఎర్ర మెడ వున్న పక్షి లాగా ఒక్క నిమిషం సారస పక్షుల్ని గురించి ప్రశ్న అడిగితే ఇంకొక నిమిషంలో ఎగిరెగిరిపడుతున్న కప్పల్ని గురించి ప్రశ్న వేస్తున్నది. తనను గురించి రాజు ప్రశ్నలు వేస్తున్నదనే భావం కలగడం వలన అతనికి సిగ్గు ముంచుకొచ్చింది. అయినా అతడు ఉత్సాహంగా పొలం దున్నుతూనే వున్నాడు. ఎద్దుల్ని అదుపులోకి తీసుకొని రాలేక తాను పడి పోతే రాజు నవ్వుతుందనే సందేహం గూడా అతనికి కలిగింది. రాజు తనను చూచి నవ్వుతుందేమో!! అందువలన అతడు చాలా జాగ్రత్త పడు తున్నాడు.

నిజానికి మర్రి చెట్టు కిందికి వచ్చిన తరువాత గాని రాజుదృష్టి కాళా మీద పడలేదు. రాజు నవ్వింది. ఆ నవ్వు తాలూకు రేఖలు ఆ పిల్లముఖ మంతా వ్యాపించాయి. ముత్యాలవంటి ఆమె దంతాలు ప్రకాశిస్తున్నాయి. ఆమె కోదర్ కాళాలవైపుకు చూడడం ఆరంభించింది.

రాజు కంటే కోదర్ ఎక్కువ సంతోషంగా వున్నాడు. అతని దృష్టి అంతా కాళా మీదా, అతని నాగలి మీదా కేంద్రీకరించి వున్నది. "కాళా నన్ను గూడా దున్ననిస్తావా ?" అన్నాడు.

"ఈ పని కష్టం" అన్నాడు కాళా. కోదర్ నిరుత్సాహ పడ్డాడు. "సరే రా, నీకు నేర్పుతా" నన్నాడు కాళా.

కోదర్ పొలంలోకి అడుగుబెట్టక పూర్వమే కాళా ముఖంమీద వ్యాపించి వున్న చెమట బిందువుల్ని చూడడంవల్లనో లేక నాగలి దున్నడమనే ఆట ఆడవలెననే కుతూహలం తనలో కలగడం వల్లనో-తెలియదు- "నీళ్లు తాగు" అన్నది రాజు.

కాళా రాజు వంకకు చూచాడు. ఆమె తలమీది బిందెలోనుండి నీళ్లు తొణికి కిందబడ్డది.

"నీవు మంచి నీళ్ళు తాగు. నేను దున్నుతా" నని కోదర్ గుడ్డ మడిచి కట్టుకొన్నాడు.

రాజు "నీళ్ళుతాగు, తాగు" అని కాళాను తొందర జేయసాగింది. నీళ్ళుతాగి తనకు గూడా ఆటలో చేర్చుకొంటాడని ఆమె అభిప్రాయమయి వుంటుంది.

కాళాకు గూడ దాహమవుతున్నది. రాజుతో మాట్లాడవలెననే కోరిక గూడా అతణ్ణి ఉత్సాహపరచింది. కోదర్ చేతికి నాగలి అందించి రాజు తలమీదనుండి నీళ్లబిందె కిందికి దింపాడు.

బాగా దాహమైనట్లున్నది. కాళా గట గట నీళ్ళు తాగుతున్నాడు. రాజు నీళ్ళు పోస్తున్నది. పొట్టబట్టిన దానికంటే కాళా దాదాపు రెండు రెట్లు నీళ్ళు ఎక్కువ తాగాడు. రాజు తాగు తాగు అని రెండు శేర్ల బిందెను వంచుతూ కాళాను బలవంతం చేసింది.

"ఇక చాలు" అని బిందె రాజు నెత్తినబెట్టి కాళాపొలంలోకి వెళ్లాడు. ఇంతనేలో అకస్మాత్తుగా నాగలి అడ్డం తిరిగింది.

"అరే, అరే! కోదర్! నాగలి వదులు. ఎద్దుల్ని నిలబెట్టు" అంటూ కాళా పరుగెత్తాడు. రాజు గూడా బిందె కిందబెట్టి నాగలి దగ్గరకు పరుగెత్తు కొని పోయింది. "నన్ను దున్ననీయవా?" అని కాళాను బతిమిలాడింది.

"పని చెడగొట్టబోకు కోదర్! నన్ను అమ్మ కోప్పడుతుంది" అని బ్రతిమిలాడాడు.

"నిన్నెందుకు కోప్పడుతుంది. రాజును తిడుతుంది. రాజు పరికిణీని చూచి అసలు ఎద్దులు బెదిరాయి" అన్నాడు కోదర్. ఈ లోపల కాళా నాగలిని తిన్నగా చాలులోకి తెచ్చే ప్రయత్నం చేస్తున్నాడు.

కాళా "కోదర్! నాగలిని వదులు. ఎద్దుల్ని అదలించకు" అని కేక వేశాడు. కోదర్ నాగలి మేడి పట్టుకొన్నాడు. కాళాతాళ్ళు పట్టుకొన్నాడు

ఎద్దులు దొంగ ఎత్తువేశాయి. తాడు తప్పించుకొని పరుగెత్తడం ప్రారంభించాయి. కాళా గూడా ఎద్దుల వెంట పరుగెత్తుతున్నాడు. కోదర్‌కు ఏమీ తోచడం లేదు. రాజుకు అదంతా తమాషాగా వున్నది. చిన్న చిన్న చేతులతో చప్పట్లుకొడుతున్నది.

కొంచెం దూరంలో పక్క పొలంలో నిలబడివున్న నానాకు చాలా ఆనందంగా వున్నది.

"ఎద్దులు సొంతవి కావులే" అని హేళన చేస్తున్నాడు. నాథా కాళా వైపుకు పరుగెత్తాడు.

"ఒరేయి, తాడు వదులు. ఎద్దుల్ని వదులు. లేకపోతే ఎద్దుల కాళ్ళకు నాగలి కొర్రు గుచ్చు కొంటుంది" అని తాను ఎద్దుల వైపుకు పరుగెత్తాడు నాథా. కాళా తల్లి గబగబా పరుగెత్తుకొని వస్తున్నది. నానా చూచాడు.

నాగలిని వదిలించారు. ఎద్దులు చచ్చిపోయేవి. కొద్దిలో తప్పిపోయింది. కాళా చేతిలో తాడు అలాగే వుండిపోయింది. కాళా నిశ్చేష్టుడై చూస్తున్నాడు. కోదర్ నాగలి వైపుకు పరుగెత్తాడు. కాళా తల్లి ఈ లోపల రొప్పుకుంటూ అక్కడికి చేరింది.

ముగ్గురు పిల్లలూ ఒకరిమీద ఇంకొకరు నేరం చెప్పుతున్నారు. కాళా కోదర్‌మీద తప్పుపెడితే, కోదర్ రాజుదే తప్పు అన్నాడు. రాజు వోణీ చూచి ఎద్దులు బెదరినవన్నాడు. రాజుకు ఆ మాటలేమీ అర్థంగాలేదు. "నన్ను దున్ననీయలేదుగా, అందువలన ఇది జరిగింది. అంతేకావాలి" అన్నది రాజు.

రూపా ఎవరిని ఏమంటుంది? ఎద్దులు బెదిరాయి. పసిపిల్లలు ఏమి చేస్తారు?

నాథ్ ఎద్దుల్ని అదుపులోకి తెచ్చాడు. నాగలి సరిజేశాడు. తాళ్ళు కట్టాడు. ముల్లు గర్ర కాళా చేతికిచ్చాడు.

రెండో వైపునుండి అదే సమయంలో గుర్రమెక్కి రాజు మామ రణఛోడ్ పొలంలోకి వచ్చి గుర్రాన్ని ఆపుజేశాడు. చేతులుచాచి రణఛోడుణ్ణి ఆశీర్వదించాడు. కాళా పొలంవైపు చూచి "ఏమిటి ఈ గందరగోళమంతా రణఛోడ్!" అని అడిగాడు.

"గందర గోళమేమున్నది? కాళా తల్లి నాగలి దున్నుతుంటే రాజు కోదర్లిద్దరూ ఆమెవెంట జేరారు" అన్నాడు రణఛోడుడు.

"మామా! నీకిదంతా తెలియదా? నీ చెల్లెలు వియ్యపురాలు కాచ గట్టి మొక్కటొన్న పండిస్తున్నది. అల్లుడు నాగలి పుస్తుకుంటే ఎద్దులు చెదరి పోయి నట్లున్నవి. మా నాథా వెళ్లి సరిజేశాడు. లేకపోతే. ."

"అంతా భవాయీ నృత్యం" అన్నాడు నానా. అది మాలి అనే మాట.) రాజు మామ ఆ పిల్లల వైపూ-నాగలీ, ఎద్దుల వైపూ చూస్తున్నాడు. "కోదర్, యా! రాజా! ఇట్లా రండి" అని పెద్దగా కేకవేశాడు.

మామను చూడగానే పిల్లలిద్దరూ పరుగెత్తుకొంటూ వెళ్లారు. "మామ వచ్చాడు. . మామ వచ్చాడు. ." అంటున్నారు. రాజు "మామా! నన్ను గుర్రంమీద కూర్చొబెట్టావా?" అని అడుగుతున్నది.

కాని మామ చాలా కోపంగా వున్నాడు. ప్రేమగా మాట్లాడడం మాని వేసి- "ఏమిటి మీ చేష్టలు! ఊరుకోండి" అని గద్దించాడు.

తరువాత రాజును వొళ్లోకి తీసుకున్నాడు-"ఇంకొకసారి ఇట్లా వచ్చా వంటేనా? జాగ్రత్త. నా సంగతి తెలుసుగా?" అన్నాడు. "కోదర్! పోయి మంచినీళ్లు తాగిరా" అన్నాడు.

కోదర్ ఏడుపు ముఖం పెట్టి "నీళ్లన్నీ రాజు కాళాకే పోసింది" అన్నాడు.

మామకు వొళ్ళు భగ్గున మడింది. "రాజు నీళ్లు పోసిందా? పిల్ల దుర దృష్ట వంతురాలు. హీనకర్మ చేసి పుట్టింది. బుద్ధి గూడా అందుకు తగి నట్లుగానే వున్నద"ని మనస్సులో అనుకొన్నాడు. భోజుణ్ణి వదలి గంగ నూనె వాడి యింటికి చేరిందట. పోయి రణఛోడుని బిందెలోవుంటే నీళ్ళు తాగిరా" అన్నాడు మామ.

"పో. పో. ఆ బిందెలో నీళ్ళున్నవి తాగిరా" అన్నాడు రణఛోడుడు. "కాకి ముక్కుకు దొండపండు అంటే ఇదే. ఆ కాళాను చూడు. నా రాజును చూడు" అనుకొన్నాడు మామ. "వియ్యానికైనా కయ్యానికైనా సమానమైన ఉట్టిలుండాలి" అన్నాడు.

రణఛోడుణ్ణి చూచి "ఈ సంబంధం కుదిరిన తరువాత నేను రూపా యింటికి పోవడం ఎన్నడైనా చూచావా?" అని గుర్రం కళ్లెం పట్టు కొన్నాడు.

"మనోరజీ! రండి" అని కాళా తల్లి మామను గౌరవంగా ఆహ్వా

నించింది. "బాగానే చేస్తున్నావు మర్యాద? నాగలిదున్ని సాటి వారిలో పరువు తీసివేశావు" అన్నాడు.

రూపా విని వూరుకొన్నది.

రూపామీది కోపాన్ని రాజుమీద చూపిస్తూ "కబడ్దార్! ఈసారి ఈ విధంగా పొలానికి వచ్చేవంటేనా? జాగ్రత్త. ఇంట్లోనే ఆడుకో. పొలంలో నిన్ను చూస్తే గుర్రంమీద కూర్చోబెట్టుకోను" అన్నాడు.

అతడు ఏమేమో అంటున్నాడు. కొన్ని వినబడుతున్నవి. కొన్ని వినబడడంలేదు.

# 10

# మండు వేసంగిలో వసంత ఋతువు

కాళా అదృష్టవంతుడని గ్రామస్థులు అంటూంటారు. అది మంచిదే. తల్లీ కుమారులు కలిసి చేసిన కఠిన పరిశ్రమ ఫలితంగా ఈ సంవత్సరం కాళా భూములు బాగా పండాయి.

అప్పులన్నీ తీరినట్లు దాని కర్థం గాదు. తిండికి యిబ్బంది లేకుండా పోయిందని మాత్రం చెప్పవచ్చును. రాగి సంకటి తినేవాళ్ళు మొక్క జొన్నలు తినే స్థితికి వచ్చారు.

రెండు సంవత్సరాలలో అప్పులకయిన వడ్డీ కాకపోయినా ఆ వడ్డీకి వడ్డీని తప్పక తీర్చ గలిగిన స్థితి ఏర్పడిందని గట్టిగా చెప్పవచ్చును. కాని కాళా అత్తగారి తరఫునుంచి వారికి కొంత యిబ్బంది కలిగింది. కాళా అత్తగారు తమ పిల్లకు పల్లని బంగారు గాజులూ, మెడలోని కంటె మార్చి మందమైనవి చేయించమని పట్టుబట్టారు.

కాళా తల్లి వియ్యపురాలిని బ్రతిమిలాడింది. పాపం వియ్యపురాలు మాత్రం ఏం చేస్తుంది? అంతా పిల్ల మేనమామ చేతిలో వున్నవాయె. ఆయన సొమ్ములు చేయించవలసిందేనని స్పష్టంగా చెప్పేశాడు. మా గౌరవానికి అనుగుణ్యంగా వస్తువులుండాలి అని ఆయన వాదన. నీ వల్ల అవుతుందా కాదా చెప్పమని కాళా తల్లిని నిష్ఠూర్షగా అడిగాడు. తమ విషయంలో పిల్ల మేనమామకు సదభిప్రాయంలేదని కాళా తల్లికి తెలుసును. ఏదో వంక బెట్టి సంబంధం తప్పించి వేసే ప్రయత్నం అతడు చేస్తున్నాడని గూడా ఆమెకర్థమయింది. అందువలన కోపగించే బ్రతిమలాడడం మంచిదని నిశ్చయించుకొన్నది. పైపంటలో అప్పులన్నీ తప్పక తీరుస్తామనీ — కాళా సంపాదన పరుడనీ నచ్చజెప్పింది. ఆ తరువాత మూడో సంవత్సరంలో వివాహం జరపవలెనని నిర్ణయమయింది.

రాజు మేనమామ ఏదో సాకుతో సంబంధం తెగగొట్టవలెనని ప్రయత్నం చేశాడు. కాని రాజు తల్లి మాత్రం అందుకు అంగీకరించలేదు. రాజు తండ్రి స్వయంగా తన చేతులతో ఈ సంబంధం నిర్ణయించి వెళ్ళాడు గనుక నేను అందుకు నిరాకరించనని స్పష్టంగా ఆమె చెప్పి వేసింది.

"ఈ సంబంధాన్ని పూలీ అవ్వ కుదిరించింది. ఆమె భయంవల్ల బావ ఈ సంబంధానికి అంగీకరించాడు. ఇప్పుడు పూలీ అవ్వ లేదు. ఆమె స్వర్గం నుండి దిగివచ్చి నిన్ను తినివేయదు. నిజంగా ఇపుడు బావ బ్రతికివుంటే ఈ సంబంధాన్ని ఎన్నడో వదిలేవాడ" ని మనోర్ జీ చెల్లెలికి అనేక విధాల నచ్చజెప్పడానికి ప్రయత్నం చేశాడు.

అయినా రాజు తల్లి అంగీకరించలేదు. మనోర్ జీ గూడా తన పట్టు విడవలేదు. లగ్నపత్రిక వ్రాయించి పంపించే సమయంలో గూడా రత్నం వంటి పిల్లను బావిలో పడవేయవద్దనీ, ఆ పిల్ల రాగి సంకటి తిని బాధపడ లేదనీ మళ్ళీ చెప్పాడు.

"ఆ పని నా వల్లగాదు. ఆ పాపం నా నెత్తిన పెట్టుకోలేను. నీవు చేస్తే చేయి" అని రాజు తల్లి చెప్పివేసింది.

"నాకేమి గరజు పట్టలేదు" అంటూ మనోర్ జీ ఇంటిలోపలినుండి బయటి వసారాలోకి వచ్చాడు. బయట గ్రామస్థులకు మధ్యగా కూర్చొని వున్న పురోహితుణ్ణి చూచి "వ్రాయవయ్యా లగ్నపత్రిక" అని, "నాకు పని వున్నది. ఇప్పుడే మా వూరు పోయి లగ్నపత్రిక వ్రాసి వరుని యింటికి పంపించేలోపల తిరిగి వస్తాన"ని బయలుదేరాడు.

శంకర్, కాసిమ్, ఘూంచీ మొదలైన వాళ్ళు గుర్రం మీద ఎక్కబోతున్న పిల్ల మేనమామను భోజనమైనా చేసి పొమ్మని బ్రతిమిలాడారు. అతని చెల్లెలు ఎందుకు మౌనంగా వున్నదో వాళ్ళకర్థంగాలేదు.

"తిన్నట్లేలే" అని అన్నాడు మనోర్ జీ. ఆయన మాటలు చాలా కోపంగా ఉన్నవి. ఆ విషయం అతని చెల్లెలికి తెలియకపోలేదు. కాని ఆమె ఏమి చేస్తుంది? అన్నను సంతృప్తిపరచవలెనంటే ఉన్నది ఒక్కటే ఉపాయం. వ్రాస్తున్న లగ్నపత్రికను ఆపించివేయాలి. అన్నకు ఇష్టమైన వాని పేర లగ్నపత్రిక వ్రాయించాలి. అది ఆమెకు ఇష్టంలేదు.

అన్న ఈ మాట చెప్పిన నాటినుండీ — మేల్కొన్నప్పుడు ఆలోచనల లోనూ, నిద్రబోతున్నప్పుడు స్వప్నంలోనూ, ఆమె భర్త గలా తన మాట నిలపమని ఆమెకు బోధిస్తున్నాడు. ధనధాన్యాలు ప్రధానంగావు. అవి నీడల వంటివి. కులం ప్రధానం. సాటివారిలో మాటకు విలువ వుండాలి. వరుడు మంచివాడు. అతని కుటుంబం మంచిది. చచ్చినా బ్రతికినా మాటకు విలువఉండాలి . . అని గలా ఆమెకు బోధిస్తున్నాడు.

అందువలన అన్న ఎంత గట్టి పట్టుపట్టినా ఆమె వినీవిననట్లు వూరు కొన్నది.

లగ్నపత్రిక వ్రాసే సమయంలో గ్రామంలోని స్త్రీ పురుషులంతా అక్కడికి వచ్చారు. పరమాపటేల్ ఇంట్లోనుండి ఒక్క రణఛోడుని భార్య మాత్రం వచ్చింది. ఆమె రావడం గూడా మాలికి ఇష్టంలేదు. వెళ్ళవద్దని కోడల్ని నిర్బంధించింది గూడా. పరమా పటేలు అంతకు రెండు రోజుల క్రితమే గుర్రమెక్కి ఏదో వూరు వెళ్ళాడు.

మాలి పెద్దకోడలు రాజు తల్లికి అనేకవిధాల చెప్పిచూచింది. అన్నకు ఇష్టంలేని పని చేయవద్దని, అన్నమాట వినమనీ బోధించింది.

రాజు తల్లి పట్టించుకోలేదు. మేనమామతో నేను మాట్లాడుతానని మాలి కోడలు బయటకి వచ్చింది. కాని అప్పటికే మనోర్‌జీ గుర్రమెక్కి వెళ్ళి పోయాడు.

మాలి కోడలు మనోర్‌ను వెనకకు రమ్మని కేకలుబెట్టింది. ఆమె కేకలు అతనికి వినపడనేలేదు. అప్పటికే ఆయన గుర్రం ఊరు దాటిపోయింది. అసలే మనోర్‌జీ గుర్రం చురుకైనది. రౌతు కోపంలో వున్నాడు. అందు వలన ఆ గుర్రం ఆఘాల మేఘాల మీద దౌడుతీసింది.

మనోర్‌జీని వెనుకకు పిలిపించడం మాలి కోడలువల్ల కాలేదు. అయినా ఆమె తన ప్రయత్నం మానలేదు. రాజు వివాహం కాళాతో జరగ గూడదనీ, అది జరిగితే రాజు దుఃఖ సముద్రంలో మునిగిపోతుందనీ, ఎట్లాగైనా ఆ సంబంధం తప్పించితీరవలెననీ మాలి కోడలు గూడా అభి ప్రాయపడింది.

వెంటనే తాను తన యింటికి వచ్చింది. అత్తకూ, తన భర్తకూ మనోర్‌జీని ఎలాగైనా పిలిపించడం అవసరమని చెప్పింది. కోడలి సలహా అత్తకు నచ్చింది. అందువలన తన యింట్లో గుర్రం లేదనే విషయాన్ని గూడా మరచిపోయి మాలి రణఛోడుణ్ణి మనోర్‌జీని వెంటనే వెనకకు తీసుకొని రమ్మన్నది.

తల్లి మాటలకు రణఛోడునికి కోపం వచ్చింది. "ముసలివాడు గుర్ర మెక్కి వెళ్ళాడు గదా! మన యింట్లో గుర్రమేది?" అన్నాడు.

చేతులు నలుపుకొంటూ మాలి ముసలి పరమాను మూడేసి మణుగుల బరువుగల మూడు తిట్లు తిట్టింది. ఆమెకు ఏమీ తోచడంలేదు. వాకిట్లోకి

వెళ్ళి బజారంతా కలయజూచింది. భగవంతుని దయవలన గుర్రం వస్తే బాగుండుననుకొన్నది.

శంకర్, కాసిమ్ లిద్దరూ ధర్మకార్యంలో వెనకంజ వేయగూడదని తమ ప్రయత్నంలో తామున్నారు. పురోహితుణ్ణి తొందరబెట్టి లగ్నపత్రిక వ్రాయించి రూపా యింటికి పంపించే ప్రయత్నం చేశారు.

మాలికి వొళ్లు మంటలెత్తి పోతున్నది. ఆమె గోధుమ వర్ణపు ముఖం మీద మసి పూసినట్లయింది.

అటు పురోహితుణ్ణి చూడగానే రూపా ముఖం ఆనందంతో నిండి పోయింది. పురోహితుణ్ణి ఆదరించి మంచంమీద కూర్చొనబెట్టింది. గ్రామంలో నలుగుర్నీ కేకవేయడానికి బయలుదేరింది.

పెళ్లిళ్ల సమయాలలో వధూవరులకంటే పెళ్లి ఆనందాన్ని అనుభవించేది ఆ గ్రామంలోని యువతీ యువకులే. వధూవరులు ఏడెనిమిదేళ్ల వాళ్లు. వాళ్లకు పెళ్లి అంటే ఒక బొమ్మలాట మాత్రమే. వాళ్ళకు ఏ చీకూ చింతా వుండదు.

క్షణకాలంలో కాళా యిల్లు నిండిపోయింది.

అది వేసవికాలం. పనిపాట్లున్న కాలంగాదు. పైన వివాహ ప్రసంగం. ఆడవాళ్ళు ఇంటిముందు నిండికూర్చున్నారు. యువకులు గూడా ఒక్కరొక్కరే నెమ్మదిగా అక్కడికి చేరుకొన్నారు. పాటలు ప్రారంభమైనవి.

వృద్ధులు మంచాలు వాల్చుకొన్నారు. ఇంటి మంగలి హుక్కాలు ఏర్పాటు చేశాడు.

సరిగ్గా అదే సమయంలో జమున మేనత్తమొగుడు గుర్రం దిగాడు. గుర్రాన్ని మాలిగారింట్లో కట్టివేసి తాను కాళా యింటికి చేరుకొన్నాడు.

అసలే మాలి మండిపోతున్నది. జమున మేనత్త మొగుడు చేసిన పనితో అగ్నిలో ఆజ్యం పోసినట్లయింది. ఇక ఆమె వాగుడుకు హద్దూ పద్దూ లేకుండా పోయింది.

అయితే ఆమె వాగుడు ఎవరు వింటారు? రెండు రెండు గ్రామాల పొలిమేర్లవరకూ వినిపించే ఆ పెళ్ళి పాటల రణగుణ ధ్వనిలో మాలి ఏడుపు—మాలి వాగుడు ఎవ్వరికీ వినిపించలేదు.

యువకులు పాటల నిషాలో వున్నారు. గడ్డితో కప్పబడిన ఆ చిన్న యిల్లూ, ఆ యింటి ముంగిలీ చిన్నవే అయినా అదేమీ పాటలు పాడేవారికి

పట్టినట్లు లేదు. చుర చుర నెత్తిమాడుస్తున్న ఎండను గూడా వాళ్ళు లెఖ్ఖ చేయడం లేదు. పాటల మీద పాటలు. ఒక్కటే పాటలు. తెగ పాడుతున్నారు. ఆ పాటలు కాల్పనిక జీవిత సౌందర్యాన్ని వ్యక్తం చేస్తున్నట్లున్నవి.

ఉగమణీ ధరతీ మాఁ కేసర్ ఉడే ఛే ఓ రేషమా!
ఉగమణీ ధరతీ మాఁ కేసర్ ఉడే ఛే రే లోల్!
మీఁ జాణయుం నణదీనో వీరో ఆవే ఛే ఓ రేషమా
మీఁ జాణయుం నణదీనో వీరో ఆవే ఛే రే లోల్.

తూర్పు దిశన భూమి మీదనుండి కేసరాలు ఎగురుతున్నవి. ఓ రేషమా! తూర్పు దిశన భూమిమీదనుండి కేసరాలు ఎగురుతున్నవి లోలా! నాకు తెలుసును. ఆడబిడ్డ వీరుడు (భర్త) వస్తున్నాడు ఓ రేషమా!

ఆ పాట వినగానే ప్రతి స్త్రీకి పరదేశం వెళ్ళిన తన భర్త కోసం తాను ఎదురు చూస్తున్నట్లనిపించింది. కుంకుమ వర్ణంతో అవతరించిన ప్రభాత కాలాన్ని చూడగానే వారి మనస్సుల్లో విశ్వాసం ఉదయించింది.

మీఁ జాణయుం బంగడీ ఓ జోడీ లావే ఛే ఓ రేషమా!
మీఁ జాణయుం బంగడీ ఓ జోడీ లావే ఛే రే లోల్.
నాకు తెలుసును. అతడు గాజుల జత తెస్తున్నాడు.

యువకులు తన కోసం తమ తమ భార్యలు ఎదురు చూస్తూ విరహ వేదన అనుభవిస్తున్నట్లు భావించుకొంటున్నారు. వారి ప్రియతములూ, ప్రియురాళ్ళూ ఊహాలోకానికి సంబంధించినవారో, లేక అక్కడ గుమిగూడిన వాళ్ళలో వున్నారో తెలియదు.

అథమణీ ధరతీ మాఁ ధూల్ ఉడే ఛే ఓ రేషమా!
అథమణీ ధరతీ మాఁ ధూల్ ఉడే ఛే రే లోల్
మీఁ జాణయుం నణదీనో వీరో ఆవే ఛే ఓ రేషమా!
మీఁ జాణయుం నణదీనో వీరో ఆవే ఛే రే లోల్.
పశ్చిమ దిశన భూమి మీదనుండి దుమ్ము లేస్తున్నది.
నాకు తెలుసును ఆడబిడ్డ భర్త వస్తున్నాడు.

ఆ గీతం ప్రభావమేమిటో, రెండు జాముల మండుటెండ గూడా ఎవరినీ బాధిస్తున్నట్లు లేదు. వృద్ధుల హృదయంలో మండు వేసంగిలో వసంత ఋతువు చిగురించినట్టున్నది.

ఆ వేడిని భరించలేక ఒక్క రణఛోడుడు తన యింట్లో నుంచి బయటికి

వచ్చాడు. ఇంటిముందు కట్టివున్న గుర్రంమీద కెక్కాడు. గుర్రాన్ని అదలించాడు. మనోర్‌జీ ఇంటికి అతని ప్రయాణం.

పాటలు మాత్రం అతణ్ణి వెంటాడుతూనే వున్నవి. పొలంలోకి పరుగెత్తి చిన్న కొండ గుట్ట ఎక్కాడు. చల్లని రాత్రి వేళ వినిపించినట్లు పెళ్లి పాటలు అతని చెవులల్లో ప్రతిధ్వనిస్తున్నవి.

దఖణాతా వావలియా వావా మాండ్యా ఛే ఓ రేషమా!
దఖణాతా వావలియా వావా మాండ్యా ఛే రే లోల్.
మీం జాణయుం నణదీనో వీరో ఆవే ఛే ఓ రేషమా!
మీం జాణయుం కమ్ఖానాం కామణ్ లావే ఛే రే లోల్!

దక్షిణ దిక్కునుండి చల్లటి గాలి వీస్తున్నది.
నాకు తెలుసును. ఆడబిడ్డ వీరుడు వస్తున్నాడు.
నాకు అందమైన రవిక గుడ్డ తెస్తున్నాడు.

రణఛోడుడు గుట్టదిగాడు. అతని హృదయంలో శాంతిలేదు. అతని బాధ ఏమిటో భగవంతునికే తెలియాలి.

మీం జాణయుం కాళజడే కామణ్ లావే ఛే ఓ రేషమా!
నాకు తెలుసును. సుందరమైన హృదయంతో వస్తున్నాడు.

ఓతరాతీ ధరతీమాం బాదల్ ఉతేఛే ఓ రేషమా!
ఓతరాతీ ధరతీమాం బాదల్ ఉతేఛే ఓ లోల్
ఉత్తర దిశన భూమిమీద మేఘాలు ఎగురుతున్నవి.

మీం జాణయుం మనడాం నో మోర్ లావే ఛే ఓ రేషమా!
మీం జాణయుం దలడాం నోచోర్ ఆవే ఛే రేలోల్
నాకు తెలుసును మనస్సనే నెమలిని తెస్తున్నాడు.
నాకు తెలుసును హృదయ చోరుణ్ణి తెస్తున్నాడు.

పాట పూర్తికాగానే ఐదారు నిమిషాలు వాతావరణమంతా శాంతంగా వుండిపోయింది. ఆ పాటలు పాడేవాళ్ళూ వినేవాళ్ళూ మహదానందంలో-మరో లోకంలో ఉన్నట్లున్నారు.

## 11

## వంశనాశకుడు

రణఛోడుడు మనోర్‌జీ యింటిముందు గుఱ్ఱాన్ని కట్టి వేసేటప్పటికి సూర్యుడు పశ్చిమ దిశలో అడుగు బెట్టబోతున్నాడు. దానికర్థం ఎండ తీవ్రత తక్కువయిందనికాదు. విపరీతంగా వడకొడుతున్నది. ఆ వడ ప్రాణి జగత్తు రక్తమాంసాలను పీల్చివేస్తున్నది. ఆకాశంలో ఎక్కడా పక్షి అనే మాట కన్పించడం లేదు. కుక్కలు పొద్దున్నే యిళ్లముందు పడి వున్న స్నానాలరాళ్ళకు పక్కగా చేసిన గోతుల్లో పడివున్నవి. జనం ఇళ్ళల్లో లోపలి గదులలోనో, లేక పశువులశాలల్లోనో మంచాలు వాల్చు కొని పడుకొని వున్నారు.

మనోర్‌జీ యింటిముందున్న పెద్ద ఖాళీ స్థలాన్నీ, ఆ యింటి స్థంభాల మీద చెక్కబడివున్న నగీషీనీ, తాపడం చేయబడిన ఇత్తడిరేకుల్నీ, తలుపుల కున్న ఇత్తడి రింగుల్నీ చూస్తే - అది సంపన్న గృహంగా కనిపిస్తున్నది.

ఆ యింటి ముందుభాగానికి ఉత్తరదిశగా పడిపోతున్నట్లుగా వున్న గదిలో పనికిమాలిన వస్తువులు నిండివున్నవి. దాని చుట్టుపట్ల పడివున్న బూడిదను చూస్తే ఆ గది బూడిద నిలవ జేయడానికి ఉపయోగింప బడినట్లు కనబడుతున్నది. అంతేగాక విరిగిపోయిన నాగళ్ళూ, బండి చక్రాలూ, మంచాలూ, పనికిరాని వస్తువులూ అన్నీ ఆ సంగ్రహాలయంలో ఉన్నవి. అది కుక్కల అఖాడాగా వున్నది. ఆ విరిగిన వస్తువుల మీద అడ్డదిడ్డంగా పడవేయబడిన రోజూ ఉపయోగించుకొనే కొన్ని మంచాలున్నవి. రెండు మంచాలు పట్టేటంత చోటు పేడతో అలకబడి వున్నది. దాని మధ్య నుండి వెనక గదిలోకి ద్వారమున్నది.

ఆ యింటి దక్షిణ భాగం స్థితి గూడా అట్లాగే వున్నది. నీళ్ళు కిందికి దిగే గొట్టానికి దగ్గరగా కిందగా నీళ్ళ మోరీ వున్నది. గోడ పక్కగా నాగళ్ళు పడివున్నవి. ఆ నాగళ్ళకు పట్టెళ్ళూ, ఎద్దుల మూతులకు తగి లించే చిక్కాలూ వేలాడుతున్నవి. రెండు మేకులు పాతి వాటికి మధ్యగా బండి నిలబెట్టబడి వున్నది. వేసవికాలం గనుక వాటికేమీ ఉపయోగంలేదు.

రణఛోడుడు వసారాలోకి ప్రవేశించి ఇంటి లోపలికి చూచాడు. "ఎవరు

లోపల ?" అని పిలిచాడు. ఇంటిలోపలినుండీ వస్తున్న వెలుతురుకు అతని కళ్ళు మిరుమిట్లు గొనడం వలన లోపల ఏమున్నదో అతనికి కనబడడం లేదు.

వాకిలి ముందు పెద్ద అరుగున్నది. తలుపులు తెరవబడి వున్నవి. ఆ అరుగుకు పక్కగా మోకాలంత ఎత్తున ఒక అడ్డ గోడలాంటిది వున్నది. ఆ యింటికి రెండో వైపున వంటయిల్లు వేరుగా వున్నది. ఇంటి మధ్యగా తిరగలి భూమిలో బిగించబడి వున్నది. దానికి పక్కగా ఒక రోలున్నది.

రణఛోడుడు లోపలికి ప్రవేశించేటప్పటికి ఆ రోట్లో ధాన్యం పోయబడి వున్నది. దానికి పక్కగా అరమణుగు బరువుగల రోకలి పడివున్నది. అక్కడికి కొంచెం పక్కగా మనోర్ కోడలు నేలమీద పడుకొని గుర్రు బెడుతున్నది. పక్కనున్న ఉయ్యాలలో పిల్లవాడు నిద్దరబోతున్నాడు.

రణఛోడుడు ఎంత పిలిచినా ఆ యువతికి నిద్ర మెళుకువ రాలేదు. కాని గదివైపు మంచం మీద పడుకొనివున్న మనోర్‌జీ భార్యకు నిద్ర మెళుకువ వచ్చింది. మంచం మీద నుండి వెంటనే కిందికి దిగింది, "ఓహోహో! రా రా. రణఛోడుడా! ఇంత ఎండలో వచ్చావు. ముసలాయన ఇప్పుడే హుక్కా తాగి పడుకొన్నా"డన్నది.

గది కుడి భాగంలో గోడకు తగిలించి నిలబెట్టబడిన అందమైన హుక్కాలో అగ్నిదేవత వొంటికన్నుతో చిరునవ్వు నవ్వుతున్నది. మనోర్‌జీ గూడా మేల్కొన్నాడు. దూదితో నిండిన మెత్తని పరుపుమీద కూర్చొని "ఎక్కడినుండి రాక ?" అని అడిగాడు.

ఇంటినుండి వస్తున్నానని రణఛోడుడు జవాబు చెప్పాడు.

అత్త కోడల్ని నిద్ర లేపింది. "మోంఘీ! నిద్ర లే. లే. ఇంట్లోకి ఎవరొస్తున్నారో ఎవరు పోతున్నారో జాగ్రత్తగా చూడవద్దా ?" అన్నది.

"ఏ పెళ్ళివాళ్ళు వచ్చారు ?" అన్నది లేచి కూర్చుని కన్నులు నలుపుకొంటూ మోంఘీ.

"ఎవరో కాదు. నీ మామ కొడుకు రణఛోడుడు వచ్చాడు. ఆ గదిలోకి పోయి చూడు" అన్నది.

(మోంఘీ కాళా మేనత్త జమున కూతురు.) మోంఘీ లేవవలసిన అవసరం కలగనేలేదు. కంఠ ధ్వనినిబట్టి నిజంగానే రణఛోడుడు వచ్చినట్లు ఆమె గుర్తించింది. ఆమె ముఖంమీద ఎందువల్లనో సంతోషం కనబడలేదు

మర్యాద చేయడానికి ఆమె లేవను గూడా లేవలేదు. ఆమె ముఖంమీద విషాదం గూడా కనిపించసాగింది. రణఛోడుడు అత్తవారింటికి వచ్చాడు. దానిలో ఆశ్చర్యమేమున్నది? అనుకొంటూ లేచి మంచినీళ్ళు తాగి రోకలి చేతులోకి తీసుకున్నది.

రణఛోడుడు రావడం వలన మనోర్‌కు నిజంగానే ఆశ్చర్యం కలిగింది. "నేను వచ్చి ఒక్క ఘడియగూడా కాలేదు. ఇంత ఎండలో నీవెందుకు వచ్చినట్లు?" అని ప్రశ్న వేశాడు

రణఛోడుడు ఉత్తరీయంతో ముఖం మీది చెమట తుడుచుకొని మంచం పట్టెమీద కూర్చున్నాడు. "నీతో ముఖ్యమైన పనివుండి వచ్చాను" అన్నాడు.

క్షణకాలంలో మనోర్ మనస్సులో రకరకాల ఆలోచనలు బయలు దేరాయి. కోపంలో వచ్చిన నన్ను తిరిగి పిలిపించడానికే చెల్లెలు అతన్ని పంపి వుంటుందనుకొన్నాడు. "లగ్నపత్రిక వ్రాయించడం ఆపించి ఇంకొక వరుణ్ణి వెదకే భారం నామీద వెయడానికి నిశ్చయించివుంటుంది. లేకపోతే ఇంత ఎండలో రణఛోడుడు ఎందుకు వస్తాడు?" అనుకొన్నాడు.

"ఎందుకు వచ్చావు? ఏమిటిపని?" అని ప్రశ్నించాడు.

"నీవు ఏ పని తలపెట్టావో నా పని గూడా అదే" నన్నాడు రణఛోడుడు.

మనోర్ ఆలోచనలో పడ్డాడు.

"నేనేమీ పని బెట్టుకొని తిరిగిరాలేదు." ఏమిటి ఇతడనేది? మనోర్‌కేమీ అర్థం గాలేదు.

నిజానికి రణఛోడుడు అంత పెద్ద తెలివిగలవాడు కాడు. ఆ సంగతి మనోర్‌కు తెలుసును. అదిగాక ఇటువంటి విషయాలలో అనుభవమున్నవాడు గూడా కాడు. ఎవరితో ఏ విధంగా మాట్లాడాలో, ఎవరికేవిధంగా నచ్చజెప్పాలో గూడా అతడికి తెలియదు. మంచి చెడ్డల విచక్షణ అతనికి తెలుసుననే విషయంలో గూడా మనోర్‌కు సందేహమే.

"నీవు కోపంగా తిరిగి వచ్చావు" అన్నాడు రణఛోడుడు. మనోర్‌కు కొంచెం విసుగుపుట్టింది "లగ్నపత్రిక వ్రాయించడం మా చెల్లెలు ఆపించిందా? ఏమి జరిగింది? తొందరగా చెప్పు" అన్నాడు.

"లగ్నపత్రిక వ్రాయడమూ జరిగింది, కాళా యింటికి పంపడంగూడా జరిగింది" అన్నాడు రణఛోడుడు.

మనోరుడు ఏమీ మాట్లాడలేదు.

"లగ్నపత్రిక చూచి కాళా తల్లి చాలా సంతోషించింది" అన్నాడు రణఛోడుడు. రణఛోడుడు ఎంత తొందరగా – పెద్దగా మాట్లాడుతున్నాడంటే – ధిబంగ్ ధిబంగ్ అని రోకలిపోట్లు వేస్తున్న మోంఘీ చెవులల్లో గూడా అతని మాటలు పడడం ఆరంభించాయి. మనోర్ భార్య గడప దగ్గరగా కూర్చొని వారిద్దరి మాటలు శ్రద్ధగా వింటున్నది.

"లగ్నపత్రిక అందగానే కాళా యింట్లో ఎన్ని పాటలు! ఎన్ని పాటలు!!"

"పాటలు పాడక ఏమి చేస్తారు? బాగానే వున్నది. రణఛోడ్! ఇవన్నీ అటుంచి నీవెందుకు వచ్చావో తొందరగా చెప్పు" అన్నాడు మనోరుడు.

"ఆ లగ్నపత్రిక పంపడం మాకు నచ్చలేదు. మా అమ్మకు చాలా కష్టంగా వున్నది. వాలాభాయి..."

"అది సరే, ఇప్పుడేదైనా యిబ్బంది ఏర్పడిందా?" అన్నాడు మనోరుడు. "మామా! నీవిటు వచ్చేశావు. పూలీ అవ్వ కొడుకు శంకర్ మీసాలు మెలిపెట్టి మనోరుణ్ణి రెండు జాములప్పుడు నెత్తిమీద గుడ్డవేసి పంపించామని వదిరాడు."

"అట్లాగా?" మనోర్ ముఖం నల్లబారింది. మోంఘీ అత్త పక్కగా వెనకవైపు దాగి మాటలు శ్రద్ధగా వినడం ఆరంభించింది.

"మా అమ్మ శంకర్‌ను చివాట్లు పెట్టింది. నిన్ను సమర్థించింది. నీ కూతురు నీవు రావడంతోనే ఏడవడ మారంభించింది" అన్నాడు రణఛోడుడు.

"ఎందుకు ఏడవడం?"

"ఎందుకంటే మీ మేనగోడల్ని మీరంతా కలిసి అగ్నిలోకి తోసి వేస్తున్నారు. ఆ పిల్ల జీవితమేమయిపోతుందో మీరెవ్వరూ ఆలోచించడం లేదు గదా! అందువలన ఏడవక ఏమి చేస్తుంది?" అన్నాడు రణఛోడుడు. అతని నాలుకమీద ఆ క్షణం సరస్వతి నాట్యం చేసింది.

"అల్లుడూ! అదంతా నాకు తెలుసు. కాని ఏమి చేయను? నెమలి గుడ్డ

మీద ఎవ్వడూ చిత్రాలు గీయడు'' అన్నాడు. ''అయినా యిప్పుడు నేను మాత్రం ఏమి చేయగలను? లగ్న పత్రిక పంపించడం గూడా జరిగిందని అన్నావు'' అన్నాడు మనోరుడు.

''లగ్నపత్రిక పంపించడమే గాదు. ఈ రోజే గణేశ పూజ గూడా'' అన్నాడు.

మనోరుడు వెలవెలపోయినట్లు నవ్వాడు. గోడకు తగిలించి ఆనించ బడిన హుక్కా చేతిలోకి తీసుకొన్నాడు. ''అంతా చెయ్యి దాటిపోయింది. ఇప్పుడేమి చెయ్యగలం?'' అన్నాడు మనోరుడు విచారంగా.

''ఏమి చేయలేక పోవడమేమిటి? ఈ స్థితిలో పెళ్ళి ఆపితేనే మగ తనం'' అన్నాడు రణఛోడుడు.

''ఏమిటి? పెళ్ళి ఆపివేయాలా?''

''అవును [1]పసుపు రాసిన పెళ్ళికొడుకు పసుపుతో పడివుండేటట్లు చేయడంలోనే మన గొప్పతనముంటుంది. కాళ్లా పెళ్ళి ఇప్పుడు ఆపడం లోనే మగతనముంటుంది'' అన్నాడు.

రణఛోడుని మాటలు చిన్నపిల్లల మాటలుగా కన్పించాయి మనోర్‌కు.

''మామా! నీవు వచ్చావా? అయ్యో, పెద్దవాడు వెళ్ళాడు అని అను కున్నవాళ్ళు కూడా లేరు అక్కడ. నీ మాటకు విలువ వుండాలా, అక్క ర్లేదా?'' అని అడిగాడు రణఛోడుడు.

పక్కనుండి ఈ మాటలన్నీ వింటూన్న మనోర్‌జీ భార్య మాట్లాడ కుండా ఉండలేకపోయింది. ''పసుపురాసిన తరువాత పెళ్ళికొడుకు పెళ్ళి గాకుండా వుండిపోవడం లోకంలో జరిగే పనేనా? తోటివాళ్ళు, కులం వాళ్ళు చూచి హర్షిస్తారా?'' అన్నది.

అత్త మాటలకు మోంఘీ సంతోషించింది.

''మన జాతిలో అటువంటివి జరగలేదంటావా?'' అన్నాడు రణఛోడుడు.

''మనజాతిలో.....''

''జాతీలేదు గీతీలేదు. అవన్నీ నేను సర్దుకొంటాను. మామకు అవమానం కలిగింది గనుక మనం మన మాటను అమలుచేసి చూపించాలి'' అన్నాడు రణఛోడుడు.

మనోర్‌కు రణఛోడుని మాటల్లో ఏమీ పస వున్నట్లు కనబడలేదు.

---

[1] పెళ్ళికి ముందు పెళ్ళి కొడుకుకు పసుపు పూస్తారు.

హుకొ్క పిలుస్తూ "అల్లుడూ! పంపించిన లగ్నపత్రికను రద్దు చేస్తే– మనల్ని నిందించేవాళ్లు వెయ్యిమంది బయలుదేరుతారు" అన్నాడు.

"బెల్లం గడ్డతో వాళ్ల నోళ్ళు కట్టివేస్తే సరి, సరిపోతుంది" అంటూ రణఛోడుడు తన జేబులో వున్న రూపాయల సంచి మీద చెయ్యి వేశాడు. "రూపాయిలు ఘల్లున మోగితే అందరి నోళ్లు మూత బడతవి" అన్నాడు రణఛోడుడు.

మనోరుడు రణఛోడుని ముఖం వంకకు ఆశ్చర్యంగా చూచాడు. తెలివి తక్కువవాడు అనుకొన్న రణఛోడుడు చాలా తెలివిగా మాట్లాడుతున్నా డనుకొన్నాడు. మనోర్ ముఖం మీది రేఖల్లో ఆశ, సంతోషం రెండూ అస్పష్టంగా కనిపించడం ఆరంభించాయి.

ఆ మాటలు వింటున్న మోంఘీ ముఖంలో నెత్తురు చుక్క లేకుండా పోయింది. ఎర్ర గులాబీవంటి ఆమె ముఖం తెల్లబడి పోయింది. "ఎంత అన్యాయానికి పూనుకొంటున్నారు?" అనుకొన్నది.

"నీవు నీ తండ్రితో ఆలోచించావా?" అని అడిగాడు మనోర్‌జీ.

"ఆయన ఇంట్లోలేడు. అందువల్ల అడిగే అవకాశం కలగలేదు. అయినా నీకెందుకు? ఆ ముసలివాడు నోరెత్తడు, ఆ బాధ్యత నాది" అన్నాడు రణఛోడుడు.

"ఏమైనా నాకు ఇష్టంగా లేదు" అన్నాడు మనోరుడు.

"మా తండ్రి ఏమీ అనడు. అనడానికి వీలులేదు. ఇంట్లోవున్న మా అందరి అభిప్రాయానికీ ఆతడు వ్యతిరేకంగా నడిస్తే ఆయన మా యిల్లు వదలవలసి వస్తుంది" అన్నాడు రణఛోడుడు.

"అట్లాగా?"

"అంతే. నీవు వినలేదు. కాని నీవు గుర్రమెక్కి వచ్చిన తరువాత శంకర్ ఇంకా ఏమన్నాడో తెలుసా? ఈ ముసలివాడితో సంప్రతించి సంబంధం కుదిరించామా? ఇప్పుడీయన అలుగుతున్నాడు. ఈ వివాహం చేసి తీరుతాము. ముసలివాడు రాకపోతే ఏమీ ఆగదు" అన్నాడు.

"మా అమ్మ ఏమన్నదో తెలుసా? ఇంత పొగరుబోతుతనమా? పెద్దా చిన్నా లేకుండా మాట్లాడుతున్నారు. మా యిల్లు పూర్తిగా నాశనమై పోయినా సరే, కాళాగాడు పసుపుతోనే ఉంటాడు" అన్నాడు.)

"అవును. అంతపని జరగవలసిందే" అన్నాడు మనోరుడు ఉత్సా

హంగా. కాని కొద్ది నిమిషాలలోనే మళ్ళీ తన అభిప్రాయం మార్చు కొన్నాడు. "పోనీ, మన కెందుకు? ఎట్లాగైనా చావనీ" అన్నాడు.

వొడ్డుకు చేరబోతున్న నావ నీళ్ళల్లో మునిగిపోయినట్లనిపించింది రణఛోడుడికి.

"ఏమిటి? ఏమిటి? మనకెందుకంటున్నావా? అంటే నా మాట మీద నీకు విశ్వాసం కలగలేదన్నమాట" అన్నాడు రణఛోడుడు. "విశ్వాసాని కేమున్నది?" అంటూనే మనోరుడు ఇది డబ్బుతో సంబంధించిన పని పంచాయితీవార్లకు బోలెడంత డబ్బు యివ్వాలి అన్నాడు.

"డబ్బుకు వెనకాడుతున్నావా? ఇదిగో రూపాయలు. ఇవి వంద రూపాయలు. నీ దగ్గర పెట్టుకో. ఇదిగో ఇది నా మోచేతి కంకణం. ఇది గూడా నీ కిస్తున్నాను. ఇకముందు పని చూడు" అన్నాడు.

మనోరుడు ఉత్సాహపడ్డాడు. "డబ్బు పెడితే తప్పకుండా పని అవు తుంది. ప్రయత్నం చేద్దాము" అన్నాడు మనోరుడు.

రణఛోడుడు లేవబోయాడు.

"ఎక్కడికి బయలుదేరుతున్నావు? ఆగు. కొంచెంసేపు కూర్చో" అని రణఛోడుణ్ణి మనోర్‌జీ కూర్చోబెట్టాడు.

మనోర్‌జీ కొంచెంసేపు ఆలోచించి "పని అంతా నిర్విఘ్నంగా జరిగిన తరువాత ఇంకొక వరుడు కావాలి గదా? చూచావా?" అని అడిగాడు.

"చూచాను, ఆ విషయం మా అమ్మతో గూడా ఆలోచించి వుంచాను"

"కాళా కంటే పదిరెట్లు మంచివాడు కావాలి వరుడు" అన్నాడు మనోర్‌జీ.

"పదిరెట్లేమిటి? పదిహేను రెట్లు మంచివాడు వరుడు" అని రణ ఛోడుడు నవ్వాడు.

"ఇల్లు మంచిదేనా?"

"నా తమ్ముడు నానా వరుడు"

"మీ తమ్ముడికి మళ్ళీ పెళ్ళి చేస్తారా?"

రణఛోడుడు నవ్వుతూ అవునని తల వూపాడు.

"నీ కేమన్నా పిచ్చి ఎక్కిందా? పిల్ల మీద పిల్లను చేస్తానంటా వేమిటి? నానాకు ఇదివరలో పెళ్ళి అయి వున్నది. అది లాభం లేదు.

ఇంకొక సంబంధం చూడడం మంచిది'' అంటూ మనోర్‌జీ హుక్కా తాగడం ఆరంభించాడు.

''మనోర్‌జీ! పిల్లమీద పిల్ల అంటున్నావేమిటి? నీకు తెలియదా? ఆ పిల్ల కాపరానికి వచ్చిన తరువాత మూడు సంవత్సరాలలో ఆ పిల్లను వొక్క రోజు అయినా మా యింట్లో చూచావా? చూచి వుండవు. ఆ పిల్ల కుంటిపిల్ల. అది గాక ఆ పిల్ల నోరు కూడా మంచిది గాదు'' అన్నాడు.

''ఒక రకంగా ఆ మాట గూడా నిజమే. పరమాం పటేలు యిల్లు, నానా వంటి అందగాడు వరుడు. పిల్ల సుఖపడుతుంది. కాని దీని పరిణామ మేమవుతుందా అని ఆలోచిస్తున్నా''నన్నాడు మనోర్‌జీ.

''పరిణామ మేమీ కాదు''

''అట్లా అనడానికి వీలులేదు. నలుగురూ మనల్ని నాలుగు మాట లంటారు. సొటికులం వాళ్ళు వదలరు.''

''కులంవాళ్ళు వదలరా? వదలక ఏమి చేస్తారు? మా అమ్మ ఏమ న్నదో తెలుసునా? మాకున్న భూమి యావత్తూ అమ్మవలసి వచ్చినా సరే, మేము సిద్ధమే. కాళాకు ఉద్దేశించిన పిల్ల పెళ్లి నానాతో జరిగి తీరాలి'' అన్నాడు రణఛోడుడు.

''ఈ పనికి చాలా డబ్బు ఖర్చవుతుంది. నాకు మాత్రం ఇదెందుకో సక్రమంగా జరుగుతుందని అనిపించడం లేదు. మనం దెబ్బ తింటాము'' అని సందేహం వెలిబుచ్చాడు మనోర్‌జీ.

''తింటే తింటాము. ఏమైనా సరే. ఈ పని జరిగితీరవలసిందే'' అంటూ రణఛోడుడు రెండు హుక్కా పీల్పులు పీల్చి - ''ఈ సాయంత్రం లోపల పని సక్రమంగా జరిగినట్లు నీకు కబురంపిస్తే సరి గదా?'' అన్నాడు.

''బాగా ఆలోచించుకో అల్లుడూ! కులం వాళ్ళు వదలరు. మా చెల్లెలికో నాకో జుల్మానా పడుతుంది. దానికి డబ్బు ఖర్చవుతుంది. ఆ డబ్బంతా నీవు భరించవలసి వుంటుంది. తరవాత చెప్పలేదని అనుకోగూడదు'' అన్నాడు మనోర్‌జీ.

''నేను చదువుకున్న వాణ్ణికాను. లేకపోతే నీకు కాగితం మీద వ్రాసి యిచ్చేవాణ్ణి. ఎంత డబ్బు ఖర్చయినా సరే ఇచ్చే బాధ్యత నాది. నీవు నా పన్నెండు తులాల బంగారపు గొలుసు మెడలో వేసుకొని పంచాయితీవార్ల ముందు కూర్చో'' అన్నాడు రణఛోడుడు.

మనోర్‌జీకి ఇంకా సందేహం తీరలేదు. హుక్కా రణఛోడుని చేతి కందిం చాడు. ఎవరెవరికి ఎంత యివ్వవలసి వస్తుందో ఈ విషయంలో, ఎవరెవ రికి ఏ విధంగా నచ్చజెప్పాలో అంతా వివరంగా రణఛోడుడికి చెప్పాడు.

"నేను వెళ్ళి వస్తా"నని రణఛోడుడు లేచాడు. హుక్కా గబ గబా నాలుగు పీల్పులు పీల్చాడు. "ఇక్కడనుండి పేఢాపటేలు దగ్గరకు పోతాను. నాలుగు గ్రామాలూ చిటిక వేసినంతసేపట్లో వెళ్ళి అందరినీ కలుసుకొని వస్తాను" అంటూ ఇంటి బయటికి వచ్చి గుర్రం ఎక్కాడు. మరు నిమిషంలో గుర్రం డెక్కల చప్పుడు. తర్బడ్..తర్బడ్..తడాఫ్..తడాఫ్..అని వినిపించింది.

రణఛోడుడు బయటికి వెళ్ళగానే మనోర్ భార్య తన భర్త దగ్గరకు వెళ్ళింది. మోంఘీకి ఏమీ తోచలేదు. కళ్ళవెంట బొట బొట నీళ్ళు కారడం ఆరంభించాయి. గోడలో లీనమైనట్లుగా కొంతసేపు అట్లాగే నిలబడి పోయింది. తరువాత ఏదో ఆలోచన కలిగినట్లున్నది. లేచి నీళ్ల కడవ నెత్తిన పెట్టుకొని ఊరి చివరి పేటిగట్టుకు చేరింది. కడవ బావి దగ్గర పెట్టి ఏరు దాటింది. ఒక్క ఘడియలో పుట్టింటికి చేరింది.

ఇంటి ముందు చూచింది. పరమా పటేలు గుర్రం అక్కడున్నది. రణ ఛోడుడు తిన్నగా అక్కడికి వెళ్లాడని అనుకొన్నది. నెమ్మది నెమ్మదిగా చప్పుడు లేకుండా అడుగులు వేస్తూ లోపలికి పోయి వసారాలోకి తొంగి చూచింది. వసారాలో పరమా పటేల్ కూర్చొని హుక్కా గుడ గుడ లాడిస్తున్నాడు. అదే సమయంలో మోంఘీ తల్లి నీళ్ళ బిందెతో వెనక వైపునుండి ఇంట్లోకి ప్రవేశించింది.

మోంఘీ – అక్కడ పరమా పటేల్ వుండడం వల్ల జరిగిన విషయ మంతా తల్లికి చెప్పడం మంచిది కాదేమో ననుకొన్నది.

"ఏ మమ్మాయీ! అల్లుడు లేకుండా ఒక్కతెవే వచ్చావు?" నీళ్ళ కడవ కింద బెడుతూ తల్లి అడిగింది.

జవాబు చెప్పడానికి బదులు మోంఘీ వెక్కి వెక్కి ఏడవడం మొదలు పెట్టింది. మోంఘీ కాళాకు జరుగుతున్న అన్యాయాన్ని సహించలేకుండా వున్నది. వసారాలో పరమా పటేల్ వుండడం వలన తల్లికి ఏమి చెప్పాలో నిశ్చయించుకొన లేకుండా వున్నది.

పరమా పటేలుకు చెప్పడం వల్లనే కాళాకు మేలు కలుగుతుందని

ఆమెకేమి తెలుసు? పరమా పటేల్ స్థితి గూడా అంతంత మాత్రంగానే వున్నదని మోంఘీకి తెలియదు.

మోంఘీ ఏడుపు చూచి తల్లి భయపడింది.

"ఏమయింది అమ్మా! ఏమయింది?" అని అదుర్దాగా అడిగింది.

అత్తగారింట్లో ఏదో తగాదా జరిగి వుంటుందను కొన్నది తల్లి. చివరికి అన్ని విషయాలు తల్లికి మోంఘీ చెప్పివేసింది. పరమా పటేలుకు మోంఘీ వచ్చినట్లు మాటలవలన తెలిసి "ఎందుకమ్మా! ఏడుస్తున్నావు?" అని అడిగాడు.

"మామా! కాళాకు రాబోతున్న కష్టాలను తలుచుకొంటే ఏడుపు వస్తున్న" దని చెప్పింది.

"కాళాకు ఏమి కష్టాలు రాబోతున్నవి?" అతని హృదయానికి ఏదో దెబ్బ తగిలినట్లనిపించింది. "ఈరోజు వాళ్ళింట్లో గణేశపూజ గదా?" అన్నాడు.

ఒక్క నిమిషం ఆలోచించి మోంఘీ జరిగిన కథంతా చెప్పి వేసింది.

పరమా పటేలూ, మోంఘీ తల్లీ అది విని దుఃఖ సముద్రంలో మునిగి పోయారు. జమున దుఃఖానికి అంతేలేదు. కన్నీళ్ళు కారుస్తున్నది. పరమా పటేలుకు ఆ కన్నీళ్ళు గూడా లేవు. నేలమీద అతడు కుప్పగా కూలాడు. అతనికేమీ తోచలేదు. హఠాత్తుగా లేచి నిల్చొన్నాడు.

"మోంఘీ! నీవు తొందరగా మీ అత్త వారింటికి వెళ్ళిపో. లేకపోతే నిన్ను నీ అత్తమామలు బాధిస్తారు" అన్నది మోంఘీ తల్లి.

మోంఘీ వెళ్ళి పోయింది.

పరమాపటేలు గుర్రం ఎక్కబోతున్నాడు – అతణ్ణి జమున ఆపివేసింది.

"అన్నయ్యా! నీవు వెళ్ళి ఏమి చేయగలవు? అడకత్తెరలోని వక్కవు" అన్నది. పరమా పటేలుకు ఆ సంగతి తెలుసును. తాను కాళాను సమర్థిస్తే ఆ వయస్సులో తన యిల్లూ వాకిలీ వదలాలి. కాళాను సమర్థించకపోతే తరతరాల వంశగౌరవం మట్టిలో కలసిపోయేటట్లున్నది. తప్పదని గుర్రంమీద జీను వగైరాలు వేశాడు. హుక్కా చేతిలోకి తీసు కొన్నాడు.

రెండు గుక్కలైనా ఇంకా పీల్చలేదు. ఇంతలో రణఛోడుడు అక్కడికి చేరాడు. వాణ్ణి చూడగానే పరమా కళ్లు నిప్పులు గక్కాయి.

రణఛోడుడు గుర్రం దిగాడు. జమున లోపలికి వాణ్ణి ఆహ్వానించింది. పరమా పటేలు చేస్తున్న పని తప్పు అని కొడుకును మందలించాడు.

"నీ గౌరవం మా గౌరవం దక్క వలెనంటే నీవు ఇక్కడే రెండు రోజులు పడి వుండు. అది అమ్మ అభిప్రాయం" అన్నాడు రణఛోడుడు.

"నీ అమ్మ.." కోపంతో వణకి పోతున్నాడు పరమా పటేలు.

రణఛోడుడు అంబోతులాగా తండ్రిని ఎదుర్కొనడానికి సిద్ధ పడ్డాడు.

జమున కంతా అర్థమయింది. పరాయి గ్రామంలో "మా యింట్లో-తండ్రీ కొడుకులు పోట్లాడు కొనడం మంచిదిగా" దని అన్నకు అడ్డం వచ్చి నమస్కారం చేసింది. రణఛోడుణ్ణి ఉద్దేశించి- "నీవు తెలివిగల వాడవు. ఇక్కడ తగాదాలు పనికి రావు. మా గుర్రం తీసుకొని పో. మాకు అగౌరవం కలిగే పని చెయ్యకు" అన్నది.

అప్పటికే ఆలస్యం కావడం వల్లనో, పరమా పటేలు కోపం చూచో వచ్చినవాడు వచ్చినట్లు గుర్ర మెక్కాడు రణఛోడుడు. పోతూ పోతూ తండ్రిని తమ వూరు రావద్దని చెప్పాడు. "నీవు మనవూరు వచ్చి లేని పోని గందరగోళం లేవదీశావంటే మర్యాద దక్కదు. జాగ్రత్త" అని తండ్రిని గట్టిగా హెచ్చరించాడు.

"నీవూ, నీ యిల్లూ తగలబడ బోతున్నవి" అన్నాడు పరమా పటేలు. జమున అన్నకు అడ్డం వచ్చి-"కాళా అదృష్టంలో ఏది వ్రాసివుంటే అది జరుగుతుంద" న్నది.

పరమా పటేలు పిచ్చివాడిలాగా మంచంమీద పడి పెద్ద పెద్దగా ఏడవడం ఆరంభించాడు. "నా కడుపున వెధవలు పుట్టారు, నా యిల్లు నరకమై పోయిం" దని భోరు భోరున ఏడ్చాడు.

జమున అన్న నోటికి చెయ్యి అడ్డం పెట్టింది. "ఏమిటి ఆ మాటలు? ఎవరి విధికి ఎవరు కర్తలు! ఈ వయస్సులో నీకీ దుఃఖం" అని కన్నీరు కార్చింది.

# 12

# చెడ్డవాడు చెడ్డపని చేయనే చేశాడు

సూర్యుడు మండుతున్న కట్టెపుల్ల చేతిలో పట్టుకొని ఉదయించాడు. ఇళ్ల ముందు ఎద్దులు మేత మేస్తున్నవి. ఆవులూ, గేదెలూ పశువుల శాలల్లో వున్నవి. ఆడవాళ్లు ఇళ్ళు వూడ్చి నీళ్ళు తెచ్చి, పప్పు బియ్యం బాగు చేసుకొంటున్నారు. మగవాళ్లు తీరికగా కూర్చొని-ఏడెనిమిది నెలలుగా చేసిన చాకిరీ వలన అలసిపోయి-అలసట తీర్చుకొంటున్నట్లుగా హుక్కాలు గుడ గుడలాడిస్తున్నారు.

పశువులు పొలాలకు పోతున్నవి.

రెండోవైపు నుంచీ అయిదారు గ్రామాలనుండి పంచాయతీవారులు రావడం ఆరంభించారు. ఒకడు గుర్రమెక్కి వస్తే అయిదారుగురు ఒక్కొక్క గుంపుగా హుక్కా పీలుస్తూ వస్తున్నారు.

గ్రామం గ్రామమంతా విచార సముద్రంలో మునిగి వున్నది. వివాహ మండపంలో పంచాయతీదార్లెందుకు? శంకర్‌కూ, ఫూల్‌జీ తాతకూ విషయమంతా తెలిసిపోయింది. కాళా తల్లికి పిచ్చెత్తినట్లయింది. ఆమె మనుష్య ప్రపంచంలో లేనేలేదు.

ఘడియ రెండు ఘడియల్లో కోదర్ యింట్లో పంచాయితీదార్లు సమావేశమైనారు. రణఛోడుడు ఆహ్వానించగా వచ్చిన పంచాయతీదార్లు తమతో పాటు ఒక్కొక్కరు ఐదైదుగురు హంగుదార్లను పిలుచుకొని వచ్చారు. హంగుదార్లు లేకపోతే రక్తి ఎక్కడిది?

రెండు పక్షాలు స్పష్టంగా కన్పిస్తున్నవి. రణఛోడ్, మనోర్జీలు ఒక పక్షంలో వున్నారు. కొంతమందికి ఏ పక్షమూ లేదు. వాళ్లు ఎంత మురికిగా వున్నారో, అంత పిచ్చివాళ్ళుగా కనబడుతున్నారు. అసలు వాళ్ళు ఎందుకు పిలిపించబడ్డారో వాళ్ళకే తెలియదు. పేథా పటేలువంటి అన్ని విషయాలూ తెలిసిన వాళ్ళు బయట ఒక మాటా లోపల ఇంకొక మాటా చెపుతూ కొంగ భక్తుల్లా కూర్చొని వున్నారు. గ్రామ మంగళ్ళు హుక్కాలు అందిస్తున్నారు. పంచాయితీదార్లు సంభాషణ ప్రారంభించారు.

రణఛోడుడిచ్చిన రూపాయలతో జేబులు నిండిన ఐదారుగురు పెద్దల్లో ఒకడైన పేథా పటేలు ఫిర్యాదు ఏమిటో వివరించడం ఆరంభించాడు.

"వినండి, పిల్ల పక్షంవాళ్లు చెప్పేదేమిటంటే-ఆరేడు సంవత్సరాల క్రితం ఈ సంబంధం నిశ్చయించబడింది. పిల్ల తరఫు కొంతమంది బంధువులకు ఈ సంబంధం అప్పుడే యిష్టంలేదు. అయితే మొహమాటం వలన అప్పట్లో వాళ్ళేమీ వ్యతిరేకంగా మాట్లాడలేదు. అందువలన తాంబూలాలు పుచ్చుకోవడం జరిగింది."

శంకర్ పేథా పటేలు మాటలకు అడ్డు వచ్చాడు. బహిరంగంగా ఎదిరించాడు. "కొంతమంది అంటావేమిటి? ఈ విషయం మన గ్రామంలో వున్న మన కులం వారికందరికీ తెలుసు. గలాభాయికి ఈ సంబంధం ఇష్టం లేకపోతే వాలాభాయి యిల్లు ఎందుకు బాగుచేయించేవాడు? పొలం పనుల్లో ఎందుకు సహాయం చేసేవాడు? ఇష్టంలేని వాడెవడైనా అటువంటి పనులు చేస్తాడా? నిజమేమిటని ఆలోచిస్తే గలా ఆ పనులన్నీ తన కుమార్తె మేలునే దృష్టిలో పెట్టుకొని చేశాడు" అన్నాడు.

కూర్చున్న వాళ్ళల్లో చాలా మంది "నిజమేనని" తలలూపారు.

"ఆ గలా జీవించి వుంటే ఈ పంచాయితీకి అవసరముండేదే గాదు. గలా లేకపోవడం వల్లనే ఈ పంచాయితీ అవసరమయింది. తండ్రి చని పోయిన తరువాత ఆ పిల్ల మంచి చెడ్డలెవరు చూడాలి?" అని మనోర్‌జీ ప్రశ్నించాడు.

"ఆ విషయమే గదా, మనం ఇపుడు ఆలోచిస్తున్నది" అన్నారు కొందరు పెద్దలు.

"ఇష్టం లేనప్పుడు లగ్నపత్రిక ఎందుకు పంపించినట్లు? పసుపు వ్రాసిన పెళ్ళి కొడుకు పెళ్ళి కాకుండా పసుపుతో అట్లాగే వుండిపోవాలా?"

పూల్‌జీ మండిపడ్డాడు. లేచి నిల్చున్నాడు. అతనితో గూడా ఐదారుగురు లేచి నిలబడ్డారు.

"మీరంతా పెద్ద మనుష్యులా? బీదవాళ్ళకు గౌరవం, మర్యాదలు వుండవా? మీరంతా న్యాయం చెప్పడానికి వచ్చారా?" అన్నాడు పూల్‌జీ తాత.

రణఛోడుడు కూడా లేచి నిలబడ్డాడు. "అందుకని ఆ పిల్ల గొంతు కోయ మంటారా? బలవంతంగా పిల్లకు పెళ్ళి చేస్తారా?" అన్నాడు. రణ

ఛోడుడితో బాటు పది మంది లేచి నిలబడ్డారు. ఆ నిలబడిన వాళ్ళలో మనోర్‌జీ అతని తపెతర బంధువులు వున్నారు. మనోర్‌జీ కొడుకు గూడా అక్కడే వున్నాడు. అతడు తన తండ్రి మర్యాద తీసేశాడు. ''నా తండ్రికి బుద్ధి భ్రష్టమైనది. అరవైఏళ్ళ వయస్సు వస్తే మతి పోతుందని సామెత ఆలోచించండి'' అన్నాడు.

తన కొడుకు తన భార్య మాట వింటున్నాడని మనోర్‌జీ మొదటనే విని వున్నాడు. కాని ఇంతదాకా సాహసిస్తాడని అనుకోలేదు. అతడి కళ్ళు ఎర్రబడ్డవి. కొడుకు వైపు తిరిగి –''ఓహో! నీవు గూడా పంచాయితీకి వచ్చావా? తాగిన పాలు ఇంకా వంటనైనా బట్టలేదు.''

మనోర్‌జీ కొడుకు పక్షంలో పది మంది లేచి నిలబడ్డారు. ''తండ్రినని జబర్దస్తీ చేయబోతున్నావు. అతణ్ణి నీవేమైనా అన్నావంటే..''

''ధోవతి కట్టుకోడమైనా సరిగా తెలియదు. పంచాయితీ చెప్పడానికి వచ్చాడు'' అన్నారు కొందరు పెద్దలు-జేబులు నిండిన వారు.

దానితో వ్యవహారం ముదిరింది. శంకర్, రణఛోడు లిద్దరూ ఒకరి మీద కింకొరు తారసిల్లారు. ఇద్దరి చెయ్యి చెయ్యి కలిసింది. అంతా గందరగోళమయిపోయింది. చేతులు చేతులు కలవడమే గాక కాళ్లకు గూడా పని ఏర్పడింది.

ఆ యింటి బయట ఆడవాళ్లూ పిల్లలూ గుంపులు గుంపులుగా చేరారు. మగవాళ్ళు ఒకరొకరు తన్నుకుంటుంటే ఆడవాళ్లు దూర దూరంగా పోవడం ఆరంభించారు. పిల్లలు పెద్దగా ఏడవడం మొదలుపెట్టారు.

అంతవరకు మౌనంగా కూర్చున్న పేథా పటేల్ కల్పించుకొన్నాడు. తన పెద్ద శరీరం కదలిపోయేట్లుగా పెద్దగా అరిచాడు. ''అడవి మనుష్యుల్లాగా మీరు ప్రవర్తిస్తున్నారు. మిమ్మల్ని అందరినీ జాతిలోనుంచి వెలివేయిస్తాను. కాకి గోల చేస్తున్నారు. ఇక లేవండి. అందరం ఇంటికి పోదాం. ఇరు పక్షాలవాళ్లూ తమలో తామే న్యాయం తేల్చుకొంటారు'' అన్నాడు.

పేథా పటేలు తప్ప ముందున్న అయిదారుగురు పెద్దలు లేచి నిలబడ్డారు ''మీరు గూడా లేవండి. వాళ్లను తన్నుకొని చావనీయండి. పోదాం పదండి'' అన్నారు.

జనమంతా లేచి నిలబడ్డారు. కర్రలు కత్తులు చేతికి తీసుకొన్నారు. కొద్ది సేపు–ఉద్రేకం తగ్గింపాకా-ఎవరికి తోచిన పని వారు చేశారు.

చాలామంది జనం ఇంటి బయటకు పోయారు. తరువాత మళ్లీ రెండు పక్షాల వాళ్లూ శాంతించి నెమ్మదిగా ఆలోచనలో పడ్డారు. తగాదా ఏదో విధంగా పరిష్కారం కావాలి గదా!! తన్నులాటలతో గుద్దులాటలతో తగాదా పరిష్కారం కాదని నిర్ణయించుకొని – పంచాయితీ పెద్దలకు నమస్కారం చేశారు. కోపంతో ఆ విధంగా ప్రవర్తించినందుకు క్షమార్పణ చెప్పుకొన్నారు. ప్రాయశ్చిత్తం చేసుకొంటామన్నారు. ఇక మేము మాట్లాడితే బ్రహ్మహత్య చేసినంత పాపమన్నారు.

అందరూ శాంతించిన తరువాత పేథా పటేలు గొంతు పెద్దది చేశాడు. పక్కనున్న తలగుడ్డనూ కత్తినీ చేతిలోకి తీసుకొన్నాడు. "మేము చెప్పిన మాట వినకపోతే మేము న్యాయం ఏ విధంగా చెప్పగలం? ఇక ఈ పని మావల్ల కాదు" అన్నాడు.

పేథా పటేలును కూర్చో బెట్టేటప్పటికి ఇరు పక్షాలవారికీ చెమటలు పోశాయి. "పెద్దలు ఏది చెప్పితే అది శిరసావహిస్తాము. ఇరు పక్షాలవారం ఎదురు చెప్పము" అని ఇరు పక్షాలవారూ గట్టిగా చెప్పారు.

ఆ ప్రాంతంలో పేథా పటేలు పెద్ద రాజకీయవేత్త. అక్కడి జమీందార్లు గూడా అతని సలహా లేనిది ఒక్కడుగైనా వేయరు. వ్యాపారస్తులు అతని మాటను వేదవాక్యంగా భావిస్తారు. అతడి వయస్సు నలభైఐదు సంవత్సరాలయినా శరీరాన్నిబట్టి చూస్తే అరవై ఏళ్లవాడుగా కనబడు తుంటాడు. న్యాయం చెప్పడానికి కూర్చున్నప్పుడు డెబ్బయి ఏళ్ల వాడుగా కనబడుతాడు.

ఎదుటి పక్షాన్ని వోడించడంలో అతనికి ప్రత్యేకమైన నైపుణ్యం వున్నది. సామాన్యంగా చిన్న చిన్న తగాదాలు అతడు పట్టించుకోడు. పెద్ద వ్యవహారాలయితేనే పట్టించుకొంటాడు. పట్టించుకొన్న వ్యవహారాన్ని పెద్ద సమస్యగా మార్చివేస్తాడు. అనేక సమస్యలు సృష్టిస్తాడు. ఈ సమస్యల నన్నింటినీ పరిష్కరించమని ఎదుటి పక్షం వారిని కోరతాడు. ఎంతకూ తగాదాను తెగనివ్వడు. ఇరు పక్షాలవారూ విసిగిపోయిన తరువాత రెండు నిమిషాలలో తన అభిప్రాయం చెప్పి వొప్పిస్తాడు. అసలు నిజానికి ఈ పేథాపటేలే ఆ ప్రాంతంలో ఒక పెద్ద సమస్య. అతడు ఎవరికి మేలు చేస్తాడో, ఎవరికి కీడు చేస్తాడో చెప్పడం కష్టం. అందరి దగ్గరా బహిరంగంగానే డబ్బు తింటాడు. అయినప్పటికీ అతడు అన్యాయం

చేశాడని ఎవ్వరూ అనరు. అతడెవ్వరికీ మిత్రుడు కాడు. కాని అందరూ అతణ్ణి మిత్రుడుగానే భావిస్తారు. ఒక్క రాయితో రెండు పక్షుల్ని కొట్టడం అతనికి బాగా తెలుసు. (తగాదాలు తీర్చడంవలన లభించిన డబ్బుతో అతని నల్లమందు ఖర్చు, గుడ్డల ఖర్చు, సంవత్సరం పొడుగునా తిండి ఖర్చు, అన్నీ తీరుతుంటవి.)

(కొద్దిసేపైన తరువాత పేథా పటేల్ కాళా పక్షంలో ముఖ్యులైన శంకర్‌నూ, పూల్‌జీని పక్కకు పిలిచాడు. లక్ష మాటల విలువగల ఒక్క మాట చెప్పాడు.

"పిల్ల పక్షంవారి హాతం సంగతి మీకు తెలుసు. పిల్ల మేనమామకు ఈ వివాహం ఇష్టంలేదు. అతడు ఆ పిల్లను పెళ్లి పందిట్లోకి తీసుకొనిరాడు. మీరు ఆ పిల్లను ఎట్లా పెళ్లి చేసుకొంటారు? ఇంటి యజమాని బతికివుంటే అది వేరే విషయం. పిల్ల తల్లి భర్తలేని విధవరాలు. మీరే ఆలోచించండి. ఎవ్వరికీ యిష్టంలేని ఈ పెళ్లి మీరు ఎట్లా చేస్తారు?" అని అడిగాడు.)

"పై అధికారులకు ఫిర్యాదు చేస్తాము" అన్నాడు మావ్‌జీ. "అది మీ యిష్టం. మీరు పై అధికారుల దగ్గరికి పోతారు. మంచిదే. మరి కులం వాళ్ళంతా ఏమవుతారు? కులంవాళ్ళు మిమ్మల్ని వెలివేస్తే ఏ అధికారి మిమ్మల్ని రక్షిస్తాడు?" అంటూ పేథా పటేల్ నవ్వాడు. "మీరు తొందర పడకండి. ఇది పెళ్ళి వ్యవహారం. ఇచ్చిపుచ్చుకోవడాలు అనేకం ఉంటుంటవి.."

"అంటే పిల్లను వదలమంటావా? పసుపు పూసిన పెళ్లికొడుకు పసుపు పూసినట్లుగానే వుండిపోతాడా? అది మాకు అగౌరవం కాదా?" అన్నాడు పూల్‌జీ తాత కోపంగా.

"ఎవ్వడూ పసుపుతో వుండడు. కులంవాళ్ళు ఉండనివ్వరు. మీరీ పిల్లను వదిలేయండి" పేథాపటేల్ ఏదో రహస్యం చెపుతున్నట్లుగా నవ్వాడు." కొన్ని రహస్యాలుంటాయి. అందరి ముందరా రహస్యాలు చెప్పగూడదు అన్నట్లు అభినయించాడు. కూర్చున్న వాళ్ళల్లో సగంమంది మళ్ళీ లేచి నిల్చున్నారు.

పరస్పరం సంప్రతింపులు ఆరంభించారు జనం. ఆరేండ్ల క్రితం నిశ్చయమైన సంబంధాన్ని ఈ విధంగా భంగం పరచడం చాలామందికి నచ్చలేదు.

చివరికి పేథా పటేలు శంకర్ చెవిలో ఏదో వూదాడు. శంకర్ ఫూల్‌జీతో చెప్పాడు. శంకర్ ఫూల్‌జీ లిద్దరూ వేరుగా వెళ్ళి ఆలోచించారు. తమ వాళ్ళను ఇంటి వెనకకు పిలిచారు. వారితో సంప్రతించారు. కాసిమ్ బేచాత్‌లకు పేథా పటేలు సలహా నచ్చలేదు. కాని, వాళ్ల కులం వేరు. "శంకర్! నీవు అంగీకరిస్తే రాత్రికి రాత్రి ఆ పిల్లను తీసుకొని పోయి కాళాకు ముడిబెడతాన''ని కాసిమ్ అననే అన్నాడు. ఎవరైనా అడ్డం వస్తే కాళ్లు విరగగొడతామన్నాడు. శంకర్ గూడా అందుకు అనుకూలుడే. కాని కులం వాళ్ళతో ఎట్లా? పెళ్ళి అయిన తరువాత పిల్లా పిల్లవాడూ మళ్ళీ కులంలో కలవాలిగదా! శంకర్ ఆలోచించాడు.

అన్ని విషయాలూ బాగా ఆలోచించిన తరువాత పేథా పటేలు సలహా బాగానే వున్నదని అందరూ నిశ్చయానికి వచ్చారు. చివరికి రెండువందల ఇరవైరూపాయలు పిల్ల తరఫున పిల్లవానికి జుల్మానాగా యివ్వడానికీ, పిల్ల వాడి పక్షంవారు పిల్లను వదలుకోవడానికీ నిర్ణయం జరిగింది.

రెండు వందల ఇరవై రూపాయలకు బదులు నాలుగు వందల నలభై రూపాయలు యివ్వడానికి కూడా రణఛోడుడు సిద్ధంగా వున్నాడని పంచా యితీదార్లకు తెలియదు.

"రాజు పెళ్ళి విషయంలో ఇక మాకేమీ బాధ్యతలేదు. పిల్లవాణ్ణి మీరే కుదుర్చుకోండి'' అని పేథా పటేలు తీర్పు చెప్పివేశాడు. అయితే రాజా వివాహం ఎప్పుడు జరగాలి? అనే విషయంలో ఒక్క షరతు పెట్టాడు. "పిల్లవాడి పక్షంవాళ్ళు లగ్నపత్రిక తిప్పిపంపివేసిన తరువాతనే వివాహం జరగాలి'' అన్నాడు. వెంటనే పిల్లపక్షం వాళ్లు కాళా పక్షంవారికి డబ్బు యిచ్చి వేశారు. కాని ఆ రూపాయలు ఎవరు తీసుకోవాలి? ఎవరి దగ్గర పెట్టు కోవాలి? తీర్పు వినగానే కోపం వచ్చి ఫూల్‌జీ గుర్రం ఎక్కేశాడు. చివరికి పేథా పటేలు బలవంతం వలన శంకర్ ఆ డబ్బు తీసుకొన్నాడు.

"నీ మాట మీద విశ్వాసం వుంచి నేనీ డబ్బు తీసుకొంటున్నాను. పసుపు పూసిన కాళా అట్లాగే వుండడానికి ఏలులేదు'' అని శంకర్ పేథా పటేలును తొందర చేశాడు.

"సంబంధం తెగిపోయింది. ఈ పిల్లను ఎవరు చేసుకుంటారని'' ఎవరో అడిగారు.

"వాళ్ల బంధువులున్నారు. కులం వాళ్లున్నారు. వాళ్లు చూచుకొం టారులే" అని పేథా పటేలు లేచాడు. అతని వెంట అందరూ లేచారు.

వచ్చిన వాళ్లంతా భోజనాలు చేస్తున్నారు. కాళా యింట్లో విషాద పూరితమైన వాతావరణం వ్యాపించి వున్నది. శంకర్ రూపా పిన్నికి అనేక విధములుగ నచ్చజెప్పాడు. ౹ఁతిమిలాడాడు. ఏమయినా మానవ శరీరం గదా!! రాజువంటి మంచి పిల్ల చెయ్యి తప్పిపోయింది. ఆ పిల్ల ఎంత అందమైనదో అంత తెలివిగలది.

పేథా పటేలు గుఱ్ఱం ఎక్కుతూ శంకర్ చేతికిచ్చిన లగ్నపత్రికతో రూపా కన్నీళ్లు ఆగిపోయాయి. పిల్లవాడు పసుపుతో వుండడని విశ్వాసం కలిగింది. కాని ఆమె అంతరాత్మ తపిస్తూనే వున్నది. చివరికి చెడ్డవాడు చెడ్డపని చేయనే చేశాడు అని దీర్ఘంగా ఆమె నిట్టూర్చింది. ఆమె భగ వంతుణ్ణి ఒక్కటే ప్రశ్న వేసింది–

"భగవంతుడా! అంత మంది పెద్ద మనుష్యుల్లో న్యాయం చెప్పగలిగిన వాడు ఒక్కడూ లేకపోయినాడా?"

## 13

# దురదృష్టవంతుడు పరమా పటేల్

పంచాయితీ నిర్ణయం జరిగిన తరువాత గ్రామమంతా విషాదంలో మునిగిపోయింది. వాలాభాయి యింట్లో పరమాన్నంలో ఈగ పడినట్లు యింది. మాలి యింట్లో రహస్యంగా ఏదో ప్రయత్నం జరుగుతున్నది. కోడక్ యింట్లో రాజు తల్లి ఏడవాలో సంతోషించాలో తెలియని స్థితిలో పడిపోయింది. ఆ రోజు సాయంత్రం ఒకరి యింటినుండి ఇంకొకరి యింటికి మిఠాయి పోవాలి. ఆడపిల్ల యింటినుండే మిఠాయి రాకపోతే కాళా యింటి నుండి మిఠాయి రాజు యింటికి ఎట్లా వెళ్తుంది? పసుపుపూసిన కాళా పెళ్ళి కాకుండానే వుండిపోతాడా? అందరూ అదే ఆలోచిస్తున్నారు. "అది సరే, రాజుకు వరుడు ఏ వూరినుండి వస్తున్నాడు?" అని ఎవరో ప్రశ్న వేశారు.

ఆ ప్రశ్నకు జవాబు రెండో రోజు లభించింది. పరమా పటేల్ ఇంటి మంగలి వూళ్ళో నలుగురి యిళ్ళకూ పోయి "పరమా చిన్న కొడుకు నానా గణేశ పూజకు కూర్చుంటున్నాడు, అందరూ వచ్చి ఆశీర్వదించండి" అని చెప్పి వచ్చాడు. పొరుగూరులో వున్న పరమాకు ఈ విషయం తెలిసింది. పరమా యింట్లోనే ఇంత అన్యాయం జరుగుతున్నదా అని అంతా ఆశ్చర్య పడటం ఆరంభించారు. ఈ సంగతి తెలియగానే పరమా పటేల్ వెంటనే తన గ్రామం వచ్చాడు. ఇంకా గుర్రమైనా దిగలేదు, భార్య మాటలు వినబడ్డవి.

"ఈ పెళ్ళి జరిగి తీరవలసిందే. నీవు నోరెత్తితే జాగ్రత్త" అన్నది మాలి. "పెళ్ళికి విఘ్నం..."

"విఘ్నం నీ నా జీవితాల మధ్యలోనే ఏర్పడింది" అని మాలి మాటను మధ్యలోనే అందుకొని పరమా పటేల్ గుర్రం వీపు మీదనుండి జీను కిందికి దించబోతున్నాడు. ఇంతలోనే రణఛోడుడు ఇంట్లో నుండి బయటకు వచ్చాడు.

"గుర్రం మీది జీను దింపవద్దు. నానా తరఫున మిఠాయి తీసుకొని పోవాలి" అన్నాడు.

పరమా పటేలు తల తిరిగినంత అయింది.

"నీ తల్లి . . . ఎక్కడికిరా మిఠాయి తీసుకొని పోయేది?" అన్నాడు.

రణఛోడుని వయస్సు అప్పటికి ముప్పయి సంవత్సరాలు. పైలా పచ్చీసుగా వున్నాడు. పక్కన తల్లీ, పేరంటానికి వచ్చిన ఆడవాళ్ళూ నిలబడి వున్నారు. తండ్రి మోటు తిట్టు తిట్టాడు. రణఛోడుడు సహించ గలడా? రణఛోడునికి వొళ్లు తెలియని కోపం వచ్చింది. పక్కనున్న కర్ర తీసుకొన్నాడు. తండ్రి మీదికి దూకాడు. నలుగురైదుగురు రణఛోడుడికి అడ్డం వచ్చారు. పరమా పటేల్ కళ్లల్లోనుండి రక్తం ప్రవహిస్తున్నట్లని పించింది. మాలిని జుట్టు పట్టుకొని తన్నాలనీ, ఇంట్లో గణేశ పూజ చేయి స్తున్న బ్రాహ్మణుడి ఆచమనం పాత్ర బజార్లో పారేసి నున్నగా వున్న అతడి తల రెండు వక్కలు చేయాలనీ అనుకున్నాడు. కాని ఏమి చేయ గలడు? యమునివంటి రణఛోడుడు ఎదుట నిలబడి వున్నాడు.

మాలి దృష్టిలో పరమా పటేలు ఎప్పుడో మరణించాడు. బ్రతికి వున్న వాడు, తన పిల్లల తండ్రి కాడు. కాళా పినతండ్రి మాత్రమే. ఆమె చూస్తూ నిలబడివున్నది.

అంతా రసాభాసగా తయారయింది.

వెంటనే పరమా పటేల్ ఎగిరి గుర్రం ఎక్కాడు. కాని మాలి గుర్రానికి అడ్డం వచ్చింది.

"ఈ గుర్రం మీ తండ్రి సొత్తు కాదు. దిగు గుర్రం" అన్నది. అంత వరకు శాంతంగా వున్న నాథా అందుకొన్నాడు. తల్లి ముందుకు వచ్చాడు.

"నీ అబ్బ సొత్తు తెచ్చావులే!" అంటూనే నాథా రణఛోడుని వైపుకు దూకాడు. "ఏమిటి? ముసలివాణ్ణి కొడతావా? నీ భుజాలలో అంత బల మున్నదా? కొవ్వు కళ్లకు తట్టిందా?" అన్నాడు.

క్షణకాలం అంతా శాంతి వ్యాపించింది. నాథా ఆ విధంగా అంటాడని పరమా పటేలు స్వప్నంలో గూడా వూహించలేదు. "మాలీ! నాథా నీ మితభాషి అయిన కొడుకు. చూడు" అన్నాడు పటేల్.

నిజానికి నాథా వ్యవహారం పరమాకు గూడా ఆ సమయంలో నచ్చ లేదు. తన యింటి భవిష్యత్తు భయంకరంగా అతని కళ్లకు కట్టడమారం భించింది. ఐదారు నిమిషాలు పిచ్చివాడులాగా నిలబడ్డాడు పరమా.

నాథా, రణఛోడుడు ఇద్దరూ తిట్లల్లోకి దిగారు.

పరమాకు చాలా కష్టంగా తోచింది. "మాలీ! విను. విను. నీ కన్న కొడుకు లిద్దరూ "శాస్త్రం" ప్రారంభించారు. మాలీ! నా మాట జాగ్రత్తగా విను. కుటుంబంలో కలహ బీజాలు నాటావు. అవి నీ యింట్లోనే నీ కాళ్ల కిందే ఫలించబోతున్నాయి. అనుభవిస్తావు" అన్నాడు. కొరడాతో గుర్రాన్ని అదిలించాడు. "మాలీ! ఏడువు. వీళ్లిద్దరూ నీ కన్న కొడుకులు. ఇది నీవు సంపాదించిన ఆస్తి. ఏడుపు ఒక్కటే నీకు మిగలబోతున్నది" అన్నాడు. గుర్రం ముందుకు సాగింది. గుర్రం వెంట వున్న గుర్రపు పిల్ల మాలిని ఎగతాళి చేస్తున్నట్లుగా హీ హీ హీ అని సకిలించింది.

పరమాను వెనకకు పిలుచుకొని రావాలా, కర్రలు తీసుకొని తారసిల్లిన నాథా రణఛోడుల్ని వారించాలా, నిశ్చేష్టురాలైవున్న మాలికి ధైర్యం చెప్పాలా లేక ఇంట్లో గణేశపూజకు పాటలు పాడించాలా ? ఏమీ చేయాలో అక్కడున్న వారికెవ్వరికీ తోచలేదు.

ఇదంతా తక్కువైనట్లు కాళా యింట్లో కూర్చొనివున్న బేచాత్, కాసిమ్ వగైరాలు "ఈ మాలి రాజుకు గూడా శత్రువురాలయింది అంటున్నారు."

పదిహేనేళ్ళ మావ్జీ కొడుకు రామూ మాలిగారింట్లో మండుతున్న హోలీలో నెయ్యి పోస్తున్నాడు. "వినండి, వినండి. అందరూ నానా పెళ్ళికి పాటలు పాడుతున్నారు. మాలి పాడుతుంటే కొడుకులిద్దరూ తాళం వేస్తున్నారు. ఆహాహా ! పాటలు ఎంత బాగున్నాయి!" అంటున్నారు.

నాథా రణఛోడు లిద్దరూ తిట్ట రాని తిట్లు తిట్టుకొంటున్నారు. మాలి కర్రలు తీసుకొని తారసిల్లుతున్న ఇద్దరినీ వారిస్తున్నది.

గేదెదూడలు పోట్లాడుకొంటే చెట్లు విరిగిపోతవని సామెత. నాథా రణఛోడు లిద్దరిలో ఒకడికి చెయ్యి విరిగితే ఇంకొకడికి తల పగిలింది. ఇద్దరి మధ్య వున్న మాలి చేతి గాజులు ముక్కలు ముక్కలయినవి. అట్లాగే కొంచెంసేపు పూరుకొంటే ఏమయేదో భగవంతునికే తెలియాలి. కాసిమ్ బేచాత్ లిద్దరూ అడ్డంబడ్డారు. అన్నదమ్ముల్నిద్దరినీ విడదీశారు.

మంగలి పిలిస్తే వచ్చిన గ్రామస్థులంతా తమాషాగా చూస్తున్నారు. లో లోపల అంతా సంతోషించారు. "మాలీ ముగ్గురు కొడుకులూ గణేశపూజ చేస్తున్నారు" అంటున్నారు. "అంతే కాదురా. మాలి గూడా పూజకు కూర్చున్నది" అని నవ్వుతున్నారు. "ఇల్లంతా గణేశపూజకు కూర్చున్న దనరా తమ్ముడూ !" అన్నాడింకొకడు.

"అదికాదు లేవోయి! పసుపు రంగైతే పచ్చిది. అందుకని పెళ్ళి కొడుకుకు నెత్తురుతో రంగు పూస్తున్నారులే" అన్నాడు ఇంకొకడు.

కాని పరమా యింట్లో జరుగుతున్న హంగామాను చూచి కాళా తల్లి చాలా విచారించింది. గబ గబ తాను ఇంటి వెనక భాగానికి పరుగెత్తింది.

"పరమా మరదీ! పరమా మరదీ!" అని పెద్దగా పిలిచింది. "తిరిగి రాకపోతే కాళామీద ఒట్టు" అన్నది.

కాని ఈ మాటలన్నీ వినకపూర్వమే పరమా గుఱ్ఱం సందు దాటి వెళ్ళిపోయింది.

"నా మూలాన పరమా మరిది ఇంటికి దూరమైనాడ" ని కాళా తల్లి చాలా చింతించింది.

రెండు జాముల సమయంలో ఎంత మండి పోతున్నది. మైదానంలోనూ నదీ తటంలోనూ, పొలాలలోనూ భూమి ఆవిరి కక్కుతున్నది. పశువులూ, జంతుజాలమూ చెట్ల క్రింద పడుకొని రొప్పుతున్నవి. పక్షులు ఆకుల చాటున దాక్కొంటున్నవి. నలువైపులా ఒక్కటే శాంతిగా వున్నది. కాని ఒక్కగానొక్క పరమా పటేలు గుఱ్ఱం మాత్రం దుమ్ము రేపుకుంటూ ముందుకు పరిగెత్తుతున్నది.

ఆ సితిలో పటేలును ఎవరు చూచినా-పాపం! ఎవరో దుఃఖజీవి అని అనకుండా వుండరు.

## 14

# భగవంతుడేది చేసినా మంచికే చేస్తాడు

దాదాపు సాయంత్ర మయ్యేటప్పటికి పూల్ జీ తాత గుర్రంమీద ఎక్కిన శంకర్ కాళా యింటి ముందు ఆగాడు. 'దోవ మధ్యలోనే పరమా పటేలును అడ్డగించి బలవంతంగా యింటికి తీసుకొని వచ్చాడు.

శంకర్ గుర్రం దిగగానే "రూపా పిన్నీ! ఇదిగో లగ్నపత్రిక" అన్నాడు.

పరమా పటేలు తన యింటి వైపుకు చూచి మాలీ వినేటట్లుగా "ఇక మీరు పిడవండి. పసుపు పూసిన నానా పసుపుతోనే ఉన్నాడు, రణ ఛోడుణ్ణి పంచాయతీ చేయమని చెప్పండి" అన్నాడు.

పరమా పటేలు అన్న రెండు మాటలూ అక్షరాలా నిజమైనవి. కోదర్ యింట్లో నుండి లేచిన పంచాయితీదారులు నానా అత్తగారింట్లో తిరిగి సమా వేశమైనారు. నానా అత్తగారు తగాదా బెట్టింది. "మనోర్ పటేలు కొక్కడికేనా మేనగోడలున్నవి? ఇంకెవ్వరికీ ఆడపిల్లలు లేరా? సంబంధం చేయడం, తుంచివేయడం వారిష్టమేనా? మా అమ్మాయిలో ఏ లోప మున్నదని పిల్లవాడికి మళ్ళీ పెళ్ళి చేస్తున్నారు? బీదవాళ్ళమైతే మాత్రం మాకు పరువూ మర్యాదా లేవా?" అని పంచాయతీదార్ల వెంటబడింది.

జేబులు నింపుకొన్న ఏ కొద్దిమంది మాత్రమో తప్ప మిగిలిన వాళ్ళంతా జరిగిన పనికి చాలా కోపంగా వున్నారు. ఎంత బీదతనంలో వున్నా మాటకు విలువ వుండాలి. న్యాయం అందరి విషయంలోనూ ఒకటిగానే వుండాలి. తోకలున్న వాళ్ళకు ఒక న్యాయమూ, లేని వాళ్ళకు ఇంకొక న్యాయమూ పనికిరాదు అని వాళ్ళ అభిప్రాయం. "మీ పిల్లలకు రెండు రెండు సంబంధాలు చేస్తారా? బీదవాళ్ళమైన మా పిల్లలకు కుదిరిన సంబంధాలు చెడగొట్టి వేస్తారా?" అని బహిరంగంగానే విమర్శన ప్రారంభించారు.

కొంతమంది పేథా పటేలు వినేటట్లుగానే - "ఓ పటేలూ! న్యాయం చేయదలచుకొంటే అందరి విషయంలోనూ సమాన దృష్టితో వుండు. లేకపోతే నీ గౌరవం మా గౌరవం గూడా దక్కదు" అన్నారు.

కాని అసలు నానా రెండో పెళ్ళి విషయంలో పంచాయతీ కోరమని పేథా పటేలే నానా అత్తగారికి సలహా చెప్పిన విషయం చాలామందికి తెలియదు.

తగాదా ప్రారంభమయింది. చర్చలమీద చర్చలు జరిగి రోజు రోజంతా తల పగలగొట్టుకొన్న తరువాత పేథా పటేలు తీర్పు యిచ్చాడు.

"తాసర్‌వాలా గ్రామంలో నర్సీ కూతురు కొరకై తాంబూలాలు పుచ్చుకొన్న పదిహేను రోజులకు పెళ్ళి కొడుకు చచ్చిపోయాడు. అందువల్ల నర్సీ కూతురు పెళ్ళి కాలేదు. అందువలన నర్సీ కూతురుతో కాళాకు వివాహం జరగాలి. రాజు వివాహం నర్సీ అన్నతో జరగాలి" అదీ తీర్పు.

ఆ తీర్పు విని అందరూ సంతోషించారు.

"అరే! పేథా పటేలూ! ఏమి నీ తెలివి!!" అని కొంతమంది అన్నారు గూడా.

"పరమా పటేలు కొడుకు నానా సంగతి ఏమిటి? పసుపు పూసుకొని కూర్చున్నాడు గదా!! కాళాకు జరిగిన అన్యాయం జరగనే జరిగింది. మరి, ఈ మర్యాదగల వారి సంగతి.." ఎవరో ప్రశ్నించారు.

మనోర్ గూడా అదే ప్రశ్న రెట్టించివేశాడు.

పేథాపటేల్ ఆ ప్రశ్నకు స్పష్టంగా జవాబు చెప్పాడు.

"తమ్ముడూ!" అని మనోర్‌ను పేథా దగ్గరకు పిలిచాడు.

"నానా గణేశ పూజకు కూర్చున్నమాట వాస్తవమే. నేను గూడా అంగీకరిస్తాను. పిల్లనిచ్చే వాళ్లు గూడా అంగీకరించవలెను గదా!! నేను పసుపు పూసుకొని కూర్చుంటాను. నాకు ఎవరైనా వచ్చి పిల్లనిస్తారా? నీవే చెప్పు. నా ప్రశ్న ఏమిటంటే - అసలు నానా ఎవరినడిగి పసుపు పూసుకొన్నాడు ? ఎవరిది తప్పు?" అని ఎదురు ప్రశ్న వేశాడు.

జనమంతా గొల్లుమని నవ్వారు. మనోర్‌జీ ముఖం తెల్లబడిపోయింది.

ఆ తరువాత కొంతమంది కాళా రాజూల సంబంధం నిలబెట్టవలెనని ప్రయత్నం చేశారు. ఆ ప్రయత్నం ఫలిస్తే పేథా పటేలు జేబు ఖాళీ చేయవలసిన అవసరం ఏర్పడేది. అందువలన దానికి అతడు అంగీకరించ లేదు. పంచాయితీదార్లు పేథాతో ఏకీభవించారు.

చివరికి కులంవాళ్ల ముందు శంకర్ కాళాల లగ్నపత్రికా, మనోర్ రాజూల లగ్నపత్రికా తయారుచేశారు.

ఆ లగ్నపత్రిక తీసుకొని ఫూలీజీ తాత గుర్రమెక్కి, శంకర్ కాళా యింటికి చేరాడు. పరమాపటేలు విచారానికి అంతం లేకుండా పోయింది. ఏడు తరాలుగా ఏర్పడిన కుటుంబ గౌరవాన్ని ఒక ఆడమనిషి ఘడియలో మట్టిలో కలిపివేసింది. అదీ అతని విచారానికి కారణం. ముఖం చూప డానికే అతనికి సిగ్గు కలిగింది. తన కుమారుడు పసుపు పూసినవాడు పసుపు పూసినట్లుగానే వుండిపోయాడు. "చెరపకురా, చెడెదవు" అనే సామెత చరితార్థామయింది అనుకున్నాడు.

ఆత్మహత్య చేసుకోవాలో, కాళా యింటికి నిప్పంటించాలో లేక పరమా పటేలు గొంతు పిసికివేయాలో మాలీకి ఏమీ తోచలేదు. మంచంమీద పడి వున్న రణఛోడుడు అవమానం భరించలేక కుమిలి కుమిలి పోతున్నాడు.

కాళా తల్లి వ్రతం పూర్తికాగానే ఉపవాసం మానివేసింది. ఆడవాళ్ళు పాటలు ప్రారంభించారు.

"హరి గలనుం ఛోగుం నేగల నోగోటో కేసరియా లాల్,
కో తో సాహూబా ఘోడీలా వోరీ ఆలుం కేసరియా లాల్"

పాగా కుచ్చు మీద గులాబీ పువ్వూ, ఎర్రకేసరం వంటి గోటూ వున్నది. నీవు కావలెనంటే గుర్రాన్ని కొని తెస్తాను.

ఇటు లగ్నపత్రిక తీసుకొని మనోర్‌జీ కోదర్ యింటిముందు గుర్రం దిగాడు. కోదర్ తల్లి "అన్నా! శోక పత్రిక తెచ్చావా?" అని అడిగింది. పెళ్ళి ఇంట్లోనే ఆనందం లేకపోతే - సంతోషం లేకపోతే - ఆ యింట్లో పాటలు పాడడానికి ఎవరు వెళ్ళతారు?

కాళా యింట్లో యువకులే కాదు, నడివయస్సులో వున్న వాళ్ళు గూడా నిన్న జరిగినదానికి బదులు తీర్చుకొంటున్నట్లుగా ముక్త కంఠంతో గొంతెత్తి పాటలు పాడుతున్నారు. కాసిమ్ ధనుర్విద్యా నిపుణుడు లాగా బాణంమీద బాణం తీసినట్లుగా పాటలమీద పాటలు పాడుతున్నాడు.

"అంగరేజ్ ఆవ్యో రే జుదీ జాత్‌నో
టోపీవాలో ఆవ్యో రే విలాంత్‌నో
ఏనీ గాడీ మాం భరియా ఛే లాల్
ఏనీ మఢమనా బోల్ కాలా కాలా, రే అంగరేజ్ ఆవ్యో
ఏ సప్రైండా లావ్యో ఛే మాతా
ఏనీ మఢమనా గాల్ రాతా రాతా రే"

వేరు జాతికి చెందిన ఇంగ్లీషువాళ్ళు వచ్చారు.
విదేశాల నుండి టోపీవాళ్ళు వచ్చారు.
బండి నిండా నిప్పులు నింపుకొని వచ్చారు.
వాళ్ల భార్యలు ముద్దు ముద్దుగా మాట్లాడుతారు.
ఇంగ్లీషు వాళ్ళు వచ్చారు.
వాళ్ళు విశ్వాసం తెచ్చారు.
వాళ్ల బాలల బుగ్గలు ఎర్ర ఎర్రగా ఉంటవి.
ఇంగ్లీషు వాళ్ళు వచ్చారు.

ఇంగ్లీషు వాళ్ళు, దొరసానులు, రైలు బండి మొదలైనవన్నీ జనానికి కొత్త కొత్త విషయాలు. అందువల్ల జనం ఉత్సాహంగా ఆ పాట వింటూ పాడటం ఆరంభించారు. దానితో కాసిమ్ ఉత్సాహానికి అంతులేకుండా పోయింది. రైలు బండికి సంబంధించిన ఇంకొక పాట మొదలుపెట్టాడు. అది పాడే పద్ధతి వేరు. కాసిమ్ నలుగురు నలుగుర్ని ఒక్కొక్కచోట చేర్చి ఒకరి భుజంమీద ఇంకొకరి చెయ్యి పెట్టమన్నాడు. అందరూ అదే విధంగా తయారైనారు.

గాడీ సడప్ దయీనే ఆవీ రే రామా రాఠోడ్!
గాడీ డుంగర్ మాం అచ రాణీ రే రామా రాఠోడ్!
గాడీ హాలే ఛే కే చాలే రే రామా రాఠోడ్!
గాడీ కోవాళా మంగావే రే రామా రాఠోడ్!
గాడీ వావడా మంగా వేరే రామా రాఠోడ్!
గాడీ రేల్ వాయీ ఓ పథరావే రే రామా రాఠోడ్!
గాడీ సడప్ దయీనే దా లీరే రామా రాఠోడ్!
రైలు బండి పరుగెత్తుకుంటూ వస్తున్నది.
రైలు బండి కొండల మధ్య నిలిచిపోయింది.
రైలు బండి కదులుతున్నదా లేక నడుస్తున్నదా?
రైలు బండి గునపం తెప్పించుకొంటున్నది.
రైలు బండి వార తెప్పించు కొంటున్నది.
రైలు బండి ఇనుప పట్టీలమీద వ్యాపించి వున్నది.
రైలు బండి పరుగెత్తుకుంటూ బయలుదేరింది.

ఆడవాళ్ళు పాట చెప్పుతూవుంటే శంకర్, నాథా, రామా భార్యలు మగ

వాళ్లను అనుకరిస్తూ రైలు బండి నడకను అభినయిస్తున్నారు. నడప్పయానే అనగానే ఒకరి వెనకవున్న ఇంకొకరు ఐదైదు అడుగులు ఎగిరి గంతు వేస్తున్నారు. బండిలాగా ఆగిపోతున్నారు. ముందుకు పరుగెత్తుతున్నారు. పాడేవాళ్లూ వినేవాళ్లూ మహదానందంలో ఉన్నారు. అదే పాటను రెండో సారి గూడా పాడిస్తున్నారు. స్త్రీలూ, పురుషులూ, "హాలే ఛే కే చాలే ఛే" అన్నప్పుడు వూగిపోతున్నారు. చివరి చరణం అందుకోగానే జనం రైలు బండిలాగా నడుస్తున్నారు. పరుగెత్తుతున్నారు.

చీకటి పడగానే జనమంతా భోజనానికి లేచారు. కడుపునిండా అంతా భోజనం చేశారో లేదో తెలియదు. వెంటనే పాటలు ప్రారంభించారు. రాత్రి రాత్రి అంతా పాటలు పాడుతూనే వున్నారు. అంతా ఆనందంలోవున్నా ఆ పాటలు వింటుంటే పరమా పటేలు కుటుంబానికి మాత్రం వొంటిమీద తేళ్లూ జెర్రులూ పాకినట్లనిపించింది. మాలి, రణఛోడుడు నానా ఎంత బాధపడుతున్నారో చెప్పడానికే వీలులేని పరిస్థితి ఏర్పడింది. రాత్రి అంతా అట్లాగే గడచింది.

పగలు మాత్రం తక్కువేమున్నది? ఒక పాట పూర్తి అయితే రెండో పాట ప్రారంభమవుతున్నది. రోజు గడిచింది. రెండో రోజు విందు ఏర్పాటు అయింది. యువకులకూ, నడి వయస్సు వారికీ కొత్త పని దొరికింది. అంతా సామాన్లు తూయించడంలోనూ, లెఖ్ఖ వేయడంలోనూ మగ్నులైనారు. గుండిగ పరమాన్నానికి ఇరవై ఆరు శేర్ల బెల్లమైతే ముప్పావు గుండిగకు ఎంత బెల్లం కావాలి? అదీ లెఖ్ఖ. పది పన్నెండు మంది ముగ్గురు ముగ్గురుగా కలసి కంకర రాళ్లతో లెఖ్ఖ కడుతున్నారు. ఒకడు కట్టిన లెఖ్ఖను ఇంకొకడు అంగీకరించడం లేదు. ఏ ఇద్దరి లెఖ్ఖా ఒక్కటిగా కలవడంలేదు.

ఒకవైపు ఈ లెఖ్ఖల వ్యవహారం జరుగుతూనే వుంటే రెండోవైపు పాటల్లోవున్న వారికి ఇవేమీ పట్టలేదు. ఇంటి వెనక భాగంలో గాడి పొయ్యిమీద ఎసళ్ళకు నీళ్లుపెట్టిన యువకుల ప్రపంచం ఇంకొక రకంగా వున్నది. పాటలు పాడుతున్న ఆడవాళ్ళను చూచిన కొద్దీ ఈ యువకుల హాస్యపు మాటలు హద్దులు దాటిపోతున్నవి. ఒకరిని మించి ఇంకొకరు మాటలు విసరుతున్నారు.

మాలి అదంతా చూచి సహించగలదా? లేచి తన తండ్రి యింటికి

వెళ్లిపోయింది. అమె తల తిరిగిపోతున్నది. ఎందుకు తిరగదు? కళ్ళు మూసుకొన్నదేగాని, చెవులు పని చేస్తూనే వున్నవి గదా!!) చుట్టుపట్ల వున్న నాలుగైదు గ్రామాలనుండి వచ్చిన ఆడవాళ్ళు భోజనానికి పోతూ గూడా గొంతెత్తి పెద్దగా పాటలు పాడుకున్నారు. ఆ పాటలు తనను నలు వైపులనుండీ చుట్టీముట్టి తనకు వురివేయబోతున్నవని అనుకొన్నది. మాలి (భోజనాలు ప్రారంభమైనా ఆడవాళ్ళ పాటలు మాత్రం ఆగిపోలేదు. మాలీ తనలో తాను "ఈ ముండలంతా తినడానికి వచ్చారా పాడడానికి వచ్చారా? భగవంతుడు ఎంతెంత పెద్దగొంతులు వీళ్ళకు పెట్టాడు?" అనుకొన్నది. తెల్లవార్లూ మంచంమీద ఆ పక్కె మీద నుండి ఈ పక్కె మీదకూ ఈ పక్కె మీద నుండి ఆ పక్కె మీదకూ దొర్లుతూ గడిపింది. క్షణ కాలంలో చెవుల పొరలు తెగిపోతవేమో ననుకొన్నది. కాని అమె హృదయానికి కప్పుకొన్న తెరలో?..

కుమిలి కుమిలి ఏడుస్తున్నది. తలబాదుకొంటున్నది. ప్రయోజనం?

"నా కొడుకు పసుపుతోనే వున్నాడు!" అమె గుండె పగిలినట్లనిపించింది. వెంటనే నానాకు కబురు పంపించింది. "నాథా భార్యగానీ, పెద్దవాడి భార్యగానీ, ముసలి వాడు గానీ ఎవ్వరూ కాళా యింటికి పోగూడదు. పోతే ఇక మీకూ మాకూ సంబంధం లేదు" అని అజ్ఞ వేసింది. కాని నాథా భార్య ఆ అజ్ఞను మన్నించలేదు. ఉడికించడానికి తిన్నగా వెళ్ళి పెళ్ళి బండిలోనే కూర్చున్నది.

మాలి ఆ విషయం తెలియగానే తోకతొక్కిన త్రాచులాగా బుస గొట్టింది. మంచం మీద నుండి కిందకు దూకింది.

పెళ్లి బళ్ళు దుమ్ము రేపుకుంటూ పొలాల్లో పరుగెత్తుతున్నవి. పెళ్ళి పాటలు వినబడుతున్నవి.

(ఏక్ ఝూలావాడీ సోపారీ నుం ఝాడ్ ఛే
అమారా కాళూ భాయీ నే టుంపియానీ హోష్ ఛే
వేవాయీ నా మళేతో అమనే కేయీ మే...ల
ఝూలావాడీ సోపారీ నుం ఝాడ్ ఛే

ఒక ఝూలావాడీ పోకచెట్టున్నది. మా కాళా భాయికి తల దువ్వుకొనే తెలివున్నది. వియ్యంకుడు కలవకపోతే మాకు చెప్పండి ఝూలావాడీ పోకచెట్టు ఒకటున్నది.)

రెండోవైపు ఆ రాత్రికి రాత్రే ముసలివాడికి తిట్లు లభించడమే గాక అతని యిల్లు రెండు భాగాలుగా పంపకం చేయబడ్డది.

రాజు యింట్లో ఒక యజ్ఞోపవీతధారి భజంత్రీలను ఢోళ్ళు వాయించమంటూ సప్తపది మంత్రాలు చదువుతున్నాడు.

నిదా మహీం నహీ హతుం తన ఖాన్ జ్యారే

జేణే జునో పూరణ రక్షణ కీధుం త్యారే

నిద్రలో గూడా - తన శరీరాన్ని రక్షించుకోలేని వారిని సైతం ఎవరు రక్షిస్తుంటారో అతడు మిమ్మల్ని సంపూర్ణంగా రక్షించు గాక! ఢోలు సన్నాయి వాయిద్యాల ధ్వని మధ్యలో ఆ యజ్ఞోపవీతధారి వధూవరుల చేతులు కలిపాడు. ఆ సాయంత్రం కట్నాలూ చదివింపులూ జరిగాయి. ఆ తరువాత బుక్కాయి, వసంతం చల్లుకొనడం జరిగింది. అప్పగింతలయి పోగానే చిన్న బండిలో రాజు అత్తగారింటికి బయలుదేరింది. అదే సమయంలో కాళా గూడా తన భార్యతో కలిసి తన గ్రామంలోకి ప్రవేశించాడు.

రూపాకు ఆ గల్లీలో శాంతి లభించింది. కారణమేమంటే తమ యింటి ప్రక్క భాగం సాథాకూ, పరమాకూ లభించింది. అది తెలిసి రూపా చాలా సంతోషించింది. అందరితో చెప్పటం ఆరంభించింది-

"మా కాళా భార్య కాళ్లు మంచివి. ఆ పిల్ల యీ యింట్లో అడుగు బెట్టగానే మాకు శాంతి లభించిం"దన్నది. అంతేగాక మనోర్ జుల్మానాగా యిచ్చిన డబ్బుతోనే పెళ్ళి ఖర్చంతా జరిగిపోయింది. అది గూడా కోడలి ప్రతాపమేనని ఆమె అభిప్రాయం. ఆ ఆనందంలో రాజుకు బదులుగా తన యింటికి వచ్చిన కోడలి ముఖంమీది స్ఫోటకం మచ్చల్నీ, ఎగుడు దిగుళ్ళను మరచిపోయింది. "అందం ఎవరికి కావాలి? కొరుక్కుని తింటామా?" అనుకొన్నది. పిల్ల పేరు భలీ. కాళా కంటే పిల్ల రెండేళ్ళు పెద్దది. అంటే తొందరగా కాపరానికి వస్తుందనుకొన్నది. చివరకు బాగా ఆలోచించుకొని భగవంతుడేది చేసినా మంచికే చేస్తాడనుకొన్నది. వెంటనే ఆమెకు తన భర్త జ్ఞాపకానికి వచ్చాడు. ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి.

"భగవంతుడు నీకు ఈ సుఖాన్ని ప్రసాదించ లేదు. నేను బ్రతికే వున్నాను. భగవంతుడు వెయ్యి హస్తాలతో మా శిరస్సుపై కూర్చొని వున్నాడు. మనమెందుకు విచారించాలి?" అనుకొని నమస్కరించింది.

## 15

# ఒకరితో ఒకరు మాట్లాడని రాజూ కాళాలు

రూపా కొత్త కోడలు మేలు కొరకై రకరకాల మొక్కులు మొక్కుకొన్నది. మనస్సును సంతృప్తి పరచుకొన్నది. అయినా రాజును చూచినప్పుడల్లా ఆమె హృదయం కలుక్కుమనేది. భగవంతుడు రాజుకు మంచి రూపాన్ని ప్రసాదించాడు. వసంత ఋతువులోని నవనవలాడే పూదీగలాగా రోజు రోజుకూ రాజు వికసించడం ఆరంభించింది. అది చాలదన్నట్లు రాజు కాళా తల్లి ఎక్కడ కన్పించినా "అత్త" అని పిలిచేది. రాజు తల్లి అది మంచిది గాదని రాజును అనేక పర్యాయాలు నివారించింది. అయినా రాజు ప్రయత్నంగానే - రూపా అత్త అని అనివేసేది.

ఒకరోజు గొడ్లను తోలుకొనిపోతున్న గ్రామస్థులంతా వినేటట్లుగా రాజు అత్త శబ్దాన్ని ప్రయోగించడం జరిగింది. తన తల్లి నుద్దేశించి రాజు— "అమ్మా! అమ్మా! మన గేదే, అత్తగారి చాంద్రీ (గేదె పేరు) రెండూ.."

మధ్యలోనే పెదవులు కొరుక్కొని రాజు మాట ఆపివేసింది. పక్కన ఐదారుగురు ఆడవాళ్ళు నిలబడివున్నారు ఆ మాట వినగానే ఫక్కున నవ్వారు. రణఛోడుని భార్య కూడా అక్కడే వున్నది. ఆమె వూరుకుంటుందా? "ఏమే? రాజూ! నీకు ఎంతమంది అత్తలు?" అని అడిగింది.

మూడు దోవలూ కలిసే చోటు అది. అమ్మలక్కలందరూ వినేటట్లుగా రాజు అన్నమాటకు రాజు తల్లికి కోపం వచ్చింది. కూతుర్ని ముక్కచివాట్లు పెట్టింది. "ఎన్నిసార్లు చెప్పినా నీ అలవాటు మారడంలేదు; ఇంకొకసారి ఈ పొరపాటు చేశావంటే చీరి వేస్తా"నన్నది. గబ గబ ఇంటికి వెళ్ళిపోయింది.

ఆ మాట అన్నదే గాని, రాజు తల్లి ఇంటికిపోయి భోరున ఏడ్చింది. రాజు పెళ్లి తప్పించిన వాళ్లనందరినీ ఎన్ని తిట్లో తిట్టింది. తన అసహాయ స్థితికి వలవలలాడింది.

కాళా తల్లి తన ఇంట్లో ఒకమూల కూర్చొని జరిగినదానికి కన్నీరు కార్చింది. వెక్క వెక్క ఏడ్చింది.

దిన దినం పెద్దవాడవుతున్న కాళా అదృష్టంలో ఆ ఏడుపు గూడా వ్రాసి లేదు. జరిగినదంతా జ్ఞాపకం రాగానే అతడు పెద్దగా నిట్టూర్చి "అయిందేదో అయిపోయింది" అనుకొనేవాడు. ఆ విషయాన్ని మరచిపోయే ప్రయత్నం ప్రారంభించాడు.

అయితే తోటిపిల్లలు మాత్రం కాళా రాజుల స్నేహాన్ని మరచిపోలేదు. మరచిపోనిచ్చేవాళ్ళు కాదు. దాగుడు మూతలూ, ఉప్పు పట్టీలూ ఆడే టప్పుడు కాళా రాజును పట్టుకొంటే రాజును ఆ పిల్ల మొగుడు పట్టుకొన్నా డని పెద్దగా పిల్లలంతా అరిచేవాళ్ళు. అది విని కాళా సిగ్గు పడేవాడు. రాజు గూడా సిగ్గుపడి పారిపోయేది. పక్షిలాగా ఎగిరిపోయేది. భయంవల్ల ఇంటికి పోయేదిగాదు. ఏ మారుమూలకో - ఎవ్వరూ లేనిచోటికి - పోయి మౌనంగా కూర్చోనేది. కాళా ఆడుతూవుంటే ఆ ఆటలో తను పాల్గొనేది గాదు. రాజు ఆడుతూవుంటే కాళా దూరంగా తను చేతులు కట్టుకొని నిల బడేవాడు. క్రమక్రమంగా వాళ్ళు ఒకర్ని ఇంకొకరు చూచుకొనే అవ కాశం గూడా లేకుండాపోయింది. రాజు గలగోటా పుష్పంలాగా విక సిస్తుంటే - తల్లి రాజును ఆటలకు పోవద్దని కట్టడి చేసింది "రాజూ! నీవు ఎంత పెద్దదానివైనావో తెలుసునా? ఇక ఆటలకు పోగూడదు" అన్నది.

కాళా పెద్దవాడైన కొద్దీ అతని తెలివి తేటలు పెరగడం ఆరంభించాయి. అతనిలో దృఢత్వం ఏర్పడుతూ వచ్చింది. కిశోరావస్థ యౌవనావస్థ ఈ రెండింటి మధ్య వున్న నాలుగైదు సంవత్సరాలూ రాజు కాళాల మధ్య మాటలు లేకుండా గడచాయి. చాలాసార్లు నీళ్ళు నింపుకొనే చోటో, ఏ పొలం గట్టు మీదో ఇద్దరూ కలిసేవాళ్ళు. అయినా ఇద్దరు శత్రువులు కలిసినట్లు ఒకరినొకరు సరిగ్గా చూచుకొనే వాళ్ళు గూడా కాదు. ఒకరోజు గడ్డిమోపు తలమీదకు ఎవరైనా ఎత్తుతారా అని రాజు ఎదురు చూస్తున్నది. ఇంతలో కాళా అక్కడకు వచ్చాడు. కాళా కనిపించగానే ఆమెలో ఏమి సంచలనం కలిగిందో తెలియదు, తనంత తానుగానే మోపును అమాంతం ఎత్తి నెత్తిన బెట్టుకొన్నది.

నిజమాలోచిస్తే - కాళా రాజు లిద్దరూ తమ తమ మనస్సుల్లో ఏవో సందేహాలు పెట్టుకొన్నారు గాని సంఘం వారిద్దరి మధ్య జరిగిన పూర్వ కథను ఎపుడో మరచిపోయింది. ఏదైనా మాట సందర్భంగా ఆ ఘటన చర్చకు వచ్చినా దానికేమీ ప్రాముఖ్య ముండేది గాదు. సంఘంలో అయి

వంటి ఘటనలు జరగడం మామూలే. అందువలన ఎవ్వరూ పట్టించుకొనే వాళ్ళు కారు. అంతేగాక ఎవరెవరి మధ్య ఇటువంటి సంబంధాలు నిశ్చయ మయ్యేవో, అట్టి స్త్రీ పురుషులు ఒకచోట చేరినపుడు అరమరికలు లేకుండా మనస్సు విప్పి మాట్లాడుకొనేవారు. ఫలానా కారణం వల్ల సంబంధం మారి పోయిందన్నీ, లేకపోతే మేమిద్దరం ఆలుమగలం అయ్యే వాళ్ళమే నని కొంత మంది అంటూ తాము నవ్వి ఇతర్లను నవ్విస్తూ వుండే వాళ్ళు.

రాజూ, కాళాలు మాట్లాడుకొనే అవకాశాలు చాలాసార్లు ఏర్పడ్డవి. అయితే ఎవరు ముందు మాట్లాడాలి అన్న చోట పట్టింపు వచ్చి వ్యవహారం అంతతో ఆగిపోయేది. కాళా కోదర్ల మధ్య చిన్ననాటి స్నేహం మళ్ళీ ఏర్పడింది. ఒకరింటికి ఇంకొకరు పోవడం గూడా వాళ్ళు ప్రారంభించారు. ఇంటి పెద్దల మధ్య గూడా మాటలూ - రాకపోకలూ ఏర్పడ్డవి. అయినా రాజూ, కాళాల మధ్య మాత్రం వాళ్ళ మనస్సులో ఎంత కోరిక వున్నా- సంభాషణ జరిగేది గాదు.

ఒకసారి గ్రామంలోని నవయువకులూ, నవయువతులూ ఝూలా తిరణా లకు బయలుదేరారు. కాళా నూనూగు మీసాల వయస్సులో వున్నాడు. అతడు తన బృందాన్ని ఒకదానిని తయారు చేసుకొన్నాడు. కోదర్ కాళా బృందంలో వుండేవాడు. నానా బృందం వేరుగా వుండేది. నానా బృందం ముందుగా తిరణాలకు బయలుదేరింది. "వాళ్ళను ముందు పోనివ్వండి, మనం ఆలస్యంగా బయలుదేరి ముందుగా ఝూలా చేరుకొందా" మన్నాడు కాళా.

భగా చెల్లెలు రూఖీకి ఈ విషయం తెలిసింది. ఆ విషయం రాజుకు గూడా తెలిసింది. రాజుకు మనస్సులో కాళా బృందంలో కలిసి వెళ్ళవలె నని వున్నా సాహసించలేక పోయింది. నానా వెంట బయలుదేరింది. రూఖీ గూడా ఆమె వెంట వున్నది.

(ఝూలా వెళ్ళే దోవలో పెద్ద అడవి వొకటి వున్నది. యాత్రికులు అడవి మధ్య నుండి ప్రయాణం చేస్తున్నారు.

కొంతసేపటికి ముందున్న యాత్రికులకు వెనకనుండి పాట వొకటి వినిపించింది.)

ధీరో నోరిలానే హాఓరే    ధీరోరే మేవాసి
ధీరో బంగడీ మూలవీ జువేరే    "

ఢీరో పేరీ ఫేరవీ జువేరే ,,
ఢీరో కోనా సారు వోరొరే ,,
మారే నాసేశీ ఘణియాణీరే ,,
మారే ఏనా సారు రుంరేవో ,,
ఢీరో వాణీలానే హటేరే ,,
ఢీరో వ్యాపారీ! ఇది బజారు
ఈ గాజుల ధర ఎంత ? చూడు.
గాజులు తిప్పి తిప్పి చూడు
ఇది ఎవరి కొరకై కొంటున్నావు. ?
నాకు చిన్న భార్య వున్నది.
ఆమె కొరకై ఇవి కొంటున్నాను
ఓ ఢీరో వ్యాపారీ! ఇది బజారు

పాట పాడుతున్న వాళ్ళు కోదర్, కాళా వంటి నలుగురైదుగురే అయినా ఇరవై మంది కలిసి పాడుతున్నట్లు పాట గంభీరంగా వున్నది. రాజూ, రూఖీ వెనకకు తిరిగి చూచారు. కాళా కోదర్లు ముందు ముందు నడుస్తు న్నారు. ఎర్ర తలపాగాలతో, చెవులలో పూలు పెట్టుకొని వున్నారు. వాళ్ళ చేతుల్లో ధనుస్సులూ, బాణాలూ వున్నవి. కోదర్ చేతిలో పెద్ద కత్తి వున్నది. భగా చేతిలో ముళ్ళు దేకిన బాణా కర్ర వున్నది.

వాళ్ల సాహసాన్ని చూచో, వాళ్ల నడకలోని వేగాన్ని చూచో లేక వాళ్ల పాటలోని మాధుర్యానికి ఆకర్షించబడో, కారణమేమిటో తెలియదు, రూఖీ కాళా బృందంలో కలిసిపోయింది. రాజు గూడా ఆ బృందంలో కలవక తప్పలేదు. అయితే ఆమె మనస్సులో ఆ కోరిక లేకపోలేదు. మనస్సులోనే చాలా సంతోషించింది. అంతా అతివేగంగా నడుస్తున్నారు. చూస్తూ చూస్తూ వుండగానే నానా రామూల బృందం వెనకబడిపోయింది. నానా, కుంటుతూవున్న అతని భార్య ఇద్దరూ మరీ వెనకబడ్డారు.

"ఓ నానా! మనం గాజులు తొడిగించుకొన్నామా? త్వరగా అడుగులు వెయ్యి" అన్నాడు రామా.

నానా నవ్వాడు. ఈర్ష్య వల్లా, కాళాతో సమానంగా నడవ గలిగిన శక్తిలేకా నానా "పోనివ్వండి. మనం నెమ్మదిగా, తాపీగా వెళ్లుదాం. దోవలో ఏ తాగిన భిల్ల సర్దారో తారసిల్లితే అప్పుడు వాళ్ల పని తెలుస్తుంది"

అన్నాడు. కాని అతని కోరిక ఫలించలేదు. తిరణాల దగ్గరకు పోయి చూస్తే - ముందు పోయిన వాళ్లంతా ఆనందంగా కాళా నాయకత్వాన వాళ్ళకు కావలసిన వస్తువులేవేవో కొనుక్కుంటున్నారు.

కోదర్, భగా మొదలైన వాళ్లు బాణాలూ విల్లంబులూ కొనుక్కొనడానికి పోతే కాళా అక్కడున్న ఆడవాళ్ళందరికీ మధ్య బంధువుగా వుండి వారికి సహాయం చేస్తున్నాడు. అది చూడగానే నానా కళ్లు భగ్గుమన్నవి. ఇంతలో నానా భార్య కుంటిపిల్ల గూడా కాళా బృందంతో కలిసింది. కాళాను గాజులు కొనిపెట్టమని కోరింది.

కాని కాళా ఎంతమందికి ఎన్ని వస్తువులు కొనిపెడతాడు!! రాజు ఏ వస్తువూ కొనమని నోటితో అనదు. నాలుగణాలు చేతిలోవి చేతిలోనే తిప్పుతూ వుండిపోయింది. రాజు అడిగితే సహాయం చేద్దామని కాళా అభిప్రాయం. కాళా అడిగితే డబ్బులిద్దామని రాజు అభిప్రాయం. ఇద్దరూ మొండిగానే వుండిపోవడం జరిగింది. రాజు ఒక గుడ్డల కొట్టుముందు ఆగింది. "రూఖీ! నీకేమి కావాలి? రవికలకు కట్టుకొనే తాళ్ళు కావాలన్నావు?" అని అడిగింది.

రూఖీ ఏమీ జవాబు చెప్పలేదు. గాజులు కొనేటప్పుడు రాజు "రూఖీ! నా కెవరు కొనిపెడతారులే?" అని కాళాను ఉద్దేశించి అన్నది.

చివరికి కాళా కొద్దిగా లొంగాడు. అతను రెండు జోళ్ళు, ముత్యాల రవికతాళ్ళు, రెండణాల గాజులూ కొన్నాడు. ఒక అద్దపు ముక్కలతో కుట్టబడిన మేలిముసుగు తీసుకొన్నాడు. రూఖీ, నానా భార్య అతణ్ణి ఎగతాళి చేయడం ఆరంభించారు. "ఇవన్నీ ఎవరికి కాళాభాయీ? అక్కకా?" అని అడిగారు.

కాళా ఏమి జవాబిస్తాడు?

అతడు జవాబివ్వకుండానే రాజు అర్థం చేసుకొన్నది. తను బేరం మొదలుపెట్టింది. ఆమెను వారించాలనీ, ఇవన్నీ నీకే అని రాజుతో అనవలెననీ కాళా మనస్సులో తీవ్రమైన కోరిక కలిగింది.

రాజు ఇంకొక మేలిముసుగును కొనడంవల్ల తన వస్తువులన్నీ కాళా రూఖీ చేతికిచ్చాడు. "రూఖీ! దాన్ని తిరిగివ్వమను, ఈ ముసుగు చాలు" అన్నాడు.

రూఖీ ఫక్కున నవ్వింది. "నీవే చెప్పరాదా?" అన్నది. రాజు గెలిచి

నట్లో వోడినట్లో చెప్పడం కష్టము. కానీ ఆమె మాట మార్చింది. "అవన్నీ భలీ కొరకేలే" అన్నది. అంటూ వస్తువులు భలీకి అప్పగించింది.

వీవయింటి పిల్ల భలీ చాలా సంతోషించింది. ఎవరో చెంపదెబ్బ కొట్టినట్లుగా కాళా నిశ్చేష్టుడైనాడు.

ఇంటికి వచ్చిన తరువాత గూడా అతని ఆలోచనలకు అంతం లేకుండా పోయింది. అతనికేమీ అర్థం గాలేదు. రాజుకు నిజంగా కోపం వచ్చిందా? సంగతంతా రూభీకి అర్థమయిందా? ఆ ప్రశ్నలు రాజునే అడిగితే? ఇటువంటి ఉత్సవ సమయాలలో కలిసి మాట్లాడడానికి అనేకమైన అవకాశాలు లభిస్తుంటాయి. అయినా రాజు ఎంత ప్రయత్నం చేసినా ఆమె నోటనుండి మాట వెలువడలేదు. అంతేగాదు మాట్లాడడానికి సాహసమే కలగలేదు.

16

## యౌవనం వేసిన కాటు

యౌవనంలో ప్రవేశించిన రాజు చైత్ర వైశాఖ మాసాలలో పుష్పించి ఫలించే వనరాజువలె పుష్పించడం వికసించడం ఆరంభించింది. కొన దేలిన ఆమె కళ్లల్లో మాదకత్వం వ్యాపించసాగింది. ఆమె నడకలోనూ, మాటల్లోనూ నిండుతనం ఏర్పడింది. ఆమె మాట్లాడే మాట మాటలోనూ హాస్యం తొణికిసలాడడం ఆరంభించింది.

కాని ఆ హాస్యం కాళా అదృష్టంలో లేదు. అది భగా, రామా వగైరాలకు మాత్రమే లభించడం ఆరంభించింది. కొన్ని రోజులైన తరువాత బహుశా తనను ఏడిపించడానికే రాజు తనను వదలి మిగతావారితో ఆ విధంగా మాట్లాడుతున్నదనే నిర్ణయానికి కాళా వచ్చాడు.

"రామా భాయీ! ఉమ్మెత్త పూవు చాలా అందంగా వుంటుంది. కాని దానివలన ప్రయోజనమేమున్నది? ఆ పూవు అందాన్ని చూచి ముగ్ధులమై ఉమ్మెత్తను తింటే మృత్యువు వాత పడవలసిందేగా?"

ఈ మాటలకు అర్థమేమిటి? ఆలోచిస్తే కాళాకు వాటిలో అనేకమైన అర్థాలు స్ఫురించడం ఆరంభించాయి. అయినా రాజు తాను వినేటట్లుగా ఇటువంటి మాటలు ఎందుకు మాట్లాడుతున్నది!! రాజు మీద అతనికి చాలా కోపం వచ్చింది.

ఒక రోజు రాజు వ్యవహారం హద్దుల్ని దాటిపోయింది. రెండు జాముల సమయంలో కాళా పొలంనుండి ఇంటికి వస్తున్నాడు. రెండు పొలాల దూరంలో గట్టుమీద నిలబడ్డ రాజు "నానా! ఈ గడ్డి మోపు కొంచెం నెత్తికెత్తు" అని అడిగింది. ఆ మాటలు తను వినాలి అని రాజు అభిప్రాయమా?

తన శత్రువు నానా. అతన్ని ఈ విధంగా రాజు ఆహ్వానించడం కాళాకు చాలా కష్టాన్ని కలిగించింది. అతని మనస్సులో సందేహం గూడా ఏర్పడింది. లోలోపల ఏదైనా వ్యవహారం జరుగుతున్నదా అని సంహించాడు. నెమ్మదిగా పక్కనున్న మొక్కజొన్న చేలోకి తప్పుకొని

ఇద్దరూ తనకు కనబడేటంత దూరంలో చేలో దాక్కొని చూడడం ఆరంభించాడు.

నానా రాగానే రాజు మోపు మీదికి వంగింది. నానా నిలబడి నవ్వుతూ "మోపు ఎత్తితే ప్రతిఫలం ఏమిటి లభిస్తుంది? ప్రయాసకు ఫలముండాలి" అన్నాడు.

నానా రూపసి. అందమైన వాడు. అతని శరీరం గౌరవర్ణం కలిగి వున్నది. అతని మోచేతికి బంగారపు కంకణ మున్నది. వేళ్లకు వెండి ఉంగరాలున్నవి.

చెవులకు దిద్దులూ, వేపపువ్వు కాడలూ వున్నవి. అతడు దోహాలు బాగా పాడ గలడు.

నానా మాటలు కాళాకు పూర్తిగా వినబడలేదు. అయినా వాటి భావాన్ని అర్థం జేసుకొన్నాడు. దానితో అతని నరాలు బిగిసినట్లనిపించింది.

"మోపు ఎత్తు" అన్నది రాజు.

"ఊరికేనేనా? నీ కొరకై నేను ఎంతగా ఎదురు చూస్తున్నానో నీకు తెలుసునా? నీవంటే నేను పిచ్చివాణ్ణి అయివున్నా" నంటూ నానా చేతులు చాచాడు.

కాళా శ్వాస బంధించబడినట్లయింది.

ఇంతలోనే చెంప చెళ్లుమన్న ధ్వని వినిపించింది. బాగా జరిగిందని కాళా సంతోషించాడు. నానా సిగ్గుపడ్డాడు. చెంప సవరించుకొంటూ కుక్కలాగా కాళ్లీడ్చుకుంటూ మొక్కజొన్న చేనులో అదృశ్యుడైనాడు.

ఆనందాతిరేకంతో ఊగుతున్న కాళా మోపు ఎత్తడానికి గబగబ తాను ముందుకు అడుగువేశాడు. కాని...

రెండు మూడు మణుగుల బరువున్న గడ్డిమోపును రాజు బలవంతంగా తానంత తానే నెత్తిమీదికెత్తుకున్నది. "నీ తల్లిదండ్రులు అదృష్టవంతులు" అన్న మాటలు కాళా నోట్లోనే వుండిపోయాయి. ఆ మాటలు బయటకు రాలేదు.

రాజు వెళ్లిపోయింది. రాజు తన భార్య అయివుంటే తన జీవితమంతా నిండిపోయేది అనుకొన్నాడు. కళ్లవెంట బొటబొట నీళ్లు కార్చాడు. దీర్ఘంగా నిట్టూర్చాడు. అతనికేమీ తోచలేదు. రకరకాలుగా రాజును గురించి ఆలోచనలు రావడం ఆరంభించాయి. ఆ ఆలోచనలతోనే

గ్రామంలోకి ప్రవేశించాడు. రాజు యింట్లోనుండి ఏడుపు వినబడుతున్నది. ఏడుపును కాళా గుర్తించాడు. రాజు చిన్నపిల్లలాగా ఎక్కి పెడుతున్నది. తల్లి రాజును "ఎందుకమ్మా! ఏడుస్తున్నావు? ఇంత పెద్ద మోపు ఎందుకు తెచ్చావు? ఎవరైనా ఏమైనా అన్నారా? ఏదైనా విషజంతువు కుట్టిందా?" అని రకరకాల ప్రశ్నలు వేసింది. రాజును ఏ విషజంతువో కుట్టివుంటుందని ఆమె అభిప్రాయం. రాజును కుట్టింది ఏ విషజంతువూ కాదు. ఆమెను కుట్టింది- ఆమెలో బయలుదేరిన భూతకాలపు కల్పనలూ, దహింపజేస్తున్న యౌవనం, ప్రణయమూనూ.

రాజు మోపుతో ఇంటి వాకిట్లోకి రాగానే ఆమె మనస్సులోని కల్పనలాగా ఆమె నెత్తి మోపుమీద కూర్చున్న ఒక పక్షి ఎగిరిపోయింది. తన జీవితంలో- ఈ మోపును దించేవాళ్లు- ఇక లభించరని ఆమెకనిపించింది. ఆశా విహీనమైన ఆమె అంతరంగంలో చిలుకడు ఆరంభమయింది. దానికి ఫలితంగా కళ్లు కన్నీళ్ళు కార్చాయి.

భగ్నమైన తన జీవితంలో ఏడుపు తప్ప ఇంకా మిగిలిందేమున్నది? అందుకే పెద్దగా ఏడ్చింది. కన్నీళ్ళు కారుస్తూ తనను లాలించి అడుగుతున్న తల్లికీ, కోపాన్ని వెలిబుస్తున్న కోదర్ భార్య కేసర్‌కూ, పక్కన చేరిన అమ్మలక్కలకూ రాజు తానేమి జవాబు చెప్తుతుంది!! ఆమె దగ్గర జవాబు లేదు. ఉన్నది ఏడుపు వొక్కటే.

కాని ఆ రహస్యం ఎవరికి తెలుసు? కాళాకు తెలుసు. అతడు తన మనస్సులో అనుకొన్నాడు. రాజును ఏ విషజంతువూ కుట్టలేదు. కుట్టింది- కాటు వేసింది యౌవనం ఒక్కటే.

కోదర్‌ను మొక్కజొన్న కండెలు కాల్చుకొందాం రమ్మని పిలిచాడు. ఇద్దరూ కలిసి వెళ్ళారు.

కాళా అంతరంగంలో ఆనందం నృత్యం చేస్తున్నది. అతని హృదయంలో సంతృప్తి నిండివున్నది. కటిక దరిద్రుడికి ఒక్కసారి ధన ధాన్య సమృద్ధి కలిగినట్టున్నది. పరమానందంతో అతని హృదయం గంతులు వేస్తున్నది.

## 17
# అయిపోయిందేదో అయిపోయింది

భాద్రపద మాసం. ప్రారంభంలోని ఒకనాటి సంధ్యా సమయమది. పగలంతా వర్షం లేక పోయినా తల మీద మేఘాలు నలువైపులా వ్యాపించి వున్నవి. మొక్కజొన్న పొలాల మీద మంద మందంగా గాలి వీస్తున్నది. మొక్కజొన్న చేలు తలలూపుతున్నవి. చిలకలూ కాకులూ గుంపులు గుంపులుగా ఆ చేల మీదకు దిగుతున్నవి. కాని మంచెల మీద వున్న కాపలావాళ్ళు హుడా హుడా అంటూ వడిసెల రాళ్ళు విసురుతున్నారు.

ఆ రాళ్ళ దెబ్బలకు పచ్చ పచ్చని, ఎర్ర ఎర్రని పక్షులన్నీ ఎగిరిపోతున్నవి. ఎగిరెగిరి అలసిన పక్షులు కాళా పొలం ప్రక్కనున్న వట వృక్షం పైకి చేరుకొన్నవి. అయితే కాళా ఆ పక్షుల్ని వటవృక్షం మీద గూడా కూర్చోనిచ్చేటట్లు లేడు. అక్కడికి సమీపంలోనే వున్న మంచె మీద కాళా కోదర్లు నిలబడి వున్నారు. మొక్కజొన్న కండెలు తిని అప్పుడే వాళ్లిద్దరూ మంచె మీద కెక్కారు. కాళా వొంటి మీద అంగరఖా గూడా లేదు. అతని నోరు మాట్లాడుతూనే వున్నా అతని కళ్లు పొలం మీదనే ఉన్నవి. అతని దృష్టి మర్రిచెట్టు మీద గూడా వున్నది. "నీ మర్రిచెట్టు బంగారంగాను! వడిసెలలు గూడా పని జేయడం లేదు. నీవి ఇనప చేతులు గనుక సరిపోతున్నది గాని, చెట్టు మీది పక్షుల్ని లేవ గొట్టడం బ్రహ్మతరం గూడా కాకుండా పోతున్నది" అన్నాడు కోదర్. కాళా చేతులు నిజంగా ఇనప చేతులే. "కోదర్! నీవు వడిసెలతో రాళ్ళు విసురు. నేను వొట్టి చేతితో రాయి విసరుతాను. ఎవరు విసిరిన రాయి దూరం పోతుందో చూద్దామన్నాడు కాళా. "పందెమంటే పందెమ" నుకొన్నారు.

కోదరు ఒక గుండ్రని రాయి తీసుకొని వడిసెల గిర గిర తిప్పుతూ దూరంగా విసిరాడు.

"అదిగో, ఆ పొదలో ఆ తుమ్మచెట్టు పక్కన రాయి పడిందన్నాడు" కాళా. కోదర్ అంగీకరించాడు.

కాళా ఒక రాయి చేతిలోకి తీసుకొన్నాడు. "చూడు" అన్నాడు. మొత్తం శరీరాన్ని అంతా ధనస్సులాగా వంచి బలంగా రాయి విసి

రాడు. తుమ్మచెట్టు పక్కనున్న పొదను దాటి రాయి ఇరవై మూరలు దూరంగా పోయి పడింది.

కోదర్ పోటమిని అంగీకరించాడు. "అబ్బా! నీకు ఎంత బల మున్నది?" అని కాళాను ప్రశంసించాడు.

"భగవంతుడు నీకు ఇంతటి శక్తి నిచ్చాడు. కాని ఈ వొంటరి జీవిత మేమిటి? కాళా! నా మాట విను. వెళ్ళి అక్కను పిలుచుకొనిరా. నీ తల్లి పెద్దదై పోయింది. పని చేయలేకుండా వున్నది. పరమాను పంపించి పిల్లను తీసుకొని వస్తే బాగా వుంటుంది" అన్నాడు కోదర్. అయితే ఆ మాట కాళాకు రుచించినట్లు లేదు. ఉదాసీనంగా ఉండిపోయాడు.

కోదర్ అప్పటికీ వదలకపోతే "పనిచేసి ఇంటికి సహాయం చేస్తున్న పిల్లను అత్తవారింటికి ఎవరు పంపిస్తారు? పాలిచ్చే గేదెను ఎవరు వదలి పెడతారు?" అన్నాడు.

"మన జాతిలో వున్న ఇబ్బంది యిదే. పనిచేసే ఆడపిల్లల్ని తొందరగా అత్తవారిండ్లకు పంపించరు. ఏ చెడు పనో చేస్తే బహుశా అపుడు తొందర పడతా" రన్నాడు.

"మా అమ్మ దీపావళి వెళ్ళగానే రాజును అత్తవారింటికి పంపుతా నంటున్నది. నీ భార్యను నీవు తీసుకొనిరావడం మంచి"దన్నాడు కోదర్.

కాళాకు తన భార్యను తీసుకొని రావడం మనస్సులో అంత ఇష్టంగా లేదు. "అయితే రాజును అత్తవారింటికి..." మాట మధ్యలోనే ఆపివేశాడు కాళా.

"అవును. అత్తవారింటికి వెళ్ళుతుంది. మావ్‌లా కూతురు చూచావా ఏమి చేసిందో.." అని కోదర్ అంటూండగనే కాళా దృష్టి మర్రిచెట్టు మీద నుండి పొలం మీదికి దిగుతున్న పక్షుల వైపుకు పోయింది. హుశా హుడా అని అరుస్తూ విధి విరామం లేకుండా వడిసెల విసరడం ఆరంభించాడు.

"అబ్బబ్బ! ఎన్ని పక్షులు! ఆకాశమంతా నిండి పోయింది" అన్నాడు.

పశ్చిమ దిశలో మేఘాలలో ప్రవేశిస్తున్న సూర్యుడు బంగారపు పళ్ళెం లాగా కనిపిస్తున్నాడు. చిరునవ్వు నవ్వుతూ వున్నట్లున్నాడు. లేత ఎరుపు రంగు దుప్పటి ఆకాశమంతా కప్పబడినట్లయింది. కొంచెం చీకటి పడింది. కాళా కోదర్లిద్దరూ మంచెమీద నుండి కిందికి దిగారు. ఇంటికి బయలు దేరారు. దోవలో ఇద్దరూ మౌనంగా వున్నారు. మధ్య మధ్య ఏదైనా

మాట్లాడినా పొలాలను గురించీ, రాబోయే కాలాన్ని గురించీ మాత్రమే మాట్లాడుతున్నారు.

కాళా మాట్లాడుతూనే వున్నా లోలోపల ఏమిటో ఆలోచిస్తున్నాడు. దీపావళి వెళ్లగానే రాజు అత్తవారింటికి వెళ్లిపోతుంది. పంపవద్దని తానంటే ఏమవుతుంది ? ఊళ్లో వాళ్లంతా అనుమానిస్తారు. ఏదో ఉన్నదను కొంటారు. కోదర్ ఏమి అనుకోక పోవచ్చును, కాని అతని తల్లి!..

అయినా తనకెందుకు ? తానెవరు ? రాజుతో తనకేమి సంబంధం ? ప్రశ్నలు వేసుకొంటున్నాడు. జవాబేమి రావడం లేదు. రాజు యోగ్యు రాలు. ఊళ్ళోవాళ్లకు అనుమానం కలిగే పని తానేమి చేయడు. అయినా ఏ పొలంలోనో ఏ నానావంటి వాడో వెంబడిబడితే ఆమెను ఎవరు రక్షిస్తారు? ఆడవాళ్ళకుండే శరీరబలమెంత ? అవకాశం వస్తే తాను ఆమెను రక్షించగలడు. కాని లోకంపోకడ వేరుగా వుంటుంది.

నిండిన యిల్లూ, అందగాడైన వరుడూ వుంటే ఏలోటూ వుండదు. ఇల్లు బీదదై, వరుడు బీదగావుంటే అటువంటి యిల్లు నిర్వహించుకొన్న స్త్రీయే గొప్పది.. ఏమేమిటో వూహలు అతని మనస్సులో బయలుదేరాయి.

"దీపావళి వెళ్లగానే రాజును అత్తవారింటికి పంపుతారు" అని కోదర్ అన్నాడు. దీపావళి రావడానికి కొంత సమయమున్నది. గ్రామాలల్లో దీపావళి అంటే దీపావళి అని అర్థమా? దీపావళి అంటే హోలీ గూడా కావచ్చును. ఆడపిల్లల్ని అత్తవారింటికి పంపించే విషయంలో దీపావళులు హోలీలు కావడం, హోలీలు దీపావళులు కావడం సంభవమే.

రాజు అత్తవారింటికి పోతేనేకాని తన కోడలు తన యింటికి రాదని రూపా అంటూనే వున్నది. ఆమె మాటే నిజమయింది. పశువుల్ని మేపే సమయం లోనూ, నీళ్లు తెచ్చే సమయంలోనూ కలిసినప్పుడల్లా రూపా రాజు తల్లికి తన దుఃఖ గాథ తెలియజేయడం ఆరంభించింది.

ఏమైనా రాజు అత్తవారింటికి పోవాలి గదా? అక్కడవున్న రెండు ఆరకల భూమినీ రాజుగానీ భలీ గానీ వుంటేనే గాని సంబాళించే వాళ్లెవ్వరు ?

కాళా తల్లి చాలా నిరాశురాలయింది. ఎండి పుల్లయిపోయింది. కోడలి చేతి అన్నం తినే అదృష్టం తనకు లేదనుకొన్నది.

రాజు తల్లి హృదయం కరిగింది. రూపా యెడల ఆమెకు ఎంతో సద్భావం గూడా లేకపోలేదు. అందువలన దీపావళి వెళ్ళడంతోనే రాజును అత్తవారింటికి పంపించే ఏర్పాట్లు చేసింది. కాళాను వెంటబెట్టుకొని కోవర్‌తో కలిసి కావలసిన చీరలూ, వస్తువులూ తీసుకొని వచ్చింది.

అత్తవారింటికి పంపించే ముహూర్తం ఆసన్నం కాగానే పేరంటాళ్లు ఇంటికి చేరారు. కాని రాజు యింట్లో ఎవ్వరికీ ఏమీ ఆనందంగా లేదు. అతిథి సత్కారాలు పూర్తి అయిన తరువాత కాళా తన యింటికి వెళ్ళి కూర్చున్నాడు. కోవర్ తనను పిలవడానికి వస్తే "నేను రాను. క్షమించు" అన్నాడు. ఆ జవాబు విన్న తరువాత కోవర్ గానీ, అతని తల్లి గానీ ఏమీ చేస్తారు?

రాజు తల్లి – రోకలీ, చేటా, చీపురుకట్టా హుక్కా వగైరాలన్నీ మూటలు కట్టింది. భోజనాలు పూర్తి అయినవి. గ్రామం గ్రామమంతా రాజు యింట్లో చేరింది. కొంతమంది నవ్వుతున్నారు. కొంతమంది హాస్యంగా మాట్లాడు తున్నారు. (కోవర్ భార్య కేసర్ తప్ప అంతా విచారంగా వున్నారు. రాజు కళ్ల వెంట బొట బొట నీళ్లు కారుతున్నవి. కాళా ఎక్కడా కనిపించ లేదు. రాజు కళ్ళు కాళా కోసం వెదకుతున్నది.)

కాళా ఏడి? ఊరికి దూరంగా వున్న మిరిచెట్టు పొలంలో మంచె మీదకు వెళ్ళి కూర్చున్నాడు.) రాజుకు కాళాకు కలిగిన దుఃఖం అర్థమయింది. ఎంతగా కన్నీరు కారుస్తుంటాడో–రాజు మనస్సులోనే వూహించుకొన్నది.

రెండు ఆత్మలూ పరస్పరం ఒక దానిలో ఇంకొకటి లోలోపల మాట్లాడుకుంటున్నట్లున్నవి "నీవు ఎంత ఏడ్చినా లాభం లేదు. అయిం దేదో అయిపోయింది. విధి వ్రాత తప్పదు" అని ఆ మాటల సారాంశం.

రాజు ఎక్కిన బండి బయలుదేరింది. కాళా మంచెదిగి రాజును చూడ డానికి వటవృక్షం మీదికి ఎక్కాడు. నిండిన హృదయంతో, కన్నీ ళ్లతో నిండిన కళ్లతో రాజు వైపుకు చూస్తున్నాడు.

బండి కనిపించింది. అతని హృదయం బద్దలయింది. శూన్య హృద యాన్ని నింపుకున్నట్లుగా దీర్ఘంగా నిట్టూర్చాడు.

బండి అదృశ్యమైపోయింది. మిరి ఆకులమీద టప టప టప టపమని కన్నీటి బిందువులు వర్షిస్తున్నవి.

## 18

## అలసిన వాడికి విశ్రాంతి

పది పన్నెండు రోజుల్లోనే అత్తవారింట్లో అందరూ రాజును ప్రశంసించడం ఆరంభించారు. "పిల్ల ఎంత మంచిది! తన పనేమో తానేమో తప్ప ఇతర సంగతి ఆమెకు అక్కర్లేదు" అని పెద్ద కోడలు అనడం ప్రారంభించింది.

భలీని అత్తవారింటికి పంపమని అడగడానికి పరమా పటేలు వచ్చాడు. "భలీకి రెండు మూడు చీరలుంటే బాగుండును. ఇంటిపేరు మార్చి భలీని అత్తవారింటికి పంపవచ్చు" నని పెద్ద కోడలు అన్నది.

చీరల కేమిటి తక్కువ అంటూనే రాజు తన చీరల్లో నుండి రెండు తీసి ఇంటి పెద్ద కోడలు చేతిలో పెట్టింది. పెద్దామె ఆశ్చర్యపడింది. తన భర్త ముందు రాజును ఎంతగానో ప్రశంసించింది. పుట్టింట్లో గోధుమ రొట్టెలు తిన్న రాజు అత్తవారింట్లో ఏ జొన్నరొట్టె లభించినా దానితోనే సంతోషించేది.

రాజు కీర్తి ఆ గ్రామమంతా వ్యాపించింది. రాజు ఇంట్లో రెండెద్దులూ రెండు ఆవులూ తప్ప ఐదో పశువులేదు. రాజు భర్త యువకుడే అయినా శరీరాన్ని బట్టీ, స్వభావాన్ని బట్టీ అతడంత సమర్థుడు గాడు. అతని దౌర్బల్యాన్ని గమనించిన వారంతా కొత్త కోడలు ఆ యింట్లో కొత్త పాఠం ప్రారంభిస్తుందనుకొన్నారు. రాజు ఎక్కువ రోజులు ఆ యింట్లో వుండ దనుకొన్నారు. కాపరానికి వచ్చిన పది పదిహేను రోజుల్లోనే పుట్టింటికి వెళ్ళిపోతుందనుకొన్నారు. నెల రోజులు గడిచినా ఆమె పుట్టింటి పేరే ఎత్తలేదు. అందరితోనూ మితంగా మాట్లాడేది. ఎవరెంత ప్రశంసించినా ఆమె తన స్థితిని మాత్రం మరచిపోలేదు. యౌవనంలో వుండే సహజ ఉచ్ఛృంఖలత్వాన్నీ హాస్యప్రియత్వాన్నీ ఆమె పుట్టింటి దగ్గరే వదలి వేసింది. ఆమె అంతరంగంలో అసంతృప్తి లేకపోలేదు. దీర్ఘనిశ్వాసాలతో కన్నీళ్లతో ఆ అసంతృప్తిని దూరం చేసుకునే ప్రయత్నం చేసేది. కాళా అన్న మాటల్ని ఆమె బాగా జ్ఞాపకం పెట్టుకొన్నది – "గృహం సంపన్నంగా వుండి భర్త అన్నివిధాలా సమర్థుడుగా వుంటే ఇల్లు నిర్వహించడంలో విశేషమేమీలేదు. భర్త అమాయకుడో, అసమర్థుడో అయినప్పుడు ఇల్లు

సంబాళించుకోనడం గొప్ప విషయం'' అని కాళా అనివున్నాడు. అంతేగాక కాళా మీద అప్రయత్నంగా ఆమెకేర్పడిన కటుభావం గూడా ఎందువల్లనో దూరమయిపోయింది. జరిగిన ఘటనలనన్నింటినీ జ్ఞాపకం చేసుకుంటే, వాటిలో కాళా చేసిన పొరపాటేమున్నది? తప్పు చేసినవాడు తన మేన మామ. ఆ తప్పుకు ఫలితాన్ని కాళా అనుభవిస్తున్నాడు. కాళా అంటే ఆమెకు సానుభూతిగూడా ఏర్పడింది. అతను సుఖంగా వుంటే చూడాలి అనీ, అతనికి చేతనైన సహాయమంతా చేయాలి అని ఆమెలో బలమైన కోరిక ఏర్పడింది. అందువల్లనే కాళా తల్లి జబ్బుగా వున్నదనీ, ఆమెకు సహాయం అవసరమనీ భలీకి నచ్చజెప్పింది. భలీని అత్తవారింటికి పంపడానికి తగిన ఏర్పాట్లు చేసింది. తనవి మూడు చీరలు భలీకి యిచ్చింది. రెండు మూడు లంగాలిచ్చింది.

కాళా, కోవర్, పరమా పటేల్, శంకర్, కాసిమ్ అంతా భలీని తీసుకొని పోవడానికి వచ్చివున్నారు. ఇంటిముందు మంచాలమీద కూర్చొని వున్నారు. ఆ దృశ్యమంతా రాజు చూసింది. ఆమె మనస్సులోని ఉల్లాస మంతా ఏమయిపోయిందో తెలియదు. ఆమె హృదయం భగ్గుమన్నది. భలీ ఆమెకు శత్రువురాలుగా కనిపించింది.

ఇంటి అల్లుడి తలగుడ్డా, ధోవతులు మొదలైన వాటిని దాచి పెట్టడంలో తాను పాల్గొనలేదు. అంతేగాక కాళా తలగుడ్డ తెచ్చిన వాళ్ళను మందలించింది.

కాసిమ్ ఉత్సాహంగా ఏమిటో మాట్లాడుతున్నాడు. రాజుకు ఆ మాటలు వినవలెననే కుతూహలం గూడా లేదు.

ఇంతలోనే కాసిమ్ పాట ప్రారంభించాడు

రడీ హసాడే హసీ రడావే ఏ వేవాణ్ భవాయో

జీవతరనుంయ పీవుం వలోణుం లయాలో వేవాయా రవాయో

ఏడ్చే వాళ్ళను నవ్వించడం నవ్వేవాళ్ళను ఏడ్పించడం.-

అది భవాయీ నృత్యం.

కష్టంతో ఈ జీవితాన్నే మధించు.

శంకర్ అందుకొన్నాడు. ''కాసిమ్! ఏది మళ్ళీ ఆ పాట పాడు. భవాయీ నృత్యమా?'' అన్నాడు.

(కాసిమ్ తిరిగి అదే పాట పాడాడు.

జనమంతా సంతోషించారు.)

కాళా ఆలోచనలోపడ్డాడు. "అవును జీవితం కష్టం వంటిది. నిజమే" అనుకొన్నాడు.

కాని రాజు మాత్రం తన జీవితంలోని విషమ స్థితిని గుర్తు చేసుకొని భోరున ఏడ్చింది. ఆ రాత్రి ఆమెకు నిద్ర రాలేదు. తెల్లవార్లూ కన్నీరు కారుస్తూనే వున్నది. రెండో రోజు భలీ అత్త వారింటికి బయలుదేరింది. రాజు ఆమెను పంపడానికి బయటికి రాలేకపోయింది. "భలీ అత్త వారింటికి పోతుంటే రాజూ! ఎందుకమ్మా అంత దుఃఖపడుతున్నా"వని ఇరుగు పొరుగు వారడిగారు.

రాజు మనస్సును దృఢం చేసుకొన్నది. ఇది కర్మ ఫలం. అనుభవించ వలసిందేనని దృఢ నిశ్చయానికి వచ్చింది. నీటిమీది నాచును విడదీసినట్లు తన భావాలను విడదీసి స్వచ్ఛమైన జలంలాగా చిరునవ్వు నవ్వింది.

"వదినా! కలవవలసిన వాళ్లందర్నీ గ్రామంలో కలిసి రా" అన్నది. భలీకి సదుపదేశం గూడా చేసింది.

"కాళా స్నానం చేసినప్పుడు వేడి నీళ్ళు తయారుచేసి పెట్టు. అతని ధోవతుల్ని నీవు స్వయంగా ఉతుకు. భోజనం చేసేటప్పుడు రుచిగా పదార్థాలు చేయి. అతడు కోపగించినా నీవు నవ్వుతూ మాట్లాడు. ఇంట్లో అత్తగారు న్నది. ఆమెను దేవతగా చూసుకో. నిన్ను అదలించడానికీ, అరడి పెట్టడా నికీ అక్కడ ఎవరూ లేరు" అని హితోపదేశం చేసింది.

"భార్యా భర్త లిద్దరూ అన్యోన్యంగా కలిసి మెలసి ఆనందంగా.." అనబోతూ దీర్ఘంగా నిట్టూర్చింది.

"చివరికి ఒక్క మాట. భలీ! నీవు వయస్సులో నా కంటే పెద్దదానివి. నేను నీకేమి హితోపదేశం చేయగలను?" అన్నది.

కాళా వైపుకు తిరిగి-అతని ఉదాసీనంగా వున్న ముఖాన్ని గమనిస్తూనే "భలీ అమాయకురాలు. చెప్పి పనులు చేయించుకో. బాధ్యత నీదే" అన్నది.

అంతా ప్రయాణమైనారు. కాళా దృష్టితో రాజు దృష్టి కలిసింది. అసలే ఆమె శరీరం అలసిపోయి వున్నది. రాజుకు తన మీద తనకే కోపం వచ్చింది.

"ఎవరెట్లా చస్తే నాకెందుకు? నా సంగతి పట్టిన వాళ్ళెవరున్నారు? అన్నీ నాకెందుకు? ఊళ్లో వాళ్ల సంసారం బాధ్యత నాకెందుకు?" అనుకొన్నది.

ఊరు మొగదాకా రాజూ, ఇంకా కొంత మంది గ్రామంలోని ఆడవాళ్లూ భలీని పంపడానికి వచ్చారు. భలీ కన్నీళ్ళు కారుస్తున్నది. రాజు కళ్ల వెంట నీళ్ళు కారుతున్నవి. భలీ కనుచూపు మేర దాటిపోయింది.

పెద్ద తోడికోడలుతో బాటు తన యింటికి వెళ్ళుతూ రాజు ఎవ్వరికీ కనబడకుండా కళ్ళు తుడుచుకొని తన మనస్సును తానే సంబాళించుకొన్నది. ఎవరి జీవితానికి ఎవరు కర్తలు! ఎవరికెంత వ్రాసి వుంటే అంతే. ఈ జరిగినదాంట్లో భలీ తప్పేమున్నది? మనువు చెడగొట్టడానికి ఆమె పూనుకోలేదు గదా! ఆడపిల్లా ఆవూ ఎక్కడికి యజమాని తీసుకొనిపోతే అక్కడికి వెళ్ళుతవి అనుకొన్నది.

కాళా నడుస్తున్నంతసేపూ రకరకాలుగా ఆలోచిస్తూనే వున్నాడు. "బ్రహ్మరాత ఇట్లావున్నది. నా అదృష్టంలో ఆ సన్నని రాజుకు బదులు ఈ లావుపాటి భలీ వ్రాసి వున్నది" అనుకొన్నాడు.

కాళాకు భలీ ఏమాత్రం నచ్చలేదు. తల్లిమాట తాను కాదనలేడు. రాజా ఇంత తొందరగా అత్తవారింటికి వెళ్ళుతుందనీ, భలీని ఇంత తొందరగా తీసుకొని రావడం జరుగుతుందనీ గూడా అతడు వూహించలేదు. మేకను అమ్మి ఒంటెను కొనుక్కున్నట్లున్నదని అనుకొన్నాడు.

ఇంటికి రాగానే "ఇదిగో నీ కోడలు. కోడలి చేతి అన్నం తినవలెనని ప్రాణం తీశావు. ఇక కడుపునిండా తిను" అన్నాడు.

మంచం మీద పడివున్న తల్లికి కాళా మాటలు విచిత్రంగా కన్పించాయి. "ఏమిటి నీవనేది కాళా?" అని అడిగింది.

కాళా జవాబు చెప్పకుండానే తన తల గుడ్డ తిరగలిమీద పడవేసి వూళ్ళోకి వెళ్ళాడు. జబ్బుగా వున్న తన తల్లిని "నీకెట్లా వున్నది, జ్వరం తగ్గిందా లేదా?" అని గూడా అడగలేదు.

తల్లికి ఏమీ అర్థం కాలేదు. కోదర్, పరమాలు అక్కడే వున్నారు. కోడలు ఇంట్లో ప్రవేశించింది. కోడలిని చూచుకోగానే రూప హృదయం చల్లబడింది. "అమ్మా! రా" అని భలీని తన పక్కన కూర్చొనబెట్టుకొన్నది. ఆమె తల నిమరడం ఆరంభించింది.

("కోడలి కాళ్ళు మంచివి" అన్నది. "కాళా ఎక్కడికి వెళ్ళాడు?" అని అడిగింది.) (కాళా వ్యవహారం ఆమెకు కష్టాన్ని కలిగించింది. "మొదటి కబళంలోనే ఈగ బడింది" అనుకొన్నది.

భలీ ఇంటి పనులు ప్రారంభించింది. కడవ తీసుకొని నీళ్ళకు బయలు దేరింది. నాథా భార్య గూడా ఆమె పక్కన చేరింది. ఇద్దరూ నీళ్ళకు వెళ్ళారు.

రూపా తన కోడలి పనితనాన్ని బాగా గమనించింది.

కాళా ఇంటి దగ్గర సరిగ్గా వుండక పోవటాన్ని గూడా గుర్తించింది. కోడలంటే ఆమెకు అభిమానం ఏర్పడింది. ప్రేమతో మనుష్యుల్ని జయించ వచ్చును, కాని దానికి గూడా ప్రేమ అవసరం. అదే దానికి సాధనం. రెండు మూడు రోజుల్లోనే రూపా కాళా మనస్సును అర్థం జేసుకొన్నది.

మూడో రోజు కోవర్‌ను పంపించి ఊళ్ళో ఖాళాదూరుగా తిరుగుతున్న కాళాను ఇంటికి పిలిపించింది. దగ్గర కూర్చొన బెట్టుకొని అనేకం నీతులు చెప్పింది. "ఇక నేను బ్రతికి వుండేది నాలుగైదు రోజులు. నా మనస్సును ఈ చివరి రోజుల్లో నీవు బాధ పెట్టవద్దు. భలీ నీకు నచ్చ లేదు, నా కర్థమయింది" అంటూనే రూపా కన్నీళ్ళు కార్చింది. "నీ జీవితంలో ఎవరో చిచ్చు వెలిగిస్తే దానితో నన్ను బాధించడం ఉచితం గాదు. నేను చచ్చిపోయిన తరువాత నీకు నీతులు చెప్పే తల్లి ఉండదు. మీరే విధంగా వున్నారో చూడటానికి నేనుండను" అన్నది.

తల్లి మాటలు విన్న కాళా తన నిర్ణయాన్ని మార్చుకొన్నాడు. ఇష్టం లేని పనిని ఇష్టమైనదిగా మార్చుకొనవలసి వచ్చింది. రాత్రిళ్ళు వరండాలో నాథా భార్య వేసిన మంచం మీద భార్యతో కలిసి తాను నిద్ర పోవలసి వచ్చింది. అన్నీ చేస్తూనే వున్నా అతని మనస్సులో ఏదో కొరత లేకపోలేదు.

రూపా కాళా వ్యవహారాన్ని చూచి ఆనందించింది. కొడుకు తన మాటను మన్నించాడను కొన్నది. ఐదో రోజున కాళాను దగ్గరకు పిలుచు కున్నది. "నాయనా! భగవంతుడు మెచ్చేటట్లుగా వ్యవహరించు" అన్నది. ఆ మాట అంటుంటే ఆమె గత జీవితం ఆమె కళ్ళ ముందుకు వచ్చింది. ఆమె భర్త పిల్లల కొరకై రెండో పెళ్ళి చేసుకొన్నాడు. ఐదు సంవత్సరాలు ఆ కారణంగా తాను పడ్డ బాధ అంతా ఆమెకు జ్ఞాపక మొచ్చింది. తమలో రెండో ఆమె చనిపోయింది. మంచి దయింది. లేక పోతే.. వెంటనే ఆమె కొక ఆలోచన తోచింది. "కాళా!" అన్నది. "నా

అనుభవాన్ని దృష్టిలో బెట్టుకొని నీతిపాఠం నేర్చుకో. నీ తండ్రి ఏడు యిళ్ళు నాశనమైనా సరే, ఒక భార్య బ్రతికి వుండగా రెండో భార్యను చేసుకొన గూడదనే వాడు. ఆ మాటను నీవు గూడా గుర్తు బెట్టుకోవాలి'' అన్నది. తన తల్లి మెదడు పనిజేయడం లేదేమోనని కాళాకు అనుమానం కలిగింది. "అమ్మా! నీ వనేదేమిటి? ఏమిటి ఈ మాటలు?'' అన్నాడు.

"నా ఆత్మ చెపుతున్నది. కాళా! నా మాట జ్ఞాపకం బెట్టుకో. కోడలు బీదయింటి పిల్ల. అపును పోషించినవాడే గొల్ల. నీ వ్యవహారం వలన కోడలికి ఎటువంటి కష్టమూ కలుగ గూడ'' దన్నది. "నాకు ఏ కష్టమూ కలుగగూడ'' దన్నది.

"ఇపుడు నీకేమి కష్టం వచ్చింది? పిచ్చి వాగుడు కట్టిపెట్టి నిశ్శబ్దంగా పడివుండు'' అన్నాడు పరమా పటేలు.

అయినా రూపా మాట్లాడుతూనే వున్నది. బలహీనంగా వున్న తన చేతుల్ని మంచం పట్టెమీద నెమ్మదిగా పెట్టింది. ఆమె ఏమేమిటో అంటున్నది.

ఆమెకు భూతం పట్టినట్లున్నదని పక్కన వున్న వాళ్ళందరూ నవ్వడం ఆరంభించారు. "కాళా! ఇటురా. ఇదిగో నా చెయ్యి. చేతిలో చెయ్యివేసి మాట ఇవ్వు. నీవు భలీ వుండగా రెండోపెళ్ళి చేసుకోనని మాట యివ్వు'' అన్నది. "అప్పుడే నా మనస్సుకు శాంతి'' అని గూడా అన్నది.

కాళా ఆలోచనలో పడ్డాడు. చిన్నతనంలో బ్రాహ్మణుడన్న మాటను భగ్నం చేయడానికి ఆమె ఈ ప్రయత్నం ప్రారంభించిందని అర్థం జేసుకొన్నాడు. రాజును ఇంటికి తీసుకొని వస్తాడేమోనని ఆమె భయం. కొంత సేపు బాగా ఆలోచించి కాళా తన తల్లి చేతిలో చెయ్యి వేశాడు. తప్పు మార్గంలో తానే పనినీ చేయనన్నాడు. రూపా మహదానంద భరితురాలయింది. ఆమె కళ్ళు అమృతం వర్షిస్తున్నవి. కొడుకును మనసారా ఆశీర్వదించింది. ఈ శుభ సమాచారాన్ని తన భర్తకు వెళ్ళి చెప్పవలెనని ఆతురపడుతున్నట్లున్నది. అయిదారు క్షణాలు గడిచాయి. ఏడో క్షణంలో ఆమె కళ్ళు గిర గిర తిరగడం ఆరంభించాయి.

శంకర్, పరమా పటేలు, కాసిమ్ ముగ్గురూ - "శరీరాన్ని కింద బెట్టండి'' అన్నారు.

శరీరాన్ని కిందకు దించుతూ వుండగానే డెబ్బై సంవత్సరాల ఆ జీవితం సమాప్తమయింది.

మూడో రోజు అస్థి సంచయనం జరిగింది. ఆ రోజే గరుడ పురాణం ప్రారంభించాడు పురోహితుడు. నాలుగో రోజూ, ఐదో రోజు బంధువులంతా వచ్చి ఓదార్చి వెళ్లారు. పదో రోజు సూతకం పూర్తయింది. పదకొండోరోజు పిల్లలకు భోజనాలు పెట్టడం జరిగింది. పన్నెండో రోజు ఖలీభాత్ (శ్రాద్ధపు పెద్ద విందు) జరిగింది. చుట్టు పక్కల గ్రామాలవాళ్ళంతా నేతి హల్వాతో భోజనం చేశారు. పదమూడో రోజు సాయంత్రం తమ తమ గ్రామాలకు బయలుదేరిన జనం కర్మ బాగా జరిగిందనీ, కాళావంటి సంతానమే సంతానమనీ దీవిస్తూ - ప్రశంసిస్తూ "ముసలిది అదృష్టవంతురాల" న్నారు. "అయిదు మణుగుల నెయ్యి కర్మకు ఖర్చయింది. అది సామాన్యమైన విషయం గాదు" అన్నారు.

కర్మ పూర్తి అయిన తరువాత కాళా షాహుకారూ లెక్కలు చూసుకొన్నారు. పంచాయతీదార్ల సలహా ప్రకారం షాహుకారు లెక్కల్లో కొన్ని సర్దుబాట్లు చేశాడు. బాబాషాహి నాణేలకూ, కల్దార్ నాణేలకూ మధ్య వున్న వ్యత్యాసాన్ని గూడా లెక్కలో చేర్చాడు. మొత్తం పదిహేడు ఇరవైలూ-పైన ఏడు రూపాయలూ" అన్నాడు. కాళాను వేలిముద్ర వెయ్యమన్నాడు.

"నా తలమీద వున్ని వెంట్రుకలైనా లేవే" అంటూ కాళా వేలిముద్ర వేశాడు. "కాశీ కాకా! ఈ అప్పు ఈ జీవితంలో తీరుతుందా?" అని అడిగాడు.

"దర్జీ బ్రతికున్నంత కాలం జనం గుడ్డలు కుట్టించు కొంటూనే వుంటారు" అన్నాడు షాహుకారు. అంతా షాహుకారు మాటకు తల వూపారు. తరువాత అంతా షాహుకారు కోసం తయారు చేయబడ్డ లడ్లు తిన్నారు. పధ్నాలుగో రోజు ఉదయం షాహుకారు గుర్రమెక్కాడు.

ఆ రోజు సాయంత్రానికి కాళాకు ఒళ్ళు తెలిసింది. ఇక తనకు తల్లి లేదు అని అర్థమయింది. ఇక తన యింట్లో పరాయిపిల్ల ఖలీ స్థిరపడింది అని బోధపరచుకొన్నాడు. అంతా అతనికెందుకో శూన్యంగా కనిపించింది. కళ్లవెంట బొట బొట నీళ్ళు కార్చాడు. ఖలీ విషయంలో తన మనస్సును తాను సమాధాన పరచుకొనే ప్రయత్నం ప్రారంభించాడు. అయినా మనస్సు అంగీకరిస్తే జీవితంలో కష్టాలెందుకుంటవి?

తన ఇంటి భారమంతా కాళా భలీకి అప్పగించాడు. నెయ్యి, పాలు, పశువులు అన్నీ ఆమె ఆధీనంలో వుండి పోయినవి. భలీ ఇంటి బాధ్యత తన నెత్తిమీద పెట్టుకొన్నది. ఏమిటో ఆమెకు గూడా ఇల్లు శూన్యంగానే కనబడడమారంభించింది. స్త్రీ సహజమైన చిరు బురులాడడం గూడా ఆమె ప్రారంభించింది. కాళా వ్యవహారం ఆమెకు నచ్చలేదు. విసిగి పోయింది. ఎప్పుడూ కాళా మౌనంగా వుంటాడు. సరిగ్గా మాట్లాడడు. ఇంట్లో ఉత్సాహంగా వుండడు. ఆమె కదంతా బాధాకరంగా తోచింది. "నేను పుట్టింటికి పోతా" నని ఒకసారి బెదిరించింది. "నేను నీకు అడ్డం వస్తే అప్పుడను" అన్నాడు కాళా.

ఇక ఆ యింట్లో భలీ ఎలా వుంటుంది? పుట్టింటికి వెళ్ళిపోవాలి అని నిశ్చయించుకొన్నది. "అవసరముండి తిరిగి నీవు పిలిస్తేనే ఈ యింట్లోకి వస్తా"నన్నది.

భలీ వెళ్లినందుకు కాళాకు సంతోషమే కలిగింది. ఇంట్లోనుండి భూతం వెళ్ళిపోయిందను కొన్నాడు. అది గాక తన యింట్లో అంత పెద్ద పని మాత్రమేమున్నది? గోధుమ, శనగలు, కోతకాలానికి పని వుంటుంది. "అయినా నే నొక్కణ్ణే వెయ్యి మందికి సమానం" అనుకొన్నాడు.

తెల్లవారు జామునే లేచేవాడు. పక్కనున్న రామా, నాథా వగైరాలు లేవక పూర్వమే పాలు పితికి గొడ్లకు మేత వేసేవాడు. గొడ్లను బయటకు తోలి మూడు గంపలు పాచి వూడ్చి పెంట పోగు మీద పోసేవాడు. పొయ్యి మీద నీళ్లు కాగేలోపల రెండు మూడు బిందెలు నీళ్లు తోడుకొని తెచ్చేవాడు. తోటివాళ్లు పశువుల్ని బయటకు తోలక పూర్వమే స్నానం చేసి, పాలు వెచ్చ బెట్టి నవటాకు నెయ్యి, ఏడు శేర్ల పాలు కుండలోబోసి మూత బెట్టేవాడు.

పక్కవాళ్ళు ముఖం కడుక్కొనే లోపల "రామా! నీ పశువులతో బాటు మా పశువుల్ని గూడా తోలుకొనిపో" అని పురమాయించి కొడవలి తీసుకొని తాను పొలం బోయేవాడు. పొలంలో చొక్కా, తలగుడ్డా మర్రి చెట్టు కొమ్మకు కట్టి గోచీ బిగించి.. మిగిలిన పొలంలోకి వచ్చేటప్పటికి అతని మడి ఒకటి పూర్తి అయిపోయేది. అది చూచి రామా ఆశ్చర్యపడి "కాళా! నీకూ భూతాలకు స్నేహమేమైనా వున్నదా?" అనేవాడు.

"నేనే భూతాన్ని" అనేవాడు కాళా నవ్వుతూ. నిజంగా అతడూ

యూతంలాగానే వుండేవాడు. చామనచాయగా వున్న అతని కర్రపాటి శరీరం చెమటతో నిండివుండేది. అతని రెండు చేతులూ ఇనపముక్కల్లాగా వుండేవి.

"అదీ నిజమే. అర్ధరాత్రి నిన్ను చూస్తే జనం జడుసుకొని చస్తారు" అన్నాడు రామా.

ఒకనాడి రామా కాళాకు నచ్చ జెప్పాడు. "పిచ్చివాడా! నీవింత శ్రమ ఎందుకు పడుతున్నట్లు? అనవసరంగా పట్టుదలకు పోక పలీ వదినను పిలిపించుకో. ప్రస్తుతం పని జరుగుతున్నది. కాని 'చాతుర్మాస్యం, రాబోతున్నది" అన్నాడు.

గ్రామంలో వాళ్ళంతా అదే సలహా చెప్పడం ప్రారంభించారు. కోడక్ తల్లి గూడా అదే అభిప్రాయాన్ని వెలిబుచ్చింది. పరమా పటేలు నానా తిట్లు తిడుతున్నాడు. "నీ మెదడు పని చేయడం లేదు. ఆ అమ్మాయిలోవున్న లోపమేమిటి? ఎందుకు ఈ హఠం!" అన్నాడు పరమా పటేలు.

కాళా నోరు విప్పడు. ఎవరేమన్నా విని వూరుకొంటాడు. పరమా పటేలుకు ఇంకొక విచారం పేర్పడింది. తాను చావుకు సిద్ధంగా వున్నాడు. స్వర్గంలో అన్నా వదిన లిద్దరూ కాళా సంగతి అడిగితే తాను ఏమి జవాబు చెప్పాలి? అందువలన చాతుర్మాస్యం ప్రారంభం కాబోతూ వుండగానే కాళాతో చెప్పకుండానే కోడల్ని పిలుచుకొని వస్తామనుకొన్నాడు. పాపం, అతని దగ్గర గుర్రం లేదు. అది పెద్ద కొడుకు భాగంలోకి పోయింది. కాళ్ళీడ్చుకొంటూ నడిచి పోలేడు.

ఇక పిల్ల యింటి వాళ్ళు గూడా పట్టుగానే వున్నారు. "అల్లుడొచ్చి పిలిస్తేనే పిల్లను పంపుతాము, లేకపోతే పిల్ల మా యింట్లోనే వుంటుంది" అన్నారు. రాజు పుట్టింట్లో వున్నది. ఆమె అత్త వారింట్లో వుండి వుంటే పరమాకు కొంత సహాయం లభించేదేమో!

ఏమైనా చివరికి కాళాకు భార్యను పిలుచుకొని రాక తప్పలేదు. ఎట్లా తప్పుతుంది? వ్యవసాయం గూడా భవాయీ నృత్యం లాంటిదే. ఒక్క మనిషి ఎన్ని పనులు చేస్తాడు? ఇంటిపని చేస్తాడా? పొలం పని చేస్తాడా? పెద్దపని ఎద్దుల్ని మేపడం ఇంకొకటున్నది. రోజూ ఎద్దులకు లేచి మేత వేయాలి. నీళ్ళుపట్టాలి. ఇంట్లో పాచిపని చేయాలి. నీళ్ళు మోసుకొని రావాలి. రొట్టెలు చేసుకోవాలి. నాగలి తీసుకొని అందరితో బాటుగా

పొలం పోవాలి. సాయంత్రం ఇంటికి వచ్చి పశువుల్ని కట్టేసుకోవాలి. ఆలస్యంగా రాత్రి పొయ్యి రాజేసి – తిరగలి దగ్గర కూర్చోవాలి.

దీపావళి సమీపిస్తున్నది. అన్ని పనులతో సతమత మవుతూ పొలం పంట లెఖ్ఖ చూసుకొన్నాడు. ఎనిమిదవణాలు నష్టం వచ్చేటట్లుంది. విత్తులైతే నాటాడు గాని మిగతా భారమంతా మేఘాల మీదనేగా వుంటుంది!

కోదరూ అతని తల్లీ కాళా వెంట బడ్డారు. భలీని తాను పిలుచుకొని వస్తే రాజును అత్త వారింటికి పంపుతామన్నారు. తనకు సహాయం చేయమని అర్థించారు. కాళా ఏమీ జవాబు చెప్పలేదు. పరమూకు వొళ్ళు మండిపోయింది. "ఒరేయి దరిద్రుడా! దీపావళికి ఇంట్లో ఒక్కడివే వుంటావా?" అన్నాడు. "జనం పరదేశంలో వున్న వాళ్ళను గూడా పిలిపించుకొంటారు. నీకు పెడబుద్ధి పుట్టిందా?" అని బాగా బాధించాడు.

పరమూ పటేలు అంతేగాక మంచి రోజు విచారించాడు. "కోడల్ని పిలుచుకొని రాకపోతే విడాకు లివ్వ" మన్నాడు. "ఆ పిల్ల ఎంత కాలం ఈ బాధ అనుభవిస్తుంది. వేసిన బ్రహ్మముడి విడిపించి సన్యాసుల్లో కలవు. తండ్రి పేరు నిలపడానికి అదే గొప్ప మార్గం" అన్నాడు.

ఒక్క చేత్తో పనులు చేయలేక పోతున్నాడు. అందువల్ల కాళాకు గూడా భలీని పిలుచుకొని రావడమే మంచిదనిపించింది. "అయినా రాజు ఆ విషయం తనతో ఎందుకనదు? తనకు కష్టంగా వున్నదని ఒక్కసారి అంటే ఎంత బాగుంటుంది?" అని అనుకొన్నాడు.

ఆ ఆలోచనతోనే రాత్రి కాళా పడుకొన్నాడు. ఎంత సేపటికీ నిద్ర రాలేదు. పరమూ యిచ్చిన సలహా కాళాకు జ్ఞాపకమొచ్చింది.

సన్యాసుల్లో కలిసిపోతే అన్ని కష్టాలూ తొలగిపోతవి అనుకొన్నాడు. భూతేశ్వరం సన్యాసి కళ్ళ ముందుకు వచ్చాడు. సన్యాసి ముందు అలఖ్ (నిప్పు) మండుతున్నది. ఒక్క త్రిశూలం పక్కన పాతి వున్నది. బావాజీ శరీరమంతా బూడిద పూత. అతని కళ్ళల్లో గంజాయి మత్తూ, అతని మనస్సులో ఏదో ఒక రకపు నిర్లక్ష్య భావమూ వ్యాపించి వున్నవి. తాను బావా అయిపోయినట్లుగా భావించుకొని కాళా ఇక తనకు రాజూ వద్దు భలీ వద్దు అనుకొన్నాడు.

చివరికి తన ఆలోచనకు తానే నవ్వుకొన్నాడు. "ఓరి పిచ్చివాడా! ఏమిటి నీ ఆలోచనలు! వాలా పటేలు కొడుకు బావా అవుతాడా! భూమి తల

మంచం మీద నుండి లేవ బుద్ధి పుట్టడం లేదు. అయినా లేచాడు. తప్పదు- పిండి విసురుకోవాలి. రొట్టెలు చేసుకోవాలి. అలసిన వాడికి విశ్రాంతి అవసరం అనుకున్నాడు.

తనకు విశ్రాంతి అవసరం. రాజు ఇన్ని రోజులుగా ఇక్కడున్నది. ఒక్క రోజైనా వచ్చి చూచి పోయిందా? అనుకున్నాడు.

అనవసరంగా భలీని పుట్టింటికి పంపినందుకు కాళ్ళా పశ్చాత్తాపడ్డాడు. ఆమె వస్తేనే గాని తనకీ తిరగలి బాధ తప్పదను కొన్నాడు. నిశ్చయించు కున్నాడు.

## 19

## మేలుకో మచంధర్, గోరఖ్ వచ్చాడు

అసలు పెళ్ళికి వెళ్ళినప్పుడే కాళాకు ఉత్సాహంగా లేదు. అప్పటికే కాళా గ్రామంలోని పెళ్లి కావలసిన ఆడపిల్లలు పెళ్లిళ్ళు పూర్తిఅయి అత్తవారిళ్ళకు వెళ్ళారు. ఉన్నవే మొత్తం పదిహేను ఇరవై యిళ్ళు. అందువలన పెళ్ళి పాటలు పాడేవారి సంఖ్యకూడా తక్కువైపోయింది. తొందరలో ముహూర్తం పెట్టుకొనడం, బీద కుటుంబం గావడం గూడా దానికి కారణాలు.

భలీని అత్తవారింటికి పిలుచుకొని వచ్చినప్పుడు గూడా ఐదారుగురు తప్ప ఎక్కువమంది పోలేదు. అందువలన వరసపాటలు, తిట్లపాటలు పాడడం, వినడం అప్పుడు కూడా జరగలేదు.

ఈసారి గూడా అంతే అయింది. అత్తవారింట్లో కాళాకు లభించిన స్వాగతపు మర్యాద ఏ మాత్రం సంతృప్తికరంగా లేదు. ఇంటి ముందు మంచం వేసి, దానిమీద పరమా పటేలును కూర్చోనబెట్టారు. యముడు వస్తే ప్రాణాలు తీసుకుని పోతాడు. కాని అల్లుడు వస్తే పెంచి పెద్దచేసిన తమ పొట్టలోని పేగునే కదిలించి తీసుకుపోతాడని సామెత. స్వాగతం కూడా దాని కనుగుణ్యంగానే వున్నది.

అత్తవారింటి తరఫున హుక్కా ముందు ఉన్నా కాళాకు హుక్కా తాగ బుద్ధి పుట్టలేదు. లేచి గ్రామం నలుమూలలా చూచి వద్దామనుకొన్నాడు. కాని గ్రామంతో ఇళ్ళన్నీ మూసివున్నవి. చిన్న పిల్లలూ, లేగదూడలూ తప్ప ఇళ్ళల్లో ఎవ్వరూ లేరు. ఊరంతా శూన్యంగా వున్నది. రాజూ భలీ ఏమి పని మీద వెళ్ళారో ఎవ్వరికీ తెలియదు. సూర్యాస్తమయం కాబోయే సమయానికి ఆకాశమంతా పసుపు పచ్చటి రంగు వ్యాపించింది. నెమ్మది నెమ్మదిగా శూన్యంగా వున్న గ్రామం చైతన్యవంతం గావడమారంభించింది. బర్‌బర్‌మని తలుపులు తెరుచుకొంటున్నవి. దూడలు కట్టివేయబడు తున్నవి. గేదెలు, ఆవులు పాలివ్వడానికి తయారుగా వున్నవి. పాలు పితకడం గూడా ప్రారంభమయింది. గ్రామ కంఠంలో నిలబడిన ఒకామె అమ్మా! త్వరగా రా. బరువుతో కుంగిపోతున్నా'' నంటున్నది. ఆమె నెత్తిమీద రెండు మణుగుల గడ్డిమోపూ, చంకలో రెండేళ్ళ పిల్లవాడూ

వున్నారు. ఆవులు అంబా అంటూ పరిగెత్తుకుని వస్తున్నవి. నాగళ్ళు భుజాన పెట్టుకొని రైతులు ఇళ్ళకు తిరిగి వస్తున్నారు.

ఆవులు అంబా అంటుంటే లేగదూడలు పాలకోసం తెగ ఎగురుతున్నవి.

రెండు మూడు ఘడియల్లో గ్రామం చైతన్యవంత మయిపోయింది. అంత వరకూ వ్యాపించి వున్న శాంతి మాయమయి పోయింది.

రాజు భర్త నాగలి భుజాన పెట్టుకొని ఇంట్లో ప్రవేశించాడు. అతని వెనక వెనక ఫలీ రాజూ ఇద్దరూ రెండు గడ్డిమోపులను తీసుకొని వచ్చారు. ఫలీ కాళాను చూచింది. నెత్తిమీది గుడ్డను ముఖంమీదకి లాక్కొన్నది. పరమా పటేలును "ఎప్పుడు వచ్చావని" గౌరవంగా పలకరించింది. రాజు కాళా పరమా పటేలును కుశలప్రశ్నలు వేసింది.

ఫలీ, రాజు ఇద్దరూ కడవలు తీసుకొని వెంటనే నీళ్ళకు బయలుదేరారు. కాళా నీళ్ళకు వెళుతున్న ఆ యిద్దరినీ వెనకనుండి చూస్తున్నాడు. ఇద్దరినీ పోల్చి చూస్తున్నాడు.

రాజు ఇంటి కోడలు. కొత్తగా పుట్టింటి నుంచి రావడం వలన ఆమె గుడ్డలు కొత్తవిగా వున్నవి. ఫలీ పుట్టింట్లో వున్నది. అందువల్ల ఆమె గుడ్డలు పాతవి అయినా వాళ్ళిద్దరూ ఒకరి గుడ్డలు ఇంకొకరు మార్చుకొన్నా ఫలీ కంటే రాజు అందంగా వుంటుంది. రాజు శరీరం సన్నపాటిది. ఫలీ శరీరం లావుపాటిది. ఫలీ తలా, ముఖం పెద్దవి. కంఠధ్వని కర్కశంగా వున్నది. రాజు నెమిలిలాగా వున్నది. ఆమె ముఖం కొంచెం కోలగా వున్నది. కళ్ళు ప్రకాశవంతంగా వున్నవి. కొనదేలిన ముక్కు.

కొద్ది సేపట్లో వాళ్ళిద్దరూ నీళ్ళు తీసుకొని యింటికి వచ్చారు. కాళా తన మనస్సులో వాళ్ళిద్దర్నీ ఇంకా పోలుస్తూనే వున్నాడు. ఇద్దరి ముఖాల మీదా గుడ్డలు కిందకి లాగబడి వున్నవి. రాజు యౌవనం ఆమె కట్టుకొన్న గుడ్డల్లో నుండి ప్రవహిస్తున్నది. ఫలీ యౌవనం కాళా కంటికి ఇంకా అందడం లేదు. వేగంగా ప్రవహించే నదిలోని నీరులాగా స్థిరంగా వున్నది.

కాళా పెద్దగా నిట్టూర్చాడు. రాజు తనకంటే రెండేళ్ళు చిన్నది. ఫలీ తనకంటే రెండేళ్ళు పెద్దది. అంటే రాజుకంటే నాలుగైదేళ్ళు పెద్దది. ఇద్దరిలో వ్యత్యాసముండడంలో ఆశ్చర్యమేమున్నది ? అనుకొన్నాడు.

రాజు భర్త హుక్కా నింపుకొని వచ్చి మంచంమీద కూర్చున్నాడు. కాళా

దానితో రాజునూ, రాజు భర్తనూ ఇద్దర్నీ పోల్చి చూడడం ఆరంభించాడు.

రాజు భర్త శరీరం చాలా దుర్బలమైనది. దానికి తోడు ఎప్పుడూ దగ్గుతూ వుంటాడు. పరమా అతణ్ణి బాగా గమనించి చూచాడు. "అబ్బాయీ! నీ శరీరంలో ఏదో జబ్బున్నది. భూత వైద్యుడికి చూపించు" అని సలహా చెప్పాడు.

ఇంతలో రాజు ఇంటి బయటకు వెళ్ళింది. ఆమె చేతిలో ఏదో గిన్నె లాంటిది వున్నది. కాళాకు అర్థమయింది. బహుశా ఇంట్లో నెయ్యి లేదు. అందుకే పోతున్నదనుకొన్నాడు. అతని హృదయం భగ్గున మండింది. ప్రతిదినం రెండుసార్లు నేతి రొట్టె తినే రాజు అతిథి సత్కారం కొరకై నెయ్యి ముష్టి అడగటానికి బయలుదేరిందనుకొన్నాడు. రాజు భర్తను చూస్తే – అతడు జీవితంలో – ఏ దు సమయాలలో తప్ప – నెయ్యి తిని వుండడని అర్థమవుతూనే వున్నది. సరైన తిండి లేక – కాలం పని చేసి చేసి కృశించి వున్నాడు.

రాజు నెయ్యి ఇంట్లో పెట్టి మళ్ళీ ఇంటి బయటకు వెళ్ళింది. ఈసారి గోధుమల కొరకై పోతున్నదనుకొన్నాడు కాళా.

అయితే అతని ఈ అంచనా నిజంగా లేదు. ఇంట్లో తిరగలి తిరగడం ఆరంభించింది. అంటే ఇంట్లో గోధుములున్నవన్న మాట అనుకొన్నాడు. ఇంతలో రాజు వెంట నలుగురైదుగురు ఆడవాళ్ళు ఇంట్లోకి వచ్చారు. వాళ్ళెందుకు వచ్చారో కాళాకు అర్థం కాలేదు. ఇంకొక ఘడియ అయిన తరువాత ఇంకా నలుగురు ఆడవాళ్ళు వచ్చారు. వాళ్ళ వాలకం, వాళ్ళు మోచేతులతో ఒకళ్ళ నొకళ్ళు పొడుచుకొనడం చూచిన తరువాత వరస పాటలు పాడడానికి వాళ్ళు వచ్చినట్లు కాళాకు అర్థమయింది.

కాళా ముఖం కమలంలాగా వికసించింది. దశమినాటి రాత్రి. పాల వంటి వెన్నెల ప్రకాశిస్తున్నది. మధ్య మధ్య ఆకాశంలో శ్యామలవర్ణం వ్యాపిస్తున్నది. అలలు అలలుగా గాలి వీస్తున్నది. ఏమైనా కాళా ఆనందంగా వున్నాడు. దానికి కారణం రాజు పాటలు. పాడుతున్నవాళ్ళు గ్రామంలోని యువతులైనా పాటలు పాడమని వారికి అందిస్తున్నది రాజు.

"నా చెవులకు రింగులున్నవో లేవో చూడండి" అని కాళా ఎగతాళిగా అన్నాడు. "రింగు కాదు, చొక్కా చొక్కా" అని ఆడవాళ్ల వెనకనుంచి ఎవరో అన్నారు. పాట ప్రారంభమయింది.

"కాళూ! తారే తే కేడీయుం క్యాన్ ఫీబార్ బాపోనా?
తారీ మా డర్జీ వానే గ్రైత్రి బార్ బాపోనా
అల్యా గయితీ పఞ రాత్ వాసో రైతి బాక్ బాపోనా
అల్యా ఏమ్ కరీ కేడియుం లావీ బారే బాపోనా

కాళా నీకీ చొక్కా ఎక్కడనుండి వచ్చింది? నీ తల్లి దర్జీ వాడింటికి పోయింది. రాత్రి అంతా అక్కడనే వున్నది. ఈ చొక్కా తెచ్చింది.

పాటలు వింటున్నా రాజా తన హృదయంలోని ప్రేమను తెలియజేయడానికి ఈ పాటలు పాడిస్తున్నదా లేక తన హృదయంలో రగిలిన మంటను తెలియజేయడానికా అని కాళా ఆలోచిస్తున్నాడు. ప్రేమను సూచించే పాటలే అవి అని అతడొక నిశ్చయానికి వచ్చాడు. ఇటువంటి తిట్లు తినడానికి వివాహ సమయాల్లో పెళ్లి కొడుకులు బాగా ఉత్సాహపడతారు. కాళా తన స్థితిని గురించి చాలా విచారంలో వున్నాడు. రాజు స్థితీ తన స్థితీ ఒక్కటిగానే వున్నదనుకొన్నాడు. రాజు మధ్య మధ్యవచ్చి కొత్త కొత్త పాటలు అందించి వెళ్ళుతున్నది.

"మారా వాడా నే పఛవాడే రే ఊంటడీ ఝూలా లాయి"

మా యింటి వెనక అడవి వొంటె ఊగుతున్నది.

పాటలు పాడబడుతూనే వున్నవి.

"పరమా కాకా! స్నానానికి నీళ్ళు తోడాన''ని రాజు వాకిట్లోకి ముఖం చూపించింది.

"కాళా! స్నానం కాసి'' అన్నాడు పరమా.

"ముందు నీ స్నానం కానివ్వు'' అన్నాడు కాళా.

పరమా స్నానానికి లేచాడు. పరమాను కలవడానికి వచ్చిన ఊరి వారంతా లేచి వెళ్ళారు. రాజుకు కొంత స్వాతంత్ర్యం లభించింది. తలమీది ముసుగును తీసివేసింది. కాళా నోటికున్న కళ్లెంగూడా తొలగిపోయింది.

"ఈ తిట్లన్నీ ఎవరిని తిట్టిస్తున్నావు?'' అన్నాడు.

"మా భలీ అక్కను తీసుకొని వెళ్లిన తరువాత ఇటువంటి తిట్లు తిట్టవద్దని గుర్తు చేస్తున్నా''మని ఎవరో అన్నారు.

నిజంగా అందుకే రాజు ఈ పాటలు పాడిస్తున్నదా అని అడుగుదామనుకొన్నాడు. కాని ఏమీ అనలేదు. "ఈ తిట్లు తిట్టించడం ఆపివేసి అనదలచుకొన్న దేమిటో తిన్నగా అంటే మంచిది'' అన్నాడు.

రాజా ఇంకొక పాట అందించింది.

"సమజునే సానే సమజావుం
గద్దే గదడా– పాటు జో..

తెలుసుకొనేవాళ్ళు సైగ చేస్తేనే తెలుసుకొంటారు. గాడిదలకు కాలితాపులు.

"చాలునా? సంతోష మయిందా?" అంటూ రాజా ఇంట్లోకి వెళ్ళిపోయింది. స్నానంజేసి ధోవతి పిండబెట్టుకొంటూ వచ్చిన పరమా "కాళా! స్నానం చేసిరా" అన్నాడు.

కాళా స్నానానికి వెళ్లాడు. ఇంటి వెనక భాగంలో ఎక్కడా రాజా కనబడలేదు. దండెను తగిలించివున్న తడి పంచె గుడ్డను కట్టుకొంటూ వుంటే అతని కొక ఆలోచన కలిగింది. "వేడినీళ్ళలో కలపడానికి చన్నీళ్ళు కావాలి" అని పెద్దగా అరిచాడు.

రాజా వస్తుందనుకొన్నాడు. దురదృష్టం. భలీ వచ్చింది.

"పక్క బిందె చన్నీళ్ళ బిందె. అన్నీ నఖరాలు" అని భలీ చన్నీళ్ళు రెండు చెంబులు వేడి నీళ్ళలో పోసింది.

రాజా వాకిలి దగ్గరకు వచ్చి "చన్నీళ్ళు వున్నవా?" అని అడిగింది. దానిలో నీళ్ళే కాక కాళా కాళ్ళు గూడా చల్లబడ్డవి. అన్ని పాటలు పాడించిన రాజా ఇటువంటి అల్లా టప్పా పనులు ఎందుకు చేస్తున్నదో కాళాకు బోధ పడలేదు.

"నాలోని ఆశయమిద గూడా చన్నీళ్ళు చల్లుతున్నదా" అని ఆలోచనలో పడ్డాడు.

"నువ్వే ఎగతాళి చేయడానికి వచ్చావా?" అన్నాడు కాళా.

"అందుకు నీవే కావాలా?" అన్నది రాజా.

ఆ మాటలో ఏదో రహస్యమున్న దనుకొన్నాడు కాళా.

"ఇంత చాతుర్యం ఆమెలో మొదట లేదు. అత్తవారింటికి వచ్చిన తరువాత చాతుర్యం నేర్చుకొన్నట్లున్నది" అనుకొన్నాడు. అతని కేదో దెబ్బ తగిలినట్లనిపించింది.

నానా విషయం అడిగి తెలుసుకొందామనుకొన్నాడు.

మాట ఎత్తాడు. కాని పూర్తి గాలేదు.

మాట అంతలోనే ఆగిపోయింది.

తరువాత సహాయం చేయడానికి, గడ్డి దించడానికి అత్తవారి పొలం

వెళ్ళాడు ఆ రాత్రి. మంచంమీద పడుకొన్నాడే గాని కోడి కూసిన దాకా అతనికి నిద్ర రాలేదు. మాగన్నుగా వుండి ఎవరివో అడుగుల చప్పుడు విన్నట్లు ఉలిక్కిపడి మాటి మాటికీ లేవడం ఆరంభించాడు. ఉండుండి ఎవరో తలుపు తెరిచినట్లతని కనిపించేది. తనెవ్వరో కుదించి వేసినట్లని పించేది. ఒకసారి ఎవరో నిజంగానే దుప్పటి లాగారు. కళ్లు తెరచి చూచాడు. దుప్పటి లాగి [illegible].

"లే కాళా! లే తెల్లవారింది" అన్నాడు.

కాళా స్తబ్ధుడై లేచి కూర్చున్నాడు.

రాజు వచ్చి పక్కతోనుండే పుల్ల యిచ్చిన దాకా అతని తలలో ఏవో ఆలోచనా స్రవంతులు ప్రవహిస్తూనే వున్నవి.

పరమా లేకపోయినా పొగాకూ, నల్లమందునే సీసా కాళాకు గూడా లభించేవి. ఏమైనా ఇంటి అల్లుడు గదా!

నల్లమందు అమ్మే గుత్త అధికారం ఏ ఒక్కడికో వున్నా ఆ రోజుల్లో ఈ నాడున్నంత బందోబస్తుగా వుండేదికాదు. నటవర్ సింహ ప్రభుత్వోద్యోగి. అయినా నల్లమందు వ్యాపారం గూడా చేసేవాడు. అతడే రెండు తులాల నల్లమందు కాళా అత్తగారికి అప్పుగా యిచ్చాడు.

రాజు ఇంటి ముందు నాలుగు మంచాలున్నవి. వాటి మధ్య చలిమంట మండుతున్నది.

కాళాకు మనస్సు శాంతిగా లేక ఇంట్లోకి వెళ్లాడు. రాజు ఇల్లు ఊడుస్తున్నది. రాజు దగ్గరకు పోయి "వేయించిన పేలాలుంటే ఇవ్వు" అన్నాడు

"ఆ మాత్రం మర్యాద మాకు తెలియదా?" అని నవ్వుతూ రాజు "పోయి మంచం మీద కూర్చో, తెస్తా" నన్నది

"ఇది నీ అత్త వారిల్లుకాదు. నా అత్త వారిల్లుగూడా" అన్నాడు కాళా. రాజు నవ్వుతూ– "కావచ్చును. కాని ప్రస్తుతం నాది. చెప్పినట్లువిని బుద్ధిమంతుడిలాగా వెళ్ళి మంచం మీద కూర్చో" అన్నది.

కాళా అక్కడే నిలబడ్డాడు. రాజు ఇంటి చీకటి మూల ఊడుస్తున్నది. ఏమనుకొన్నదో ఏమో "భలే! ఆ పక్కగది ఖాళీ చేశావా?" అని పెద్దగా అడిగింది.

కాళా "నీవిట్లాగే వుంటే నేనిక్కడికి రావడమెందుకు?" అన్నాడు. రాజు నవ్వింది.

"అవసరముండి పిలిపిస్తే వస్తాను. లేకపోతే లేదు" అన్నాడు కాళా. కాళా తన వ్యవహారాల మీద శ్రద్ధ చూపించడంవలన అత్తవారింట్లో అందరూ అసంతృప్తిపడ్డారు. అయినా "పని చేసే పిల్లను తీసుకొని పోతున్నావు" అని అన్నారు.

మాట పెరుగుతుందేమోనని రాజుకు సందేహం కలిగింది. చొప్ప కట్టలు చలిగుంటలో వెయ్యమని కాళాను పంపించింది. అసలు కాళాకు గూడా ఎక్కువగా మాట్లాడవలెనని లేదు.

ఇంతలో నీళ్ల బిందెలు తీసుకొని ఫలీ వాకిలిముందుకు వచ్చింది. ఎవరి దృష్టి ఆమె వైపుకు పోలేదు.

"ఈ బిందెలు ఎవరు దింపుతారు?" అని ఫలీ పెద్దగా అన్నది. కాళా ఆ పక్కనే వున్నాడు. "ఆ బిందెలు దింపు" అన్నది రాజు.

కాళా ఆలోచనలో పడ్డాడు. తన ఇంట్లో వుంటూ, ఫలీ నెత్తిమీది బిందెలు తాను దింపలేడు. రాజు ఆజ్ఞ గదా! బిందెలు దింపి కిందపెట్టి వాకిట్లోకి వెళ్లాడు.

రాజు తోటికోడలుకు నచ్చచెప్పింది. ఫలీని పంపడానికి ఏర్పాట్లు చేసింది. అంతేగాక తానిక పుట్టింటికి పోగూడదని నిశ్చయం చేసుకొన్నది. పుట్టింట్లో ఏమైన యింక తన మాట సాగదు. తన మూలంగా అత్తా కోడళ్లకు తగాదా వస్తున్నది. వదిన ముందు తన అన్న మాట గూడా సాగదు. అంతేగాక రాజు నానా యింటికి వెళ్ళుతుందని ఊరంతా పెద్ద పుకారొకటి బయలుదేరింది. ఆ పుకారు ఎవరు వ్యాపింపజేస్తున్నారో తెలియదు. పుట్టింట్లో పాలు తాగడం కంటే అత్త యింట్లో వచ్చి మంచినీళ్ళు తాగడమే మంచిదని రాజు నిశ్చయించుకొన్నది.

కాళా తన వూరికి బయలుదేరుతున్నాడు.

పని వుండి కబురంపితే తాను వస్తానని రాజుకు కాళా మాట యిచ్చాడు.

ఫలీ అత్తవారింటికి బయలుదేరడానికి అనుకూలంగా వున్నది. అందువలన పెద్ద తోటికోడలు తనకు ఇష్టం లేకపోయినా ఫలీని పంపడానికి అనుమతించింది. కనీసం ఫలీ అయినా సుఖపడుతుందని అనుకొన్నది.

ప్రయాణ సన్నాహం జరిగింది.

పరమా గుర్రమెక్కి "నేను పేథా పటేలు ఇంటి దగ్గర వుంటాను, మీరు నెమ్మదిగా రండి" అని ప్రయాణమైనాడు.

ఆ వూరును వదులుతుంటే అతని కేదో బాధ అనిపిస్తున్నది. భలీతో మాట్లాడుతున్న రాజును చూచి "కోదర్‌ను పంపమంటావా?" అని అడిగాడు.

కోదర్‌ను రావద్దని చెప్పమన్నది రాజు. దీపావళికి తాను పుట్టింటికి రానన్నది.

ఆ మాట విని కాళా ఆశ్చర్యపడ్డాడు. అంటే రాజు నానా యింటికి పోదు అని నిశ్చయించుకొన్నాడు.

ఇంతలోనే మళ్లీ రాజు సంగతి తన కెందుకు? ఆమె ఏ దొంగలపాలైతే తన కేమిటి? -- అనుకొన్నాడు.

రాజు లేకపోతే ఈ అత్తవారిల్లు గూడ తన విషయంలో శూన్యమై పోతుంది. అయినా రాజును హెచ్చరించడం మంచిదనుకున్నాడు. "పేథా పటేలు తీర్పు యిచ్చిన నాటికి నేను చిన్నవాణ్ణి అందువల్ల ఇంత అన్యాయం జరిగింద" ని అందామనుకొన్నాడు.

ఊరి చివరకి అంతా వచ్చారు. అయినా రాజును ఒక్కసారి నానా విషయం అడిగితే? మనస్సు ఉవ్విళ్లూరింది. పక్కనే భలీ వున్నది. అడిగే అవకాశం కలగలేదు.

కాళా నుద్దేశించి రాజు "ఒక్క మాట జ్ఞాపకం పెట్టుకో. కొత్తగా పశువుల్ని కొన్నప్పుడు వాటిని ముందు గ్రామంలోని పశువులతో కలపాలి. ఇంటి పశువులతో కలిపి వాటిని కట్టివేయాలి. మానవ జీవితం గూడా అటువంటిదే. (మేమందరం పశువుల వంటి వాళ్లం" అన్నది నవ్వుతూ.)

"అంతేగాదు. పుట్టిల్లు వదిలినప్పుడు ఆడపిల్లలకు ఎంత బాధ కలుగుతుందో అది గూడా నాకు తెలుసు" అన్నది.

కాళా కత్తిని నేలకు ఆనించాడు. భలీ పక్కన ఆకులు తెంచుతున్నది. ఆమె వైపుకు చూచాడు.

"ఇక తొందరగా నడవండి. చాలా దూరం పోవాలి" అన్నది రాజు. కాళా నడక వేగం హెచ్చించాడు.

రాజు భలీ వైపుకు చూచి "నీకు కోపం ఎక్కువ. కొంచెం తగ్గించుకోవాలి. చేసుకొన్న వాణ్ణి జయిస్తే జగత్తంతా జయించినట్లని సామెత.

నీకు కడుపులో ఏమీ వుండదు. అయినా మాట దురుసుతనం లేకపోతే మంచి'' దని సలహా చెప్పింది.

ఖలీ రాజా దగ్గర విచారంగా సెలవు తీసుకొన్నది.

కాళా, ఖలీ ముందుకు సాగారు. రాజా వెనకకు ఊళ్లోకి మళ్లింది. అతని ఆలోచనలు రాజాను వదలడంలేదు. క్షణకాలం రాజా తెలివిగలదిగా కన్పిస్తే రెండో క్షణంలో యౌవనమంతా పోగొట్టుకొని కూర్చున్న దురదృష్టవంతురాలుగా కనిపించేది. దుఃఖాన్ని దిగమింగి కూర్చున్న దేవత రాజా అని ఒకసారి అనుకొన్నాడు.

గోధుమ రొట్టెలు తిని, పాలూ పెరుగూ తాగిన రాజా రాగిసంకటి, వరిగన్నం తిని సర్దుకొంటున్నది. రాజా వెనకటి జీవితమంతా అతని కళ్లకు కట్టుతున్నది.

రాజాకు దుఃఖం కలిగితే తాను సహించలేడు. ఆమెకు ఆనందంగా వున్నా తనకు కష్టంగా వుంటున్నది. కాళా విచిత్ర స్థితిలో పడ్డాడు.

ఆ ఆలోచనల్లోనే ఐదు కోసుల ప్రయాణం పూర్తి అయిపోయింది. తన వూరి పొలిమేరలోకి వచ్చిన తరువాత అతనికి వొళ్ళు తెలిసింది. రాజా అంటే తనకెందుకీ బాధ! ''నా హృదయంలో ఎందుకిన్ని నిప్పులు రేగుతున్నవి!!.. ఈ జంజాటంలో తగులుకొన్నాను. ఇది ఖవాయీ నృత్యం. మేల్కో మఛందర్! గోరఖ్ వచ్చాడు'' అనుకొన్నాడు.

## 20

# పోట్లాడుకొన్న కాళా నానాలు

దీపావళికి అంగరఖాకు బదులుగా కాళా ఐదు మైళ్ళ దూరం పోయి ఐదు కట్టింగులు ఉన్న కోటు కుట్టించుకొని వచ్చాడు. అటువంటిదే ఇంకొక కోటు కోదర్‌కు గూడా కుట్టించాడు. ఇద్దరికీ కోట్లు వుంటే తననెవ్వరూ ఆక్షేపించరని అతని అభిప్రాయం.

పరమా పటేలు వానప్రస్థాశ్రమంలో ఉన్నాడు. రణఛోడుడు ఊరికి ముఖియా అయినాడు. దీపావళి రోజున గుమిగూడిన జనమంతా కాళా కోదర్ల కోట్ల వంక చూడడం ఆరంభించారు. కోట్లు బాగున్నవని కొంత మంది పొగిడారు. కొంతమందికి అవి నచ్చలేదు. నచ్చని వాళ్ళల్లో నానా ముఖ్యుడు.

"ఎక్కడ కుట్టించారు ఈ కోట్లు? పరుపులు కుట్టేవాడు కుట్టినట్లు న్నాడు. ఎవరైనా చూస్తే ఈ కోట్లు తొడిగిన వాళ్ళను కులంలోనుండి గూడా వెలివేస్తారు" అన్నాడు.

"కోదర్! నీ కెందుకు ఈ కోటు? బాగాలేదు" అన్నాడు. కాళా అన్నీ వింటూనే వున్నాడు.

"ఓరి పోరా, కులం సంగతి మాట్లాడుతున్నావు" అన్నాడు. సుఖడీ పంపకం జరుగుతున్నది. (దీపావళి రోజున బెల్లం పిండీ కలిపి చిన్న వుండలు చేసి పంచి పెడతారు.)

కోదర్ ఈ మాటలు పట్టించుకోలేదు. హుడా పాడడంలో మగ్నుడై వున్నాడు.

కోదర్‌ను ఎట్లాగైనా తన పక్షంలో కలుపుకోవాలని నానా చాలా రోజులుగా ప్రయత్నం చేస్తున్నాడు. నాగలి దున్నడంలోనూ, ఎద్దుల్ని మేపడంలోనూ, నాట్ల సమయంలోనూ, కోతల సమయంలోనూ కోదర్‌కు బాగా సహాయం చేస్తున్నాడు. కోదర్ భార్య తన పక్షమే, నానాకు తెలుసు. అయితే నానా ఎంత సహాయం చేసినా సమయం వచ్చేటప్పటికి కోదర్ కాళా పక్షంలోనే వుంటున్నాడు. కోదర్ కాళాపక్షం వదలడని నానా నిశ్చయం చేసుకొన్నాడు. కోదర్ ద్వారా రాజును తనకనుకూలం

చేసుకోవాలని నానా అసలు తాపత్రయం. రాజును తన వశం చేసుకొనే టందుకు డబ్బిచ్చి ఒకరిద్దరు రాయబారుల్ని గూడా నియమించాడు. (ఆ రాయబారులు చెప్పిన ప్రకారం దీపావళికి రాజు పుట్టింటికి రావాలి. తనను కలుసుకోవాలి. అది ప్రయత్నం. అయితే రాజు దీపావళికి పుట్టింటికే రాలేదు. ఆమెకు చీరలు బహూకరించాలి అనుకొన్నాడు. ఆమె పుట్టింటికే రాలేదాయె. ఏమి చేస్తాడు? రెండు రూపాయలు ఖర్చుబెట్టి ఒక రాయ బారిని రాజు అత్తవారి వూరికి పంపించాడు. ప్రయోజనం కలగలేదు. నానా వేసుకొన్న అంచనా తారుమారయింది. అతనికి సంబంధించినంత వరకు ఆ దీపావళి వ్యర్థమైపోయింది.) తాను డబ్బు ఉన్నవాడననీ, అందమైన వాడననీ గూడా నానాకు గర్వంగా వుండేది. నిజానికి అతను కాళా కంటే చూడడానికి అందమైన వాడే. కాళా కొంచెం నలుపు. పాటలు పాడడంలో నానా అందెవేసిన చేయి. పొలం దున్నుతూ రకరకాల దోహాలు పాడే వాడు. అతనికి తగాదాలు తీర్చడమన్నా, ఎడ్ల బేరం కుదిరించడమన్నా, సుఖడీ తయారు చేయడమన్నా, పశువులకు జబ్బులుచేస్తే వాటికి సురులు వేయడమన్నా సరదా.)

తన రూపాన్ని చూచి రాజు తనను ప్రేమిస్తుందని అతని విశ్వాసం. చెంప దెబ్బ తిన్న తరువాత గూడా నానా రెండు మూడు సార్లు రాజుతో హాస్యంగా మాట్లాడితే రాజు మౌనంగా వూరుకొన్నది. అందువల్ల గూడా రాజు తన కనుకూలమని అతనికి విశ్వాసం ఏర్పడింది. అందువల్లనే రాయబారుల్ని పంపించే స్థితికి చేరుకొన్నాడు.

రాజు అత్తవారి వూరు వెళ్ళిన రాయబారి చెవులు లటలట కొట్టుకొంటూ తిరిగి వచ్చాడు. రాజు అత్తగారు నానా చీవాట్లు పెట్టిందట. కులంలోని పెద్దలకు చెప్తానని పైన బెదిరించిందట గూడా.

రాయబారికి ఇటు నానాతోనూ అటు రాజుతోనూ ఇద్దరితోనూ ఇబ్బంది ఏర్పడింది. (నిజానికి రాజు పుట్టింటికి రావలెననుకొన్నది. కాళా భలీని తీసుకొని రావడం వలన రాజు తన ప్రయాణం మానుకొన్నది.)

కాళా రాజు చెవిలో ఏదో వూది వుంటాడని నానాకు అనుమానం కలి గింది. అందువల్ల గిల్లికజ్జం పెట్టుకొనే ప్రయత్నం ప్రారంభించాడు.

కాళా సుఖడీ పంచి పెడుతున్నాడు.

"ఓరేయి, కాళాగాడా! నీకేమైనా రోషం పుట్టిందా?" అన్నాడు.

కాళా కేమీ అర్థం గాలేదు. "ఏమిటి నీవనేది నానా?" అని ప్రశ్నించాడు. నానా కళ్ళు నిప్పులు కక్కుతున్నవి. తిట్లు ప్రారంభించాడు.

"అనవసరంగా ఎందుకు తిడతావు?" అన్నాడు కాళా. నానా ఇంకా జోరు చేశాడు.

వెంటనే ఎగిరి నానా చెయ్యి పట్టుకొన్నాడు కాళా.

"కుక్కల కొడకా! ఏమిటిరా నీవు కూసేది?" అన్నాడు. నానా తన చెయ్యి వదలించుకొని కాళా గొంతు పట్టుకొన్నాడు. దానితో కాళా రుద్ర రూపం దాల్చాడు. కాళా చేతిలోని సుఖడీ పళ్ళెం వంద గజాల దూరం లోని స్తంభం వరకు ఎగిరి కిందపడింది. ఆ పళ్ళెం ధ్వనికి పాటలు ఆగి పోయినవి. ఎవరెవరితో పోట్లాడుతున్నారో, దేనికో ఎవ్వరికీ తెలియడం లేదు. ఒకటే గోల. ఏమిటేమిటని ఒకరి నొకరు అడుగుతున్నారు. ఏమీ అర్థం గాలేదు.

నిజానికి నానా అంటేనే కాళా చాలాకాలంనుంచి కోపంగా వున్నాడు. పరమా ముఖాన్ని చూచి ఆ కోపాన్నంతా దిగమింగుతూ వచ్చాడు. ఈ రోజు అతడి కోపం ఆగలేదు. నానాను పైకెత్తి నేలమీదకేసి విసరికొట్టాడు. మధ్యవాళ్ళు వచ్చి అడ్డం బడ్డారు. లేకపోతే రామా అన్నట్లు నానా పది శేర్ల పెరుగు కక్కేవాడే.

జనమంతా లేచి నిలబడ్డారు. కొంతమంది కాళాను పట్టుకొన్నారు. కొంతమంది నానానూ, కొంతమంది రణఛోడుణ్ణి పట్టుకొన్నారు. అయితే చాలామందికి ఆ తగాదా తేలికగా సమసిపోవడం ఇష్టం లేదు. కాళా తండ్రిని ఈ దరిద్రులు ఎంత బాధపెట్టారు!! వాళ్ళకు శాస్తి జరగవల సిందేనని బహూ సంఖ్యాకుల అభిప్రాయం. వాకిట్లో నిలబడ్డ మాలీ, రణ ఛోడుని భార్యా, ఎంత విడదీసే ప్రయత్నంచేసినా —పరమా ఎంత నానా పక్షంలో వ్యవహరించినా— కాళా మాత్రం ఏ మాత్రమూ వెనకాడలేదు. కాళా మీద దెబ్బపడితే పక్కన కాసిమ్, బేచాత్, శంకర్, భగా, కోదర్ మొదలైనవాళ్ళు వుండనే వున్నారు. నానా కిందబడి నేలకు కరుచు కొన్నాడు. వాణ్ణి కాళా నాలుగు తన్నులు తన్నాడు. రణఛోడుణ్ణి చూచి "మర్యాద దక్కించుకోదలుచుకుంటే అవతలికి వెళ్లు" అన్నాడు. నానా తిట్టరాని తిట్లు తిడుతున్నాడు. పట్టుకున్న వాళ్ళను ఎప్పుడు విడిలించు

కొన్నాడో తెలియదు, కాళా ఒక్క దూకు దూకి నానా ముఖంమీద పీశె గుద్దు గుద్దాడు.

నానా ముక్కునుండీ నోటినుండీ బొళాబొళా రక్తం కారింది. బేచాత్, కోదర్ ఇద్దరూ బలవంతంగా కాళాను పట్టుకున్నారు. రక్తం వరద కడుతూ వుంటే నానాను బలవంతంగా కొంతమంది ఇంట్లోకి తీసుకొని వెళ్ళారు. ఇంతలో రణఛోడుడు కర్ర తీసుకుని కాళా మీదకు దూకాడు. జనం కర్ర పట్టుకున్నారు. కొంతమంది నాథాను పక్కకు ఈడ్చుకుని వెళ్ళారు.

రణఛోడుడు పోలీసులకు ఫిర్యాదు చేస్తానన్నాడు. "తప్పెవరిదో తెలుసుకొన్న తరువాత గదా ఆ పని?" అన్నాడు శంకర్. "ఆ విషయం మా తండ్రికి తెలియాలి" అన్నాడు రణఛోడుడు.

"తప్పు నానాదే అయితే?"

"తప్పు అయితే మాత్రం చంపివేస్తారా?" అన్నాడు రణఛోడుడు. ఇంతలో రామా అందుకొన్నాడు. "పోలీసులు వస్తారు. వచ్చి ఏమి చేస్తారు? కాళాకు నాలుగు లాఠీ దెబ్బలు తగిలిస్తారు. నీ యింట్లో ఐదు శేర్ల నెయ్యి తాగిపోతారు. తెలిసిందా? మీరంతా అన్నదమ్ములు. పోలీసుల దాకా పోవడం మంచిదిగా" దన్నాడు. అయినా రణఛోడుడు మొండి పట్టు వదలలేదు. కాసిమ్ అందుకొన్నాడు. "ఏమయ్యా! ముఖియా! పోలీసుల్ని పిలిపిస్తావా? దానివల్ల వైరం ఇంకా పెరుగుతుంది. అసలు తప్పు నానాది. అనవసరంగా కాళాను తిట్టాడు. మీరెన్ని అన్నా ఎంత కాలం సహిస్తాడు? యిక సహించడు. తెలుసుకో. పోలీసులదాకా పోతే మీ కుటుంబమంతా కష్టాలలో చిక్కుకుపోతుంది. జాగ్రత్తగా ఆలోచించుకో" అన్నాడు.

కాసిమ్ మాటల్లోని సత్యం రణఛోడుడికి గూడా అర్థమయింది. "సరే, అయితే మీరంతా న్యాయం చేయండి. మీ వల్ల న్యాయం జరగకపోతే అపుడు ఫిర్యాదు తప్పద" న్నాడు.

"ఏమైనా ఒక్కసారి చర్మం వొలిపిస్తేనే గాని కాళాకు బుదిరాదు" అని గూడా అన్నాడు.

"ఆ స్థితి వస్తే - ఇప్పుడు ముక్కే పగిలింది. అప్పుడు తల గూడా పగులుతుంది" అన్నాడు రామా.

ఊరంతా ఈ వార్త పాకిపోయింది.

పిల్లలంతా ఒకచోట చేరి "కాళా యిట్లా దూకాడు. నానా ఈ విధంగా కింద బడ్డాడు" అని అభినయించేసి చూపించడం ప్రారంభించారు.

దీపావళి సమ్మేళనం అంతలో ఆగిపోయింది. సుఖడీ పంపకం మాత్రం జరిగింది.

శంకర్ హుడా ప్రారంభించాడు.

"హుడ్యా.. రాణాం ని వాకీరే ఛత్రీస్ శరణాయీ ఓ
పేలా గుజరాంనాం ఢమక్యాంరే.. ఢోల్"

రాణా పక్షాన సన్నాయి ప్రారంభమయింది.

గూజర్ పక్షాన ఢోల్లు మోగడం ఆరంభమయింది.

ఈ పాట నానా కాళాల మధ్య జరిగిన యుద్ధకాండకు సరిపోతున్నది.

"ఇది నీ మధ్య నానా మధ్యా చాలా కాలంగా రాజు కొంటున్న నిప్పులే" అన్నాడు భగా.

భగా అన్నమాట కాళాకు నచ్చింది. మనస్సులో సంతోషించాడు. ఒక వైపు రాణా వంటివాడు నానా. రెండో వైపు గూజర్ వంటి బీద కాళా.

రెండో చరణం అందుకోగానే కాళా కంఠధ్వని మారిపోయింది. లోపల వేదన కలిగింది.

"రాణో పహూంచ్యో రే గామనా ఘూం పామా
పేలో గూజరో సీమడీ జాయ్"

రాణా గ్రామసీమలోకి ప్రవేశించాడు.

గూజర్ బయటికి వచ్చాడు.

కాళా హృదయంలో ఏదో బాధ బయలుదేరింది. ఏదో అతని జీవితంలో పెద్ద నష్టం ఏర్పడినట్లున్నది. దేనినో పోగొట్టుకొన్నట్లున్నాడు. తాను ఒంటరిగా వున్నట్లూ, నలువైపులా శూన్యమైన వాతావరణం వ్యాపించి వున్నట్లూ అతనికనిపించసాగింది.

మంచం మీద పడుకొన్నాడే గాని అతనికి నిద్ర రాలేదు.

రాజు వేణుగా, తాను గూజర్‌గా, నానా రాణాగా భావించడం ఆరంభించాడు. లేచి హుక్కా తాగాడు.

"రానీ రాణాను" అనుకొన్నాడు.

చివరికి కన్ను మూశాడు. కొంచెంగా నిద్ర బట్టింది.

తెల్లవారేటప్పటికి భార్య నిద్ర లేపింది. అతని దృష్టి దేనినో అన్వేషిస్తున్నది. దేనినో జ్ఞాపకం చేసుకొంటున్నాడు. నెమ్మదిగా నవ్వాడు. నెమ్మదిగా మంచం దిగి - తెల్లవారుజామున వచ్చిన స్వప్నం నిజమవుతుందంటారు. జీవితమంతా తనకు నానాతో పోరాటం తప్ప దనుకొన్నాడు.

ఎందుకో అతని హృదయం ఈ రోజు ఉప్పొంగిపోతున్నది. నాట్యం చేస్తున్నది.

21

# గ్రామమంతా ఆవులతో ఆడుకొంటున్నది. కాని కాళా మనస్సు.

కాళా నిద్ర లేచేటప్పటికి అరుణోదయమయింది. గ్రామం చివరి భాగంలో నివసిస్తున్న ఠాకుర్డా ఇళ్లల్లో కోళ్ళు కూసినవి. కాసిమ్ కోడి వేప చెట్టెక్కి మొత్తం గ్రామానికి నూతన సంవత్సరం తాలూకు అభినందనలు తెలియజేసింది. కొక్కొరోకో అని కూసింది.

ధరిత్రీ దేవత నూతన వర్షాగమనంతో ఆనందంగా ఉన్నది. గ్రామంలోని మురికినంతా ఆడవాళ్ళు పగిలిన కుండల్లో నింపి గ్రామం బయట పారబోసి వచ్చారు. పదిహేను రోజుల కొకసారి స్నానం జేసే ముసలి జగ్గా ఈ రోజు నీళ్ళు తెప్పించుకొని స్నానం చేశాడు. చిన్న పిల్లవాళ్లను "లే" అంటే చాలు, లేచి స్నానాలకు తయారవుతున్నారు. స్నానం కాగానే కొత్త గుడ్డలు కట్టుకొని టపాకాయలు కాల్చుకొంటూ 'కాళా కాకా'–'ఫలానీ కాకీ' అని అరుచుకొంటూ ఆడుకొంటున్నారు.

కొంతమంది పిల్లలు కాళా ఇంటికి వచ్చారు. కాళా మాట్లాడలేదు. అప్పటికింకా అతడు స్నానం చేసి వుండలేదు. స్నానం చేయకుండా మాట్లాడితే పిల్లలంతా "గాడిదలు కాయడానికి రా" అని ఎగతాళి చేస్తారు. స్నానం చేయనివాళ్ళంతా గాడిదలని పిల్లల అభిప్రాయం.

కాళా ముఖం కడుక్కొనే లోపల మంగలి శివా వచ్చాడు. "భలీ వదినా! తొందరగా నీళ్ళు తోడు. కాళా అన్నా! తొందరగా లే" అన్నాడు.

కాళా "నీ వింకొక ఇల్లు చూచుకొని రా. ఈలోపల నేను స్నానానికి తయారవుతా" నన్నాడు.

"అదేమిటి? నీ వంటి.." శివా మాట మార్చాడు. "నిన్నటి నొప్పులు.."

"అవును శివా! ఒళ్ళంతా నొప్పిగా వున్నది. ఏమిటో మనస్సు కూడా అంత బాగా లేదు" అన్నాడు కాళా.

" అవును. నొప్పిగా వుంటుంది" అన్నాడు శివా.

"నీవు నానా మీదకు దూకినప్పుడు రణఛోడుడు నిన్ను వెనకనుండి చాలా గుద్దులు గుద్దాడు" అన్నాడు శివా.

కాళాకు ఆ విషయం గుర్తున్నట్లే లేదు.

"ఏమయినా కాళా భాయీ! నీది గట్టి శరీరం. నాబోటి వాళ్ళకు అన్ని దెబ్బలు తగిలితే ఎప్పుడో మంచమెక్కే వాళ్ళం" అన్నాడు శివా.

కాళా శివాకు రెండు లడ్లు ఇవ్వమని ఛలీతో చెప్పాడు. లడ్లు తింటూనే శివా మాటలు చెపుతున్నాడు. కాళా వింటున్నాడు. ఛలీ నీళ్ళు తెచ్చి బయట పెట్టింది. కాళా స్నానానికి గుడ్డలు విప్పాడు. శివా స్నానానికి సరిపోయేటట్లుగా వేడి నీళ్ళల్లో చన్నీళ్ళు పోసి "అన్నా! రా. పీటమీద కూర్చో" అన్నాడు.

శివా కాళా శరీరమంతా మాలిష్ చేశాడు. వేడినీళ్ళు శరీరంమీద పోస్తూ "ఇదిగో ఇక్కడ నెత్తురు గడ్డ కట్టింది. ఇదిగో నెత్తురు" అంటూ వళ్లంతా శుభ్రం చేసి కాళాకు స్నానం చేయించాడు.

"శివా! నీకు ఆలస్యం అవుతుంది" అన్నాడు కాళా.

ఇంకా సగం పూరు అట్లానే వున్నది" అంటూ శివా కాళా శరీరం మీద నీళ్ళు ధారగా పోశాడు. ఉతికిన ధోవతి తెచ్చి యిచ్చి "ఇక నేను వెళ్లుతా" నన్నాడు.

"పొగాకు తీసుకొని పో" అని కాళా అనే లోపలే శివా బజార్లోకి అడుగు వేసి "పొగాకు కాదు. ఆరు మూళ్ల ధోవతి ఇవ్వాలి" అంటూనే పక్కనున్న పరమా యింట్లోకి అడుగుబెట్టాడు.

"నాథూ భాయీ! కంకు వదినా! నీళ్లు బయట పెట్టండి అన్నాడు. అరుణకాంతి వెనక వెనక ఉషాకాంత ఆకాశం మీద అడుగుబెట్టింది. ఆమె నలువైపులా ఎర్రటి కుంకాన్ని వెదజిమ్ముతున్నది.

ఆడవాళ్ళు గొడ్లనువిప్పి బయటకి తోలుతున్నారు. మొగవాళ్ళు ఆ క్రిందటి రాత్రి అంతా గోరింటాకుతో ఆ పశువుల కొమ్ములికి రంగులు వేసి వున్నారు. కాళా తన ఎద్దుల ఆవుల కొమ్ములకూ, మూపురాలకూ గూడా రంగు వేశాడు.

రంగులు వేస్తున్నంత సేపూ కాళా మనస్సులో క్రిందటి రాత్రి వచ్చిన స్వప్నం మెదులుతూనే వున్నది. ఆ స్వప్నంలో ప్రత్యేకించిన విశేషమేమీ లేకపోయినా అతడు చూచిన విషయమిది.

ఛలీకి సంతానం లేదు. అందువలన రామూ, ఛగా మొదలైన వారు

రాజుతో తన వివాహం నిశ్చయం చేశారు. రాజు భర్త అంతకు ముందే మరణించాడు.

కాళా మనస్సులో రకరకాలుగా ఊహలు చెలరేగుతున్నవి. ఆ స్వప్నం నిజం అవుతుందని అతనికి విశ్వాసం ఏర్పడింది. ఇది స్వప్నం. స్వప్నం నిజం కాదని సందేహం గూడా బయలుదేరింది. తన గౌరి ఆవు తోరణోత్సవంలో[1] జయిస్తే తన స్వప్నం నిజం కాగలదని నిశ్చయానికి వచ్చాడు.

ముసలి ఆవు పందెంలో గెలవడం అనిశ్చితమైన విషయం. గౌరి ఎంత చలాకీ గలదైనా ముసలిదైపోయింది. అయితే దానిమీద కాళాకు విశ్వాసం ఎక్కువ. న్యాయం జరిగితే - మేలు జరిగితే దానివల్లనే జరగాలి అని దాని మెడలో గంటలు కట్టాడు. గౌరి గెలిస్తే తనకు వచ్చిన కల నిజమవుతుంది అని అతని అభిప్రాయం. కాని భలీకి సందేహం కలిగింది. "ఈ ముసలి ఆవు గెలుస్తుందా?" అని అడిగింది.

"ముసలి ఆవు గెలిస్తేనే గొప్పతనం" అని భలీకి జవాబు చెప్పాడు. రామాకు నవ్వొచ్చింది. "కాళా! ఈ ముసలి ఆవుకు గంటలు కట్టావు. ఇది గెలుస్తుందా?" అన్నాడు.

"సత్యాసత్యాలను నిరూపించడానికి ఇటువంటి ప్రయత్నమే చేయాలి" అన్నాడు కాళా.

"గంటలు కట్టినంత మాత్రాన ముసలి ఆవు గెలుస్తుందా? అసత్యం సత్యమవుతుందా?" అన్నాడు రామా.

"పందెం గెలిస్తే?"

అయితే కాళా మనస్సులో వున్న సత్యాసత్యాలేమిటో రామా కేమి తెలుసు?

"సరే అదీ చూద్దా" మన్నాడు రామా.

రిహార్సలుకు గౌరీని వదులుతుంటే ఊళ్లోవాళ్లంతా నవ్వారు. కాళాకు గూడా మనస్సులో సందేహ మేర్పడింది. స్వప్నం నిజం కాకుండా పోతుందేమోనని అతని భయం.

---

[1] పండుగ మొదటి రోజు ఊరి బయట పెద్ద తోరణం కడతారు. ఎద్దుల్ని, ఆవుల్ని పరుగు పందెంగా వదులుతారు. ఎవరి పశువు తోరణం కిందకు ముందు చేరితే వాళ్ళు గెలిచినట్టు. ఆ పందేనికి మొదటి రోజు రిహార్సల్ జరుగుతుంది.

ఆ రోజు కోదర్ లేడు. కోదర్ రాజును పిలుచుకొని రావడానికి వాళ్లమ్మ పంపితే వెళ్ళాడు. ఆ విషయం కాళా మనస్సులో మెదులుతూనే వున్నది.

గ్రామంలోని నాలుగైదు వందలు పశువులు మైదానంలో నిలబడి వున్నవి. పందెం చూడడానికి వచ్చిన జనమంతా ఎత్తైన దిబ్బలమీద నిలబడి వున్నారు. పందెం పెద్ద గోపాలుడు కర్ర సహాయంతో నిలబడి జనాన్నీ ఆవుల్నీ చూస్తున్నాడు. మైదానమంతా కొంగలు రెక్కలు విప్పినట్లున్నది.

దీపావళి పండగ ప్రారంభమైన నాటినుండీ పందెం ప్రయత్నం జరుగుతూనే వున్నది. కాళాకు వొళ్ళు నొప్పులుగా వున్నది. అయినా అతడు కచ్చ బిగించాడు. కంచు పళ్లెం చేతిలోకి తీసుకొన్నాడు. అంటే పందెంలోకి దిగబోతున్నాడని అర్థం.

నెమ్మదిగా కాళా గోపాలుణ్ణి సమీపించాడు. "మానా కాకా! ఎట్లాగైనా ఈరోజు గౌరీ జయించేటట్టు చేయాలి. మంచి ధోవతి యిస్తా" నన్నాడు.

"ధోవతులు యిస్తామని చెప్పినవాళ్లు చాలామంది ఉన్నారు"

"నేనిచ్చే ధోవతితో నీళ్లు మూట గట్టవచ్చు" నన్నాడు కాళా. మానా సంతోషించాడు. "ని గౌరి జయించిందనుకో" అన్నాడు.

పందెం ప్రారంభమయింది.

"ఆవుల కాళ్ల కింద బడతారు, జాగ్రత్త! అని" మానా హెచ్చరించాడు.

జనం ఒకరొన్నొకరు హెచ్చరించు కొంటున్నారు.

కాళాతోపాటు శంకర్, భగా, బేచాత్ మొదలైన వాళ్ళంతా పళ్ళేలు మోగిస్తున్నారు. ఆవుల్ని 'హీవో హీవో' అని హెచ్చరిస్తున్నారు. పిలుస్తున్నారు.

ఆవుల పరుగు ప్రారంభమయింది. మానా జాగ్రత్తగా వాటి పరుగును నిరీక్షిస్తున్నాడు.

భగా మైదానం వదలి పక్కనున్న మట్టిదిబ్బ మీదకు ఎక్కాడు. అతని ఆవు గూడా గ్రామం వైపుకు పరుగెత్తుతున్నది.

పక్కకు తిరిగిన ఆవుల్ని – వాటి యజమానులు దోవకు మళ్ళేస్తున్నారు. పళ్ళేల మోతతో, మానా అరుపుతో కోలాహలంగా వున్నది.

"నీవు పళ్ళెం వాయిస్తూ ముందు నిలబడు" అన్నాడు రామా కాళాతో. కాళా గౌరిని బాగా ప్రోత్సాహ పరుస్తున్నాడు.

గౌరి ముందుకు సాగింది. ఇంకా కొంచెం ముందు బడితే గౌరి గెలుస్తుం దన్నాడు రామా. గౌరి వెనకబడుతుందేమోనని మానాకు అనుమానం కలిగింది. దాన్ని పేరుబెట్టి హెచ్చరించాడు. "గౌరీ! పరుగెత్తు" అన్నాడు. తన పేరు వినగానే గౌరి ఆకాశంలోకి ఎగిరింది. మిగిలిన ఆవులు గూడా సామాన్యమైనవి కావు. అవి గూడా ముందుకు సాగుతున్నవి. మధ్య వర్తులు గుర్రాల మీద ఎక్కి ఆవుల్ని జాగ్రత్తగా చూస్తున్నారు. అందరి దృష్టి గౌరి మీదనే వున్నది. కాళా తనను తానే మరిచాడు. రాజు తనకు లభించితీరుతుందని అతనికి విశ్వాసం ఏర్పడడ మారంభించింది. కాని అదృ ష్టానికి కర్తలెవ్వరు? గౌరి పందెంలో వెనకబడ్డది.

పందెం గెలవకపోయినా రామా భగా అందరూ గౌరిని ప్రశంసించారు. రేపు నిజమైన పందెం, గౌరి తప్పక గెలుస్తుందన్నారు.

"పిచ్చివాడా! అదృష్టంతో పందెం వేస్తున్నావు" అని కాళా మనస్సులో అనుకొన్నాడు.

ఆ తరువాత మానా కాకా కొండల్లోకి వెళ్ళి అదృశ్యుడైనాడు. ఆవులన్నీ ఒకచోటికి గుమిగూడాయి. కొంగ రెక్కలు అల్లల్లాడుతున్నట్లనిపించింది.

ఆ నాటి కార్యక్రమం పూర్తి అయింది.

## 22
## రహస్యంలో రహస్యం

జనమంతా గ్రామంవైపుకు బయలుదేరారు. నవయువతులు కొత్త గుడ్డలతో నలుగురు నలుగురు ఐదైదుగురు, ఒక్కొక్క జట్టుగా చేరి పాటలు పాడుతూ నడుస్తున్నారు.

"మాతా ఆజ్ నాం ఖడకేలాం క్యారే అవశో ?
మారీ సాంజ్ నీ వేలాఏ వాటీ జోజోరే
ధన్‌గన్ కరతాం ఆవశుం . . ."

మాతా! ఈ రోజు ఆశ్చర్యం కలిగించే దుస్తులతో ఎక్కడనుంచి వస్తున్నావు ? సంధ్యా సమయంలో నాకై ఎదురు చూస్తూ వుండు. నాట్యం చేస్తూ వస్తాను.

ఆ యువతుల జట్లకు కొంచెం ముందుగా నడుస్తున్న యువకులు గూడా పాట ప్రారంభించారు.

"భోజానాం ఢోర్ పోచ్యాం రే సామీ మాళీఏ.
పేలీ వేలానాం ఓఢణోమాం య. . .

భోజా పశువులు చేరవలసిన చోటికి చేరాయి. వేళా ముసుగులో. .

వారికి ముందు పిల్లలున్నారు. చిచ్చుబుడ్లూ, టపాకాయలూ కాలుస్తూ వాళ్ళు నడుస్తున్నారు.

కాని కాళా యువకుల మధ్యాలేడు, పిల్లల మధ్యాలేడు. తాను ఒంటరిగా నడుస్తున్నాడు. గుడ్డలో ఏదో చీపురు ముల్లుండి అది మాటి మాటికీ గుచ్చుకొంటూ వుంటే బాధపడుతున్నట్లున్నాడు. రాజు పశువుల్ని ఇక్కడే మేపుతుండేది గదా ?

"తారీ ధాణీనే మరా దాళియా
వేళు భేగా భేళవీయే ఆజ్"

నీ పేలాలూ, నా వేయించిన శనగలూ రెండింటినీ ఈ ఇసకలో కలుపుదాము.

పేలాలూ శనగలూ కలిపిన విషయం అక్షరాలా నిజం. కాళా దృష్టి

ముందు నది వొడ్డునవున్న వటవృక్షం, ఆ వటవృక్షం కింద కూర్చొని పేలాలు వేయించుకొనడం, ఆ వటవృక్షానికే ఉయ్యాలవేసి దానిమీద వూగుతూ పాడటం అన్నీ నాట్యమాడసాగాయి.

దానితో కాళాకు తనమీద తనకే కొద్దిగా కోపం వచ్చింది. "కాళా! ఈ రెండు రోజులనుండి నీ పరిస్థితి ఎందుకు ఇట్లా మారిపోయింది!!" అనుకొన్నాడు. అతనికి నవ్వు వచ్చింది. "నిద్రపోయిన వాళ్లకు స్వప్నం గానీ, మేలుకొనినప్పుడు స్వప్నమేమిటి?" అనుకొన్నాడు.

ఇంటికి పోయి మంచంమీద పడివుండాలి అని అతనికి కోరిక కలిగింది. కాని శంకర్ ఇంటికి పోక తప్పలేదు. అక్కడ పెద్దలు చేరివున్నారు. సమావేశం జరగనున్నది. పంచాయితీవార్లు న్యాయ నిర్ణయానికి అక్కడ కూర్చొని వున్నారు. అంతేగాక ఆ న్యాయ నిర్ణయమేమిటో తొందరగా జరప మని కాళా రాజాలిద్దరూ కోరివున్నారు. కాళా హుసాలో లీనమైవున్నాడు.

"తాకీ ఓఢణీ నే మారాం ఫాళియాం
వేళు గోరియో ఘుమడీసె ఆజ్ . ."

నీ మేలి ముసుగూ, నా తల గుడ్డా ఇద్దరం ఈరోజు ఇష్ట మొచ్చినట్లుగా తిరుగుదాం.

పాట పాడుతూవుంటే కాళాకు ఆనందంగా వున్నది. గడచిన జీవితం లోని జీవితానందాన్ని అతడు కొల్ల గొట్టుతున్నట్లున్నాడు. కాని శంకర్ కాళాను హెచ్చరించాడు. "నీ వీ విధంగా హుసా పాడితే బండి నడవదు. లే. బూరెల మూకుళ్ళు తయారుగా వున్నవి. సుఖడీ తయారుచెయ్యి" అన్నాడు.

కాళాకు లేవక తప్పలేదు. ఇంట్లోకిపోయి భగా చెల్లెల్ని పిలిచాడు. "రతన్! కట్టెలు తీసుకొని రా. నెయ్యి బెల్లం రెండూ కావాలి. పిండి ఎక్కడ?" అన్నాడు. రతన్ అన్నీ తెచ్చి అందించింది. రతన్‌తో గప్పాలు కొడుతూ కాళా సుఖడీ తయారుచేస్తున్నాడు.

బయట కోపంతో వున్న రణఛోడ్ ముఖియాను అతడి తమ్ముణ్ణి పంచా యితీవార్ల ముందుకు పిలుచుకొని రావడానికి ప్రయత్నం జరుగుతున్నది. పరమా పటేలు నిన్న సాయంత్రమే మంచంలో పడ్డాడు. ముసలివాళ్ళు ఒక్కసారి పిలిస్తే వచ్చేవాళ్ళు. ఇప్పటి వాళ్ళు వెంటనే రారు. తోక

పట్టుకొంటే అట్లాగే పట్టుకొని కూర్చుంటారు. రణఛోడుడు పెద్దవాడై నాడు, కాని తెలివి ఎక్కడనుండి వస్తుంది?'' అన్నాడు బేచాత్.

''పిలుచుకొని రావడానికి కాళ్ళాను పంపించండి'' అన్నాడు ఒకడు.

''అవును నిజమే'' అన్నారు నలుగురైదుగురు.

బేచాత్ వుండలేక-''అతనికేమీ గరుజు పట్టలేదు. వాళ్లందరినీ పిలుచుకొని రావడానికి అతని కేమిటి అవసరం?'' అన్నాడు.

''అవును. అదీ నిజమే'' నన్నారు నలుగురైదుగురు. అవకాశం కొరకు ఎదురుచూస్తున్న రామాకు అవకాశం దొరికింది. ''అయితే ఒకపని చేయండి. రణఛోడ్ ముఖియా తోకకు కాళ్ళాను కట్టండి'' అన్నాడు.

''నీ మాట ముఖియా కాపనడని అందరూ అంటున్నారు. మీరు ఒకే బండిలో కూర్చొని ప్రయాణం చేశారట. నీవు ఆ బండిలోనే వున్నావు గనుక ఒక్క అడుగు వేయరాదా?'' అన్నాడు ఒక ముసలివాడు.

''సరైన మాట చెప్పావు. న్యాయం చెప్పించాలి గదా!!..''

కాసిమ్‌కు నవ్వు వచ్చింది. ''మీరనేదేమిటి? ఫిర్యాదు చేసిందెవరు? ఫిర్యాదు చేసిన వాళ్ళు ఇక్కడికి వస్తే న్యాయం జరుగుతుందా లేక ఇంట్లో కూర్చుంటే జరుగుతుందా?'' అన్నాడు. ''మీకంత అభిమానముంటే వెళ్లి పిలుచుకొని రండి. తరువాత న్యాయం జరుగుతుందో లేదో చూడండి'' అన్నాడు.

ఉత్సాహం కలిగిన నలుగురైదుగురు రణఛోడుణ్ణి ఎలాగైతేనేమి, బలవంతంగా లాగి తీసుకొచ్చారు. ''ఒక న్యాయం పరిష్కరించండి'' అన్నారు. రామా అందుకు ఎదురు చూస్తున్నాడు. ''అవును. తీర్పు చెప్పండి'' అంటూ అరుగుమీద నుండి లేచి గడపమీద కూర్చున్నాడు. ''భేమా డామోర్‌ను గూడా పిలిపించండి'' అన్నాడు.

''భేమాకు ఇక్కడ ఏమిటి పని?'' అన్నాడు రణఛోడుడు.

''పిల్లలికి నచ్చజెప్పు పిల్లలికి. ఏమి పని అంటున్నావా? ఇక్కడ మూర్ఖులెవ్వరూ లేరు'' అన్నాడు రామా.

రామా అప్పుడప్పుడు ఎగతాళిగా మాట్లాడుతుంటాడు. అందువలన తటస్థుడుగా వుండే కాసిమ్ మాట్లాడవలసి వచ్చింది. ''భేమా ఎందుకో నీకు అర్థంగాలేదా? ముఖియా!'' అన్నాడు.

"ఉన్న రహస్యమంతా అక్కడే వున్నది. భేమాకు అంతా తెలుసు" అంటూ రామా లేచి నిలబడ్డాడు. "ముఖియా భేమాను పిలిపిస్తే మంచిది" అన్నాడు.

"ఎట్లాగైనా చావనీ. నాకు న్యాయం అక్కర్లేదు. మీరు మీ మీ పనులు చూసుకోండి" అన్నాడు ముఖియా.

"ముఖియా! నచ్చులుగొట్టకు. అందరి కళ్లూ కప్పడానికి ప్రయత్నం చెయ్యబోకు. మొత్తం కుండ బద్దలు కొట్టవలసి వస్తుంది."

"భేమాను పిలవండి. తప్పేమున్నది?" అన్నారు నలుగురైదుగురు.

"పిలవండి. పిలిపించండి" అన్నారు కొంతమంది.

ముఖియా మధ్యలోనే అందుకొన్నాడు. "నాకు న్యాయమే అక్కర్లేదని నేనంటుంటే ఇదంతా ఏమిటి? నానా ముక్కు బద్దలయింది గాని, మీ ముక్కులు బద్దలు కాలేదు గదా!! అన్నదమ్ములు పోట్లాడుకొన్నారు. అంతే గదా!" అన్నాడు.

కాసిమ్ సంతోషించాడు. "ముఖియా! పెద్ద మాట అన్నా"వన్నాడు.

అందరికీ ఆ వ్యవహారాన్ని చూస్తే ఆశ్చర్యం కలిగింది. ఒక్క ఘడియ ముందువరకూ ముఖియా అందరిముందూ ఫిర్యాదు చేశాడు. "నా తమ్ముడు చావు దెబ్బలు తింటే మీరంతా వూరుకొన్నా" రన్నాడు. అటువంటివాడు ఇప్పుడు న్యాయమే వద్దంటున్నాడు! ఎవ్వరికీ ఏమీ అర్థంగాలేదు.

కాళా అంతా వింటున్నాడు. భేమాను పిలిపించడం కాళాకు ఇష్టంలేదు. కారణమేమంటే భేమా వస్తే రాజు పేరు గూడా వస్తుంది. ఆమెకు అవమానం జరుగుతుంది. నానాకు గూడా అవమానం జరుగుతుంది. మంచిదే. అయినా కాళాకు భేమాను పిలిపించడం మంచిదిగా తోచలేదు. ఇంతలో సుఖడీ పళ్లెం వచ్చింది. రహస్యం రహస్యంగానే వుండిపోయింది. భేమా నానా తరపున రాజు దగ్గరకు వెళ్ళిన రాయబారి.

ఆ మరుసటి రోజు గ్రామమంతా తోరణోత్సవం చూడడానికి బయలు దేరింది. వనరాజీ మధ్య ఫాల్గుణ మాసంలో పుష్పించిన ఖాఖరీ వృక్షం లాగా గ్రామంలోని ఆడవాళ్ళ మధ్య రాజు కన్పించింది. కాళా గుండెలు అదిరాయి. ఈ రాత్రే గుడ్డలు మార్చుకొంటారా? అందుకే రణఛోడుడు న్యాయం అక్కర్లేదన్నాడా? అందుకే ముసలిది రాజును పిలుచుకొని రావడానికి కోదర్‌ను పంపించిందా? లేకపోతే రాజు వచ్చి వుండదు. తన

పక్కనే కోదర్ నిలబడి వున్నాడు. కోదర్ తనకు పరమ శత్రువుగా కన బడుతున్నాడు.

కాళా ఆలోచనల్లో మునిగే వున్నాడు.. ఇంతలో "గౌరీ! హీట్, హీట్" అని మానా కాకా అరుపు వినిపించింది. నాట్యం చేస్తున్నట్లుగా గౌరి పరుగెత్తుతున్నది. కాని కాళా దృష్టి అటులేదు. అసలతడటు చూస్తే గదా? రాజును ఏ విధంగా కలుసుకోవాలి?... కలవాలా వద్దా? మాట్లాడడం అవసరమా కాదా? అతని ఆలోచన తెగడం లేదు.

గౌరి పందెం గెలిచిందని పంచాయతీ పెద్దలు నిర్ణయించేశారు. రామా, భగా, కాళాను అభినందించారు. "మంచి శకునమయింది. ఈ సంవత్సరం నీ జీవితం ఆనందంగా గడుస్తుం"దన్నారు. కాళా నవ్వుతూ ఆ మాటలన్నీ వింటున్నాడే గాని అతని మనస్సుకేమీ ఎక్కడం లేదు. వింటున్నట్టు అతడు నటన మాత్రం చేస్తున్నాడు.

కాల చక్రంలో ఇంకొక చక్రం తిరిగిపోయింది. అస్తమిస్తున్న సూర్య దేవునికి ధరిత్రి వీడ్కోలు చెప్పింది. ఆకాశమంతా గోధూళి వ్యాపించింది.

జనమంతా గ్రామం వైపుకు తిరిగారు. ముఖ్యంగా యువతులు పాటలు ప్రారంభించారు. ఈ రోజు రాజు పాటలు చెప్పుతున్నది. ఆమె కంఠం కోయిల కంఠంలాగా మధురంగా వున్నది. వ్యాకులంగా వున్న కాళా మనస్సును గూడా ఆమె పాట ఆకర్షించింది. అది కొత్త పాట.

"దన్‌తో దౌడతో జాయ్, మన్‌ఖో మాణ్యో నీర్ రే లోల్"

రోజులు పరుగెత్తుతున్నవి. కాని ఆనందం అనుభవించలేదు.

కొత్తపాట కావడం వలన రాజు చరణం అందిస్తున్నది. మిగతావాళ్ళు అదే చరణాన్ని పాడుతున్నారు. కాళాకు ఈరోజు రాజు ఏ ఇతర లోకంలో నుండో దిగి వచ్చినట్లు కనబడుతున్నది. దీర్ఘంగా నిట్టూర్చి కాళా మనస్సు లోనే "నీకెన్ని రూపాలున్నవో ఎవడికి తెలుసు? ఉల్లాసమూ, ఉత్సాహమూ నీ పాటలోని శబ్దశబ్దంలో నుండి పెల్లుబుకుతున్నది" అనుకొన్నాడు.

సవారో సమణే థాయ్ మన్‌ఖో మాణయో నథీ రే లోల్

తెల్లవారు జామున స్వప్నం వచ్చింది. ఆనందం అనుభవించలేదు.

రాజు తనను ఉద్దేశించి దుఃఖాన్ని వెల్లడిస్తున్నదని కాళాకు అనిపించింది.

"వర్షో వ్యాజమాం జాయ్ మనఖో మాణయో నథీ రే లోల్ !

సంవత్సరాలు ఏదో మిషతో గడచిపోయినవి. ఆనందం అనుభవించ లేదు.

ఆ పంక్తిని వినగానే కాళాకు తన హృదయం నిండినట్లనిపించింది. అతని హృదయం నిండకపోయినా నిమ్మతొనల వంటి అతని కళ్ళు కన్నీళ్ళతో తప్పక నిండిపోయినవి.

"నా స్థితి గూడా అట్లాగే వున్నది రాజూ!" అనుకొన్నాడు. ఆ చరణాన్ని మననం చేసుకొంటుంటే కాళా హృదయం పాడడంగాదు భోరున ఏడ్చింది.

"వర్షో వ్యాజ్‌మాం జాయ్, మన్‌ఖో మాణయో నథీ రే లోల్ !

జీవడో ఝుంఖనో జాయ్ అరేరే మాణయో నథీరే లోల్"

సంవత్సరాలు ఏదో మిషతో గడుస్తున్నవి. ఆనందం అనుభవించ లేదు. జీవితం వేదనతో గడచిపోతున్నది. ఆనందం అనుభవించలేదు.

"నీ స్థితీ, నా స్థితీ రెండూ అట్లాగే ఉన్నవి."

కాళా పక్కనే కోదర్, భగా మొదలైనవాళ్ళు హుడా పాడుతూ నడుస్తున్నారు. కాని వాళ్ళ పాటలోని ఒక్క ముక్క గూడా కాళాకు వినిపించడం లేదు. పాట పూర్తి అయిందని అనుకొని నడక వేగం హెచ్చించాడు. "కలిసే ఇప్ప చెట్టు" [1]మార్గం కనిపిస్తున్నా తాను తన ఇంటి మార్గం అనుసరించాడు. "తొందరలో రాజును కలుసుకోవాలి. ఆ పాట తనను భ్రమలో పడవేస్తున్నది" అనుకొన్నాడు. ఏమైనా కానీ, రాజు మంచి ఉత్సాహంతో వున్నది. మళ్ళీ పాట ప్రారంభించింది.

"సహియర్ ఏవుం నాం థామ్ మన్‌ఖో మాణీ లే జో రే లోల్ !"

ఓ సఖీ! ఇక ఈ విధంగా గడవదు. ఆనందం అనుభవించు.

తరువాతి పంక్తి కాళాను పిచ్చివాణ్ణి చేసివేసింది.

"జాగ్యాం త్యాథీ సవార్ మన్‌ఖో మాణీ లే జో ర్ లోల్ !

సవారీ వెళ్లుతున్నది. ఆనందం అనుభవించు.

"ఓ మూర్ఖుడా ! విను. విను. ఏమి చెపుతున్నదో విను" "కూట్‌శే లోఢులపార్ మన్‌ఖో మాణీ లే జో రే లోల్ !"

కమ్మరి సమ్మెటతో మోదుతున్నాడు. ఆనందం అనుభవించు.

[1]తోరణోత్సవం పూర్తి అయిన తరువాత ఊళ్ళో వాళ్ళు ఇప్పచెట్టు కింద కలుస్తారు.

"దానికి అర్థమేమిటో తెలిసిందా? బాధా దుఃఖమూ అన్నీ బావిలో పడనీ. నేను నానా దగ్గరకు పోతాను. ఆనందం అనుభవిస్తాను" అని అర్థమా ?

"దన్‌మాఁ బచ్చేబార్"

రోజూ రెండు రెండు సార్లు.

ఆ తరువాత రాజు ఇంకొక పల్లవి అందుకొన్నది. కాని వ్యాకులంగా వున్న కాళాకు "దినమేఁ బచ్చేబార్" అనేది హృదయంలో హత్తుకొని పోయింది. రాజు ముఖం రక్కవలెననీ, ఆమె గొంతు పిసకవలెననీ అనిపించింది.

ఇంతలో ఆ పల్లవితోబాటు ఇంకా కొన్ని శబ్దాలున్నవని అతనికి గుర్తు కొచ్చింది. "పాట పూర్తిగా వినరా మూర్ఖుడా !" అనుకొన్నాడు.

రాజు పాడుతున్నది.

"దన్‌మాఁ బచ్చేవాక్

సాంజనీ సాథే సవార్

జోవనాయీ కే ఛే ఝుపాహ్ మన్‌ఖో మాణే లే జో రే లోల్ !"

దినం రెండు రెండు సార్లు సంధ్యతో గూడా సవారై యౌవనం "తయారు" అంటున్నది. ఆనందం అనుభవించు.

ఇంకొక రోజు అయివుంటే ఆ చరణం విని కాళా సంతోషించి వుండే వాడే. నిజమైన సంగతి. సూర్యుడు రోజూ రెండుసార్లు ఉదయిస్తూ అస్తమిస్తూ హెచ్చరిక చేస్తున్నాడు. "పిచ్చివాళ్ళల్లారా ! మేల్కొండి. ఈ యౌవనం రామ్ రామ్ అనుకొంటూ రోజు రోజూ మీనుండి సెలవు తీసుకొంటున్నది" అని దానికి అర్థమని చెప్పి వుండేవాడే.

కాని ఈరోజు అతని స్థితి వేరుగా వున్నది. ఈరోజు రాజు ఏదో రహస్యం తనకు తెలియజేస్తున్నదని అతననుకొన్నాడు.

కోదర్, రామా ఇద్దరూ "అటు పూరున్నది" అన్నారు.

కాళాను ఆ మాట ఆకర్షించింది. "రణఛోడ్ కాళాలనిద్దరిని కలవకుండా మిగతా వాళ్ళతో కలిసేదెలా ?" అని గూడా వాళ్లన్నారు.

కాసిమ్ శంకర్ ఇద్దరూ అందుకొన్నారు. "గ్రామంలో ఎవ్వరూ పోట్లాడుకోరా ? మీరు ఒకే వంశంలోని పేగులు గదా ? శుభదినం నాడు అన్నదమ్ములు కలుసుకోకపోతే పని జరుగుతుందా ?" అన్నారు.

కాళాకు వారి వెంట వెళ్ళక తప్పలేదు. "ఒక్క వంశం వాళ్ళు, అన్న దమ్ములు" అన్న మాటలు కాళా హృదయాన్ని దహించి వేస్తున్నవి.

కాసిమ్, శంకర్, రణఛోడుడు, కాళా అందరూ కలుసుకొన్నారు. ఒకరినొకరు కుశల ప్రశ్నలు వేసుకొన్నారు.

తల్లిదండ్రుల కాలం నుంచి వస్తున్న ఆచారాన్ని పాటించాలి గదా! ఏమి చేస్తారు!!

## 23

## దీనిలో నీదేమున్నది?

ఇప్పచెట్టు కింద వున్న అరుగుమీద కూర్చున్న ముఖ్యులందరినీ రణఛోడుడు ఒక్కసారి చూచాడు. రెండిళ్ల వాళ్ళు రాలేదు. దానికి కారణం అందరికీ తెలుసును. ఆ ఇళ్ల వాళ్ళిద్దరూ కొద్ది రోజుల క్రితం పోట్లాడుకొన్నారు. ఒకరు రామాకు సంబంధించిన వాళ్ళయితే ఇంకొకరు గుడ్డి జగ్గాకు సంబంధించిన వాళ్ళు. ఆవులు పొలంలో మేశాయి. అది తగాదాకు కారణం.

ముఖియా వాళ్లను గూడా పిలవనంపించాడు. ఈలోపల కాళా రణఛోడుని మధ్య రాజీ మాటలు జరిగినవి. నిజానికి రణఛోడునితో కలవడానికి కాళాకు అభ్యంతరమేమీ లేదు. కాని నానాతో కలవడం అతనికి సుతరామూ ఇష్టం లేదు. శంకర్, కాసిమ్ వగైరాలు నానాను కలుపుకొనడానికే ముఖియా బండిలో కూర్చున్నారు. వాళ్లకేదో భ్రమ కల్పించబడిందని కాళా అర్థం జేసుకొన్నాడు.. అందువల్ల లక్ష మాటలకు ఒక్క మాట అన్నాడు.. "నా మనస్సు అంగీకరించడం లేదు అంతే. మనసు లేనిదే కలవడ మెట్లా?" అని అడిగాడు.

"మనస్సు అంగీకరించడం లేదా? మేము నిర్ణయం జేస్తే అది నీవు అంగీకరించక పోతే ఎట్లా? చేతులు కలపగలం గాని, హృదయాలు ఎట్లా కలపగలం? మనం ఎంత తల పగలగొట్టుకున్నా నానాతో కాళా కలిసే ఉపాయం లేదు" అనుకొన్నారు.

"అయినా కారణమేమిటి?" అని కాసిమ్ అడిగాడు.

కాళా ఏమి జవాబు చెపుతాడు? నానాతో రాజీ చేసుకొంటే రాజును వాడికి సమర్పించాలి. అది కాళాకు తెలుసు. రాజు నానాతో గుడ్డలు మార్చుకొంటే కాళాకు నష్టమేమిటి? దానికి కాళా జవాబు చెప్పలేడు. నిజమైన విషయమేమంటే - అంగీకరిస్తే అంతా మంచిదే. లేకపోతే ఏదీ లేదు. ఆ మాటంటే జనం కాళా పిచ్చివాడంటారు. అందువల్ల లక్ష మాటలకు ఒక్కమాట అన్నాడు. "నన్నిక్కడనుండి వెళ్ళిపోమంటారా?" అన్నాడు.

కాళా పట్టుదల చూసి మిగతావాళ్ళు ఆశ వదులుకొన్నారు. అయినా అంతా నాలుగు నాలుగు మాటలు చెప్పి చూచారు. లాభం లేదని అంతా లేచారు.

కాళా మనస్సు చాలా వ్యాకులంగా వున్నది. అస్తవ్యస్తంగా వున్నది. అందువలన కాసిమ్‌తో సలామ్ అనడానికి బదులు "రామ్ రామ్" (సెలవు) అనేశాడు.

హనుమంతుని గుడీ, అమ్మవారి గుడీ అన్నింటికీ పోయి వచ్చిన తరువాత హుడా పాడుకొంటూ అందరూ బయలుదేరారు. కాళా తొందరగా రెండడుగులు ముందు వేసి రెండు పొలాలు ముందుకు దాటాడు.

"జీవో జాగో తో రాపణాం బేసాడ్‌జో
పేలా ముయలానా ఛేలా ఝువార్"

బ్రతికివుంటే మళ్లీ సమావేశంలో కూర్చుందాం. చచ్చిపోతే ఇదే సెలవు.

కాళా దృష్టి పాటమీద లేదు. తొందర తొందరగా నడుస్తున్నాడు. వీళ్లు రావడానికి పూర్వమే తాను రాజును కలుసుకోవాలి.

అతడి మెదడులో అనేకరకాల ఆలోచనలు బయలుదేరాయి. రాజు పుట్టింటికి ఎందుకు వచ్చింది? బలవంతంగా తీసుకొని రాబడిందా? లేక తనంతతానే వచ్చిందా? తన దగ్గర ఏమీ ప్రమాణాలు లేవు. అతని అంతస్సు తప్పు జరగదని ఘోషిస్తున్నది. ముసలిది కోదర్‌ను పంపించి రాజును పిలిపించింది. కోదర్‌కేమీ తెలిసినట్లు లేదు.

కాళా దీర్ఘంగా నిట్టూర్చాడు. రాజు అంగీకరించిందేమో!! ఎందు కంగీకరించగూడదు? అది సంభవమే. ఆమెకు భర్త సుఖమూ లేదు, తిండి సుఖమూలేదు. ఏ విధంగా రోజులు గడుపుతుంది! ఒకరిద్దరు పిల్లలు.. మనస్సు మర్కటం వంటిది. నానా భార్య అత్తవారింటికి వచ్చి ఐదు సంవత్సరాలయింది. నానా ఇంకొక స్త్రీని పెళ్లి చేసుకొంటే న్యాయమే అవుతుంది. కాళా తల తిరిగిపోతున్నది. "వద్దు సోదరుడా! వద్దు. ఐదు సంవత్సరాలు గాదు, పది సంవత్సరాలవరకు పిల్లలు లేక పోయినా రెండోపెళ్లి సంగతే ఎత్తకు. నానా రెండోపెళ్లి చేసుకొంటే చేసుకోనీ కాని రాజును మాత్రం కాదు. నానాతో రాజు గుడ్డలు మార్చు కొంటే నా గుండెలమీద కుంపటి అవుతుంది."

రాజు అప్పటికప్పుడే వెళ్లి నానా యింట్లో కూర్చున్నట్లు కాళా వ్యాకుల

పడ్డాడు. "రామాను గీమాను పంపను. నేనే వెళ్లి రాజును కలుస్తాను" అని నిశ్చయం చేసుకొన్నాడు. "దీనిలో తప్పు ఏమున్నది?" అనుకొన్నాడు. రాజుకు నచ్చజెప్పడం అవసరమనుకొన్నాడు. రాజు అంగీకరించకపోతే? ఏది ఏమైనాసరే, నానాతో రాజుకు వివాహం జరగగూడదు. నిశ్చయానికి వచ్చాడు.

రాజు ఇంటివైపుకు బయలుదేరిన కాళా సగం దోవలోనే వెనకకు తిరిగాడు. రాజు ఇంటికిపోయి మాట్లాడడం మంచిది కాదనుకొన్నాడు. తిన్నగా తన యింటికి చేరుకొన్నాడు. కొత్త సంవత్సరం ప్రారంభమయిందని దీపం వెలిగిస్తున్న భార్యను పిలిచాడు.

"రాజును పిలుచుకొనిరా" అన్నాడు.

భలీకి కారణం తెలిసివుండవచ్చును. ఉదయం భేమా పేరు రావడంతో విషయమంతా అందరికీ తెలిసిపోయింది. అంతేగాక అంతకు రెండు రోజులు పూర్వమే నానా కాళాలు కొట్టుకొనివున్నారు. నానా రాజును పిలుచుకొని రావడానికి ప్రయత్నిస్తుంటే కాళా అడ్డుపడుతున్నాడని అందరికీ తెలిసిపోయింది.

"ఎందుకు?" అని భలీ ప్రశ్నించింది.

"పని వున్నది. ముందు నీవు పిలుచుకొనిరా. తరువాత కారణం చెబుతాను. వెళ్ళు. ముసలివానికి తెలియగూడదు. కోదర్ భార్యకు వాసనగూడా తగలగూడదు" అన్నాడు.

భలీ వెళ్ళిన తరువాత హుక్కా తాగుతూ కూర్చున్న కాళా హృదయం గబగబ కొట్టుకొనడ మారంభించింది.

వస్తుందో రాదో? రాకపోతే?

"ఏమైనా నానా యింటికి ఆమె వెళ్ళడానికి వీలులేదు. బేచాత్ సహాయంతో ఆమెను ఒంటెమీద కూర్చోబెట్టుకుని అయినా తీసుకొని పోతాను" అనుకొన్నాడు.

"తీసుకొని పోతావు? తరువాత? తరువాత ఏమి చేస్తావు? ఆమెను అత్త వారింట్లో వదలి వేస్తావా?"

"అసలు రాజు ఒంటెమీద నుండి కిందకు దిగకనేపోతే?" వాకిలి ముందున్న అరుగుమీద కూర్చుని హుక్కా తాగుతున్న కాళా దీర్ఘంగా నిట్టూర్చాడు.

ఇంత చేస్తే తనకేమిటి ప్రయోజనం ?

అంత చీకట్లోగూడా వేపచెట్టు ఆకులమధ్య నుండి కాళా ఆకాశాన్ని తేరిపార చూస్తున్నాడు.

తాను ముందూ, రాజు వెనకా ఒంటె వెళ్ళిపోతున్నది. పొదలు దాటింది. కొండలు దాటింది. నదులనూ, కాలువలనూ అన్నిటినీ దాటింది. వెళ్ళి పోతున్నది.

ఎదట భలీ కన్పించగానే కాళా ఈ లోకంలోకి వచ్చాడు.

"ఏమన్నది?" అని అడిగాడు.

"వస్తానన్నది" అంటూ తిన్నగా ఇంట్లోకి వెళ్లిపోయింది భలీ.

"ఒక్కక్షణం నిలబడు. పూర్తి మాట చెప్పు. రాజు ఎక్కడ కన్పించింది?"

"ఇంట్లో. ఇంకెక్కడ కనుబడుతుంది? అడవిలో వుంటుందా?"

"మాట అడిగితే మండి పడతావేం?" కాళాకు గూడా కోపమొచ్చింది. అయినా తమాయించుకొని "ఏమన్నది?" అని అడిగాడు నెమ్మదిగా.

"ఏమంటుంది? వస్తానన్నది."

ఇంతలోనే కాళా దృష్టి ఆ బజారులోకి ప్రవేశించిన ఒక నీడమీద పడింది. ఆ చీకట్లో గూడా ఆ మేలి ముసుగు స్పష్టంగా కనబడుతున్నది.

"సరే. లోపలికి పో" అని భలీని లోపలికి పంపించాడు.

"రా" అని రాజుకు స్వాగతం చెప్పాడు.

రాజు ఇంట్లోకి అడుగు వేసింది.

"ఇక్కడే కూర్చో. రెండు మాటలు మాట్లాడాలి" అన్నాడు కాళా.

"అన్నం తిని కూర్చుంటే బాగుంటుంది. ఈ దీపం ఎంతసేపు వెలుగు తుంటుంది?" అన్నది భలీ లోపలినుండి. ఆమె మాటల్లో కోపం కనబడు తున్నది. నీతులు చెప్పి చెప్పి ఈ కాళా రాజును తన యింట్లోనే తెచ్చి పెడతాడేమోనని భలీకి భయం ఏర్పడింది. రాజుతో కాళా మాట్లాడడం భలీకి ఇష్టం లేదు. తన పుట్టింటి విషయం గనుక ఆ యింటి మేలుకు మాట్లాడుతున్నాడు. గనుక ఏదో విధంగా సర్దుకొనే ప్రయత్నం చేసింది భలీ.

"నేను తరువాత తింటాను. ముందు నీ భోజనం కానీ" అన్నాడు కాళా.

ఈ లోపల రాజు వెనుకకు తిరిగి అరుగు పక్కన వున్న దిమ్మెనాను

కొని కూర్చొన్నది. ఆమె నిర్భయంగా నిశ్చలంగా కనబడుతున్నది. ఆ పక్కనే పడివున్న చిన్న గడ్డి పుల్లను తీసుకొని పళ్ళు కుట్టుకుంటూ- "ఎందుకు పిలిపించావు? నేను ఇంట్లో ఎవ్వరికి చెప్పిరాలే" దన్నది.

కాళా ఒక్కటే ప్రశ్న వేశాడు.

"ఊళ్ళో వినబడుతున్న మాట నిజమేనా?"

"ఏ మాట?"

"నానా ఇంట్లో నీవు ప్రవేశించే మాట. గ్రామమంతా అదేమాట అంటున్నది."

"గ్రామ మనడంలేదు. గ్రామస్థులచేత అనిపించబడుతున్నది."

"అంటే అది నిజం కాదన్నమాట" అన్నాడు కాళా. "అయినా అది నిజమా కాదా? నీ ముఖతః నీవు చెప్పు" అన్నాడు.

"నిజమే. కాని..."

కాళా మీద పిడుగు బడ్డట్లయింది. చిరునవ్వు నవ్వుతున్న రాజు అతని కళ్ళకు పిశాచంలాగా కనబడడం ఆరంభించింది.

"ఏది నిజం?"

రాజు నెమ్మదిగా నవ్వింది. ఆ నవ్వు వెల వెల బోతున్నది.

"జనమంటున్నమాట. అదే గదా నీవడిగేది?"

"అవును. ఆ మాట నిజమా? అదే నా ప్రశ్న."

"నిజం కాదు"

"ఆ మాట ఏమిటో నీవు విన్నావా?"

రాజు తన మోచేతి పైనున్న కంకణాన్ని పైకి కిందికి కదుపుతున్నది.

"విన్నాను. కాని అది నిజం గాదు" అన్నది.

కాళా లేచి ఆమె ముందుకు వెళ్ళాడు.

"ఈ మాట గ్రామమంతా ఎలా వ్యాపించింది? ఇదేమైనా సామాన్యమైన విషయమా?" అన్నాడు.

"నాతో ఈ విషయం ఎవ్వరూ మాట్లాడలేదు. నేను ఎవరెవరి నోరు కప్పను? ఎవరెవరితో పోట్లాడను?" అన్నది రాజు.

"నిన్నెవ్వరూ ఏమీ అడగలేదా?"

"లేదు"

"నీ మేనమామ గూడా?"

దీపపు కాంతి ప్రసరించి వుంటే రాజు కళ్లల్లో కాళా కన్నీళ్లు చూచే వాడు.

"ఇవన్నీ నీవెందుకు అడుగుతున్నావు?" అని ప్రశ్నించింది రాజు.

"ఎందుకు అడుగుతున్నానా?" కాళా కళవళపడ్డాడు. అతని కంఠ ధ్వని తగ్గిపోయింది. నోటివెంట మాట రాలేదు.

"ఈ మాట విన్న తరువాత నా మనస్సు బాగాలేదు" అన్నాడు నెమ్మదిగా.

"నామీద అంత అభిమానం చూపిస్తున్నావు అది చాలు" అన్నది రాజు. "ఇంత అభిమానం మా వాళ్లకు నామీద వుంటే.." రాజు బొట బొట కన్నీళ్లు కార్చింది.

కాళా ఏమి జవాబు చెప్పగలడు? "రాజూ! నన్ను మరచిపో. చిన్నప్పటి మాటలన్నీ మరచిపో. చిన్నతనంలో ఇద్దరం కలిసి ఎన్నో ఆటలు ఆడుకొన్నాము. నీవు మా యింటి నీళ్లు మోశావు. వంట చేశావు.. నాకు ఆటల్లోనే భోజనం పెట్టావు.." అంటూ దీర్ఘంగా నిట్టూర్చాడు. వస్తున్న ఏడుపును ఆపుకొన్నాడు. "నీకూ నాకూ వున్న సంబంధం అంతేనని చాలామంది అనుకొంటున్నారు..కాళా నిజం కాదనుకొన్నది నా దృష్టిలో నిజం. ఏమైనా అన్నీ గతంలోని మాటలు. అంతా మరచి పో. మరచిపో" అంటూనే వున్నాడు. కన్నీళ్లు ఆపుకోలేక పోతున్నాడు. "ఎవరు ఏమి శాపం పెట్టారో, మన స్థితి ఇట్లా మారింది" అని భోరున ఏడ్చాడు.

"రాజూ! నీ జీవితాన్ని, నీ కాపరాన్ని నీవు పాడు చేసుకోబోకు" అని కన్నీళ్ళు తుడుచు కొన్నాడు.

ఇంట్లో వంట పాత్రలు పగల గొడుతూ రణగొణ ధ్వని చేస్తున్న భలీని ఇద్దరూ గమనించ లేదు. రాజు తన చేతి గాజుల్ని పైకీ కిందికీ కదుపుతూ వున్నది. కన్నీళ్ళ వలన ఆమె దృష్టికి ఏమీ కనిపించడం లేదు.

"చెప్పు. ఇదేమీ జరగదని గట్టిగా చెప్పు. నీ నోటి వెంట ఆ మాట వింటే నాకు శాంతి" అన్నాడు కాళా.

రాజు ఏమీ మాట్లాడలేదు.

కాళా మాట్లాడుతూనే వున్నాడు. "నీకు భర్త వలన సుఖంలేదు. అది నాకు తెలుసును. చివరికి కడుపునిండా తిండి కూడా లేదు. అది గూడా నే

నెరుగుదును. మన కులంలో మారు మనువు చేసుకొనడం తప్పు గూడా కాదు. పేథా పటేల్ కూతురు అదేపని చేసింది. కాని ఒక్కమాట. నే నీ సర్వనాశనానికి కారకుడైన నానా యింట్లో మాత్రం..''

''నేను నానా యింట్లో వుండడానికి అంగీకరించానని ఎవరన్నారు?'' రాజుకు ఈసారి కోపం వచ్చింది.

''జనమంతా అంటున్నారు. నీ నోటిమీదుగా ఆ మాట విని నిజం తెలుసుకొందామని నిన్ను పిలిపించాను'' అన్నాడు కాళా.

రాజు మౌనంగా ఉన్నది.

''ఏమిటి నీ అభిప్రాయం?'' అని అడిగాడు కాళా.

''అన్నీ నీలో నీవే సృష్టించుకొంటున్నావు'' అన్నది రాజు.

''సృష్టించుకొనడంగాదు. నానా దగ్గర రెండు డబ్బులున్నాయి. నీవు అక్కడ సుఖపడవచ్చును. ఆ యింట్లో ముసలిది ఒకటి వున్నది. రెండోది ఆ కుంటిది. ఇద్దరూ రెండు కాల సర్పాలు. సవతిపోరు సహించడం కష్టం. రోజూ యుద్ధాలు..''

రాజు లేచి నిలబడ్డది. వీపు పక్కకు తిప్పింది. ''యుద్ధాలు జరగనీ'' అన్నది.

కాళా చెవుల ముందు తుపాకీ పేల్చినట్లయింది.

''లేచి నిలబడ్డావు'' అంటూ ఒక్క అడుగు ముందుకు వేశాడు. ''నీ మనస్సులోని మాట చెప్పు. నిజం చెప్పు. నిశ్చితంగా వుంటాను'' అన్నాడు.

రాజు విసుక్కొన్నది.

''నీ విషయంలో రాజూ! నాకేమీ సందేహం లేదు. విను. నా అభిప్రాయం గట్టిగా చెప్పుతున్నాను. నిన్ను నానా యింటికి మాత్రం పోనివ్వను. అంతవరకు నిశ్చయం'' అన్నాడు కాళా.

''ఏమి చేస్తావు?'' ప్రశ్నించింది రాజు. కాళా నిశ్చయాన్ని విని రాజు మనస్సులోనే సంతోషించింది.

''ఏమి చేస్తానో ఇప్పుడు చెప్పలేను'' అన్నాడు కాళా గంభీరంగా.

''నానాను చంపివేస్తావా?'' అవుననే జవాబు వినవలెనని రాజు తన మనస్సులో కోరుకొన్నది.

''కావచ్చును'' అన్నాడు కాళా.

ఐదు నిమిషాలు మౌనంగా గడిచాయి.

"ఏదీ సాధ్యం గాకపోతే సాధువుల్లో కలుస్తా" నన్నాడు కాళా.

"రెండు బుట్టలు బూడిద తీసుకురానా"? అని ప్రశ్నించింది రాజు. రాజు చేస్తున్న ఎగతాళికి కాళా కళవళపడ్డాడు. అతనికింక ఏడుపు వచ్చేటట్లు న్నది. "నీకు తోచింది చెయ్యి" అంటూ కాళా తన యింట్లోకి ఒక్క అడుగు వేశాడు.

పక్కవాళ్ళకు వినబడేటట్లుగా రాజు అన్నది: "నిశ్శబ్దంగా గుండెలు దగ్గర బెట్టుకొని శాంతంగా నిద్రబో. రాజు రెండు మనువులైన తరువాత మూడో మనువుకు గూడా తయారుకాదు" అంటూనే ముక్కలైన హృదయంతో నీళ్లు నిండిన కళ్లతో తన యింటికి బయలుదేరింది.

విడివడిన రెండు ఆత్మలూ తమ తమ హృదయాలను ఒకేరకపు ప్రశ్న అడుగుతున్నవి. కాళా ఆత్మ అడుగుతున్నది. "మాలి వలలో తగులు కొంటే నీకెందుకు? రాజు నీకు దక్కదు గదా? నీ అదృష్టంలో లేదు కదా!! ఒకప్పుడు ఆమెకూ నీకూ మనువు నిశ్చయమయిందనే విషయాన్ని లోకం మరచి గూడా పోయింది. రాజు నానా యింటికి పోయినా, ఏ బంది పోటు దొంగ యింటికి పోయినా నీకెందుకు?"

రాజు ఆత్మ అంటున్నది. "కాళా నీవాడు గాడు. సాధువుల్లో కలిస్తే నీ కేమిటి బాధ? అతని సంగతి నీకెందుకు?"

అయినా ఆ రెండు హృదయాలూ "అనుకొంటే అన్నీ వున్నవి. లేక పోతే ఏమీ లేదు" అనుకొంటూనే "అన్నీ వున్నవని" భావిస్తున్నవి.

## 24

## కాటు

ఇంటికి వచ్చిన తరువాత రాజుకు పెద్దగా ఏడుపు వచ్చింది. వెక్కి వెక్కి ఏడవడ మారంభించింది.

"ఏమయింది ?.. చెప్పు.. ఎవరైనా ఏమైనా అన్నారా? అబ్బబ్బ! ఏమిటి ఈ ఏడుపు?.. ఎందుకేడుస్తున్నావు ?"

"ఎవరేమన్నారో ! ఈమెను అభిమానించే వాళ్లు చాలామంది ఉన్నారుగా" అన్నది కేశర్-కోదర్ భార్య.

"ఏమిటి నీవనేది ? అభిమానించే వాళ్ళున్నారా ?" అన్నది రాజు తల్లి.

లేకేం ? అందరిలోనూ ముఖ్యుడు అల్లుడున్నాడుగా ?"

"ఎవరా అల్లుడు ?"

ఇంకెవరు ? తల్లికీ కూతురుకూ కావలసిన వాడు. ముసలిది కేశర్ మాట వినగానే మండిపోయింది.

"నోరు పారవేసుకోకు. అవును. మీ కులం, గోత్రం అటువంటిదే" అన్నది రాజు తల్లి.

"మా కులంలో, గోత్రంలో ఏమున్నది? ఉన్నవన్నీ మీ గోత్రంలోనే. కూతురుకు మొగుడున్నాడు. అల్లుడితో కలసి వచ్చింది కూతురు. నేనెంతగా తలబాదుకొన్నా ఏమిటి లాభం? భలీ పిలవగానే రాజు వెళ్లింది" అన్నది కేశర్.

కోడలి మాటలు రాజు తల్లికి శూలాలులాగా గుచ్చుకొన్నవి. ఇంతలో కోదర్ ఇంట్లోకి వచ్చాడు. కొడుకును చూడగానే రాజు తల్లికి ఏడుపొచ్చింది. కోదర్ అప్రయోజకుడు. అందువల్లనే కోడలు తలమీద కెక్కి కూర్చున్నది.

ఇది రోజూ వుండే వ్యవహారమే గనుక ఆ మాటలకు కోదర్‌కేమీ ఆశ్చర్యం కలుగలేదు. "పండగ రోజున ఏమిటి ఈ గోల?" అని అన్నాడు.

"నువ్విక్కడే కూర్చో, చీర తీసుకొస్తా" నన్నది కేశర్ కోదర్‌తో. "ఇంకా ఎన్నెన్ని మాటలు వినవలసి వున్నదో" అని గూడా అన్నది.

"నోరు మూసుకొంటావా లేదా?" అని గద్దించాడు కోదర్.

కేశర్ తన భర్తను లెఖ్ఖ చేస్తుందా? "ఇంట్లోకి రా అంతా తెలుస్తుంది" అంటూ నీళ్ళ గదిలో నుండి నీళ్ళు తీసుకొని వంట యింట్లోకి పోయింది.

కొత్త సంవత్సరం వచ్చింది గనుక జనం కోదర్‌ను కలిసిపోవడానికి వచ్చి పోతున్నారు.

కోదర్ గొంతు పెద్దది చేసి "కేశర్! నీవు నోరు మూసుకో" అన్నాడు పెద్దగా.

కేశర్ సహించలేక పోయింది. వంట యింటి బయటికివచ్చి నిలబడింది. "నీ మెదడులో తెలివి వుంటే అంతా అర్థమవుతుంది. ఈ ఇంట్లో జరిగే పనులు నీకు తెలియవు. నిండిన నా యింట్లో అప్రభంశపు పనులు జరుగుతున్నవి" అన్నది కేశర్.

"నీ యిల్లు? నీ అబ్బ కట్టించాడు!" అన్నాడు కోదర్.

"కాదు. నీ చెల్లెలు కట్టిస్తున్నది."

"నిన్ను నోరుమూసుకోమన్నాను. మళ్ళీ చెప్తున్నాను. అదుగో మండుతున్న కట్టె" అని పొయ్యి వైపు చూపించాడు.

"కట్టె చూపిస్తున్నావా? రా, చూపించు నీ ప్రతాపం" అని కేశర్ పొయ్యి ముందుకు పోయి నిలబడ్డది.

"సంతోషించాంలే తెలివికి" అని తగాదాను తుంచివేసే ప్రయత్నం చేస్తూ కోదర్ తల్లినుద్దేశించి "అమ్మా! నీకు చాలా కష్టంగా వున్నది. నాకు తెలుసు. కాని ఈ రోజు పండగ రోజు. జ్ఞాపకముంచుకో. ఏడుపుకు ఇంకా చాలా రోజులున్నవి" అన్నాడు.

"నీవంటి కొడుకుంటే ఏడుపుకేమి తక్కువ?" అని చేతులు ఆడిస్తూ ముసలిది కోదర్ ముందు నిలబడింది. "నాశనపువాడు? పెళ్ళాం ఎట్లా చెప్పితే అట్లా ఆడుతున్నా" దన్నది.

రాజు మౌనంగా వుండిపోయింది. లేచి బయటకు వెళ్ళింది. తల్లీ కొడుకులు మాటకు మాట అనుకొంటూనే వున్నారు. మధ్య మధ్య కేశర్ వచ్చి రంపం ఆడిస్తున్నది.

ఈ లోపల శంకర్, కాసిమ్ వచ్చి వసారాలో కూర్చున్నారు. కోదర్ హుక్కా నింపుతున్నాడు. రాజు తల్లి రాజుతో దొడ్డి వాకిలి బయటకు వెళ్ళి కూర్చున్నది. కేశర్ సూత్రధారిణి అయింది.

ముందు కేశర్ రాజు తల్లిని హెచ్చరించింది. "చెప్పినమాట విను. నీ కూతురు ఇల్లు ఖాళీగ వున్నది. ఈ ఇల్లును గుల్లచేసి వస్తువులన్నీ అక్కడికి పంపించవలెనంటే కుదరదు. నిజంగా నీ కూతురు సుఖపడ వలెనంటే నా సలహా విను. రాజును నానాకిచ్చి పెళ్లిచెయ్యి. ఆ పేరుతో అతడు రాసుకొన్న పసుపు చెరిగిపోతుంది. జుల్మానా యివ్వవలసి వస్తే కులంవాళ్లకు నానా యిచ్చుకొంటాడు. లక్ష్మి వస్తుంటే ఎదురు అడ్డ గూడదు" అన్నది.

ఆ చివరి వాక్యం రాజును ఉద్దేశించి అన్న వాక్యం.

"పెళ్లిమాట మాట్లాడుతున్నావా వదినా? ఇది ఎవరి పెళ్లి?" అన్నది రాజు. బహుశా కంకు పెళ్లి అయివుంటుందన్నది. రాజు మాటల్లో తిర స్కారభావం వ్యక్తమవుతున్నది.

"ముందు వెనకలు బాగా ఆలోచించుకో. నా సలహా వలన నీకు మేలు కలుగుతుంది. నీతల్లి నిన్ను మొక్కజొన్నల్లోనుండి వరిగబియ్యంలోకి విసరి వేసింది. నేను నిన్ను గోధుమల్లోకి చేర్చదలచుకొన్నాను. నా మాట విను" అన్నది కేశర్.

"సంబంధం మంచిదే" అన్నది రాజు తల్లి.

రాజు నెమ్మదిగా "సవతి పోరు ఉన్నది గదా?" అన్నది.

ఆ మాటతో కేశర్‌కు ఉత్సాహం కలిగింది. "కుంటిదాన్ని పుట్టింటికి పంపించి వేస్తాడు నానా."

"ఈ ఎనిమిది సంవత్సరాలలో ఆ అమ్మాయి ఒక్కసారైనా పుట్టింటికి వెళ్లిందా? వెళ్లలేదు. పుట్టింట్లో కట్టివేసి రావడానికి ఆ అమ్మాయి పశువు కాదు గదా?"

"పుట్టింటికి పోకపోతే ఇంట్లో ఒక మూల పడివుంటుంది. కుంటిది ఏమి చేస్తుంది?"

రాజు నవ్వింది. దానితో కేశర్‌కు ఇంకా ధైర్యం కలిగింది. "కావా లంటే ఆమెకు వేరే ఏర్పాటు చేయిస్తాము" అన్నది.

రాజుకు కోపం వచ్చింది.

"ఏది ఏమైనా వదినా! అన్నింటికీ ముందు మనస్సుండాలి. హల్వా తిన్నంత మాత్రంతో ఏమీ కాదు" అన్నది.

"నీవు తినవచ్చు. ఇతర్లకు పెట్టవచ్చు. కావలసినంత ఐశ్వర్య మున్నది" అన్నది కేశర్.

కేశర్ ముందు అన్న కోదర్ మాట గానీ, తన తల్లి మాట గానీ సాగేటట్లుగా లేదు. కేశర్ తనను బలవంతం చేస్తున్నది. విసుగ్గా "అయితే నీవు నన్ను అమ్మదలుచుకొన్నావు" అన్నది.

"నిన్నమ్మితే నాకేమిటి ప్రయోజనం? నిన్ను అమ్మితే నీ అన్న యింటికి లాభం.."

"వదినా! మాటలు బాగా లేవు. ఇక వదులు" అన్నది రాజు.

"నేనేమన్నాను? అంత మండిపడతావు?" అన్నది కేశర్.

"అయితే వదినా! నా మాట విను. అన్న యిల్లు విచ్ఛిత్తి అయిపోయినా, నా తల్లి ఆకలికి చచ్చిపోయినా నీ సలహా నేను వినదలచుకో లేదు. ఇక నీవు అనవసరమైన మాటలు మాట్లాడవద్దని నా మనవి" అన్నది రాజు.

"అయ్యో! అయ్యో! అదేమిటి? నేను మాట యిచ్చి వచ్చాను" అన్నది.

"మాట యిచ్చావా? ఎవరికి? సరే, అది నీకే తెలియాలి" అని రాజు లేచి నిలబడింది.

తల్లిని ఉద్దేశించి కేశర్ వినేటట్లుగా "ఇక నా ముందు ఈ మాటలు ఎత్తితే నేను గొంతుకు ఉరిపోసుకొంటా" నన్నది.

"పెద్ద మనుష్యులు వాకిట్లో వున్నారు. వారి కేమి జవాబు చెప్పను?" అని అడిగింది కేశర్.

"వారికి జవాబు నేనే చెప్పి వేస్తాను" అని రాజు రెండడుగులు వాకిట్లోకి వేసింది.

"వదినా! కొంచెంసేపు ఆగు. నా మాట విను" అన్నది.

రాజు అప్పటికే వసారాలోకి వచ్చి వేసింది.

"శంకర్ చిన్నాయనా! ఏమిటి పని? ఎందుకొచ్చావు?" అని అడిగింది.

శంకర్ ఆ ప్రశ్నకు ఉలిక్కిపడ్డాడు.

"పండగ రోజులు గదా! ఊరికనే వచ్చాను" అన్నాడు. అతని నోటి వెంట మాట పెగలలేదు.

ఏమైనా కాసిమ్ సిపాయిబిడ్డ గదా! "అమ్మాయీ! మేము ఎందుకు వచ్చామో నీకు తెలుసు. మేము నీ మేలుకొరకై.."

రాజు మధ్యలోనే అందుకొన్నది. "శంకర్ చిన్నాయనా! నిజం చెప్పు. నేను చిన్నదాన్ని. ఒక ఘడియలో ఒక కొమ్మా ఇంకొక ఘడియలో ఇంకొక కొమ్మా ఎక్కే స్వభావం నాది గాదు. నేను ఆ పని చేయను" అన్నది.

"నీకు మేలు కలుగుతుందనీ, నానా కాపరం బాగు పడుతుందనీ మేము ఈ అభిప్రాయానికి వచ్చాము. నీ మీద మాకు వైరమా అమ్మా!" అన్నాడు శంకర్.

"నానా కాపరం బాగు పరచండి. నేను తప్ప మన జాతిలో ఆడ వాళ్ళే లేరా? నా జీవితాన్ని పాడుచేసిన ఇల్లు అది. నన్ను కాటు వేసిన ఇల్లు అది. నేను నా జీవితంలో ఆ యింటిని మరచిపోగలనా?" అన్నది.

శంకర్ నిరుత్తరుడైనాడు. "నీకు పంచాయితీదార్లు వివాహం నిర్ణ యించారు. నీ యిల్లు సరిగ్గా లేకపోతే జాతికి బాధ్యత వున్నది" అన్నాడు.

"ఒక్క మాట వినండి. ఏ యింటికి పోయినా కష్టం చేయవలసిందే. శంకర్ చిన్నాయనా! ఈ పొట్ట గోధుమ రొట్టె తిన్నా నిండుతుంది. వరి గన్నం, రాగి సంకటి తిన్నా నిండుతుంది. అందువలన నన్ను గురించిన విచారం మీ కనవసరం. అమ్మ పండగని పిలిపిస్తే వచ్చాను. ఇక వెళ్ళి పోతా" నని పక్కకు తిరిగింది.

"అమ్మా! రాజూ! మా మాట వొక్కటి విను. ఆ నానా రెండు సార్లు అవమానాల పాలైనాడు. అతనికేమి జవాబు చెప్పమంటావు?" అని అడిగాడు కాసిమ్.

రాజు ముఖం వెనకకు తిప్పింది. "అయితే అతనితో ఒక్క మాట చెప్పండి. ఇన్ని సంవత్సరాలైనా పసుపు ఇంకా అతని వొంటికి వుంటే గోకుడు బద్దతో గోకించుకొని వదిలించుకోమని చెప్పండి. ఇక అవమానం సంగతి అంటారా? అతని ముక్కు పండుగనాడు పూడనే పూడింది గదా! ఇంకా అవమాన మేమిటి? మీ కేమీ సందేహం వద్దు. ఈ మాట లన్నీ నేనన్నానని చెప్పండి" అన్నది.

అంటూనే లోపలికి రెండడుగులు వేసింది.

"వదినా! రాత్రి నన్ను ఇక్కడ వుండనిస్తే వుంటాను. లేకపోతే ఇంకొక ఇల్లు చూచుకొంటా" నన్నది.

"ఇక్కడే వుండు. జీవిత మంతా వుండు. మధ్య నాదేమున్నది? నీ

బాగుకోరి ఈ ప్రయత్నంలోకి దిగాను'' అంటూ కేశర్ కోపంగా వంటింట్లోకి పోయింది.

''నా తల్లి రెండు మనువులు చేసింది. మూడో మనువు సంగతి ఆలోచిస్తున్నది'' అన్నది రాజు పెద్దగా.

తల్లి ఏమి జవాబు చెపుతుంది?

ఈ మాట విన్న శంకర్ కాసిమ్ లిద్దరూ లేచి బయటకు వెళ్ళారు.

శంకర్ తిన్నగా తనింటికి వెళ్ళాడు.

కాసిమ్ ఈ వ్యవహారంలో తలదూర్చినందుకు పశ్చాత్తాప పడుతున్నాడు. రాజు చెప్పుతో బాగా కొట్టిందనుకొన్నాడు. ఇంత కాలం తాను కాళా పక్షంలో వుండి ముఖియా మాటలూ, మాలి మాటలూ విని నానా పక్షంలో చేరాడు. రాజు బాగా బుద్ధి చెప్పింది అనుకొన్నాడు.

అక్కడ నానా, మాలీ, ముఖియా ఎదురుచూస్తున్నారు.

''ఆ పిల్ల మీ అదృష్టంలో లేదు. మీరెంత డబ్బు ఖర్చుపెట్టినా లాభం లేదు'' అన్నాడు.

''అయ్యో! కాసిమ్! ఏమంటున్నావు? రాజు అంగీకరించలేదా? ఊరంతా ఈ వార్త వ్యాపించిపోయిందే. ఆ ముండ రెండోసారి మా ముక్కు..''

''గయ్యాళిముండా! బండముండా!'' అనుకొన్నాడు లోలోపల కాసిమ్. పైకి నవ్వుతూ ''ముండ అంటున్నావు. ఎవరు ముండలో నీకే తెలియాలి. పండగనాడు కాళా నానా, ముక్కు బద్దలు కొట్టాడు గదా! ఇంకా అతనికి ముక్కెక్కడున్నది? అని రాజు అడిగింది'' అని గూడా అనేశాడు.

''విన్నారా? కడుపు నిండిందా?'' అంటూ రణఛోడుడు అక్కడి నుండి లేచి వెళ్ళాడు. నానా, మాలీ లిద్దరూ కారం రాచుకొన్నట్లు గంతులు ప్రారంభించారు. వాళ్ల కోపం కాళామీద.

కాసిమ్ మధ్య మధ్య మాటలు అందిస్తూ ఆజ్యం పోస్తున్నాడు. ''నా కడుపున పుట్టితే నీవు కాళాగాణ్ణి హతమార్చు'' అన్నది మాలి.

కోపంతో పశువుగా మారిన నానా ''కాళాను హతమార్చక పోతే నేను నీ కొడుకునే గా''దన్నాడు.

కాసిమ్‌కు అసహ్యం పుట్టింది. లేచి నిలబడ్డాడు. "ధుత్తేరీ! ఏమి మనుష్యులు వీళ్లు!! ఆ పిల్ల చూడు. దేవత" అన్నాడు.

"బాగా జవాబు చెప్పింది. బంగారపు తల్లి. బాగా బుద్ధి చెప్పింది" అనుకొన్నాడు.

## 25

## దుఃఖమేమిటి ?

పట్టుదల బట్టి నానా ఎనిమిది రోజుల్లోనే రెండో పెళ్లి చేసుకున్నాడు. కాళా సంతోషించాడు. దానికి కారణాలున్నవి. ఒకటి రాజు తన గుండె మీది కుంపటి గాకుండా వేరే వుండిపోయింది. రెండోది తన మాట నికె బడింది. మూడోది ఇద్దరు భార్యల మధ్య చిక్కుకొని నానా వాడి చావు వాడు చస్తాడు. మాలి వ్యవహారం చాకలివాడి కుక్కలాగా అయిపోయింది.

నిజానికి మాలి స్థితిని తలుచుకుంటే కాళాకు విచారం కలిగేది. చావు సమయానికి ముసలిదానికి లావు దుఃఖం ఏర్పడింది. నాథా మొదటే వేరు బడ్డాడు. రణఛోడుడు తన భార్యా బిడ్డలతో నెమ్మదిగా తప్పుకున్నాడు. నానా భార్య - కుంటిది. ఆమె మాలిని తిట్టే తిట్లకు హద్దే లేదు. మాలి మాత్రం సామాన్యురాలా ?

వాళ్లకు తగిన శాస్తి జరిగిందని గూడా కాళా అనుకుంటూ వుండేవాడు. ఏది ఏమైనా రాజు విషయంలో అతనికి నిశ్చింత ఏర్పడింది. అతని గుండెల మీది బరువును తొలగించినట్లయింది. ఇక అతనికి ఒకటే విచారం పట్టుకున్నది. ఏమైనాసరే రాజు సుఖ పడేటందుకు తన చేతనైన సహాయ మంతా చేయాలి.

తన యిల్లు రాజు యింటికి దగ్గరగా వుంటే కాళా రెండు చేతులతో రెండిళ్ళనూ సంబాళించే వాడే. తన వూరికీ ఆమె వూరికీ మధ్య దూరం ఐదు కోసులు. అయినా తన పొలం పనులు తొందరగా ముగించుకొని ఆ వూరు పోయి వాళ్ళకు గూడా సహాయం చేస్తూ వుండేవాడు.

ఒక రోజు అతని భార్య ఎత్తి పొడిచింది. ''నాలుగు రోజుల్లో రెండు సార్లు బాథడే (రాజు వూరు) పోయి వచ్చా''వన్నది.

ఒకసారి మళ్ళీ ప్రయాణమై కాళా భలీని ఉద్దేశించి ''నేను ఆ వూరు పోతున్నాను. ఎద్దులకు మేత చూడు'' అన్నాడు. భలీకి కోపం వచ్చింది. ''నీకు నీ యిల్లు పట్టినట్లేదు. ఇక్కడ చేయవలసిన పనులు ఎన్నో వున్నవి. నీవు పొరుగూరుకు బయలుదేరుతున్నా'' వన్నది.

"మన పొలం పని పూర్తి అయింది. మన పని వదలడం లేదు" అంటూనే పళ్లెం తెమ్మన్నాడు.

పళ్లెం తెచ్చిచ్చి భలీ "చూడు. ఆ షాహుకారు గుర్రం ఇంటిముందు సకిలిస్తున్నది. నాలుగు డబ్బులు సంపాదించి ఆ అప్పు తీర్చాలి" అన్నది.

"అది సకిలిస్తూనే వుంటుందిలే. కొరడా ఆడించాలి. ఏది, కొంచెం నెయ్యి పళ్లెంలో వెయ్యి" అన్నాడు. "నెయ్యి తాగితే లోపలి పేగులు గూడా చల్లబడాలి" అన్నాడు కాళా.

"ఉన్నదంతా షాహుకారు అప్పుకే చాలడం లేదు. ఆ అప్పు తీరేదెలా? ఆ షాహుకారు ఐదు శేర్ల నేతిబాన నింపుకొని వెళ్ళా''డన్నది భలీ.

"నింపుకొని పోనీ."

"అప్పు తీరే ఉపాయం? మీ పెద్దవాళ్ళు రూపాయలు పాతిపెట్టి పోలేదు".

కాళాకు కొంచెం కోపం వచ్చింది. అయినా భలీని ఏమంటాడు? నవ్వి ఊరుకొన్నాడు. "మేత వేయకుండా గేదె పాలివ్వదనే విషయం షాహుకారుకు తెలుసులే" అన్నాడు.

"అయితే షాహుకారు గేదె మనింట్లోనే వుంటుందా?"

"ఓసి పిచ్చిదానా! ఆడపిల్లల వాళ్ళు మనువు కుదిరించడానికి పోతే ఇంట్లో ఎన్ని గొడ్లు వున్నవో ముందు చూస్తారు. అదే మన ధనం. షాహుకారు డబ్బు మన డబ్బే."

మాట్లాడుతూనే కాళా భోజనం పూర్తి చేశాడు. భలీ ఆ మాటలు వింటూ కూర్చోలేదు. గేదెలకు మేత వేసింది.

అరుణోదయానికి పూర్వం ఆకాశంలో వ్యాపించిన వెలుతురు ఇంకా భూమి మీదకు బాగా దిగలేదు. గ్రామంలో జనం ఇప్పుడిప్పుడే నిద్ర మేల్కొంటున్నారు. జబ్బుగా వున్న పరమా పటేలుకు మాత్రం ఎనిమిది రోజుల నుండి కంటికి నిద్రలేదు. దగ్గు నిద్ర పోనిస్తే గదా!!

కాళా నాగలి తీసుకుని బయలుదేరేటప్పటికి రామా నిద్రలేచి తలుపు తెరుస్తున్నాడు.

"ఒరేయి కాళా!" అని రామా ఆవలిస్తూ పిలిచాడు. "నిద్ర గూడా నీ అదుపులోనే వున్నట్లున్నదేమిరా?" అన్నాడు.

"అంటే ?"

"అంటే నలుగురైదుగురైనా వుంటేగాని పొలంపని సాగడంలేదు. ఇంకా ఎవ్వరూ నిద్రైనా లేవలేదు. నీవొక్కడివే అప్పుడే పొలానికి బయలు దేరావు" అన్నాడు రామా.

"రామా! నీవు బలగమున్న వాడివి. ఈ వ్యవసాయం భవాయీ నృత్యం లాంటిది. ఒళ్ళు విరుచుకుని పనిచేయకపోతే ఈ నృత్యం సాగదు. నేను ఒంటరివాణ్ణి" అంటూనే ఊరు దాటాడు కాళా.

మొక్కజొన్న పెరుగుతున్నది. వరి కోతలు అయిపోయినవి. గోధుమకు ఇంకా సమయం రాలేదు.

కళ్ళంలో పడివున్న ధాన్యం నూర్పిడి అయిపోయింది. వెన్నెల రాత్రి కాళా ఆ నూర్పిడి పూర్తి చేయించాడు. ధాన్యం ఇంట్లో బుట్టలో పోయించాడు. పైన మెత్తించేశాడు. పని పూర్తికాగానే సహాయానికి బాథడేకు ప్రయాణమైనాడు.

నిజానికి అతనికి తన పని కంటే అత్తవారింట్లో చేస్తున్న పనిలోనే ఆనందం ఎక్కువగా లభించేది. అలసట అని అనిపించేదేగాదు. పచ్చి ఉల్లి పాయలు కొరుకుతూ వరిగన్నం తింటున్నా అది ఎంతో రుచిగా వున్నట్లని పించేది. జొన్న రొట్టెలు తింటూంటే రాజు చేతిలోని తీపి ఆ రొట్టెల్లోకి దిగినట్లనిపించేది. దాని కంతకూ కారణం రాజు వొక్కతే. రెండో వైపు ఆమె యింటి పరిస్థితిని తలుచుకొంటే కాళాకు గుండెలు దడ దడలాడేవి. నానా యింటికి పోకుండా ఆపి రాజు యెడల తాను పాపం చేశానని గూడా అనుకొనేవాడు.

ఒక దినం పొలంలో బండి నిండా గడ్డి నింపాడు. రాజు పక్కనే వున్నది. "మీ ఆయనకు మందేదైనా ఇప్పిస్తున్నావా? శుష్కించి పోతున్నాడు" అన్నాడు.

"ఏం మందు యిప్పించను? చురకవేయించాలి. వేయించాము. లాభం లేకపోయింది. చేతనైనంతలో ఏ లోటూ చేయడం లేదు. నేను ఈ యింటికి వచ్చేటప్పుడు మా వాళ్ళిచ్చిన డబ్బు మందుకు వాడాను. చేతి వుంగరము అమ్మి తాయెత్తు కట్టించాను" అన్నది.

"రోగమేమిటో మందేమిటో తెలుసుకోవాలి గదా? ఇది నాకు వాయు రోగంగా కనబడుతున్నది" అన్నాడు కాళా.

"అయితే ఎవడినైనా వైద్యుణ్ణి చూడు. చేతిలో చిల్లిగవ్వ లేదు. రోజూ ఐదు శేర్లు కావాలి" అన్నది.

కాళా మనస్సులోనే ఆలోచించాడు. "నిజమే" అనుకొన్నాడు. "అయితే నీవు అంగీకరిస్తే భభూతేశ్వర్ మందు ఉపయోగిద్దాము. ఆ బావా నా..."

"ప్రయత్నం చెయ్యి. నా పుట్టింటి వాళ్ళిచ్చిన ముక్కుపుడక ఒక్కటున్నది. ఇది అమ్మివేస్తాను" అన్నది. రాజు సంతోషంగా మాట్లాడింది. ఆమె ముఖం మీద కాంతి వ్యాపించినట్లున్నది.

కాళాకు కలిగిన ఆశ్చర్యానికి అంతులేదు. రాజు శరీరం మీద మొదట కాళ్లకు పాంజేబులు, వెండి మెట్టెలూ వుండేవి. ఆభరణమన్నా అనక పోయినా ముక్కుకు బంగారపు ముక్కుపుడకలుండేవి. చేతులకు వెండి కంకణా లుండేవి. ఆమె సన్నని మెడలో అణాల హారముండేది. కాళా తనలోనే తాను బాధ పడ్డాడు. "ముక్కు పుడక సరే..."

రాజు బావాను పిలుచుకొని రమ్మని కాళాను బ్రతిమిలాడింది.

"నీకు కోపం రాకుండావుంటే ఒక్కమాట అడగనా రాజూ?" అన్నాడు కాళా. రాజుకు అర్థమయింది. మనస్సులోనే సంతోషించింది. ఎందుకు సంతోషించదు? తన జీవితంలో ప్రశ్న అడిగేవారు ఎవ్వరూ లేరు గదా?

మరు క్షణంలోనే తన ముఖం మీదికి కోపం తెచ్చుకొన్నది. నవ్వడానికి గూడా ప్రయత్నం చేస్తూ – "నాకు కోపం వస్తుందనీ – అదైనా నీమీద – అని అనుకుంటున్నావు గదూ?" అన్నది.

"కోపమని గాదు..రాజూ! నిజం చెప్పు. నీవు నిజంగా నీ భర్తను బ్రతికించవలెననీ, అతనికి మందులు ఇప్పించవలెననీ కోరుకుంటున్నావా?" అని అడిగాడు.

రాజు ముఖంపైన దుఃఖపు మేఘాలు కమ్ముకొన్నవి. బాధతో రాజు నవ్వింది. "నీవు నన్ను ఈ ప్రశ్న అడుగుతున్నావా? రాజు తన భర్త చనిపోతే మంచిదనీ అందుకు ఎదురు చూస్తున్నదనీ ప్రపంచం అనుకో వచ్చును. కాని.. నేను ఎందుకు ఎదురుచూడాలి? ఏమి చేయడానికి చూడాలి? ఏ సుఖం కొరకై ఎదరుచూడాలి? మీరంతా రాజుకు దుఃఖంగా వున్నదని అనుకొంటున్నారు. నాకేమి దుఃఖమున్నది? తల్లిదండ్రుల వంటి బావగారూ, తోడికోడలూ వున్నారు. ఇంట్లో వున్న పిల్లలందరూ

నా పిల్లలే!!'' అంటూ రాజు నవ్వడానికి ప్రయత్నించింది. ''నీవంటి వాడు ఇంట్లోవుంటే రోజూ పదిసార్లు తిట్టేవాడు. నా భర్త నేను చెప్పి నట్లు వింటున్నాడు'' అంటూ భూమి ఆకాశం కలిసిన చోటుకు చూస్తూ నిలబడింది. ''నాకు విచారమేమీ లేదు'' అన్నది. ఆమె సానుభూతి చూపించే వాళ్ళమీద సానుభూతి చూపించేటట్లున్నది.

కాళా రాజును రెప్పలార్పకుండా చూస్తూ నిలబడ్డాడు. ''నీవంటి స్త్రీలు మన జాతిలో చాలామంది వున్నారు. నీ వొక్కతివే కాదు'' అన్నాడు.

''ఆ మాట నిజమే. సరే ఆ మాట వదులు. బావాను ఎప్పుడు పిలుచు కొస్తావో చెప్పు'' అన్నది.

''నీవు చెప్పితే ఈరోజే''

''సరే, ముందు ఈ బండి తోలు'' నవ్వుతూ రాజు నిలబడింది. ''అవసరం బుద్ధిని చెడగొడుతుందని సామెత. నేను మాత్రం అటువంటి పనిని చేయ'' నన్నది.

కాళా హృదయం దుఃఖంతో నిండిపోయింది. రాజు తనను విడిచి అనేక యోజనాల దూరం వెళ్ళిపోయిందను కొన్నాడు. రెండో రోజు బావాను పిలుచుకొనిరావడానికి వెళ్ళాడు. వెళ్ళవలసి వచ్చింది.

అతడు ఆలోచించుకొంటూ తనను తానే ప్రశ్నించుకొంటున్నాడు— రాజుకు ఏమి దుఃఖమున్నది? ఈ ఒక్క పనీ అయి—ఆమె భర్త ఆరోగ్య వంతుడైతే - ఇక లోటేముంటుంది? ఆమె సుఖంగా వున్నది. ఇంట్లో తగాదాలు లేవు. తల్లిదండ్రులవంటి బావగారూ, తోడి కోడలు వున్నారు. చెప్పినట్లు వినే భర్త వున్నాడు. కడుపున పుట్టిన పిల్లలవంటి పిల్లలున్నారు. ఆ కుటుంబమంటే ఈర్ష్య కలిగినట్లుగా కాళా దీర్ఘంగా నిట్టూర్చాడు. సుఖంగా వున్న వాళ్ళంటే ఎవరు? ధన ధాన్యాలున్నా - కుక్కల్లాగా రోజూ పోట్లాడుకొనే వాళ్ళు? ఒకళ్ళను చూస్తే ఇంకొకళ్ళు ఈర్ష్య పడే వాళ్ళు? ఎవరు సుఖవంతులు? సుఖానికి మనస్సు ముఖ్యం. పొట్ట నిండుగా లేకపోయినా పరవాలేదు. హృదయం నిండుగా వుండాలి అని తన తండ్రి అంటూ వుండేవాడు. అది అక్షరాలా నిజం.

రాజుకు సంసార సుఖం లేదు. తిండి సుఖం లేదు. గుడ్డల సుఖం లేదు. అయినా తనకేమీ దుఃఖం లేదంటున్నది. ఇక దుఃఖమున్న దెక్కడ? దుఃఖానికి మూలమేమిటో ఆలోచిస్తూ కాళా అడవుల్లో వెళ్ళుతున్నాడు.

## 26

# పృథ్వీ భారం మోసేవాళ్లు

చలికాలం ముదిరింది. గోధుమ, శనగ బాగా పండినవి. పంటలు ఇంటికి చేరుతున్నవి.

అవి పన్నులు కట్టే రోజులు. రణఛోడ్ ముఖియా ఇంటిముందు జమీందారు గుర్రం సకిలిస్తున్నది. జమీందారు ఠాకుర్ నౌకరు దీపూఖా ఇంటింటికి పోయి అందరినీ హెచ్చరించి వచ్చాడు.

అరవై సంవత్సరాల ఠాకుర్ తెల్లగడ్డం సవరించుకొంటూ మీసాలు మెలి బెట్టుకుంటూ గుర్రం దిగాడు. అతని కళ్ళు ప్రకాశవంతంగా ఉన్నవి. నలువైపులా చూస్తూ-నవ్వుతూ-కొత్త వాళ్లతో పరిచయం చేసుకొంటు న్నాడు.

"ఇతడెవరు?.. ఓహోహో! వాలా పటేల్ కొడుకు కాళియా పటేలా? ..శంకర్! ఇతడు నీ కొడుకు గదూ?.. నానా పెద్ద వాడైనాడు. ఇరవై సంవత్సరాల వయస్సు గదూ నీది?.. ఇద్దరు భార్యల్ని చేసుకొన్నావు. బాగున్నది. ఏభై సంవత్సరాల వయస్సు నాటికి నేను నలుగుర్ని చేసు కొన్నాను. నీవూ నేనూ సమానంగానే-సమ ఉజ్జీలంగా ఉన్నామన్న మాట. ఈ కాళియాకు ఒక్కతే భార్య. ఏకపత్నీ వ్రతుడు శ్రీరాముడన్న మాట" అంటూనే ఠాకుర్ దీపూను పిలిచాడు.

"దీపూ! మాలవాణ్ణి పిలిపించి గుర్రానికి మేత ఏర్పాటు చేయించు. లేకపోతే మన కోపం వీళ్లమీద చూపించవలసి వస్తుంది. వాళ్ళు తమ కోపం తమ భార్యల మీద చూపిస్తారు.. వాళ్ల భార్యలు పిల్లల మీద చూపి స్తారు. కాళా! నీవు చెప్పు. పిల్లలు లేనివాళ్ళు కోపం ఎవరిమీద చూపి స్తారు?" అని అడిగాడు.

కాళా జవాబు చెప్పలేదు.

ఠాకుర్ బలవంతం చేసిన మీదట-"తమ భర్తల మీద" అన్నాడు.

"అయితే నీ కనుభవం లేదు అని అర్థం. నీకు పిల్లలెంత మంది?"

"ఎవ్వరూ లేరు"

"ఓహో! నీ భార్య పేరేమిటి?"

"ఖలీ" రామా చెప్పాడు.

"పేరు ఖలీ. మాట్లాడడంలోనూ పని చేయటంలోనూ గూడా. ." అన్నాడింకొకడు.

"అర్థమయింది. పిల్లలు లేని పటేలు భార్యలు తమమీదే తాము కోపం చూపించుకొంటారు. కోపం వస్తే వేరే మంచం వేసుకొని పడుకొంటారు. ఇటు గడ గడ లాడించే చలిలో ఒక్కడే. ."

"కాని, మొగవాళ్ళు గూడా చలిలో. ."

కాళా మాట జనానికి నచ్చలేదు. ఠాకుర్‌కు జవాబు చెప్పడం వాళ్లకు నచ్చదు. ఠాకుర్ ఏదంటే దానికి తల వూపడం మంచిదని వాళ్ల అభిప్రాయం. "తిలక్‌చంద్‌లాంటి వాళ్ళు వస్తే వాళ్లతో మాట్లాడ వచ్చునుగాని ఠాకుర్ లాంటి పెద్ద వాళ్ళతో ఏమి మాట్లాడుతాము ?" అని అక్కడున్న వాళ్ళు ఒకళ్ళు ఇంకొకళ్ళతో అనుకొన్నారు.

"నీ కనుభవం లేదు కాళా ! మగవాడు అలసి సొలసి వుంటాడు. అంత సుఖం ఆడదానికే. ."

"మా ఆడవాళ్ళు గూడా కష్టపడి పని చేస్తారు. రెక్కలు ముక్కలైనా చాకిరీ చేస్తూనే వుంటారు" అన్నాడు కాళా.

"అవును. అది గూడా నిజమే. ఆడది గాడిద ఒక్క రకం అని సామెత. వాళ్లకిద్దరికీ వీపు మీద నాలుగు మణుగుల బరువుంటేనే గాని గడవదు. ఏమంటావు శంకర్ ?" అన్నాడు ఠాకుర్.

ఠాకుర్ అన్న మాట నిజమేనని అందరూ తలలూగించారు. ఠాకుర్ ఇలాంటి మాటలు మాట్లాడుతూనే పొగాకూ, నల్లమందూ వగైరాలు తెప్పించాడు.

అందరూ ఒకళ్ల తరువాత ఇంకొకళ్ళు హుక్కా తాగుతున్నారు. కొంత మంది నల్లమందు నీళ్ళు తాగుతున్నారు.

లెఖ్ఖలు పూర్తి అయినవి. మొత్తం ఊళ్లో ఏభై అరవై ఇళ్ళున్నవి. ఒక యింట్లో పది మణుగులు, ఇంకొక యింట్లో ఇరవై మణుగులు ఈ విధంగా మొత్తం మూడు వందల మణుగులు లెఖ్ఖ తేలింది. చాలావరకు వసూలయింది. మిగతాదాన్ని రాబోయే సంవత్సరం లెఖ్ఖలోకి చేర్చడం జరిగింది.

పని పూర్తి కాగానే ఠాకుర్ పంజాళీ గుర్రం ఎక్కాడు. వూరి పొలిమేర వరకూ గ్రామస్థులు గుర్రం వెనక నడిచారు. బంధువును పంపుతున్నట్లు

ఠాకుర్‌ను పంపించారు. అందరి ముఖాలు ఖిన్నంగా ఉన్నవి. ఠాకుర్ అందరి దగ్గరా సెలవు తీసుకొన్నాడు. గుర్రాన్ని అదలించాడు. గుర్రం పరుగు ప్రారంభించింది. "అదిగో గుర్రం తోరణం దాటింది.. కొండె క్కింది.. కొండ దిగింది.." అని గుర్రం అదృశ్యమయిందాకా జనం చూస్తూనే వున్నారు. గుర్రం అదృశ్యంకాగానే అంతా వూరివైపుకు మళ్లారు.

ఠాకుర్ వెళ్లగానే మర్నాడు షాహుకారు దిగాడు. షాహుకారు లెఖ్ఖలు ప్రారంభమైనవి. అవి ఏమి లెఖ్ఖలో ఏమిటో భగవంతునికే తెలియాలి. షాహుకారు లెఖ్ఖలు తేల్చాడు. ధాన్యం పోగు బడింది. పెళ్లి అప్పులు కొన్ని. శ్రాద్ధపు అప్పులు కొన్ని. రకరకాల అప్పులు. ఇంటింటా లడ్లు ఫలహారం చేసి ఎద్దుల మీద ధాన్యం, నేతి బానలూ నింపుకొని షాహుకారు వెళ్ళాడు.

బంతి ఆటలాడే ఆడవాళ్ళు దిగారు. రక రకాల ఆటలు చూపించి పచ్చ చీరలూ, ధోవతులూ తీసుకొని వాళ్ళు వెళ్ళారు. పొలాలలో పండిన పంటల మీద చిలకల గుంపులు గుమి గూడుతున్నవి. ఇంతలో హోలీ డోళ్ళు మోగడం ప్రారంభ మయింది. ఆడవాళ్ళు పేడతో ఇళ్ళు అలుకుతున్నారు. మగవాళ్ళు కోలాటం కర్రలు ఇళ్ళల్లోకి చేర్చారు. ఎక్కడ చూచినా డోళ్ళు ఢమ ఢమ లాడుతున్నవి. తాళాలు మోగడం ప్రారంభమయింది. "హోలీ వచ్చింది.. హోలీ వచ్చింది.." హోలీ పాటలు ప్రారంభమైనవి.

ధాన్యం నూర్పిళ్లు జరుగుతూనే వున్నవి. మిడతల దండులాగా బ్రాహ్మణులు, మొగుడు చచ్చిన అనాధలూ కళ్లాలలో తిరిపెం తెచ్చుకొన డానికి మూగుతున్నారు. శేరు రెండు శేర్లు అంతా తీసుకొని వెళ్ళు తున్నారు.

పండిన పంటను బట్టి కాపలా వాళ్లకు ధాన్యం పంపకం జరిగింది. అందరికీ సుఖడీ పంపకం గూడా జరిగింది. మిగిలిన ధాన్యం ఇళ్లకు చేరింది.

వేసవి కాలం. పగలు పొద్దెక్కువ. ఒంటెలూ, ఏనుగలూ వెంబడి పెట్టుకొని సాధువులు బయలుదేరారు. గ్రామ గ్రామంలో డేరాలు వేసు కొని వాళ్ళు జ్ఞానబోధ ప్రారంభించారు. "ఇటు ఇస్తేనే అటు వస్తుంది. పుణ్యం చేసుకొంటేనే జన్మ కడ తేరడం" అని నీతి బోధలు చేస్తూ అందరినీ ఆశీర్వదించి-వాళ్ల నెత్తి మీద భస్మం చిలకరించడం ఆరంభించారు.

సాధువులు గుంపులు గుంపులుగా వస్తూనే వున్నారు. బడోదా మార్గంలో కాశీ, మధురా వగైరాలకు వెళ్లుతూనే వున్నారు.

గ్రామాలలో కొన్ని చోట్ల పెళ్ళి సన్నాయిలు మోగుతున్నవి. రణఛోడ్ ముఖియా వంటి డబ్బున్న యింటి స్త్రీలైతే కొత్త చీరలు కట్టుకొని రక రకాల నగలు పెట్టుకొని పాటలు పాడుకుంటూ పెళ్ళిళ్లకు హాజరవుతూ వుంటారు. పెళ్ళి మూడు రోజులు ఆనందంగా గడవగానే నాలుగో రోజున ఎవరింటికి వాళ్లు వెళ్ళుతుంటారు.

పిల్లలకు పేర్లు వ్రాసేవాళ్ళు, చేతులు చూచేవాళ్ళు తెల్ల గుర్రాలెక్కి ఊళ్లోకి దిగుతూనే వున్నారు. "నీళ్ళు మూట గట్టే ధోవతు లిప్పించండి. చొక్కా లిప్పించండి" అని రైతుల్ని విసిగిస్తూ వున్నారు. వాళ్ళు వూరు విడిచి పెట్టారో లేదో భవాయీ నృత్యంవాళ్ళు గ్రామంలోకి ప్రవేశించారు. నృత్య ప్రదర్శనాలు ప్రారంభమైనవి. భర్తృహరి రాజు, పింగళా రాణి నాటకం ఒకరు ప్రదర్శిస్తే, గోపీ సందణ్ ఇంకొకరు ప్రదర్శిస్తున్నారు. అయితే జనానికి నచ్చిన నృత్యం రంగ్‌లా, రంగ్‌లీ నృత్యం. రంగలీకి కోపం రావడం, ఆ కోపం తగ్గించడానికి రంగలా పడ్డబాధ, అత్తా కోడళ్ల తగాదా, రంగ్‌లా పరస్త్రీ గమనం అన్నీ ఆ నృత్యం లోని అంశాలు.

"మన పిల్లలు గూడా రంగ్‌లా రంగ్‌లీగా తయారవుతున్నారు" అన్నాడు రామా.

"జనానికి ఈ ఆట అంటే చాలా యిష్టం" అన్నాడు కోదర్.

"ఎందు కిష్టం గాదు? నీది నా కిష్టమైతే నాది నీ కిష్టం. రంగలీ బుగ్గల్ని రంగిలా ముద్దు బెట్టుకొంటే మన పెదవులు తడి అవుతున్నవి. రంగలీ బుగ్గలు మన ఆడవాళ్ళ బుగ్గలు కాదు గదా?" అన్నాడు కాళా.

భవాయీ నాయకుడు - "బోలో అంబే మాతాకీ జై" అంటే కూర్చున్న వాళ్ళంతా "జై" అంటున్నారు. నృత్యగాళ్ళు పాత్రలూ, గుడ్డలూ వస్తూలు చేసుకొని ఇంకొక వూరికి ప్రయాణ మవుతున్నారు.

వేసవి ప్రారంభంలో గ్రామంలో మశూచికం ప్రారంభమవుతుంది. మోతీచడాదేవ్, భలియాదేవ్ కొలువులు జరుగుతవి. స్త్రీలకు దేవత పూనకం జరుగుతుంది. కొంతమంది గాజులు పగులగొట్టుకొంటే కొంతమంది రవికలు చింపుకొంటుంటారు. ఊరంతా రణగుణ ధ్వని జరుగుతుంది. కొంతమంది

తమ తమ శక్తిని బట్టి కొబ్బరికాయలు సమర్పిస్తే కొంతమంది కోళ్లనూ, మేకల్నీ సమర్పిస్తుంటారు.

దొమ్మరాట లేనిదే జరిగేదెట్లా? వాళ్లుగాక పాములాడించే వాళ్లు, పిల్లనగ్రోవి వాయించే వాళ్లూను. అందరికీ నాలుగు గింజలు సంపాదించుకొనే రోజులవే. కత్తులు కటార్లు తయారుచేసే కమ్మర్లు, కుమ్మర్లు, జోస్యం చెప్పే రంగస్వామి అందరికీ తీరనిపని ఆ రోజుల్లో.

వైశాఖ మాసం ప్రారంభం కాగానే గాలి దుమ్ము ప్రారంభమవుతుంది. చెట్లకొమ్మలు పడిపోతుంటవి. ఇళ్లకప్పులు ఎగిరిపోతుంటవి. ఇళ్లమీద కప్పిన గడ్డి ఎక్కడికి ఎగిరిపోతుందో భగవంతునికే తెలియాలి.

ఆషాఢమాసం ప్రవేశించకుండానే దేవా బన్‌జారా కొడుకు, రత్నా బంజారా, మాల్వా నుండి వచ్చాడు. పశువుల్ని తోలుకొస్తూ వాటితో బాటు, రకరకాల వార్తల్ని గూడా వాడు తీసుకొస్తుంటుంటాడు. "తెల్లవాళ్లను మా కళ్లతో చూశాం, రైల్లో కూర్చుని ఐదణాల టికెట్టుకొని యాభై కోసులు ప్రయాణం చేశాం" అని రతన్ బన్జారా చెప్పడం ఆరంభించాడు.

అడిగే వాళ్లు చాలామంది. కాని ప్రశ్న ఒక్కటే- "రతన్‌భాయీ! తెల్లవాళ్ళు సముద్రం దాటి వచ్చారంటారు. నిజమేనా? అసలు వాళ్ళు మనుష్యుల్లాగానే వుంటారా? మేడం మేడం అంటారు. అదేమిటి?" ఇవి ప్రశ్నలు.

రతన్ నిషా ఎక్కినట్లు మాట్లాడుతుంటాడు. "తెల్లవాళ్ళకు ముప్పయి కళలూ తెలుసు. ఇక వారి రూపమంటారా? దేవతలయ్యా దేవతలు! దేవతలంటే వాళ్ళే. మేడమ్ అంటే వాళ్ళ ఆడవాళ్ళు మేడమ్‌లు. తియ్యతియ్యగా నెమ్మది నెమ్మదిగా మాట్లాడతారు. వాళ్ల శరీరం కుంకుమ పువ్వులాగా వుంటుంది. మాట్లాడుతుంటే పూలు వర్షిస్తాయి."

"ఆ దొరసానుల్ని కలిస్తే-చూస్తే- మన జన్మ తరిస్తుందంటారు. నిజమేనా?" అన్నాడు కాళా. ఇంతలో కాళాకు ఇంకొక సంగతి జ్ఞాపకం వచ్చింది.

"అది సరే, రతన్ భాయీ! వాళ్ళు బయటకు వెళ్ళి నీళ్ళు ఉపయోగించరటగా? నిజమేనా?" అన్నాడు.

రతన్ నిజమే నన్నాడు.

అది వినగానే మొత్తం అక్కడ కూర్చున్న వాళ్లంతా తుపుక్కున ఉమ్మేశారు. "థూ థూ థూ" అన్నారు.

"రైలు బండి అదేమిటి?" ఎవడో అడిగాడు." "రైలు బండి? దానికి దున్న పోతులాంటి ఇంజనుంటుంది. మంచం పట్టెల్లాగా రెండు ఇనప బద్దెలుంటవి. వాటిమీద రైలు పరుగెత్తుతుంది. ఎంత వేగం.. ఎంతవేగం.." అన్నాడు.

"ఠాకుర్ పంజాళీ గుర్రంలాగా పరుగెత్తుతుందంటావు."

"అరే, ఆ గుర్రం దాని ముందు బలాదూర్" అన్నాడు రతన్.

ఇటు రతన్ రైలు బండి విశేషాలు తన్మయంగా చెపుతున్నాడు. అటు తల మీద మేఘాలు కమ్ముకొనడం ఆరంభమయింది. కాళా, కోదర్, రామాలు లేచారు. "రతన్ మాటలు బాగానే వున్నవి, గాని పైన మేఘాలు" అన్నాడు కాళా.

"కాళా ఈ లోకంలో అంతా మన ముందు చెయ్యి జాపుతారు. మనం మేఘాలముందు జాపుతాము. మనం ఈ మేఘాలకు చాలా ఋణపడి వున్నాము" అన్నాడు కోదర్.

"అసలు సామెత వుండనే వున్నది గదా! రైతు మీద కోటి మంది ఆధార పడతారు" అన్నాడు శంకర్.

"కాని ఏమి లాభం? ఆరైతే ఈ రోజుల్లో కష్టాలలో వున్నాడు. భగవంతుని దృష్టిలో న్యాయ మంటూ ఉన్నదా? పుట్టిన దగ్గర నుండీ రైతుకు ఎన్ని బాధలు! ఎన్ని బాధలు!! తిండి సుఖం లేదు. భార్య సుఖం లేదు..."

రామా మధ్యలో అందుకొన్నాడు. "ఒరేయి పిచ్చివాడా! మనం పృథ్విని పోషించే వాళ్ళం. తెలిసిందా? గురువు చెప్పుతూ వుండే వాడు. తండ్రికి తన కూతురు చింత ఎట్లాగో రైతుకు ఈ ప్రపంచం చింత అలాగే."

ఆ మాట వినగానే కాళాకు నవ్వు వచ్చింది. "పృథ్విని పోషించే వాళ్ల మనిగాదు. పృథ్విని మోసే వాళ్ళమను బాగుంటుంది. ఎద్దు వీపు మీద నెయ్యి, గోధుమ, బెల్లం అన్నీ వేస్తాము. అది మోస్తుంది. కాని వాటిలో ఏ ఒక్క వస్తువూ దీని నోట్లోకి పోదు" అన్నాడు కాళా.

కాళా మాట అందరికీ నచ్చింది. "మనం గోధుమలు పండిస్తున్నాము.

ఎవరి నోటికో అందిస్తున్నాము. మనకు మిగిలేది వరిగన్నమో రాగి సంకటో, అంతే. ఎక్కువ కెక్కువ మొక్కజొన్న" అన్నాడు శంకర్.

"గేదెల్ని చూడు. వాటిని మేపడం మన పని. నెయ్యి షాహుకారుది" అన్నాడు రామా.

అందరూ "మనం నిజంగా పృథ్విని మోసేవాళ్లం" అని అనుకొన్నారు.

"మనం పృథ్వినే గాదు, జీవితాన్ని గూడా మోస్తున్నాము" అనుకొన్నాడు కాళా. రాజు లేని జీవితం అతనికి భారంగా కన్పిస్తున్నది. తానెందుకు జీవిత భారం మోస్తున్నాడో అతనికే తెలియడం లేదు. జీవించాలి గనుక జీవిస్తున్నాడని అనుకోవాలి.

సహాయం చేయడానికి అత్తవారింటికి వెళ్ళుతున్నాడు. ఆ మిషతో రాజును చూచే-రాజుతో రెండు మాటలు మాట్లాడే అవకాశం అతనికి కలుగుతున్నది.

అత్తవారి వూళ్ళో మూడేసి నాలుగేసి రోజులుండి తిరిగి తన వూరుకు వెళ్లుతుండేవాడు. రాజును విడిచి వెళ్లుతుంటే అతనికి మనస్సులో చాలా దుఃఖంగా వుండేది. అయినా ఏమి చేస్తాడు ?

## 27

# అభిప్రాయ భేదం

వైశాఖమాసం దుమ్ము, తుపాన్లు తగ్గినవో లేదో జ్యేష్ఠమాసం నిప్పులు కురవడం ఆరంభించింది. పొద్దెక్కిన కొద్దీ భూమిలో నుండి ఆవిరి బయలు దేరడ మారంభించింది. రెండు జాముల సమయంలో ఇంటి బయటకు రావడానికే ఎవ్వరూ సాహసించే వాళ్ళు గారు.

నిజానికి వేసవి రోజుల్లో పనిచేయ బుద్ధి పుట్టదు. సోమరితనమనండి, అలసట అనండి ఎక్కువగా ఉంటుంది. కాని రైతులకు జ్యేష్ఠమాసంలో గూడా పనిలేకపోవడమంటూ లేదు. కొంతమంది పొలాలలోకి ఎరువులు తోలుతున్నారు. కొంతమంది ఇళ్ళమీదికి పెంకులెక్కిస్తున్నారు. కొంతమంది వెదుళ్ళు పాతి, మట్టి పిడతలు వేసి ఇంటి గోడలు బాగు చేసుకొంటున్నారు. కొంతమంది ఇంటికి కట్టెలు తెచ్చుకొంటున్నారు. శంకర్‌వంటి బలగ మున్న వాడికి గూడా క్షణం తీరిక చిక్కడంలేదు. ఛలీ గూడా రోజంతా ఎరువులు తట్టలు అందిస్తున్నది. రాత్రి ఇంటి పనులన్నీ పూర్తికాగానే రోకలి చేతిలోకి తీసుకొని అర్ధరాత్రి దాకా కారం, పసుపు, ఉప్పు అన్నీ దంచి పెట్టుకొంటున్నది. క్షణం తీరిక లేకుండా వున్నది.

కాళా నెత్తిమీద రెండిళ్ల బరువున్నది. తన యిల్లు చూచుకొని అత్తవారిల్లు గూడా చక్కబెట్టాలి.

పది రోజుల్లో తన యింటి పని అంతా పూర్తిజేశాడు. పదకొండో రోజు మధ్యాహ్నం రొట్టె తిని కత్తి తీసుకొని ఖాథీడే వెళ్ళి వస్తానన్నాడు.

"కమతాగాణ్ణి చూడడానికి వెళ్ళుతున్నారనుకొన్నాను" ఛలీ అన్నది.

"కమతాగాణ్ణి చూడాలి. కాని వాళ్ళు కబురంపించారు" అన్నాడు కాళా.

ఛలీకి వొళ్ళు మండిపోయింది. కోపం ఆపుకోలేకపోయింది. "వాళ్ళు వాళ్ళు అంటావేమిటి? ఆ నంగనాచి కబురంపించిందను" అన్నది.

తాను ఖాథీడే వెళ్ళడం ఛలీకి ఇష్టం లేదని కాళాకు ఇదివరకే తెలుసును. కాని ఇంత స్పష్టంగా ఛలీ ఆ మాట అంటుందనుకో లేదు.

"ఖాథీడే నేను వెళ్ళడం దేనికి? మీ వాళ్ళ మేలుకొరకేగా? నీ కిష్టం

లేకపోతే - మానివేస్తాను. అనవసరంగా మాటలంటున్నా" వని కత్తి మేకుకు తగిలించి, తలగుడ్డ తిరగలి మీద పడవేశాడు కాళా.

"నీ పుట్టింటి బరువంతా మోస్తున్నాను. అందుకు కృతజ్ఞత తెలియ జేయకపోగా, పైన ఈ ఎత్తిపొడుపు మాట లేమిటి?" అంటూ హుక్కా తీసుకొని పొయ్యి దగ్గరకు వెళ్ళాడు.

"మాట నిజమే. రెండు సంవత్సరాలు కృషి జేస్తే పొలంలో ఇరవై ఐదు మణుగుల వరకు ధాన్యం మిగలడం ఆరంభించింది. పిల్లలు వరిగన్నం మాని మొక్క జొన్నన్నం తింటున్నారు" అంటూ కాళా హుక్కా పీలుస్తూ వసారాలోని అరుగుమీద కూర్చున్నాడు.

భలీని ఉద్దేశించి "నీ అభిప్రాయం నాకు బోధపడడం లేదు. అక్కడికి పోవాలనీ, చాకిరీ చేయాలనీ నాకేమీ లేదు" అన్నాడు.

ఇంతసేపు కాళా మాట్లాడడం ఇదే మొదటిసారి. భలీ మాత్రం ఏమి చేస్తుంది? ఒక విధంగా కాళా అన్న మాటలు నిజమే. అయినా తన మనస్సులో ఏమిటో సందేహం బయలుదేరింది. వచ్చి వాకిలి గడపనానుకొని నిలబడింది.

"నేను నిన్నొక్కమాట అడుగుతాను. గుండెలమీద చెయ్యి వేసుకొని నిజం చెప్పు" అన్నది.

అడగమన్నాడు కాళా.

"నిజం చెప్పు. నీకూ, రాజుకూ ఏమీ సంబంధం లేదా?" అని అడిగింది.

రెండు క్షణాలు కాళా ఆశ్చర్యచకితుడైనాడు. నవ్వాడు-

"పిచ్చిదానా! నాకూ రాజుకూ మధ్య చాలా సంబంధమున్నది. మొదట మా యిద్దరికీ పెళ్లి నిశ్చయమయింది. అది తప్పిపోయింది. ఇప్పుడు వాళ్ల యిల్లు చూచే భారం నామీద పడ్డది. సోదరుడులాగా ఆ పని చేస్తున్నాను. నీకిష్టం లేకపోతే చెప్పు. మానివేస్తాను. నన్నేమి చేయ మంటావు? ఒట్టు పెట్టుకోమంటావా?" అన్నాడు.

భలీ ఏమంటుంది? ఏమీ మాట్లాడలేదు.

"నేను నిజం చెపుతున్నాను. నేను తప్పు మాట్లాడితే అగ్నిదేవత సాక్షి" అన్నాడు.

అయినా భలీ మౌనంగానే ఉన్నది. కాలి బొటన వ్రేలితో నేలను తొలుస్తున్నది.

"నీకు నా మాట మీద విశ్వాసం కలగడం లేదు. అయితే నెయ్యితో దీపం వెలిగించి తీసుకురా. ఆ దీపం ఎత్తుతాను" అన్నాడు.

ఖలీ నోరు విప్పింది.

"ఇక చాలు. మాట్లాడకు. ఒట్లమీద వొట్లు పెట్టుకొంటున్నావు. ఒట్టు పెట్టుకోమని నేనడిగానా?" అంటూనే ఖలీ లోపలికి పోయి కత్తి, తల గుడ్డా తీసుకొచ్చింది. "ఇవిగో తీసుకో. పొద్దెక్కుతున్నది. ఐదు కోసులు పోవాలి" అన్నది.

"నేను పోను" అన్నాడు కాళా.

తలగుడ్డ వొళ్ళో పడేసి "ఇదిగో తీసుకో. లే" అన్నది ఖలీ.

"ఇవాళ వెళ్లను. రేపు చూద్దాంలే" అన్నాడు కాళా.

"అయితే కమతగాణ్ణి చూచిరా. ఆ పనైనా అవుతుంది" అన్నది ఖలీ.

కాళా లేవలేదు.

ఇక ఖలీ పట్టుబట్ట లేదు. కత్తి వంకెకు తగిలించి లోపలికి వెళ్లింది. పెద్దగానే నవ్వుతూ "అబ్బా! ఏమి మనిషి! అలిగి కూర్చున్నాడు. మాటే మాట్లాడడు. చిన్న పిల్లలు నయం" అన్నది.

కాళా ఇంట్లో చాలాసేపు కూర్చోలేక తల గుడ్డ చుట్టుకొని నది వైపుకు బయలుదేరాడు. అతని మనస్సులో రకరకాల ఆలోచనలు బయలుదేరినవి.

"రాజుకూ నాకూ మధ్య ఏదో సంబంధమున్నదని ఖలీతో ఎవరని వుంటారు! నిజంగా నాకూ రాజుకూ మధ్య వున్న సంబంధం ఏమిటి?" ఆలోచించాడు. కాళాకు నవ్వు వచ్చింది.

"ఉన్నదను కొంటే చాలా వున్నది" అనుకొన్నాడు.

ఖలీ వచ్చి రెండేళ్ళయింది. ఇంతవరకు పిల్లలు లేరు.

"రాజును పిలుచుకొస్తే? ఇంట్లో చేర్చుకొంటే? చిన్నతనంలో కన్న కలలన్నీ నిజమవుతవి. రాజు నా కొరకే జన్మించింది. విధివశం వల్ల వేరయింది" అనుకొన్నాడు.

"రాజు నా దగ్గర వుంటే?" దూరంగా కొండల వైపు చూచాడు కాళా. "ఆ కొండలన్నీ పిండి చేయగలను. నదుల్ని ఆపించి చెరువులు కట్టించగలను. బావులు తవ్వించి ఎక్కడ చూచినా మామిడి చెట్లు నాటించ గలను. కాని ఇవన్నీ..." కాళా దీర్ఘంగా నిట్టూర్చాడు. "ఇవన్నీ మియాం కాళ్ళకు చెప్పాలుంటేనే...."

నదిలోని కొత్త చెలమలోని చల్లటినీళ్ళు తాగాడు. దానితో అతడి మెదడు కొంచెం చల్లబడింది. ఆలోచన మారింది. "రాజును ఇంట్లో చేరిస్తే – సవతుల కయ్యం!! నానా గతి చూడు. కళ్ళెం లేని గుర్రం, సిగ్గులేని ఆడది లాగా వున్నది వాడి భార్యల సంగతి. ఇవన్నీ ఆలోచించే అమ్మ నా దగ్గర మాట తీసుకొన్నది. ఆమె కిచ్చిన మాట తప్ప గూడదు, తప్పను" అనుకొన్నాడు.

"ఇద్దరు భార్యల సంగతి మరచిపో. పిచ్చివాడా! ధోవతులు ఉతకడం దగ్గరనుండి సవతుల మధ్య యుద్ధాలు బయలుదేరతవి" అనుకొన్నాడు.

"కాకపోయినా ఖలీలో వున్న లోపమేమిటి? ఏడుగురి పని ఒక్కతే చేస్తుంది. రాజు అందంగా వుండవచ్చు. అది నాలుగు రోజుల వెన్నెల. ఆ వెన్నెల చూచి ఆనందించడానికి నాకు అవకాశమెక్కడున్నది? నేను రైతును. రైతు బిడ్డను."

చివరికి నిర్ణయం చేసుకొన్నాడు. "ఇక చాలా అవసరమైన పని వుంటేనే తప్ప ఖాఫీడే పోను. రాజును కలవను" అనుకొన్నాడు.

## 28

## రాగి బిందెలు

కాళా నది దాటి అవతలి వొడ్డున రెండు కోసులు నడిచాడు. దోవ చిన్నది. అడవి. పగలే పెద్దపులులు మీద దూకేటట్లుగా వున్నది. పెద్ద పులుల సంగతి ఎట్లా వున్నా కొండల్లో జిగురు పోగుచేసే భిల్లులు మాత్రం సామాన్యంగా జనాన్ని వదలరు.

''ఎక్కడికి ?'' అని కేక వినిపించింది.

దొంగగా కాళా కన్పించకపోయినా భిల్లులు మాత్రం వదలలేదు. ''నేను వాలా పటేలు కొడుకును, గ్రామ పెద్ద యింటికి పోతున్నాను'' అని చెప్పిన తరువాత భిల్లులు వదిలారు. అంతేగాక అతని బలమైన చేతులూ, భుజాన వేలాడుతున్న కత్తి గూడా భిల్లుల్ని కొంతవరకు భయభ్రాంతుల్ని చేయక పోలేదు.

వాలా పటేలంటే భిల్లులకు చాలా గౌరవం. ఏభై సంవత్సరాలకు ముందు– వాలా బాగా యౌవనంలో వున్న రోజుల్లో ఒకసారి తురక దండ్లు ఆ ప్రాంతం మీద దాడి చేశాయి. ఆ ప్రాంతం గౌరవం కాపాడిన వాళ్లు ఆ రోజుల్లో ఇద్దరే ఇద్దరు. ఒకడు వాలా పటేలు, రెండో వాడు బేచాత్ తండ్రి. తురక దండ్లు గ్రామాలు లూటీ చేయడానికి రాగానే ఆ ఇద్దరూ వాళ్లను నది అవతల ఎదుర్కొన్నారు. భిల్లులు వాళ్లిద్దరికీ సహాయం చేశారు. ఒక చిన్న కాలవలో పోరాటం జరిగింది.

పెద్ద పెద్ద రాళ్ళు మీదబడి– బాణాల వర్షం తమమీద కురుస్తుంటే దండులో వున్న వాళ్ళు భయపడి కంటికి కనబడకుండా పరుగెత్తారు. కొంతమంది అక్కడే చచ్చారు. కొంతమంది భిల్లుల చేతుల్లో హతమైనారు. మిగిలినవాళ్ళు ఎటు పరుగెత్తారో ఎవ్వరికీ తెలియలేదు.

ఆ రోజు నుండి ఆ ఘాటీకి ''ఎర్రఘాటీ'' అని పేరు వచ్చింది. ఆ కాలం నాటి తుపాకులు ఒకటి వాలా యింట్లో, ఇంకొకటి బేచాత్ ఇంట్లో ఇప్పటికీ వున్నవి.

వాలా చేతుల్లో భిల్లులు గూడా చాలామంది దెబ్బలు తిన్నారు. అప్పటి నుండి వాలా అంటే భిల్లుల్లో భయంతోబాటు గౌరవం గూడా ఏర్పడింది.

కాళా కొండమీది కెక్కి "ఇంట్లో ఎవరు ?" అని కేకవేశాడు. అక్కడొక యిల్లున్నది. ఆ యిల్లు ఝూంఖరా చెట్ల కొమ్మలతో తయారై వున్నది. మధ్య మధ్య పేముతో అల్లకం జరిగి వున్నది. ఇంటిమీద పెంకులు లేవు. ఖాఖరా తీగలు కనబడుతున్నవి. వసారా నేల కిందకున్నది. వొంగి వొంగి లోపలికి పోవాలి. ఆ వసారాలో ఆడుకొంటున్న ఇద్దరు ముగ్గురు కాళా పిలుపు విని బయటికి వచ్చారు. ఆ పిల్లలకు చిన్న చిన్న లంగోటీలు మాత్రమున్నవి. మగపిల్లలకు ఎర్రటి జందెమున్నది.

ఆ జందెం భుజం మీద లేదు. నడుముకున్నది. వాళ్ళ వొంటి రంగు నలుపు అనడానికి వీలులేదు. చామనచాయ అనవచ్చును. మొరుగుతున్న కుక్కను కత్తితో అదలిస్తూ "ఇంట్లో ఎవ్వరూ లేరా ?" అన్నాడు.

పిల్లలు ఇంటి లోపలికి చూచారు. ఇంట్లో నుండి ఒక పెద్ద పిల్ల బయటికి వచ్చింది. ఆమె శరీరం గోధుమ రంగుగా వున్నది. ఆమెకు పదిహేను పదహారు సంవత్సరాల వయస్సు వుండవచ్చును. ఆమె కాళ్లకు వెండి మెట్టెలూ, మెళ్ళో పూసల పేర్లూ ఉన్నవి. యౌవనం ఆమె శరీరంలో నుండి తొణికిసలాడుతున్నది. ఆమె ముఖంమీద సంకోచమనే మాటేలేదు.

"మా తండ్రి అడవిలోకి వెళ్ళాడు జిగురు తేవడానికి" అన్నది ఆ పెద్ద పిల్ల.

కాళా నిప్పు తెమ్మన్నాడు. తెచ్చిచ్చింది. బీడీలో పొగాకు నింపి నిప్పుతో బీడీ వెలిగించాడు. మేఘాలమీదకు పొగ వదులుతూ ఇంకొక కొండకు బయలుదేరాడు. దోవలో ఒక భిల్లుడు కన్పించాడు. "నాకు కమతానికి పిల్లవాడు కావాలి" అని అడిగాడు కాళా.

"నా మేనల్లుడున్నాడు. ఏమి కమతమిస్తా" రని అడిగాడు భిల్లుడు.

మామూలుగా ఇచ్చేది ఇస్తానన్నాడు కాళా. కాదన్నాడు ఆ భిల్లుడు.

"మీ పెద్ద ఏది జెపితే అది" అన్నాడు కాళా.

ఇద్దరూ పెద్ద దగ్గరకు వెళ్ళుతూవుంటే దోవలో కొంతమంది పిల్లలు కనిపించారు.

"వీడే ఆ పిల్లవాడు" అని భిల్లుడు ఒక పిల్లవాణ్ణి చూపించాడు.

"నీ పేరేమిటి ?" పిల్లవాణ్ణి అడిగాడు కాళా.

"మంగళా"

"మా ఇంట్లో కమతానికి వుంటావా ?"

"ఉంటాను. కాని మామ వొప్పుకోవాలి"

మంగళా తెలివిగల వాడుగా కన్పించాడు. కాళా తనకు తగిన పిల్ల వాడు మంగళా అని నిశ్చయించుకొన్నాడు.

అంతా కులపెద్ద ఇంటికి చేరుకొన్నారు. ఇల్లు వెదుళ్ళతో కట్టబడి వున్నది. గోడలన్నీ పేడతో అలకబడి శుభ్రంగా వున్నవి. ఇంటిముందు ఆడ గుర్రమున్నది. వసారాలో రెండు మూడు తుపాకులూ, రెండు కత్తులూ, విల్లూ, బాణాలూ వున్నవి. అలఖా గామేతీ ఆ పెద్ద పేరు. గామేతీ వాలా కొడుకు కాళా అని తెలుసుకొని చాలా సంతోషించాడు. కాళాను మంచంమీద కూర్చోబెట్టాడు.

గామేతీ వయస్సు అరవైఐదు లేక డెబ్బయి సంవత్సరాలుంటుంది. గట్టి కాయపాటి శరీరం. పెద్ద గడ్డం. చిన్న తలగుడ్డ చుట్టుకొని వున్నాడు.

"మంచినీళ్ళు తాగుతావా?" అడిగాడు గామేతీ.

"మట్టి కుండలనుకుంటున్నావేమో, కాదు. రాగి బిందెలు" అంటూ గామేతీ గ్లాసుతో నీళ్ళు తెచ్చాడు. "నీవంటి వాళ్ళు వస్తే ఈ నీళ్ళు ఉపయోగిస్తా" మన్నాడు.

రాగి బిందెలనగానే కాళాకు కథ వొకటి జ్ఞాపకమొచ్చింది. ఒక పెద్ద యింట్లో ఒక కోడలు పొరపాటున ఒక కుండ పగులగొట్టింది. అత్త నానా తిట్లు తిట్టింది.

"అవి మట్టికుండలు. రాగివి కావు. పగలక ఏమవుత" వన్నది కోడలు.

దానిపైన అత్త మండిపడి "రాగి బిందెలు గామేతీ ఇంట్లో వుంటవి. పోయి ఆ యింట్లో ఆ బిందెలు మోయి" అన్నది.

కోడలు గామేతీ యింటికి వెళ్ళింది. ముందు బిందెల్ని తరువాత ఆ యింటినీ సంబాళించింది.

కాళా గామేతీకి ఆ కథ చెప్పుదామనుకొన్నాడు. చెప్పలేదు. తాను తొందరగా ఇంటికి పోవాలి. అందువలన "అలఖా బాబాయీ! మంగళాను కమతానికి తీసుకొని పోదామనుకొంటున్నాను" అన్నాడు.

"అయితే కనకా ఏమన్నాడు?" గామేతీ ప్రశ్నించాడు. "కుర్రవాడికి ధాన్యంలో భాగమివ్వాలి. అది పిల్లవాడి తండ్రి తీసుకొంటాడు. మరి నా గతి?" అన్నాడు కనకా.

"నీకు గూడా ఏదో సహాయం చేస్తాడులే" అన్నాడు గామేతీ. రెండు ధోవతులు ఇవ్వడానికి కాళా అంగీకరించాడు.

కనకా గూడా సరే నన్నాడు.

"బృహస్పతి వారం నాడు పిల్లవాణ్ణి పంపుతా" నన్నాడు.

రేపు పొద్దున్నే ప్రయాణం అనుకొన్నాడు. ఈరోజే మంచివారం పంపమన్నాడు కాళా. మంచిదనుకొన్నారు. కాళా, కనకా ఇద్దరూ బయలుదేరారు.

అలఖా పొలిమేర వరకు వచ్చి కాళాను పంపించాడు.

కనకా మంగళాను కాళా ముందు నిలబెట్టి "తల్లిలేనివాడు. జాగ్రత్తగా చూడు" అని కళ్ళనీళ్ళు పెట్టాడు.

"మంగళాకు ఏమి కష్టముంటుంది? శుభ్రంగా ఇంత తిండి తిని ఎద్దుల్ని మేపుకొస్తాడు. నీకేమీ విచారం వద్దు. ఇక మంగళా నా మేనల్లుడు. తెలిసిందా?" అని మంగళాను వెంటబెట్టుకొని కాళా బయలుదేరాడు.

మంగళాను ఏవేవో ప్రశ్నలు అడిగాడు. ఇంతలో అతనికి రాగి బిందెలు జ్ఞాపకం వచ్చాయి. గామేతీ మీద ఈర్ష్య కలిగింది. బిందెలు బాగున్నవి. "అయినా ఆ బిందెలు రాజువంటి స్త్రీ ఇంట్లో వుంటేగదా శోభిస్తవి" అనుకొన్నాడు.

అతనికి తాను పుట్టినప్పుడు తన తండ్రి జమునకు రాగి బిందెలు ఇస్తాననడం జ్ఞాపకమొచ్చింది. తన జీవితమంతా నెమరు వేసుకొన్నాడు. మధ్య మధ్య మంగళాతో మాట్లాడుతూనే వున్నాడు. కాని ఆలోచన రాజు, రాగి బిందెల చుట్టూ తిరుగుతున్నది.

రాజు రాగి బిందెలతో నీళ్ళు తెస్తున్నది. బిందెలు తళ తళ లాడుతున్నవి. ఆమె కళ్ళు ప్రకాశిస్తున్నవి. జనం అడిగితే రాజు జవాబు చెప్పింది: "నాకు రాగి బిందెలంటే చాలా ఇష్టం" కాళా ఈ లోకంలో లేడు. ఆలోచనల్లో వున్నాడు.

"మనే తాంబా నే బేడ్ రేడ్ లాగీ"

నాకు రాగి బిందెలంటే ఇష్టం.

పాట పంక్తి పాడుతూ కాళా కళ్ళు తెరిచాడు. ఎదట మంగళా చిరునవ్వు నవ్వుతున్నాడు.

"భగవంతుడు పిచ్చివాడులాగా వున్నాడు... రాజు ముఖం గాదు, మంగళా ముఖం నాకు చూపిస్తున్నాడు" అని కాళా నవ్వుకొన్నాడు.

అబ్బా! ఎటువంటిది ఈ మానవజన్మ!! కాళా ఆశాసౌధాలు నిర్మించుకొంటున్నాడు. మంచం మీద నుండి కిందకు దిగి ఉజ్వల భవిష్యత్తును ఊహించుకొంటున్నాడు... రాజు తప్పకుండా తన యింట్లో రాగి బిందెలతో నీళ్ళు తెస్తుంది....

తన తండ్రి పాడిన భజన కీర్తన కాళాకు జ్ఞాపక మొచ్చింది.

"కోణే ఢంఢోల్యాం మారాం సూతాం సమణా నే
ఓల్యాం, కోణే హాళవేఢీ సోన్ తాణీ?"

నిద్రపోతూ స్వప్నాలు చూచేవాణ్ణి ఎవరు మేల్కొలుపుతున్నారు? ఎవడు నెమ్మదిగా దుప్పటి కప్పుకొంటున్నాడో అతడు –

"ఝుంఖీ ఝుంఖీనే బేతన్ ఆతమే పూర్యా
తారాం సమణాంయే సోడనే సంకేలీ"

ఆలోచించి ఆలోచించి ఆత్మలో చైతన్యాన్ని నింపాడు. నీ స్వప్నాలను దుప్పటిగా కప్పుకొన్నాడు.

ఈరోజు స్వప్నాలుగావున్నవి రేపు నిజమవుతవి. నీకు స్వప్నంలో రాజు కన్పించి "మనే తాంబానే బేడ్ రేడ్ లాగీ" అంటున్నది. కాళాకు గిలిగింతలు పెట్టినట్లనిపించింది.

మంచం మీద కూర్చొని స్వప్నంలో కన్పించిన రాజును గురించి గద్యంలో గాక పద్యంలో వర్ణన ప్రారంభించాడు.

"మనే తాంబానే బేడ్ రేడ్ లాగీ
రేడ లాగీరే రేడ్ లాగీ
మనే మననే మేళాపే రేడ్ లాగీ"

నాకు రాగి బిందెలంటే ఇష్టం. ఇష్టం చాలా ఇష్టం. నా మనస్సుకు కలయిక చాలా ఇష్టం. ఇష్టం చాలా ఇష్టం.

## 29
## మనసులో నెమళ్లు

పర్వతాల మధ్య సింహాలు గర్జిస్తున్నట్లుగా ఉత్తరదిశనుండి మేఘాలు గర్జించడం ఆరంభించాయి.

ఆ గర్జనం విని కాళా, కోదర్ మొదలైన రైతుల హృదయాలు నాట్యం చేశాయి. అంతా వసారాలలోనుండి బయటికి వచ్చి మేఘాలవంక చూడడం ఆరంభించారు. మేఘాలు లేచాయి. ఇవాళ తప్పక వర్షం కురుస్తుందని ఎవడో అన్నాడు. ''మేఘాలు ఎంత వేగంగా పరుగెత్తుతున్నవి ! ఎంత వేగం!'' అని రామా ఉప్పొంగిపోతున్నాడు.

నిజంగానే మేఘాలు పరుగెత్తుతున్నవి. ఏడుస్తున్న పిల్లవాణ్ణి సముదాయించడానికి పరుగెత్తే తల్లుల్లాగా మేఘాలు కన్పిస్తున్నవి. ఫెళ ఫెళా ఉరుములూ, మెరుపులూ ప్రారంభమైనవి. మెరుపులు సూర్యుణ్ణి ఎగతాళి చేస్తున్నట్లున్నవి.

''ఎన్ని ఖాళీ బిందెలు తెస్తావో తీసుకొనిరా. క్షణంలో నింపుతా'' మని మేఘాలు నీళ్ల బ్రాహ్మణులతో పందేలు వేస్తున్నవి.

చూస్తూ చూస్తూ వుండగానే నీరు వరదలు గట్టింది. గుంటలూ చెరువులూ అన్నీ నిండినవి.

ఎనిమిది నెలలనుండి భూమి తపించి వున్నది. ఇంత వర్షం కురిసినా భూమి నీళ్లను పీల్చుతూనే వున్నది.

మేఘరాజు ఒకచోటనే ఇల్లు కట్టుకొని కూర్చుంటాడా ? లేదు గదా! అతడు ఒకచోటనే వుంటే మిగతా ప్రాంతాల గతి ఏమిటి ? అంటోతుల్లాగా రంకెలువేస్తూ మేఘాలు దక్షిణ దిశకు వెళ్లిపోయినవి.

రైతులు నడుములు బిగించారు. నాగళ్ళు బాగుచేయించడానికి కొందరు కమ్మర్ల యింటికీ, కొందరు వడ్రంగుల యింటికీ వెళ్ళారు. శివామంగలి ఇంటింటికీ తిరిగి ఆహ్వానాలు అందజేస్తున్నాడు. ముఖియా అందరినీ తన యింటిముందు అరుగుమీద సమావేశం కమ్మని పిలిపించాడు. కాళాకు వెళ్లడం యిష్టం లేకపోయినా వెళ్లక తప్పలేదు. వెళ్లి మౌనంగా కూర్చున్నాడు.

ఇంటికి రాగానే భలీ అందుకొన్నది. "నీవు ఎరువు వేయించడానికి పోనేలేదు. విత్తనాల గింజలన్నా ఇచ్చిరా. లేకపోతే పుట్టింటి గతి ఏమిటి?" అన్నది.

"అవసరముంటే వాళ్లే తీసుకొని పోతారులే" అన్నాడు కాళా. "ఇన్ని రోజులూ పరుగెత్తుకొంటూ పొయ్యేవాడివి, పదిహేను రోజులనుండి మానివేశావు. ఆ రోజు నేనేదో అన్నానని నామీద కోపం" అన్నది భలీ.

"నీవు అనడంలో తప్పేమున్నది?"

"నా మాట విను. విత్తనాలిచ్చిరా" అన్నది భలీ.

"వచ్చి తీసుకొని పొమ్మను. లేకపోతే మంగళాను వెంటబెట్టుకొని నీవు పో" అన్నాడు కాళా. "మంగళా! వెళ్లి వస్తావా?" అని అడిగాడు.

"మంగళాను నీవే వెంట తీసుకెళ్లు" అన్నది భలీ.

"లేదు. నాకు చాలా పని వున్నది. అవసరముంటే వాళ్ళే వచ్చి తీసుకుని పోతారులే" అంటూ కాళా లేచి ఇంటి బయటికి వెళ్ళాడు.

విత్తనాలకోసం రాజు తన బావగారిని వెంటబెట్టుకొని వస్తుందనుకొన్నాడు కాళా. రెండు రోజులు గడచినా ఎవ్వరూ రాలేదు. కాళాకు విసుగనిపించింది. ఏమైనా సరే, తాను ఆ వూరు పోగూడదనుకొన్నాడు. బాథీడే గ్రామంలో విత్తనాల గింజలు అప్పు దొరకవు. కోదర్ ఒక్కడే బాధపడాలి అనుకొన్నాడు.

తనకు గూడా క్షణం తీరిక లేదు. మొక్కజొన్న విత్తనాలు వెదజల్లే రోజులవి.

ఆషాఢమాసంలో కాళా కాళ్లల్లో విపరీతమైన శక్తి ప్రవేశిస్తుంది. చొక్కా విప్పి తలగుడ్డ మామిడిచెట్టు కొమ్మకు తగిలించాడు. మేఘాలతో దాగుడు మూతలాడే సూర్యుడు ఇవాళ ఎందుకో మండిపోతున్నాడు. కాళా వొళ్ళంతా చెమట కారుతున్నది. అతడి వీపు మట్టితో నిండిపోయి భూమిలాగా కనబడుతున్నది. అతడికదేమీ లెఖ్ఖలో వున్నట్లు లేదు. మొక్కజొన్న పనికాగానే బావి వున్న పొలంలోకి పోవాలి. అదొక్కటే అతడి లక్ష్యం.

రైతులంతా రెండు జాముల సమయంలో నాగళ్ళు విప్పి విశ్రాంతి తీసుకొంటున్నారు. కాని కాళా మాత్రం నాగలి విప్పలేదు. ఆకలి అనిపించింది. ఇంకా అన్నం రాలేదనుకొన్నాడు. ఊరువంకకు చూచాడు. అకస్మాత్తుగా కాళా దృష్టిని రెండు కళ్ళు ఆకర్షించాయి. రాజు వచ్చినట్లున్నది... కాదు

కాదు... రాజు కాదు.. అనుకొన్నాడు. కాదు కాదు. రాజే వచ్చినట్లున్నది. అదే నడక.. అదే రూపం.. రాజు వచ్చింది. అన్నం తెస్తున్నట్లున్నది.

కాళాకు ఆశ్చర్యం కలిగింది. ఎన్ని పనులున్నా భలీ అన్నమిచ్చి రాజును పొలం పంపుతుందా ?

వెంటనే తాను నాగలి విప్పి ఎడ్లను చెట్టుకిందికి తోలాడు. రాజు రానే వచ్చింది.

కాళా హృదయం నాట్యం చేసింది. రాజు చేతి రొట్టె తిని చాలా రోజు లయింది. అవయినా ఆమె అత్తవారింట్లో. ఇది తన యింట్లో. తన వూర్లో. నానా పక్క పొలంలో వున్నాడు. వాడి కళ్ళ ముందు రాజు తన కొరకై అన్నం తెచ్చింది. కాళా కోరిక పూర్తి అయింది. దూరంగా వున్న మంగళాను పిలిచి ఎద్దులకు మేత వేయమన్నాడు. మంగళా మేత వేస్తూ వేస్తూ రాజును తదేక ధాన్యంగా చూస్తున్నాడు.

''ఎందుకు అట్లా చూస్తున్నావు ?'' అని నవ్వుతూ అడిగింది రాజు.

మంగళాకు గూడా నవ్వు వచ్చింది.

''భలీ వదిన ఎక్కడి కెళ్లింది ?'' అడిగాడు మంగళా. ''భలీకి బదులుగా నేను వచ్చాను. నీకు చెడ్డగా కనిపిస్తున్నానా ?'' అన్నది రాజు.

కాళా అందుకొన్నాడు - ''మంగళా ! ఒక్క మాట అను. జీవితంలో మొదటిసారి ఈరోజే - ఒక్కరోజే వచ్చి జన్మసఫలం చేశావని అను'' మాట అందించాడు.

కాళా రాజును రెప్పలార్పకుండా చూస్తున్నాడు. ''ఆకలి రెండు రొట్టెలు తినగలిగినంత వుంటే ఒక్క ముక్క మాత్రం దొరికినట్లున్నది'' అన్నాడు.

''అంత పెద్ద ఆకలివుంటే ఎవరేమిచేస్తారు ?'' అంటూ రాజు దొన్నెతో పప్పుతీసి మంగళాకు అందించింది.

నెత్తిమీద కాకులు ఎగరడం చూచి కాళా ''పొట్ట కాకులు గూడా నింపు కొంటవి'' అన్నాడు.

''నీకు ఇంకా ఏమైనా కావలెనని కోరిక వున్నదా ?'' అంటూ రాజు మంగళా చేతికి రొట్టెలందించింది.

మంగళా ఆ రొట్టెలూ పప్పూ తీసుకొని మర్రిచెట్టుకిందకు వెళ్ళి కూర్చున్నాడు.

"నా కింకా ఏమీ వద్దు. జీవితమంతా ఆకలిగానే వుంటాలే" అన్నాడు కాళా.

"చేతులు కడుక్కోనిరా. ఆకలి తీరుతుందో లేదో చూద్దాం" అన్నది రాజు.

కాళా ఏమిటో ఆలోచిస్తున్నాడు.

"ఏమిటో ఆలోచిస్తున్నావు?" అన్నది రాజు.

"ఆలోచనలు చాలా రోజులనుంచీ వున్నవి. ఈ రోజు ఎందుకో నీ ముందర హృదయాన్ని విప్పవలెనని అనిపిస్తున్నది."

"ఎట్లా వున్న హృదయాన్ని అట్లాగే వుండనీ. విప్పవద్దు" అని రాజు నవ్వింది. తాను గూడా సుఖంగా లేననే ఆమె మనోభావాన్ని ఆమె కళ్ళు వ్యక్తం చేస్తూనే వున్నవి.

కాళా చేతులు కడుక్కోని వచ్చాడు.

"పరిస్థితుల్ని గమనిస్తే- అర్థం జేసుకొంటే హృదయం విప్పవలసిన పనివుండ" దన్నది రాజు.

"హృదయం విప్పితే చెడిపోయేదేమున్నది? నిజం చెప్పు. రాజూ!"

"నీకు చిన్ననాటి మాటలు జ్ఞాపకమున్నవా? కోదర్, నీవూ, నేనూ అందరం ఈ వటవృక్షం కింద ఆడుకొనేవాళ్లం. నీవు రొట్టెలు చేసే దానివి. నీళ్లు తెచ్చే దానివి. నేను నాగలి దున్నేవాణ్ణి. నీవు రొట్టెలు తెచ్చి కూర మరచిపోయేదానివి. నేను నిన్ను కొట్టడానికి లేచేవాణ్ణి.. నీవు నీళ్లు తెస్తే నేను నీ నెత్తిమీదనుండి బిందె దింపేవాణ్ణి. జ్ఞాపకమున్నదా?" అని అడిగాడు.

కాలి బొటన వ్రేలితో నేలను తొలుస్తూ కళ్లెత్తకుండానే రాజు తల ఆడించింది.

"ఆషాఢమాసం రాగానే నాకా రోజులన్నీ జ్ఞాపకం వస్తుంటవి. నీ లంగా జ్ఞాపకం వస్తుంటుంది. నీ చిన్న కాళ్లు జ్ఞాపకమొస్తుంటవి."

"నీకు అన్నం అందించడానికి వచ్చాను. ఇదిగో పప్పు. తొందరగా రొట్టె తిను. నాకు ఆలస్యమవుతున్నది" అన్నది రాజు.

"ఒక్కసారి చిన్ననాటి మాటలు జ్ఞాపకం చేసుకో"

"అన్నీ జ్ఞాపకమున్నవి. రొట్టె తిను" అన్నది రాజు నవ్వుతూ.

"గుడ్డలు మార్చి లంగా కట్టుకొంటే చిన్నదాన్ని - చిన్న పిల్లనయి

పోతాను. నీకు వంట చేస్తాను. నీళ్లు తెస్తాను అనుకొంటున్నావా ? గుడ్డలు మారిస్తే వయస్సు తగ్గుతుందా? నదిలో ప్రవహించే కర్ర ముక్కనైతే సముద్రంలోకి చేరక పూర్వమే పట్టుకొని తీసుకొని రావచ్చును. మానవ జీవితం అటువంటిది కాదు. గడచిన జీవితం గడచిన జీవితమే. అది మళ్లీ రాదు'' అన్నది రాజు.

కాళా పప్పులో రొట్టెముంచి — ''ఈరోజు ఆకలి చచ్చిపోయింది రాజూ!'' అన్నాడు.

''నేను రావడంవల్ల. అవునా? ఈ సంగతి ముందు తెలిస్తే భలీనే పంపించేదాన్ని'' అన్నది.

''ఇది నా అదృష్టం లే'' అన్నాడు కాళా. ''రాజూ! ఆలోచించు. తినడంలోనూ, పొట్ట నింపుకొనడంలోనూ చాలా భేదమున్నది.''

''కావచ్చును'' అన్నది రాజు చెట్టువైపుకు చూస్తూ.

''మనం ఏమి ఆనందం అనుభవిస్తున్నాము ?''

''ఆనందమేమిటి? అంతా జీవిస్తుంటారు. మనం గూడా జీవిస్తున్నాము''

''జీవితంలో నెమళ్లు నాట్యం చేస్తుంటవా ?''

''మన చేతనయితే మనం వంద నెమళ్లు నాట్యం చేసేటట్టు చేసే వాళ్లం''

''అట్లాగే కనబడుతున్నది ధోరణి'' అని రాజు ఫక్కున నవ్వింది. ఆ తరువాత విత్తనాల గింజలు ఎన్ని తీసుకొని పోవాలో, ఏ ఏ పొలంలో ఏమేమి చల్లించాలో అన్నీ వివరంగా చెప్పాడు కాళా.

''అయితే నీవు రావు'' అన్నది రాజు.

''పనివుంటే కబురంపించు'' అన్నాడు కాళా.

''కోపంగా వున్నావు'' అన్నది రాజు. ''భలీ అన్ని మాటలూ చెప్పింది. నీ ముందర మాట్లాడలేకపోతున్నది. నా ముందు కన్నీరు కార్చింది. తన చేతులతో పుట్టింటికి కీడు కలుగజేశానని అంటున్నది. తెలిసిందా! ఒక్కమాట విను. భలీ భోలీ మనిషి. ముందు మాట అంటుంది. తరువాత పశ్చాత్తాప పడుతుంది'' అన్నది రాజు.

కాళా లేచి నిలబడ్డాడు.

రాజు నవ్వింది.

''ఇంకా మొక్కజొన్న విత్తనాలు బుట్టలో వున్నవా?''

"ఉన్నవి. పని చాలా ఉన్నది. ఏమి చేయను రాజూ? రెండు నిమిషాలు మాట్లాడితే హృదయం తేలికబడుతుంది. ఆకలి ఎప్పటికీ తీరేదిగాదు. దానికి నీవేం చేస్తావు?" అన్నాడు.

రాజు ముఖంమీద దుఃఖం కమ్ముకొన్నది. "మనస్సులోని నెమలిచేత మనస్సులోనే నాట్యం చేయించు. ఆనందాన్ని అనుభవించు" అన్నది.

కాళా స్వగతంగా "మనస్సులోని నెమళ్లను మనస్సులో ఆడిస్తేనే ఆనందం. అపుడు మనువు చెడగొట్టే వాళ్ళుండరు. నిందించే వాళ్ళుండరు. చూచి ఈర్ష్య పడేవాళ్లు గూడా వుండరు" అనుకొన్నాడు.

రెండు హృదయాలూ ఒకేమాట మాట్లాడుతున్నవి. రెండు మూడు నిమిషాలలో యుగయుగాలు గడచినవి.

ఇద్దరి కళ్ళూ టపటప కన్నీరు కార్చినవి.

రాజు కన్నీరు బలవంతంగా ఆపుకొన్నది. నవ్వడానికి ప్రయత్నించింది.

"రాజూ! ఆలస్యమవుతున్నది. వెళ్ళు. పొట్టను సంతృప్తి పరచుకొన వచ్చును. కాని హృదయాన్ని సంతృప్తి పరచుకోవడం కష్టం" అన్నాడు.

రాజు బయల్దేరింది.

"మనస్సులోని నెమళ్లను మనస్సులోనే ఆడించడం అంత తేలికపని గాదు" అనుకొన్నాడు కాళా.

## 30

## చివరి సెలవు

విత్తనాలు చల్లిన తరువాత ఐదు రోజుల్లో భూమి అంతా ఆకుపచ్చని రంగుతో నిండిపోయింది. యౌవనవతి శరీరంలోనుండి అణువణువునుండే యౌవనం తొణికిసలాడినట్లు భూమాత అణువణువునుండీ యౌవనం తొణికిసలాడుతున్నది. చూస్తూ చూస్తూ వుండగానే చెట్లన్నీ ఆకుపచ్చ రంగును ధరించాయి.

మొక్కజొన్న, సజ్జ గబ గబా అన్ని మొక్కలూ పైకి వచ్చినవి.

ఉన్నవాడున్నట్లుగా రమ్మనమని రెండు మూడు సార్లు రాజు కాళాకు కబురంపించింది. కాని కాళా పోలేదు. మొక్కజొన్న కండెలు వచ్చిన తరువాత పోవచ్చునని నిశ్చయించుకున్నాడు. ఇంకొక వర్షం కురిస్తే వరి గూడా నాటవచ్చును.

"వర్షం కొరకై ఎదురు చూస్తున్నావు. ఎదురు చూచి చూచి మెడ నొప్పి పుట్టవలసిందే" నన్నాడు రామా.

కాళాకు నవ్వు వచ్చింది. "అసలు మనకు గర్వమెక్కింది. మా తండ్రి అంటూ వుండేవాడు మృత్యువూ, వర్షమూ ఎప్పుడొస్తవో ఎవ్వరికీ తెలియదు..."

వాళ్ళ గర్వభంగం ప్రారంభమయింది. పంచమి పోయింది. ఏకాదశి నాడు తప్పదనుకొన్నారు. వర్షం రాలేదు. పూర్ణిమ గూడా గడచి పోయింది. "గోకులాష్టమినాడు వర్షం కురవకపోతే మీసాలు గొరిగించుకొంటా" నన్నాడు ఒక మహానుభావుడు.

"మీసాలు గొరిగించుకొనడానికి – ముందు తడపడానికి నీళ్లు కావాలి" ఇంకొకడు అన్నాడు. "నదిలో నీళ్లు లేవు. హనుమంతుని గుడి బావిలో భూతాలు "బుస్కొ" కొడుతున్నవి. తాగడానికే నీళ్లు లేవు. మీసాలు తడపడానికి ఎక్కడనుండి వస్తవి?"

"తలమీద మేఘాలు లేకపోతే అది భాద్రపదం ఎట్లా అవుతుంది?" అని సామెత.

భూమి మీద పైకి లేచిన మొక్కలు కొన్ని తిరిగి భూమిలోకి ప్రవేశించి

మిగతావి గొడ్ల పొట్టల్లోకి పోయినవి. మొక్కజొన్న పసుపుపచ్చ రంగుకు దిగింది. మొక్కలు నేల మీదకు తలవాల్చినవి. నవయౌవనవతికి క్షయరోగం వచ్చినట్లయింది.

మొక్కజొన్నను చూచి నిట్టూర్చిన రైతులు ఆకాశం వంకకు చూచారు. మధ్య మధ్య మబ్బులు వేస్తున్నట్లు ఆశ కలిగేది. మరు నిముషంలో ఆ ఆశ నిరాశ అయ్యేది.

"భగవంతునికి మనమీద దయలేదు" అన్నాడు కాళా.

ఒక పొడుగుపాటి బల్లెం తెమ్మన్నాడు కాళా.

"బల్లెం దేనికి?" కోదర్ అడిగాడు.

"ఆకాశానికి తూటు పొడిచి నీళ్లు తెప్పిస్తా" నన్నాడు కాళా.

అందరూ ఫక్కున నవ్వారు.

రాము ప్రశ్నించాడు — "ఆకాశానికి తూట్లు పొడిచే మహానుభావా! భలీ వదిన కోడి కుయ్యగానే హనుమంతుడి బావి దగ్గరకుపోయి వరసలో ఎందుకు నిలబడుతున్నది?"

భలీ వొక్కతే గాదు. వూళ్లో వాళ్లందరి స్థితీ అదేగా వున్నది. కోదర్, శంకర్ వంటి రాగి బిందెల వాళ్ల భార్యలు మొదట మొదట సంకోచించారు. చివరకు అందరూ వరసలో నిలబడవలసి వచ్చింది.

భాద్రపద మాసం గడిచింది. వర్షం మీది ఆశ జనం వదులు కొంటున్నారు. మొక్కజొన్న ఇక పశువుల పాలయింది. పశువులు బ్రతికినా మంచిదేశే అని రైతులనుకొన్నారు.

ఆశ్వయుజంలో గూడా నీటి చుక్క లేదు.

దీపావళి శూన్యంగా గడిచింది. టపాకాయలూ, చిచ్చుబుడ్లూ మాట ఎత్తిన వాళ్లు లేరు. తోరణోత్సవం జరిగింది, గాని ఆవుల పోటీలు లేవు. హండా గీతాలు లేవు. పాటలు లేవు. ఉత్సవం చూడడానికి వచ్చిన జనం స్మశానంలో కూర్చున్నట్లు కూర్చున్నారు.

ఇప్పచెట్టు క్రింద జనం గుమిగూడారు. ఆడవాళ్లు తప్ప చిన్నలూ పెద్దలూ అందరూ వచ్చారు. ఒకరి నొకరు కలుసుకొనడమే వారి ఉద్దేశ్యం. ఎవరిలో చూచినా ఉత్సాహమే లేదు.

"మనలో ఎవరం బ్రతికి వుంటామో, ఎవరం వుండమో తెలియదు. బ్రతికిన వాళ్లు మాత్రం చచ్చిన వాళ్ళను స్మరించండి" అన్నాడు

శంకర్. అతని నోటి వెంట మాట రాలేదు. అందరూ ఒకరి నొకరు ఆలింగనం చేసుకొన్నారు. ఒకరి దగ్గర ఇంకొకరు సెలవు తీసుకొన్నారు.

ఇంటికి పోతూ శంకర్, కాసిమ్‌లు హూడా గీతం ఎత్తుకొన్నారు.

"జీవో జాగో! తో రావణాం బెసాడ్ జీ

పేలా ముయలానా ఛెల్లా! ఝువార్"

బ్రతికివుంటే వచ్చే సంవత్సరం సమావేశంలో కలుద్దాం. చచ్చి పోయిన వాళ్లకు మాది ఇదే ఆఖరి నమస్కారం.

శంకర్, కాసిమ్‌ల కళ్ల నుండి కన్నీరు ధారలు గడుతున్నవి. కాళా, భగా వంటి రాతి గుండెల గొంతుక గూడా డగ్గుత్తిక పడింది. మృత్యు ముఖంలోకి చేరినా హాస్యంగా మాట్లాడే రామా దిగాలు పడివున్నాడు. అన్నాలు తిన్న తరువాత అందరూ తిరిగి కలిశారు. ఇంటింటికీ జట్లు జట్లుగా పోయి అందరినీ కలసి వచ్చారు. అందరి హృదయాలూ నిండి వున్నవి. అందరూ జీవన్మరణ సమస్యలో ఉన్నారు. చివరి సెలవు తీసుకొన్నారు.

ఠాకూర్ గూడా గ్రామంలోకి వచ్చాడు. పన్ను సంగతి అతడు ఎత్త లేదు. ఇంటింటికీ దీపూభాను పంపలేదు. లెఖ్ఖల పుస్తకం నింపించాడు. నల్ల మందు నీళ్లూ, పుగాకూ అందరికీ అందజేశాడు. గుర్రం మెక్కుతూ- "కరువు వచ్చింది. ఇక్కడ నిలవగలిగితే నిలవండి. లేకపోతే షేర్‌పురం చేరు కోండి. ఈ గుర్రం బ్రతికివున్నంత కాలం మీకేమీ కష్టం కలగనివ్వ" నన్నాడు. అందరూ ఠాకుర్‌కు నమస్కారం చేశారు. "మా సంగతి కని పెట్టి వుండండి. మమ్మల్ని బ్రతికించండి" అన్నారు.

"మేమందరం ఈ కరువులో చచ్చిపోతే మా జ్ఞాపకార్థం ఈ వూరి మధ్య ఒక స్థంభాన్ని ఎత్తించండి" అన్నాడు కాళా. ఆ మాట విన్న వాళ్ల గుండెలు అలిసిపోయినవి. జనం భయభ్రాంతులైపోతున్నారు.

"చనిపోయిన వారికి స్థంభమెందుకు? మృత్యువంటే జనం భయపడు తున్నారా?"

కాళా భయపడుతున్నది మృత్యువు వస్తుందని గాదు. కొండల మధ్య గుడిసెల్లో నివసిస్తున్న భిల్లుల్ని చూచి భయపడుతున్నాడు.

భిల్లులు వ్యవసాయం చేస్తుంటారు. పండిన పంట వాళ్లకు సరిపోదు. తిండి లేదు. గుడ్డలు లేవు.

అలఖా గామేతీ కూడా లోలోపల భయపడుతూనే వుంటాడు.

పచ్చి గడ్డి అమ్ముకొని, చెట్ల బెరళ్లు ఉడకబెట్టుకొని తిని, చింతచెట్ల లాంటి చెట్ల చిగుళ్లు తిని ఏదో విధంగా వాళ్లు కాలం గడుపుతున్నారు. కాని ఇక .. చలికాలం పొట్టలో కాళ్ళు ముడుచుకొని ఎట్లాగో గడుపుతారు. వేసవికాలం రాగానే స్థితి ఏమిటి ?

రాను రాను పరిస్థితి భయంకరంగా మారిపోతున్నది. కొంతమంది ఇళ్ళు తాకట్టుబెట్టారు. కొంతమంది పొలాలు తనఖా పెట్టారు. శంకర్, రణఛోడుడు మొదలైన వాళ్ళకు అవకాశం లభించింది. ఐదు మణుగులో ఆరు మణుగులో ధాన్యమిచ్చి పొలాలు, ఇళ్లూ తాకట్టు బెట్టుకొన్నారు. అదైనా పదిసార్లు బ్రతిమిలాడించుకొని.

ఫాల్గుణమాసం చీకటిరాత్రిళ్ళలో పుకారు బయలుదేరింది. బందిపోట్లు జరగవచ్చు .. ఇవాళో .. రేపో .. అంతే.

వయస్సులో వున్నవాళ్ళు తెల్లవార్లూ గస్తీ తిరుగుతున్నారు. మృత్యువు దర్శనమివ్వడం ఆరంభించింది. రాత్రిళ్ళు వెలుతుర్లో కత్తులూ, కటార్లూ కనిపించడం ఆరంభించినవి.

కాళా చాలా వ్యాకులంగా వున్నాడు. ఏమి చేయాలో తోచడం లేదు. ఒక రోజు రాజును చూడడానికి బయలుదేరాడు.

రాజు వాకిట్లో కూర్చొని వున్నది. కాళాను గుర్తు పట్టలేదు. భుజంమీద కత్తివున్నా అతని నడక మారిపోయింది. ఆకారం అసలే మారింది. కాళా రైతుగా కాదు. చావడానికి సిద్ధంగా వున్న బక్కచిక్కిన మనిషిలాగా వున్నాడు. కాని అతని కళ్లకాంతి తగ్గలేదు. రాజు అతణ్ణి చూచి చిరునవ్వు నవ్వింది.

''నిన్ను గుర్తు బట్టలేదు'' అన్నది.

''నీవు మాత్రం గుర్తు బట్టేటట్లున్నావా ? ఇంట్లో గింజలున్నవా ?'' అని అడిగాడు.

''గింజలున్నవి, కాని పనిలేదు'' అన్నది రాజు మంచం వాలుస్తూ. కాళా ఇంటి లోపలికి చూచాడు. ''అంతా ఎక్కడికి వెళ్లారు ?'' అడిగాడు.

''ముగ్గురూ దేగడియా గ్రామం ధాన్యం కొరకు వెళ్ళారు. పిల్లలంతా ఆడుకొనడానికి వెళ్ళారు'' అన్నది.

ధాన్యం అయిపోయి ఎన్ని రోజులయింది? రాజు నవ్వి వూరుకొన్నది. ఆ విషయం పట్టించుకొన్నట్లు లేదు.

కాళా కత్తి కిందకు దింపాడు. లేచి గదిలోకి పోయి ధాన్యం బుట్టలోకి ధనస్సు పెట్టి చూచాడు. రాజు అపుదామనుకొన్నది. కాని కాళా ఆగలేదు. ఒక్క గింజ లేదు.

"ఇంకా పంట రావడానికి ఏడు నెలలైనా వున్నది. ఏడు నెలలు గడవాలి. ఆ తరవాతైనా వర్షం కురుస్తుందని నమ్మకమేమిటి?"

రాజు నిప్పు తేవడానికి బయటకు వెళ్ళింది. "ఇంట్లో గింజలుంటే గదా పొయ్యి వెలిగేది" అనుకొన్నాడు. అందుకే నిప్పు కొరకై పోతున్నది" అని దీర్ఘంగా నిట్టూర్చాడు. రాజు కొరకై ఎదురు చూస్తూ వాకిట్లో నిలబడ్డాడు. రాజు ఇంట్లోకి రాగానే "నిప్పు అక్కడ బెట్టు. నిలబడు" అన్నాడు. రాజు నిలబడింది. కాళా కళ్ళ వెంట నీరు కారుతున్నది.

"నా కళ్ళ ముందు నీ వీవిధంగా చచ్చిపోతూ వుంటే చూడలేను" అన్నాడు.

"లోకమంతా చచ్చిపోతున్నది. నేను ఒక్కతెనే కాదు. కాళా! నీ యింట్లో మాత్రం ధాన్యం మూలుగుతున్నదా? విత్తనాల కొరకై వచ్చినప్పుడు చూచాను" అన్నది.

"నేను లెఖ్ఖ వేసుకొన్నాను. మా యింట్లో మేమిద్దరం. నేనూ భలీ. మాకు రెండు నెలలు గడుస్తవి. ఇక మంగళా వున్నాడు. వాణ్ణి కమతం మానిపిస్తాను" అన్నాడు కాళా.

"మంగళాను కమతం మానిపించకు. లోకమేమనుకొంటుంది?" అన్నది రాజు.

"లోకం ఎట్లాగైనా చావనీ. ముందు మనం బ్రతకాలి గదా!"

"అట్లా అనడానికి లేదు. నా మీద నీకు అభిమానమున్నది. అదే పది వేలు. నీ యింట్లో..."

"నా భాగంలో నుండి ఇస్తాను. రోజుకు ఒక్క పూట తింటాను"

రాజు లోలోపల ఆనందంలో మునిగిపోయింది. రెండో క్షణంలోనే తనను తాను సంబాళించుకొన్నది.

"నేను మీ యింటికి వస్తానా? ఆ విషయం మరచిపో" అన్నది.

"ఇక్కడ ప్రాణాలు విడుస్తావా?"

"ప్రాణాలు విడవడం అంత తేలికా?" అన్నది నవ్వుతూ.

"నీకు నచ్చజెప్పటం ఎట్లాగో నాకు తెలియడం లేదు. పిచ్చిదానా! ఈ

లోకంలో నీకెవ్వరూ లేరనుకోకు. దేశస్థితి సరిగా లేదు. తల్లులు పిల్లల్ని పీక్కొని తినే రోజు లొచ్చినవి'' అన్నాడు.

''నేను నీ యింటికి రాను. అది జరిగే పనిగాదు. నా అన్న వచ్చి పిలిచినా నేను రాదలచుకోలేదు'' అన్నది.

రాజు సామాన్యమైన వ్యక్తిగాదు. ఆమె జగదంబ అనుకొన్నాడు కాళా. లోలోపలే ఆమెకు నమస్కారం చేశాడు. హుక్కా గుడగుడలాడించి ''నన్ను ఆశీర్వదించు'' అన్నాడు.

''ఆశీర్వాద మేమిటి ?''

కాళా మాట తప్పించాడు. ''ఎప్పుడు ఎక్కడ లూటీలు జరుగుతవో చెప్పలేకుండావున్నాము. జనం ఆకలికి మాడిపోతున్నారు. నాకొక ఆలోచన కలుగుతున్నది. నేనుగూడా ఆ లూటీ చేసే వాళ్లల్లో చేరిపోతే బాగుంటుం దేమోననిపిస్తున్నది. పదిమంది ప్రాణాలు రక్షించవచ్చు'' నన్నాడు.

''ఓహో ! ఈ ధనుస్సూ, ఈ బాణాలూ అందుకేనా మోసుకొచ్చావు ? బందిపోటు దండులో చేరి జనాన్ని రక్షిస్తావా లేక నీవే ప్రాణాలు వదులుతావా ?'' అన్నది వ్యంగ్యంగా.

కాళాకు ఆ వ్యంగ్యం అర్థం కాలేదు. ''కుక్క చావు చావడం కంటే ఆ చావే మంచిది'' అన్నాడు.

''నీకు చావు అంటే అంత తేలికగా వున్నది. మనం ప్రతిదినం నది వొడ్డున మండే చితుల్ని చూస్తున్నాము. మన స్థితి గూడా అంతే. అయితే మృత్యువును నెత్తిమీద మోసుకుంటూనే తిరుగుతుంటాము.''

''మృత్యు సమయంలో నీవు నా దగ్గర వుంటే . .''

మాట పూర్తిగాలేదు. ఇంతలోనే రాజు భర్తా, బావగారూ, తోడికోడలూ లోపలికి వచ్చారు. వారి తలలమీద నిండిన సంచులున్నవి.

రాజు ముఖం వికసించింది. ఒక నెల మృత్యువుకు వాయిదా వేశా మన్నది. రాజు తనను సంతోషపెట్టడానికి ఆ మాటలంటున్నదని కాళాకు తెలుసును.

కుశల ప్రశ్నలైన తరువాత ఎద్దుల్నీ, ఆవుల్నీ అమ్మి ఈ ధాన్యం తెచ్చామని వాళ్లు చెప్పారు. ''బేరగాళ్లు వచ్చారు . . ఆకలి గొన్న వాళ్లు చేయని పని వుండదు'' అన్నారు.

''మీ రాజు చాలా గొప్పది. ఉదారురాలు. ఆమెకు మనుష్యులి

ప్రతిఘటించడానికి లాఠీ చేయడం ఇష్టముండదు. కాని అవుల్నీ, ఎద్దుల్నీ కటిక వాళ్లకు..''

వెంటనే మాట మార్చుకొన్నాడు. ఆమెకు మనస్సులోనే చెయ్యెత్తి నమస్కారం చేశాడు. రాజు రాజవంశంలో పుట్టవలసింది అనుకొన్నాడు.

ఆ తరువాత ఇంట్లో పాత్రలు వగైరాలు జాగ్రత్త చేసుకోమన్నాడు. తాను వెళ్ళుతానన్నాడు. భోజనం చేసి వెళ్ళమని అందరూ అన్నారు. ఇంట్లో ధాన్యం దంచుతున్న రాజు బయటికి వచ్చింది. ''అన్నం తినకుండా వెళ్లుతావా? వెళ్లు'' అన్నది.

కాళాకు ఆకలిలేదు. చచ్చి పోయింది. చివరిసారి నా చేతి అన్నం తిని వెళ్ళమని రాజు కళ్లు చెప్పుతున్నవి. పొయ్యిదగ్గరే కూర్చొని చిన్న ఉల్లి పాయల కారంతో రెండు రొట్టెలు తిన్నాడు. రొట్టె తింటున్నాడేగాని కళ్ళవెంట నీళ్లు కారుస్తున్నాడు.

రాజు ''నీవు మగవాడివి. గుండె ధైర్యం కలిగివుండాలి'' అన్నది.

''తిరిగి కలుస్తామో లేదో?''

''కలుస్తాము.''

''రాజూ! నీ వొడిలో తలబెట్టి పెద్దగా ఏడవాలనిపిస్తున్నది.''

''రొట్టె ఇంకొకటి ఇవ్వనా?''

కాళా శిరస్సు రాజువైపుకు వంగింది. ఆమె తన చేతితో కాళా తల నిమిరింది. ఆ తరువాత నీళ్ళగ్లాసు తెస్తానని లేచి వెళ్ళింది.

కాళా అట్లాగే కూర్చున్నాడు.

తన తలను నిమిరిన వేళ్ళల్లోనుండి అతనికేదో సందేశం వినిపించింది.

భోజనం కాగానే హుక్కా తాగాడో లేదో తెలియదు, లేచి అందరి దగ్గరా సెలవు తీసుకొన్నాడు.

''పదిహేను రోజుల్లో మళ్ళీ వస్తాను, క్షేమ సమాచారం తెలియజేస్తూ వుండండి. రాజూ! తిరిగి కలుస్తామో లేదో!! ఇది చివరి..'' కంఠం పెగలలేదు. రాజు తనను తానే మరచిపోయి నిలబడివున్నది. కాళా వంక చూస్తున్నది.

కాళా తలగుడ్డ అదృశ్యమయిందాకా అలాగే నిలబడ్డది. తలగుడ్డ అదృశ్యం కాగానే కళ్లు తుడుచుకొన్నది.

## 31

# ఆకలి భూతాలు

అడవి మీదబడి తినేటట్లున్నది. పక్షులు ఆకలికి చచ్చి కింద పడిపోతున్నవి. చైత్ర మాసంలోనే ఆ చెవులోని గాలి ఈ చెవిలోకి కొడుతున్నది. కాళా నేలమీద అడుగులు పెట్టలేక పోతున్నాడు. అంత వేడిగా వున్నది.

అతని దృష్టిలో ఇవన్నీ లేవు. అతని మెదడులో ఒకటే ఆలోచన పని చేస్తున్నది. రాజు షాహుకారుకు తన శరీరాన్ని అర్పిస్తే? భూమి గతి తప్పినా రాజు అటువంటి పని చేయదు అనుకొన్నాడు.

ఆ ఆలోచన వచ్చినందుకు కాళాకు తనమీద తనకే కోపం వచ్చింది. "నీవు రాజును ఇప్పటికీ గుర్తించ లేదన్నమాట" అనుకొన్నాడు.

ఇంకొక ఆలోచన వచ్చింది. "నీవు లూటీకి పోతావా? దొంగతనాలు చేస్తావా?" రాజు బాగా చెప్పింది. ఆ అభిప్రాయాన్ని గూడా మార్చుకొన్నాడు.

రాజు ఇంట్లో వున్న ధాన్యమెంతో లెఖ్ఖ వేసుకొన్నాడు. వాళ్లింట్లో ఎట్లాగైనా ఒక నెల గడుస్తుంది. పదిహేను రోజుల్లో తానొకసారి వెళ్లి వస్తాడు. భలీ దగ్గర కొన్ని నగలున్నవి. అవి అమ్మితే నెల తప్పక గడుస్తుంది. తన యింట్లోవున్న తిండి గింజలు రెండు నెలలకు సరిపోగలవు. చాతుర్మాస్యం అయిన తరువాత గూడా వర్షం కురవదా? ఒక్క వర్షం కురిస్తే.. అనుకొంటూనే ఊళ్లోకి వచ్చేశాడు. ఊరు ఉత్తరదిశ నుండి పెద్దగా కేకలు వినబడుతున్నవి. "పరుగెత్తండి! పరుగెత్తండి! దండు వచ్చి పడింది. పశువుల్ని తోలుకొని పోతున్నారు. లూటీ.." శరీరం కాళా కంపించిపోయింది. కాళా కత్తి బయటికి తీసి ఉత్తర దిక్కుకు పరుగెత్తాడు.

"కొండల్లోకి పోతున్నారు. పరుగెత్తండి" అని మళ్లీ అరుపులు వినిపించినవి. కాళా ఒక్క అంగలో నదివొడ్డుకు చేరాడు. "వస్తున్నా" నని పెద్దగా కేకబెట్టాడు. ఆ కేక వినగానే "మా వాడు వచ్చాడు, ఇక పరవా లే"దని బేచాత్ కేకబెట్టాడు.

బేచాత్ పోయిన తన ఏడు గేదెల్లోనుండి మూడింటిని తిరిగి తెచ్చాడు. మిగతావాళ్ల పశువులు పూర్తిగా పోయినవి. ఊరంతా గగ్గోలుగా వున్నది.

ఇంటి వాకిట్లో భలీ తలబాదు కొంటున్నది. "బేచాత్ వొంటరివాడు. తోడుబోండి. మా ఆయనకు కబురంపించండి" అంటున్నది.

కాళా అప్పటికే కొండల్ని సమీపించాడు. కొండ ఎక్కి దిగి ఒక లోయ దగ్గరకు చేరాడు. ఒక చెట్టు ప్రక్కన కూర్చున్నాడు. ఇంతలో చంప బడుతున్న ఆవు అరుపు వినబడింది. ఆ అరుపు వినబడ్డ వైపుకు పరు గెత్తాడు. కొండ ఎక్కాడు. ఆ కొండమీద నుండి కిందకు చూచాడు. అతడు చూచిన దృశ్యాన్ని ఏడు జన్మల్లో కూడా మరచిపోలేడు. ఇరవై ముప్పయి అస్థిపంజరాలు చచ్చిన పశువులమీద తాండవమాడుతున్నవి. ఆ అస్థిపంజరాలు దంతాలనే కత్తులుగా ఉపయోగిస్తున్నవి. మొదట అవి నక్కలేమోనను కొన్నాడు. ఒక అస్థిపంజరం తన కొడుకు చేతిలో నుండి మాంసం లాక్కొంటున్నది. ఒక ముసలిది నెత్తురు తాగుతున్నది. ఇద్దరు మాంసం ముక్కలుగా కోస్తున్నారు.

కాళా ఆ దృశ్యాన్ని చూడలేక పోయాడు. వాళ్ళను చంపడానికి తాను వచ్చాడు. ఆ విషయం మరచాడు. అతని కళ్ళల్లో నుండి నీరు కారు తున్నది. "ఓ భగవంతుడా! నీ సృష్టికి ఎంత దుస్థితి ఏర్పడింది!! ఈ ఆకలికి మించిన మహా శక్తి ఇంకొకటి లేదు" అనుకొన్నాడు. ఆకలికి ఆగలేక ఈ జనం పశువుల్ని చంపి తింటున్నారు. ఆ చచ్చిన జంతువుల చుట్టూ తిరుగుతున్న పిల్లల్ని చూడగానే కాళా హృదయం కరిగి పోయింది. మౌనంగా వెనకకు తిరిగాడు. ఏభై అడుగులు వెనకకు వేశాడు. ఏమిటి చూచాడు? ఏభై అస్థిపంజరాలు పదిహేను ఇరవై పశువుల్ని ఎండిన కాలవ వైపుకు తీసుకొని పోతున్నవి. వాటిలో తన గేదెలు గూడా వున్నవి. గేదెల్ని విడిపించాలి. ఒక్క చేత్తోనే అనుకొని పక్కగా నక్కి కూర్చున్నాడు.

ఆ ఏభై అస్థిపంజరాలూ సమీపానికి వచ్చినవి. వాళ్ళల్లో కొంతమంది స్త్రీలున్నారు. కొంతమంది పురుషులున్నారు. వాళ్ళ మొలలమీద లంగో టీలు గూడా లేవు. ఆకులు కట్టుకొని వున్నారు. ఆడవాళ్ల స్తనాలు ఎండి లోపలికి పీక్కొనిపోయి వున్నవి. వొంటి చర్మం వేలాడుతున్నది. వాళ్ళ వెనక ముసలివాళ్ళు నడుస్తున్నారు. పిల్లలు ఆక్రందనం చేస్తూ పరు గెత్తుతున్నారు. ఎవరికీ నిలబడే శక్తి గూడా లేదు. అస్థిపంజరాలు కాలవ

దగ్గర ఆగినవి. అవి ఒక పశువును చంపినవి. ఆ పశువు మీద జనం ఈగల్లాగా మూగారు. కొంతమంది కత్తులు ఉపయోగిస్తున్నారు. కొంత మంది రాళ్ళతోనే పశువుల్ని చంపుతున్నారు. కాళా హృదయం భోరున ఏడ్చింది. ఇక తాను వాళ్ల దగ్గరకు పోదలుచుకోలేదు. తన గేదెల్ని విడిపించడం మానుకొన్నాడు. భగవంతుణ్ణి అనేక విధాలుగా తిట్టాడు. ఒక ముసలిది చెవుల పిల్లిని చంపి తింటున్నది. ఇదంతా నిజమా? స్వప్నం కాదు కదా? అనుకొన్నాడు. కొండ దిగి తన వూరుకు బయలు దేరాడు. కొంత దూరం వచ్చిన తరువాత అతనికి స్పృహ తెలిసింది. కూర్చుని పెద్దగా ఏడ్చాడు. తల్లిదండ్రులు చనిపోయినపుడు గూడా అతడంతగా ఏడవలేదు.

కోదర్, భగాలు ఏమిటేమిటని అడిగారు. "స్నేహితుల్లారా! మీరు ఆకలిని చూడలేదు. నేను చూచాను. ఆకలి భూతాలను చూచా" నన్నాడు.

కోదర్, భగాలు కాళాను చెయ్యి పట్టుకొని ఇంటికి తీసుకొని వెళ్ళారు.

32

## విన్నదీ, కన్నదీ....

కాళా, అతని సహచరులూ ఇంకా గ్రామంలోకి చేరనేలేదు. గ్రామమంతా రక రకాలుగా వార్తలు వ్యాపించినవి. కాళా గాయపడ్డాడనీ, అతని గుడ్డలు రక్తంతో తడిసిపోయి వున్నవనీ ఒకడంటే ఇంకొకడు అసలతని చెయ్యి తెగిపోయిందనే అన్నాడు. అది నిజం గాదు, నా కళ్ళతో నేను చూచి వచ్చాను, కాళా కులాసాగానే వున్నాడని ఇంకొకడన్నాడు. అయితే అలఖా గామేతీ – ఈ బ్రతికివున్న భూతాలు గామేతీ అదుపులో లేవనీ, ఇప్పటికైనా గ్రామాల వాళ్ళు మేల్కొనడం మంచిదనీ – జనానికి తెలియజెప్పవలసిన బాధ్యతను కాళా మీదబెట్టి – అతణ్ణి ప్రాణాలతో వదిలిన మాట నిజమని ఇంకొకడన్నాడు.

అయితే ఆ మాటలో గూడా కొంత నిజం లేకపోలేదు. గ్రామంలోకి ప్రవేశించిన తరువాత యువకులు ఎవరి యిళ్ళకు వాళ్ళు పోతూ కాళాతో – బ్రతికి వుండదలచుకొంటే సామాన్లు మూట గట్టడం మంచిదనీ లేకపోతే మునిగినవాడు మునుగుతాడు, చచ్చినవాడు చస్తాడు అన్నారు.

అది చైత్రమాసం. చీకటిరాత్రి పైన భూతాల ఈ వార్తలు జనం భయభ్రాంతులై వున్నారు. పశువుల శాలలన్నీ ఖాళీగా వుండడం పైన భయంకరమైన వార్తలు ప్రచారం గావడం వల్ల ఎవ్వరికీ తమ యిళ్ళల్లో వుందామని గూడా అనిపించడం లేదు. ఇళ్ళల్లోకి పోతే గుండెలు దడ దడ లాడడం ఆరంభించాయి.

జనమంతా కాళా యింటిముందు చేరారు. జరిగిందేమిటో తెలుసుకొన వలెనని వారి కుతూహలం. కాళా యింటిముందు ప్రదేశమంతా జనంతో నిండిపోయింది. కాళాకు దగ్గరగా కూర్చొని ప్రశ్నలు వేయవలెననీ, ఆ ప్రశ్నలకు సమాధానాలు వినవలెననీ జనం తహ తహ లాడుతున్నారు. నేను ముందు నేను ముందు అని జనం తోసుకొనడం గూడా ఆరంభించారు. ఆడవాళ్ళు కొంచెం దూరంగా కూర్చొని – మాకు గూడా వినబడేటట్లు మాట్లాడమని కాళాను బ్రతిమలాడుకొంటున్నారు.

కాళాకు ఇంతమంది జనం మధ్య నిలబడి మాట్లాడడం అలవాటు లేదు.

అయినా మాట్లాడక తప్పలేదు. మంచం మీదనుండి లేచి నిలబడ్డాడు. కొంచెం ముందుకు అడుగు వేశాడు. ఇంకా మాట ప్రారంభించనే లేదు. ఇంకా కొంచెం ముందుకు రా అని ఒక కేక వినబడింది.

ఇంతలో రామా ఒక మంచం తీసుకొని తప్పుకోండి తప్పుకోండి అంటూ ముందుకు వచ్చాడు. మంచం కింద వేసి కాళా! ఒక్క నిమిషం ఆగు అంటూ ఎక్కడికో పరుగెత్తి ఒక బుట్ట తీసుకొని వచ్చాడు. జనం విచిత్రంగా అతని వైపుకు చూస్తున్నారు. ఇదేమిటి వీడు అని పక్కున నవ్వారు.

అంతా పక్కున నవ్వారు. వీడేమిటి మధ్యలో అని కొంతమంది విసగడం ఆరంభించారు.

రామా ఆ బుట్ట తెచ్చి మంచంమీద బోర్లించాడు. దీనిమీదికెక్కి మాట్లాడు అని కాళాతో అన్నాడు. మొదట విసిగినా రామా చేసిన ఉపాయం అందరికీ నచ్చింది.

కాళా ఆ బుట్టమీద నిలబడ్డాడు. కాళా అందరికీ దేవదూతగా కనబడడం ఆరంభించాడు.

కాని నిజానికి కాళా దేవదూత కాదు. ఆకలికి తపించిపోతున్న భూతాలదూత.

బుట్టమీదికి ఎక్కి నిలబడ్డాడే గాని కాళాకు ఏమి మాట్లాడాలో తోచలేదు. "మీరేదో అడుగుతామన్నారు, అడగండి" అన్నాడు.

[నాధా భార్య కంకు–'అక్కడ జరిగిన విశేషాలు చెప్పు అన్నది.'] "వదినా! చెప్పవలసిన విశేషాలేమీ లేవు" అన్నాడు. అయినా అతని కళ్లముందుకు తాను చూచిన దృశ్యాలన్నీ వచ్చినవి. చచ్చిన జంతువుల కళేబరాలూ, వాటిమీదకు ఎగబడిన మానవకంకాళాలూ, ఎండిన పచ్చిమాంసమూ అన్నీ కళ్లముందు తాండవమాడినవి. "అబ్బబ్బ! ఆ దృశ్యాలను నేను వర్ణించలేను. అటువంటి దృశ్యాలను చూచే అవకాశం ఏడు జన్మలెత్తినా మనకు వద్దు" అన్నాడు. మనం స్మశానంలో భూతాలను చూడలేదు. బర్బరాభూతం స్మశానంలో తన అనుచరగణంతో తాండవం చేస్తుందని పెద్దలంటుంటారు. అదే దృశ్యాన్ని నేను చూచాను అన్నాడు.

కాళా గొంతు సవరించుకొన్నాడు. "నిజంగా అదే దృశ్యం, నిజంగా అదే దృశ్యం. అయితే బర్బరాభూతం మాత్రం లేదు" అన్నాడు.

"ఉన్న యిబ్బంది అదే గదా బర్బరాభూతం వుండివుంటే మిగిలిన భూతాలను అది అదుపులో బెట్టేది" అన్నాడు రామా.

"నిజం రామా! నిజం" అన్నాడు కాసిమ్‌ఘాంచీ. ఘాంచీ కోపంతో లేచి నిలబడ్డాడు. చేతులు తిప్పుతూ - ఇంతకాలం బర్బరాభూతం మిమ్మల్ని కాపాడుతుందనుకొన్నారు. ఇప్పుడంతా తల్లక్రిందులయింది. పశువుల్ని కొల్లగొట్టడం అయిపోయింది. ఇక ఇళ్లు లూటీ అయ్యే పరిస్థితి ఏర్పడింది. ఇప్పటికైనా జాగ్రత్తపడండి. రెండు మూడు రోజుల్లో ఆ పని గూడా జరిగిపోతుంది. తరవాత చెప్పలేదనుకోవద్దు" అన్నాడు.

రెండు క్షణాలు నిశ్శబ్దంగా అందరూ నోరు కదపలేదు. జనం బ్రతికి వున్నారా లేదా అని గూడా సందేహం కలిగే వాతావరణం ఏర్పడింది.

కాళా బుట్టదిగి కిందకువెళ్లి కూర్చున్నాడు. తరువాత దగ్గులూ తుమ్ములూ ప్రారంభమైనవి. ఇళ్లు లూటీలు జరిగే ప్రమాదమున్నదంటు న్నారు. ఇళ్లల్లో ఏమైనా వున్నవాళ్లకు ఆ భయం" అన్నారు ఇద్దరు ముగ్గురు.

"అవునవును అదీ నిజమే. మీయింట్లో మా యింట్లో ఏమున్నవి? గిద్దెడు గింజలుంటే ఈ రోజుతోనే ఆఖరు" అన్నారు ఇంకా కొంతమంది.

అదీ నిజమే. ఆకలితో పరాయీ దేశంలో చచ్చిపోయే దానికంటే ఉన్న వాళ్లో మట్టి గావడమే మంచిది" అన్నారు కొంతమంది. రామా గూడా వాళ్లల్లో చేరాడు. మాటల్లోనే గ్రామస్థులంతా తమ తమ స్థితిని ఏకరువు పెట్టడం ప్రారంభించారు. "రామా అభిప్రాయం గూడా మంచిదే. లూటీ ఉన్న మానెడు గింజలూ తీసుకొనిపోతే పదిహేను రోజుల తరువాత చచ్చేది ఈవాళే చస్తాము, ఇప్పటికే సగం చచ్చివున్నాము" అన్నాడు.

బేచాత్, భగా, నానా లాంటి వాళ్ళు గూడా వూరు విడచి వెళ్లడానికి ఇష్టంగా లేరు. నానా అందుకున్నాడు - అట్లా ధైర్యంగా అదిసరే, మన మంతా కలిసినట్టుగా వుంటే ఈ బిల్లుల్ని ఎదుర్కోలేమా? అంత శక్తి చచ్చి వున్నామా?" అన్నాడు.

బేచాత్ నానాను సమర్థించాడు.

"అయితే ఆ విధంగానే నిర్ణయించండి" అన్నాడు రణఛోడ్ ముఖయా.

కాసిమ్ "ఘాంచీ గూడా సంతోషించాడు–అట్లా ధైర్యంగా మాట్లాడండి" అన్నాడు.

రణఛోడ్ ముఖియా లెఖ్ఖ ప్రారంభించాడు. "దోవలోనే బిల్లులు మ

మీద తారసిల్లితే?'' అని ఒకడు ప్రశ్న వేశాడు. షేర్‌పురిలో లూటీ జరగదనే విశ్వాసమేమిటి?'' ఇంకొకడన్నాడు. రెండు గింజలు ఏదో విధంగా దాచుకుందామన్నాడు ఇంకొకడు.

కాళా మాట్లాడకుండా వుండలేని స్థితిలో పడ్డాడు – మీ కెవ్వరికీ ఇష్టం లేకపోతే ఇంకొక వూరు మనం పోవలసిన అవసరం లేదు. కాని తరువాత మాకు చెప్పలేదు అనగూడదు. మనం బిల్లుల్ని ఎదుర్కొంటాము, తిండి లేకపోయినా ఉపవాసాలు చేస్తాము అనడం ఉపయోగం లేని మాటలు. ఆ గుంపుల్ని ఈ రోజు ఈ కళ్లతో చూచాను. ఆ గుంపులు ఎక్కడనుండి పోగుబడ్డవో నాకే అర్థంగాలేదు. ఆకాశంనుండి జనం కిందకు దూకారో డూంగర్ పర్వతాలనుండి వాళ్ళంతా పుట్టారో నాకు అర్థం గాలేదు'' అన్నాడు.

''పర్వతాలకూ పుట్టలేదు. ఆకాశంనుండీ దూకలేదు. ఆకలి ఘాతాలు మన గ్రామాలలో ఏదోవున్నదని భావించి గ్రామగ్రామాలనుండి ఒక చోట పోగుబడుతున్నవి. కొద్దిరోజుల్లోనే ఆ జనం ఈగలుగా ముసురుకొంటారు'' అంటూ కాలూ లేచి ఇంట్లోకి వెళ్ళాడు.

''జనం ఈగలుగా ముసరవచ్చును. ఉన్న ధాన్యం తీసుకొని పోవచ్చును. జనాన్ని చంపరుగదా!'' అన్నాడు రామా.

హుక్కా నింపుకొని కాళా బయటికి వచ్చాడు——

''రామా! నా మాట విను. మనుష్యులు మనుష్యుల్ని పీల్చుకొని తినే రోజులు వస్తున్నవి. తప్పదు'' అన్నాడు.

ఎవ్వరూ ఏమి మాట్లాడలేదు. వాతావరణం నిశ్శబ్దంగా వుండిపోయింది.

''ఆలోచించండి. నిర్ణయించండి'' అన్నాడు రణఛోడ్ ముఖియా. అందరము ఇక్కడే వున్నాము. ఎవరైనా ఇళ్ల కాపలాకు మిగిలిన వాళ్లుంటే గూడా వాళ్లను పిలిపించండి'' అన్నాడు రామా.

ఎక్కడి యిళ్లు అక్కడ వదిలి గొళ్లేలు గూడా వేయకుండా వచ్చిన సంగతి అందరికీ జ్ఞాపకం వచ్చింది.

''మగవాళ్ళు ఆడవాళ్లు ఇళ్లకు పోతే'' అన్నారెవరో. ఆడవాళ్లు ఇంట్లో వుండగలరా? అన్నాడింకొకడు.

ఆడవాళ్ళు ఇళ్లకు పోవడం మంచిదని నిర్ణయం జరిగింది. పిల్లలూ కొంత మంది ఆడవాళ్ళూ ఇళ్లకు వెళ్ళారు.

ఆలోచన ప్రారంభమయింది. ఏమిటి చేయాలి? కాళా ఒక పక్షానికి నాయకుడు. రణఛోడ్ నానాలు ఇంకొక పక్షానికి నాయకులు. ఊరు వదలడమా లేదా అదీ సమస్య.

కాళా పక్షంలో స్వార్థమేమీ లేదు. రణఛోడ్ పక్షంలో స్వార్థమున్నది. దాన్ని బాధ్యత అని గూడా అనవచ్చు. నీవు ఊరి పెద్దవు. గ్రామాన్ని ఎడారిగా ఎందుకు మార్చావని తనను అధికారులడిగితే తానేమి జవాబు చెప్పాలి? అది రణఛోడ్ ముఖియా సమస్య. అయితే అతనికి కాళా మాటలు గూడా యుక్తి యుక్తంగానే కనబడుతున్నవి.

"మీ యిష్టం. ఆలోచించి నిర్ణయించండి" అని కాళా వైదొలిగాడు. ఎవ్వరికీ ఏమీ తోచడం లేదు. బేచాత్ జాతి వాళ్ళు పది పదిహేను మంది వున్నారు. రణఛోడ్ "ఇద్దరు ముగ్గురు షేర్‌పూర్ వెళ్ళి మనం వుండడానికి అక్కడ స్థలం వున్నదో లేదో చూచి రావడం మంచిదన్నాడు. ఇష్టంలేక పోయినా కాళా గూడా అందుకు సరే నన్నాడు. కాని షేర్‌పూర్ అందరికీ నచ్చలేదు. డేగడియా గ్రామమైతే మంచిదని కొంతమంది సలహా చెప్పారు.

"సరే, రేపు ఇద్దరు డేగడీయా వెళ్లి చూచిరండి" అని నిశ్చయం చేసుకొని అందరు లేచారు. ఇళ్ళకు వెళ్ళారు.

ఇంటికి వెళ్ళారే గాని తలుపులు మూసుకొని అందరూ లోపల పని ప్రారంభించారు. ఆడవాళ్లు కాళ్ళకున్న వెండి సామాన్లను మూట గట్టారు. కాళా తన యింటి వెనక గోడకు పక్క అరుగులాంటి దానిని నిర్మించడం ఆరంభించాడు. నానా రణఛోడు లిద్దరూ పెట్టెలు తెరిచి నగలన్నీ ముసలి మాలి వొడిలో పెట్టడం ఆరంభించారు.

రెండో రోజు తెల్లవారింది. జనం కలుస్తున్నారు. కాని తమ తమ రహస్యాలను ఒకడు రెండో వాడితో చెప్పడం లేదు.

కాళా బేచాత్‌కూ, రామా భగాలకూ ఇంటి వెనక గోడకు పక్కగా ఇంకొక వరస గోడ కట్టమని సలహా చెప్పాడు.

నిజానికి అందరికంటే ఎక్కువ భయపడుతున్నారు. రణఛోడ్ నానాలు. సొమ్ములన్నీ మూట గట్టి నా చేతి కివ్వమని మాలీ గోల చేసింది.

"నా కివ్వు. ఎక్కడైనా పూడ్చి పెడతా నన్నాడు నానా ముసలిది మండి పడింది.

నాకిస్తే నేను దాచిపెడతానన్నాడు రణఛోడుడు. ముసలిది అంగీకరిస్తే గదా! మూట చేతిలోకి తీసుకొనివెళ్లి మంచంమీద కూర్చున్నది.

అన్నంగూడా మంచంమీద కూర్చొని తినడం ప్రారంభించింది. బయటికి పనిమీద పోవలసివస్తే - మూటమీద బొంతకప్పి నానాను కూర్చోబెట్టి బయటకుపోయేది.

బహుశా నగలమూటను గుండెలకు కట్టుకొని చస్తుంది ఈ ముసలి పీనుగ అని కోడళ్లు తిట్టడమారంభించారు.

ఎవరు ఎన్ని తిట్టినా ఆ ముసలిది మూట వదిలేదిగాదు. కోదర్ తల్లికి పాలిచ్చే ఆవుమీద ప్రాణం. దాన్ని వదిలి ఒక్క నిమిషం వుండేదిగాదు.

రామా ప్రాణం పిల్లలమీదవుంటే కాళా ప్రాణమంతా ఎద్దులమీద వున్నది.

పొద్దుగూకితే అందరిదృష్టి వూరి పొలిమేరవైపుకు పరుగెత్తేది. "అదుగో తుపాకి మోత, ఇదిగో జనం వస్తున్నారు. భూతాలు భూతాలు" అని జనమంతా దద్దరిల్లిపోతూవున్నారు. అంతా నిద్రాహారాలు మానేశారు. తెల్లవారు జామున కోడికూయగానే— అమ్మయ్యా! ఈరోజు గడచింది, అని అంతా దీర్ఘంగా నిట్టూర్చేవాళ్లు.

## 33
## దుఃఖ పీడితులు

వేసవి కాలం. ఎవ్వరికీ పనిలేదు. రోజులు గడిచేదెట్లా? అందరికీ ఆకలి గూడా చచ్చిపోతున్నది.

పశువులు లూటీ చేయబడి, కొండల్లో తను చూచిన దృశ్యాన్ని కాళా వర్ణించి చెప్పినప్పటినుండి అందరి దృష్టి కొండల వైపుకూ నది వైపుకూ పరుగెత్తుతూ వుండేది. రోజు రోజూ వార్తలు రావడం ఆరంభమైనది. ఏ రోజు విన్నా దోపిడీల వార్తలే. ఈరోజు ఒక వూర్లో దోపిడీ జరిగితే రెండో రోజు ఇంకొక వూర్లో జరుగుతున్నది.

దూరంలో ఏమిటి, ఒక రోజు పక్క గ్రామంలోనే పెద్ద దోపిడీ జరిగింది. తుపాకుల గుండ్లు వర్షించినవి. ఆ గ్రామంలోని వాళ్లంతా ప్రాణాలు తప్పించుకొని కాళా గ్రామం చేరుకొన్నారు. గ్రామం సర్వ నాశనమై పోయింది. అది చూచిన తరువాత కాళా మొదలైన వాళ్ళు రెండు మూడు రోజుల్లోనే మన గ్రామం వంతు అని నిశ్చయించుకొన్నారు. పెద్ద పులి నెత్తురు రుచి చూచింది. ఇక రోజూ అల్లరి తప్పదని నిశ్చయించు కొన్నారు. యువకులు కత్తులూ కటార్లతో తయారుగా వున్నారు.

మొదట కాళా గూడా లూటీల ముఠాలో చేరవలెననుకొన్నాడు, కాని రాజు ఉపదేశంతో ఆ అభిప్రాయం మార్చుకొన్నాడు. వాళ్లను ఆకలితో భగవంతుడు చంపుతున్నాడు, ఇక మనం గూడా ఆ పని ఎందుకు చేయ వలెనని దండు వచ్చినా తానెవరిమీదా చెయ్యి జేసుకోగూడదని నిశ్చ యించుకొన్నాడు. ఆకలి స్వరూపాన్ని తాను కొండల్లో స్వయంగా చూచి వున్నాడు.

ఒక రోజు రాత్రి అదే విషయాన్ని బేచాత్ వగైరాలు కూర్చొని చర్చించు కొన్నారు.

"ఆకలి దండ్ల మీద శత్రుత్వం లేకపోయినా ఆత్మరక్షణ మనం చేసు కోవాలి. మా కుటుంబానికి రోజూ పది శేర్లు ధాన్యం కావాలి. అంతా లూటీ అయిపోతే మన గతి ఏమిటి?" అన్నాడు బేచాత్.

రెండో రోజు రాత్రి జనమంతా కాపలా కాస్తూనే వున్నారు. ఇంతలో గ్రామానికి ఉత్తర దిశన తుపాకీ కాల్చిన చప్పుడయింది.

దండు రాబోతున్నదని తెలిసిపోయింది. ఊరంతా గందరగోళం ప్రారంభమయింది. ఎక్కడి వాళ్ళు అక్కడ తమ సామాన్లు సర్దుకొన్నారు. అయినా సర్దుకొనడానికి అవకాశమేది? అంతా భయభ్రాంతులైనారు. ఏమవుతుందో, ఏమి వుంటుందో, ఏమి పోతుందో ఎవ్వరికీ తెలియడంలేదు. ఆడవాళ్లు చెప్పేది మగవాళ్లకు అర్థం గావడం లేదు. మగవాళ్ళు చెప్పేది ఆడవాళ్లకు బోధపడడం లేదు. పిల్లలు లెఖ్ఖలోనే లేరు. అసలీ పిల్లలే ఆ పూట అందరికీ భారంగా కనబడుతున్నారు.

బేచాల్ కొంతమందిని వెంటబెట్టుకొని ఉత్తర దిశకు పరుగెత్తాడు. శత్రువుల్ని జాగ్రత్తగా ఎదుర్కోవాలి. దండులో చాలామంది ఉంటారు. ప్రాణాలకు తెగించి వుంటారు.

వెన్నెల గుడ్డి గుడ్డిగా వున్నది. తేనెటీగలు ముసరినట్లు జనం ముసిరారు. రకరకాలుగా కేకలు వేస్తున్నారు. భలీని, కంకునూ, ఇంకా కొంత మంది ఆడవాళ్లనూ కాళా బలవంతంగా ఒకచోట కూర్చోబెట్టాడు. ఉన్న ధాన్యాల్ని, పాత్రల్ని పెంటపోగులో దాచిపెట్టాడు. ఇంట్లో ఏమీ లేదని చెప్పమన్నాడు. ఎక్కడి వారక్కడ కూర్చున్నారు. అంతా గడగడ పోతున్నారు. భర్తలు భార్యల్ని పలకరించడం లేదు. భార్యలు పిల్లల్ని వదిలేశారు. పిల్లలు ఏడుస్తున్నారు. అటు ఇటు పరుగెత్తుతున్నారు. తల్లుల వెనక వెనక నక్కి నక్కి కూర్చుంటున్నారు.

దోపిడీ జరగక పూర్వమే రణఛోడ్ ముఖియా దివాలా తీసిన వాడి లాగా కూర్చున్నాడు. మాలి నగల మూట తీసుకొని ఎక్కడికి పోయిందో తెలియదు. నానా భార్య కుంటిది అటూ ఇటూ పరుగెత్తుతున్నది. భలీ గుండెలు బాదుకొని ఏడుస్తున్నది. రణఛోడుడూ నానా ఇద్దరూ ముసలి దాన్ని వెతకలేక చస్తున్నారు. నగలన్నీ ముసలిదాని దగ్గరే వున్నవి.

నానాకు వొళ్లు మండింది. రణఛోడుణ్ణి ఒక్క గుద్దు గుద్ద బోయాడు. "నగల మూటలోనుండి ఒక్క నగ పోయినా జాగ్రత్త!" అని అన్నను హెచ్చరించాడు.

ఎవరికీ ఏమీ తోచడం లేదు. దండు గ్రామంలో ఇళ్ళల్లోకి ప్రవేశించింది. ఇళ్ళ తలుపులు పగిలిపోతున్నవి. కిటికీలూ, కిటికీ తలుపులూ బద్దలు బద్ద

లైనవి. కొంతమంది గుడ్డలు పోగు చేసుకొంటున్నారు. కొంతమంది పాత్రలు పోగు బెట్టుకొంటున్నారు. దండులోని జనం పెరుగు, పాలు, పిండి, ధాన్యం ఏది దొరికితే అది తాగుతున్నారు. బొక్కుతున్నారు. తిన్నది తిని మిగిలినదాన్ని మూట గట్టుకొంటున్నారు.

కాళా ఇల్లు ఊరికి పశ్చిమదిశలో వున్నది. కాళా తన ఇంటి ముందున్న వేప చెట్టుకింద నిలబడి చూస్తున్నాడు. రామా, నాథా, ఇద్దరు ముగ్గురు నవయువకులూ కాళా పక్క నిలబడి వున్నారు.

"ఏమిటి ఆలోచన?" రామా అడిగాడు.

కాళా నవ్వాడు. "వాళ్ళను ఎదుర్కొందామా? ఎదుర్కొంటే ప్రమాద మున్నది" అన్నాడు.

"నీ యింట్లో మంగళా వున్నాడు. బహుశా వాడు నీ యిల్లు లూటీ కానివ్వడు. అందువల్లనే నీవు నిశ్చింతగా వున్నా" వన్నాడు రామా.

"మంగళాకు తెలియకుండానే ఈ దివిటీలు వచ్చినవి" అన్నాడు కాళా.

"వయస్సులో వున్న మనం దండును ఎదుర్కొనవలసిందే" అన్నాడు నాథా.

రామా ధోవతి పైకి బిగించాడు. "నీ అభిప్రాయమేమిటి కాళా?" అన్నాడు.

"మీరు ముందు పదండి. నేను తరువాత వస్తా" నన్నాడు కాళా. రామా, నాథాలు పరుగెత్తారు. కాళా తలగుడ్డ విప్పాడు. ధోవతి బిగించి ధనుస్సూ, కత్తీ తీసుకొని కోతిలాగా వేపచెట్టు ఎక్కి కూర్చున్నాడు. రెండు వైపుల నుండీ ఆ సందులోకి దండు ప్రవేశించింది. దండువాళ్లు ఎవరికి ఏ యిల్లు అనుకూలంగా వుంటే ఆ యింట్లో దూరుతున్నారు. పది పదిహేను మంది కాళా యింట్లోకి దూరారు.

కాళా యింటి తలుపు మొదటనే తెరవబడి వున్నది. మంగళా పక్క నున్న అరుగుమీద కూర్చొని వున్నాడు. వాడు గుంపును చూచి ఏడవడం ఆరంభించాడు. "ఇంట్లో ఏమీ లేదు. నేనే ఆకలితో మాడుతున్నాను. నన్ను గూడా మీతో తీసుకొని పోండి" అని వాడు ఏడుస్తూనే అరుస్తున్నాడు.

కాని ఆ యుక్తి ఏమీ పని చేయలేదు. మంగళా మాటలు ఎవడు వింటాడు? గుంపు ఇంట్లోకి పోనే పోయింది. కాళా నెత్తురు వేడెక్కింది. తన యింట్లోకి దండు ప్రవేశించింది. తాను చెట్టు దిగాలా వద్దా? ఆలోచనలో పడ్డాడు.

తాను ఉన్న ధాన్యాన్ని మూటలు గట్టి పెంట పోగులో దాచిపెట్టి వున్నాడు. గుడ్డలన్నీ మూట గట్టి వేపచెట్టు కొమ్మకు పైన కట్టివేశాడు. వంటిల్లు, స్నానాల గదీ నెలల తరబడిగా ఉపయోగంలో లేనట్లు చేసిపెట్టాడు. కాని వాలా పటేలు కొడుకుననే అహం అతణ్ణి ప్రేరేపిస్తూనే వున్నది. కత్తి వరలో నుండి తీసి కిందికి దూకి జనంలో తాను గూడా కలిశాడు.

మంగళా కాళా యింటి అరుగుమీదనే వున్నాడు. కాళా అతనికి ఇదివరలోనే చాలా యుక్తులు నేర్పి వున్నాడు. కాని ఆ భూతాలను చూడగానే మంగళా అన్నీ మరచిపోయాడు.

"ఏమిరా మంగళా!" అని ఒక వ్యక్తి మంగళాను సమీపించాడు. అతణ్ణి కాళా గుర్తించాడు. అతడు కనకా. కాని మంగళా తన మామను గుర్తించలేదు. పడ్డ దూడలాగా వుండే కనకా ఎక్కడ? ఈ శవమెక్కడ? కొద్దిసేపటికి మంగళా కనకాను గుర్తించాడు. ఏడవడం ప్రారంభించాడు. కాళాకు మంగళా మీద కోపం వచ్చింది. వీడెందుకు ఏడుస్తున్నాడు? వాళ్ళిద్దరూ మాటల్లో పడితే ఏమి ప్రమాదమౌనని నెమ్మదిగా కనకాను ఇంట్లోకి పిలిచాడు. వాణ్ణి అటు ఇటు తిప్పి ఇంట్లో ఏమీ లేదే అని వాణ్ణి నెమ్మదిగా ఇంకొక యింటికి పంపించే యత్నం చేశాడు.

కనకా అటు ఇటు చూచాడు. ఆడవాళ్ళు ఆ యింట్లో ఏమీ లేదన్నారు. కాళా నెమ్మదిగా జనంలో కలిశాడు.

ఒక్క గుడ్డ అయినా తనకు కావలెనన్నాడు కనకా. "కొంత ధాన్యం పోగుచేశాను. మూటకు గుడ్డ కావాలి" అన్నాడు. మంగళా ధోవతిచ్చి తిరిగి మంగళాను పంపించే షర్తుపై మంగళాను గూడా కనకా వెంట ఫంపుతా నన్నాడు.

నెమ్మదిగా ఆ గుంపు ఆ సందు దాటింది. కనకా గూడా ఊరు వదలమని సంకేతంగా తుపాకీ కాల్చడం కొరకై వూరి బయటకు బయలుదేరాడు. ఆ గుంపు పోగానే దివిటీలతో ఇంకొక గుంపు ఆ వీథిలోకి ప్రవేశించింది. కాళా తొందరగా ఇంట్లోకి పోయి మంచెమీద దాక్కున్నాడు. గుంపు కాళా యింట్లోకి ప్రవేశించింది. ఏవేవో వస్తువుల్ని పగలగొట్టింది. కొద్దిసేపైన తరువాత గుంపు ఇంటి బయటికి పోయింది. మంగళా "తిరగలి తీసుకొని పోవద్దు. నేను కనకా మేనల్లుణ్ణి" అని వాళ్ళవెంట బడ్డాడు.

కాళా గండు పిల్లిలాగా మంచెమీద నుండి కిందకు దూకాడు. తిరగలి తీసుకొని పోనివ్వ గూడదనుకొన్నాడు.

కాని ఆ గుంపు మంగళా మాటను మన్నించింది.

"నీవు మా వాడివేనా?" అని తిరగలిని నాథా యింటిముందు పడ వేసింది. మంగళా తిరగలి మీద కూర్చున్నాడు.

కాళా ఇంటి బయటకు వచ్చేటప్పటికి ఆ వీథిలో రెండు మూడు దివిటీలు మాత్రమే వున్నవి.

ఇంతలో వూరు బయటనుండి తుపాకీ పేలిన శబ్దం వినిపించింది. దండు వాళ్లు వూరు విడిచి వెళ్లారు. కాని రెండు నీడలు దివిటీలు లేకుండానే వెనకకు ఎందుకు వస్తున్నవి? కాళా ఆశ్చర్యపడ్డాడు. లేచి తలుపు వెనకగా నిలబడ్డాడు. ఒక చేతిలో కత్తి వున్నది. గడప మీదకు రాగానే ఒక నీడను చెయ్యి పట్టుకొన్నాడు. ఆమె ఒక స్త్రీ.. కాళా సిగ్గు పడ్డాడు.

మళ్లీ ఇంకొక తుపాకీ పేలిన శబ్దం వినిపించింది. దండు వెళ్లిపోయింది.

జనమంతా మళ్లీ గ్రామంలోకి వచ్చారు. తమ తమ యిళ్లు ఏ స్థితిలో వున్నవో చూచుకొంటున్నారు.

"బేచాత్! ఎక్కడున్నావు ఇంత సేపు?" అన్నాడు ఎగతాళిగా కాళా.

ఆ తరువాత చాలా సేపు దివిటీలు నది దగ్గర నిలబడ్డవి. బహుశా సారాయి దుకాణం లూటీ అవుతున్నదను కొన్నారు జనం.

ఆ తరువాత దివిటీలు దూర దూరంగా పోవడం ఆరంభించినవి. ఏదో పాట గూడా వినబడుతున్నది.

"భాయీ యా సప్నే తే కాల్ హె పడ జ్యో రే అలఖా భరోడ్
భూఖజ్యే దార్డ్యో పీధో హే రే
మయ తో గాంమత్‌జ్యో వాలయో హే రే అలఖా భరోడ్
మయ తో కుణ్ హే రోకణ్‌వాలో రే"

కరువు వచ్చింది. ఆకలితో వున్న వాళ్లు సారాయి తాగండి. మేము నడుం బిగించాము. మమ్మల్ని ఎవరు ఆపగలరు?..

ఆ పాటలోని మాటల కర్థ మేమిటి? ఏమీ లేదు. వినడానికి పాట మధురంగా వున్నది. భిల్లులు అదృశ్యమైనారు. ఈ పర్వతా లెటువంటివో ఈ భిల్లులు గూడా అటువంటి వారే అనుకొన్నారు కాళా మొదలైనవారు.

ప్రపంచంలో దుఃఖ పీడితులు నిజంగా భిల్లు లే.

34

## మాలి మృత్యువు

శత్రుసైన్యం గ్రామంలో ప్రవేశించి కొల్లగొడితే ఎలా వుంటుందో ఆ గ్రామం అలా తయారయింది. కొట్లూ, ఇళ్ల తలుపులూ అన్నీ పగిలి వున్నవి. పాలు పెరుగుకుండలూ, వంటపాత్రలూ అన్నీ ముక్కముక్కలై వున్నవి. ఇళ్ళల్లో మంచెలన్నీ నేలపాలైనవి. దండువాళ్లు చేతికి ఏది దొరికితే అది తీసుకొని వెళ్ళారు. తిరగళ్లు, రోకళ్లు అన్నీ మాయమైనవి. ఊళ్లో వస్తువులు పోకుండా మిగిలినవాడు కాళా వొక్కడే. సర్వనాశనమైన వాళ్ళు రణఛోడ్, నానాలు.

దండు జనం నానాయింట్లో పెట్టెలన్నీ పగలగొట్టారు. ఇంట్లో ఒక్క వస్తువు మిగల్చలేదు. నాలుగు గేదెల్నీ తీసుకెళ్ళారు. రాగి పాత్రలు, ఇత్తడి బిందెలు, రోకళ్లు, తిరగళ్లు ఏమీలేవు.

కుంటిదాని వొంటిమీద గుడ్డపేరుతో ఒక చిన్న పేలిక మాత్రం మిగిలింది. ఇదంతా చాలదన్నట్లు నగలమూటతో మాలి కనబడలేదు. తెల్ల వారింది. ఊరు ఊరంతా గాలించారు. మాలి ఎక్కడికి పోయివుంటుంది? ఎవ్వరికీ ఏమీ తోచడంలేదు,

పది పదిహేను మంది మాలిని వెదకడానికి బయలుదేరారు. వాళ్ళల్లో కాళా గూడా ఉన్నాడు. వెదికి వెదికి విసుగుజెందారు. నానా అసలు ఆశ వదులుకొన్నాడు. బహుశా దొడ్డిదోవగుండా పరుగెత్తి కొండమీదికి పోయి వుంటుందని కాళా విశ్వాసం. ఆ కొండమీదకు అందరూ వెళ్ళారు.

ఏ క్రూరజంతువు నోటిలోనైనా పడిందా? ఏమైంది? ఎవ్వరికీ అంతు బట్టలేదు. ఏమైనా మాలి బతికిలేదని అందరూ నిశ్చయించుకొన్నారు.

చివరికి అంతే అయింది. ఒకచోట రెండు పెద్ద పెద్ద రాళ్ళమధ్య మాలి శవం కనిపించింది. మాలి చచ్చినట్లు నిశ్చయమైపోయింది. నానా నగల మూట కొరకై వెదకడం ఆరంభించాడు. మాలి శవం కనపడి నగల మూట కనబడకపోతే తన మీది కొస్తుందని కాళా నానాను తన వెంటనే వుంచుకొన్నాడు. నగ్నంగా వున్న మాలి శవం మీద కాళా తన తలగుడ్డ తీసి కప్పివేశాడు. చివరికి ఈ మాలికి ఎటువంటి స్థితి ఏర్పడింది!!

"నానా! తెలివిగా వ్యవహరించు. ఆమె వొంటి మీద గుడ్డ గూడా దండు వాళ్లు వదలలేదు. నగలమూట వదులుతారా? ఆమె శరీరం మీద గాయాలు చూడు. ఆమెను ఎంతదూరమో నేలమీద పడవేసి ఈడ్చారు. పాపం ఆ జీవి ప్రాణాలు వదిలినప్పుడు ఎంత బాధ పడిందో" అన్నాడు.

వార్త గ్రామమంతా వ్యాపించింది. చచ్చిన మాలి కొడుకులకు కోడళ్ళకు గూడా శత్రువురాలుగా కనిపించింది. "చచ్చింది చావడమే గాక ఇంట్లో వాళ్ళనందరినీ చంపింది" అన్నారు. ఇంట్లో ఒక్క నగ కూడా మిగిలించ లేదు.

"స్మశానంలో శవంమీద వేయడానికి గుడ్డ గూడా లేదు. ముసలి దాని గతి చూడు" అని అందరూ ఆశ్చర్యపడ్డారు.

నీళ్ళు తెచ్చే ఆడవాళ్ళంతా ముసలిదానికి సంభవించిన దుఃఖస్థితిని గురించి అనేక విధాల చెప్పుకొన్నారు. మాలి కర్మకు ఇంట్లో ఏమీ లేదు. పిండ ప్రదానానికి గూడా ఒక్క గింజలేదు.

రణఛోడుడు చాలా దుఃఖ పడ్డాడు. నిన్నటి దాకా రాజభోగంగా వున్న తన యిల్లు ఈరోజు ఈ స్థితికి మారింది. భోరు భోరున ఏడ్చాడు. రెండెద్దులు మాత్రం మిగిలినవి. రణఛోడుని భార్య ఆ ఎద్దుల్ని గూడా వదిలి పెట్టింది. వాటికి మేత ఏది?

"తుపాకీ పేలగానే ధాన్యం వగైరాలు జాగ్రత్త చేసుకొంటే బాగుండేది" అన్నాడు కాళా.

"అన్నీ మూటలు గట్టి పెట్టాము. దాచి పెట్టేవాళ్లమే. ఇంతలో ఈ ముసలిదాని పీడ పట్టుకొన్నది. దాన్ని వెదకడంలో ఈ గతి పట్టింది" అన్నాడు రణఛోడుడు.

శవాన్ని చితిమీద పెట్టిన తరువాత నోట్లో ఏమైనా వస్తువు పెట్ట మన్నారు.

"వెండి వుంగరం గూడా మిగల్చలేదు ముసలి ముండ" అన్నాడు నానా. కాళా వెంటనే తన చేతి వుంగరం తీసి ముసలిదాని నోట్లో పెట్టాడు.

"జీవితమంతా కాళాను ముసలిది తిట్టి పోసింది. చివరికి కాళా వుంగరమే దానికి గతి అయింది" అన్నారు కూర్చున్న వాళ్లు.

స్మశానంలో పొగాకు గూడా లేదు. శంకర్ ఇంటి నుండి తెప్పించారు.

శవ దహనం పూర్తి కాగానే అంతా స్నానం చేసి ఇంటికి వచ్చారు. రణఛోడుడు నానా వెక్కి వెక్కి ఏడ్చారు. నవమాసాలు మోసిన తల్లి పోవడం వొకటి, నగలన్నీ పోవడం ఇంకొకటి. రెండు బాధలు ఏర్పడ్డవి.

నగలు పోయినందుకు వాళ్లు మరీ ఏడ్చారు.

లోకాచారం ప్రకారం కొంచెంసేపు కోడళ్ళు కూడా ఏడ్చారు. కాని కుంటి కోడలు మాత్రం "ఒక్క నగ అయినా పెట్టుకోనివ్వ లేదు ముండ" అని నానా తిట్లు తిట్టింది అత్తను.

నానా మనస్సులోనే తన కుంటి భార్యను సమర్థించాడు. జనం అంతా మాలి మృత్యువును గురించీ, మాలిని గురించి రకరకాలుగా ఆలోచించారు.

విధి వ్రాతను ఎవరు తప్పించగలరు?

చెయ్యిమీద చెయ్యివేసుకొని కూర్చున్న రణఛోడుని యింట్లో వాళ్లకు ఉదయపు భోజన చింతలేదు గాని ఆ చింత గ్రామంలోని వాళ్లకు ఏర్పడింది. శంకర్ కోదర్ వగైరాలు కలసి మజ్జిగతో ఆ రోజు ఆ యింట్లో వాళ్లకు భోజనం ఏర్పాటు చేయించారు.

రణఛోడుని అస్థి – చరాస్థి – అంతా పోయింది. ఇంట్లో ఒక్క ధాన్యపు గింజలేదు. డేగడియా గ్రామం నుండో, షేర్‌పూర్ నుండో అతడు ధాన్యం తెప్పించుకోగలడు. కాని ఆ ధాన్యం వాళ్ల యింటికి చేరేదెలా? దోవలో ఎక్కడ లూటీ అయిపోతుందో తెలియదు.

కాళా దగ్గర కొంత ధాన్యమున్నదని మాటల్లో మాటల్లోనే తేలింది. శంకర్ దగ్గర కొంత గోధుమ వున్నది. గ్రామంలో మిగిలిన రైతుల దగ్గర ఒక్కరి దగ్గర మణుగుంటే ఇంకొకరి దగ్గర నాలుగు శేర్ల ధాన్యము వున్నది. నిజానికి దాడి జరగక పూర్వమే ఆ వూళ్లో చాలామంది యిళ్లల్లో గింజలు నిండుకొన్నవి. చింతచిగురూ, మోహూచెట్టు బెరళ్లూ తిని వాళ్లు కాలక్షేపం చేస్తున్నారు.

కాళా ఆలోచించి తన యింట్లో నుండి పది శేర్ల ధాన్యం తెచ్చి రణఛోడుడికి యిచ్చాడు. నానాకు ఆ ధాన్యం తీసుకొనడం యిష్టం లేదు. కాని ఏమి చేస్తాడు? తను వొద్దంటే ఇల్లు గడిచేదెలా? తమకు ధాన్యం యిచ్చే వాళ్లెవరున్నారు? కాళా జీవితాంతం తనను దెప్పుతాడని కొంత సేపు నసిగాడు నానా.

నానా సంగతి కాళాకు గూడా తెలుసును. మూడో రోజు ఇంకొక పది శేర్లు సహాయం చేశాడు. నీవు సహాయం చేస్తున్నావని కృతజ్ఞత వెల్లడించాడు రణఛోడుడు. "మన తల్లిదండ్రులు వేరు గాని మన తాత వొక్కడే గదా? ఈ భూమి మన తాతది గదా? అందువలన నీవు ఏ మాత్రమూ సందేహించ వద్దని" కాళా రణఛోడుడితో అన్నాడు. నిజానికి ఆ మాటలు నానాకు నచ్చజెప్పడానికి అన్నమాటలే.

నానాకు ధాన్యం తీసుకొనడం ఇష్టంలేదని రణఛోడుడికి తెలుసును.

అయితే ధాన్యానికి ధరగట్టి డబ్బివ్వమని గూడా తమ్ముడికి సలహా చెప్పాడు.

ఒక రోజు కూడా రణఛోడుడు "కాళా! నీ దగ్గరున్న మొత్తం ధాన్యం నాలుగు మణుగులు. నీవు ఈ విధంగా మాకు ధాన్యమిస్తే మీ యిల్లు గడిచేదెలా?" అని అన్నాడు.

"అది నిజమే! మా యింట్లో నేను భలీ ఇద్దరమే వున్నాము. మీరు మృత్యు ముఖంలో ఉన్నారు. ఆమాత్రం సహాయమైనా చేయకపోతే నేనెందుకు?" అన్నాడు కాళా. రణఛోడుడు కళ్లవెంట బొట బొట కన్నీరు కార్చాడు. "కాళా! ఇక వద్దు. మా కొరకై నీవు కష్టంలో పడవద్దు" అన్నాడు.

"అంతమాత్రానికే మేము ఆకలితో చచ్చిపోతామా? భిల్లులు మాత్రం బ్రతకడం లేదా? అట్లాగే మనం గూడా" అన్నాడు కాళా. కాళా మాటల్లో ఆత్మ విశ్వాసం తొణికిసలాడుతున్నది.

రణఛోడుడు కాళాను చూస్తూ అలాగే వుండిపోయాడు. అతనికి ఏవేవో ఆలోచనలు వచ్చినవి. "భిల్లుల సంగతి ఎందుకు ఎత్తుతావు? వాళ్ల లాగా మనం పశువుల్ని చంపుకొని తింటామా? అది అధర్మం గదా? అది గాక ఆ పశువులైనా మన దగ్గర ఎక్కడున్నవి? అందరికీ ధాన్యం పంచి పెట్టడానికి నీవేమీ షావుకారువు కావు" అన్నాడు రణఛోడుడు.

"దేశమంతటా కరువు వచ్చేటట్లున్నది. మార్గం ఆలోచించు" అని గూడా అన్నాడు రణఛోడుడు.

"మార్గం నాకు గూడా ఏమీ తోచడం లేదు. నిజంగా ఆకలి బాధ ప్రారంభమయితేనే గాని మార్గం గూడా తోచదేమో!!" అని కొంచెంసేపు కాళా ఆలోచనలో పడ్డాడు. "అయినా ఆకలికి మన కుటుంబమంతా చచ్చి పోతుందనే వూహ నా బుద్ధికి కలగడం లేదు. ఏమైనా ధైర్యంగానూ, జాగ్రత్తగానూ గూడా వుండాలి. ఆకాశాన్ని ఛేదించి అయినా ధాన్యం తేగలననే నమ్మకం నాకున్నది" అన్నాడు కాళా.

"ఎంత ధైర్యమున్నా ఏమి లాభం? సగం కుటుంబం ఆకలికి చావడానికి సిద్ధంగా వున్నది. ఆకలి ఆకలి అని గ్రామమంతా అలమటించి పోతున్నది."

రణఛోడుడు నానాను పిలిచి "నానా! కుంటి మరదలు ఇంట్లో నానా గందరగోళం చేస్తున్నదట. తిండి తిండి అని ఒకటే గోలట. పెద్దవాళ్లకు

ఒకరొట్టె చిన్నవాళ్ళకు అర రొట్టె ప్రకారం పంచుకొని తింటేగాని తిండి సరిపోదు. మీ వదిన ఆ కట్టడి జేసింది. అది యిష్టం లేనివాళ్లు తమదోవ తాము చూసుకొనడం మంచి'' దన్నాడు.

నానా ఏమీ మాట్లాడలేదు.

ఇంకొక రోజున కుంటిది పచ్చి ధాన్యమే బొక్కడం ఆరంభించింది. రణఛోడుని భార్యకు ఎదురు తిరిగింది. ''మీ పెత్తనం మాకు వద్దు. నీవు రెండు రొట్టెలు తిని మాకు వొక్కటే యిస్తున్నా'' వని రామ రావణ యుద్ధం చేసింది. నానా కుంటి భార్యను సమర్థించాడు.

ఒక్కవాళ్ళ యింట్లోనే గాదు. గ్రామంలో ప్రతి యింట్లోనూ ఇటు వంటి తగాదాలే బయలుదేరినవి. కాళా యింట్లో కూడా భార్యా భర్తల మధ్య తగాదా ప్రారంభమయింది. ఆహారం తగ్గిస్తే శరీరం తగ్గుతుంది. పెంచితే శరీరం పెరుగుతోందని కాళా భలీకి హితోపదేశం చేయడం ప్రారంభించాడు.

''మీ అన్నలకూ తమ్ములకూ ధాన్యం పంపకం చేసి నన్ను ఆకలితో చంపుతున్నా'' వని భలీ విరుచుకొని పడింది.

నిజానికి అంత మాట భలీ కాళాను ఎప్పుడూ అనివుండలేదు. ''నే నెవరినీ చంపడం లేదు. తిండి తిండి అని అస్తమానం రొద చేస్తూ వుంటే చివరికి ఆ తిండి బాధతోనే చచ్చిపోతావు. లోకమంతా ఏ స్థితిలో వున్నదో గూడా ఆలోచించాలి'' అంటూ కాళా బయటికి వెళ్ళాడు.

గ్రామం గ్రామమంతా ఆకలికి అలమటించి పోతున్నది. ఎవరికీ ఏమీ ఉపాయం తోచడం లేదు. జనం తమ గ్రామాలనూ, పొలాలనూ గూడా వదలి ఇతర గ్రామాలకు వలసపోవడం ఆరంభించారు. ఎవరు ఎక్కడికి వెళ్లుతున్నారో ఎవ్వరికీ తెలియడం లేదు. స్మశానం చేరుకొంటున్న వారి సంఖ్య మాత్రం రోజు రోజుకూ పెరిగిపోతున్నది.

ఆకలి వలన చచ్చిపోవడమనే మాట అర్థం గాదన్న కాళా ఇంట్లోకి గూడా ఆకలి దేవత ప్రవేశించింది. కాళా ఇంట్లో రెండు రోజులకు సరి పోయే గింజలు మాత్రమే మిగిలినవి. కాళా అరుగుమీద కూర్చొని పళ్లు కుట్టుకుంటూ ఆలోచనలో పడ్డాడు. తమ గ్రామంలో కోమటి కొట్టు పెద్ద దేమీ లేదు. మిర్చి వ్యాపారం చేసే కాసిమ్ ఇల్లు లూటీ అయిపోయింది. గ్రామం వదలక తప్పదనే నిశ్చయానికి వచ్చాడు. దేగడియా గ్రామం

మంచిదనీ, అక్కడ ఏదో విధంగా కాలం గడపవచ్చుననీ నిశ్చయించు కొన్నాడు.

కాళా సలహాను రణఛోడుడు నానా వగైరాలు గూడా అంగీకరించారు. కోదర్, శంకర్లు గూడా సరేనన్నారు. అంతా ప్రయాణమైనారు. సామాన్లు సరిజేసుకొనడం ప్రారంభించారు.

ఏమేమి సామాన్లు తీసుకొని పోవాలి? కాళా ఆలోచనలో పడ్డాడు. మంచాలు, తుపాకీ, తిరగలి, పాత్ర సామాను అనేకమున్నవి. సామగ్రి నంతా మంగళా మామ కప్పగించి మంగళాను ఇంట్లో అట్టి పెట్టి వెళ్లుదా మనుకొన్నాడు. అయినా చాలా వస్తువులు ఎవ్వరికీ కనబడకుండా వుండేటట్లుగా దాచిపెట్టాడు. ప్రయాణ సన్నాహంలో ఉన్నాడు.

రణఛోడుడు ఒక వార్త తెచ్చాడు.

"రేపు ఉదయం రెండు మూడు ధాన్యం బళ్లు మన వూరికి వస్తున్నవి" అని ఆ వార్త. "ఆ బళ్ల వెంట తుపాకులతో సిపాయీలుంటారు. ఆ బళ్ల మీద ఎవరైనా చెయ్యి వేస్తే-ఆ సిపాయీలు తుపాకులు పేలుస్తారు."

రెండో దినం బళ్లు రానే వచ్చినవి. బళ్ల మీద ధాన్యపు బస్తాలున్నవి. సిపాయిలు వుండనే వున్నారు.

కాళా పళ్లు కుట్టుకుంటూ ఆలోచనలో పడ్డాడు. అతని పళ్లల్లో నుండే గాక అతని కళ్లల్లో నుండి గూడా రక్తం వర్షించడం ఆరంభించింది. ధాన్యం లేక గ్రామాలన్నీ స్మశానంగా మారిపోతూ వుంటే తిలక్ చంద్ వ్యాపారం చేసి-డబ్బు సంపాదిస్తున్నాడు! అతడు చేస్తున్న పనిలో న్యాయమేమున్నది? ధాన్యం మనం పంపించిందా? మనం ఆకలికి చస్తూ వుంటే మన కళ్ల ముందు నుండి ధాన్యం తీసుకొని పోతాడా? ఆ బళ్లలోని ధాన్యం లభిస్తే గ్రామం గ్రామమంతా నెల రోజులు బ్రతుకుతుంది. ఆ పని చేసి తీరాలి. వాలా పటేలు కొడుకు గాకపోతే ఆ పని ఇంకెవరు చేస్తారు? వాలా పటేలు కాళాకు కళ్ల ముందు కన్పించినట్లయింది. "కాళా! రక్తం ధార బోసి అయినా సరే, ధాన్యం బళ్లను వూళ్ళో నుండి పోనివ్వకు. నిలబడు" అని బోధిస్తున్నట్లనిపించింది.

కాళా లేచి నిలబడ్డాడు. ఇంట్లోకి పోయి తలగుడ్డ చుట్టుకున్నాడు. ధనస్సూ, బాణాలూ తీసుకొని ఊరి బయటకు బళ్ళదగ్గరికి బయలుదేరాడు. ఊరి బయట మర్రిచెట్టు కింద బళ్ళున్నవి.

భోజనాలు పూర్తి చేసుకొని బళ్ళవాళ్ళు బళ్ళుకట్టే ప్రయత్నంలో ఉన్నారు. ఇద్దరు సిపాయీలు హుక్కా తాగుతున్నారు. ముసలి సిపాయి కాబూలీ యముడులాగా కొంచెం దూరంగా వున్నాడు.

కాళా బళ్ళదగ్గరకువెళ్ళి "ఎక్కడికి బళ్ళు పోతున్నవి ?" అని అడిగాడు.

"తుమ్ కౌన్ హో ?" ముసలి కాబూలీవాడు ప్రశ్నించాడు. "ఈ ఊరికి ముఖియాను" అన్నాడు కాళా.

"ముఖియాను ఇప్పుడే కలిశాను. నీవు ముఖియావు కావు" అన్నాడు కాబూలీవాడు.

కాబూలీవాణ్ణి చూడగా చూడగా కాళా శరీరం కంపించడం ఆరంభించింది. అయినా తనలో తాను గట్టి నిర్ణయం చేసుకొన్నాడు - "ఏమైనా సరే, ధాన్యం వూరు దాటగూడదు" అనుకొన్నాడు.

"ముఖియా మా పెద్దన్న. ఈ బళ్ళు ఈ వూరు దాటగూడదు" అన్నాడు కాళా.

క్షణకాలం సిపాయీలు ఆ మాట విని ఆశ్చర్యపడ్డారు. ముసలి కాబూలీ నవ్వుతూ "ఈ బళ్ళు ఎవరివో నీకు తెలుసా ?" అన్నాడు.

"తెలుసు తలక్‌చంద్‌వి." తలక్‌చంద్‌కు ప్రభుత్వం వారి సహాయం వున్నదని గూడా తెలుసు. అతని ముందు ఠాకుర్ మాట గూడా సాగదని తెలుసు. అయినా ఈ బళ్ళు ధాన్యంతో ఈ వూరు దాటడానికి వీలులేదు" అన్నాడు కాళా దృఢంగా.

కాబూలీ వాడు లేచి నిలబడ్డాడు. కాళాను పై నుండి క్రిందికి తేరిపార జూచాడు.

"బళ్ళు ఆపడానికి నీవెవరు ?" అన్నాడు.

కాళా కొంచెం భయపడ్డాడు. అయినా ధైర్యం తెచ్చుకొన్నాడు.

"బళ్ళు నడపండి" అని గద్దించాడు కాబూలీ. బళ్ళు సాగినవి.

కాళాను ఉద్దేశించి "నీ మంచికి చెపుతున్నాను. దోవకు అడ్డురావద్దు. అడ్డంవస్తే పచ్చినెత్తురు తాగవలసి వస్తుం" దన్నాడు కాబూలీ. కాబూలీ వాడి గడ్డం, చేతులు కంపిస్తున్నవి. ఈ లోపల శంకర్, కోదర్ రణ ఛోడుడు మొదలైన వాళ్ళంతా అక్కడికి చేరుకొన్నారు.

కాబూలీవాణ్ణి చూచి అక్కడ చేరిన్న వాళ్లంతా గడగడలాడి పోతు

న్నారు. కాళాను వారించడానికి గూడా వాళ్లకు సాహసం కలగడం లేదు. అయినా కోదర్, భగా ఇద్దరూ కాళా పక్షంలో నిలబడ్డారు.

"ధాన్యం వెళ్లడానికి వీలులేదు" అన్నాడు భగా.

అంతా తెగించి వున్నారని కాబూలీ అర్థం చేసుకున్నాడు. తానేమి చేయాలి ? తనను నమ్మి తలక్ చంద్ బళ్లను పంపించాడు. తాను లొంగు తాడా? తన పెద్దలు సంపాదించి పెట్టిన గౌరవమంతా మట్టిలో కలు స్తుంది అనుకున్నాడు. ముందుకు అడుగువేసి "నడపండి బళ్ళు" అన్నాడు.

దానిలో గుమిగూడిన జనం పక్కకు తప్పుకున్నారు. భగా, కోదర్లు రెండడుగులు వెనకకు వేశారు. ఒక్క కాళా మాత్రమే నిలబడి వున్నాడు.

"బళ్ళు పోవడానికి వీలులేదు" అన్నాడు కాళా.

"అయినా బళ్లవాళ్లు ఎద్దుల్ని అదిలించారు. చక్రాలు తిరగడం ఆరం భించినవి. కాళా బళ్లకు అడ్డం నిలబడ్డాడు.

కాబూలీ వాడి చేతిలోని తుపాకి ఏ నిమిషంలో పేలుతుందోనని జనం భయ భ్రాంతులై చూస్తున్నారు.

కాళా పర్వతంలాగా నిలబడి వున్నాడు.

"నీ ప్రాణాలు దక్కవు" అన్నాడు కాబూలీ.

"నీ తరం గాదు" అందుకున్నాడు భగా.

"అయితే నీవు గూడా రా" అన్నాడు కాబూలీ.

భగా లాఠీ తీసుకొని కాళా పక్కగా నిలబడ్డాడు. శంకర్ భగాను తప్పుకోమని బ్రతిమిలాడుతున్నాడు. కాళా గూడా లాఠీ చేతిలోకి తీసు కున్నాడు.

ఎద్దులు ఆగిపోయినవి. బళ్ళు కదలడం లేదు. ఢాం అని తుపాకి పేలింది. దుమ్ము ఆకాశానికి లేచింది. గిరగిరా తిరిగిపోతూ కాళా నేలమీదకు వొరిగాడు. కాని ఆ వూపులో ఎప్పుడు కాబూలీ వాడి దగ్గర వెళ్ళాడో తెలియదు. కాబూలీ వాణ్ణి కింద పడవేసి ఆతని గుండెల మీదకు ఎక్కి కూర్చున్నాడు. శంకర్, కోదర్, భగాలు కాళా చెయ్యి బట్టుకున్నారు. కాబూలీ వాడు కళ్ళు మూసుకొని లో లోపలనే ఏదో ఆనందం అనుభ విస్తున్నాడు.

కాబూలీ వాడి ముందు కాళా ఎంత ? అయినా కాబూలీ ఏమీ చెయ్యలేదు.

కాబూలీవానికి తన గుండెల మీద కూర్చున్న వాడు - పదిహేను

సంవత్సరాల క్రితం తనను వదిలి వెళ్లిన తన కొడుకు అనిపించింది. కాళా రూపంలో అతడికి తన కొడుకు కనిపించాడు. అదే చపలత్వం. అదే కోపం. అదే రూపు రేఖలు !!

ముసలి కాబూలీ వాని హృదయం ఆనందంతో నిండిపోయింది. తన గుండెలమీద మృత్యుదేవత కూర్చుని వున్నదనే విషయాన్ని గూడా అతడు మరచాడు.

కాబూలీ వాని ముఖం మీదా, గుండెల మీదా నెత్తురు చూచి రణఛోడుడు గడ గడలాడాడు. ఈ కాబూలీ చచ్చిపోతే గ్రామం మీద గుండ్ల వర్షం కురుస్తుంది. అని అతని భయం.

అసలు జరిగిందేమిటంటే – కాబూలీవాడు పేల్చిన గుండు కాళా చేతికి తగిలింది. మోచేతికి పక్కగా పెద్ద గాయమయింది. ఆ గాయంలో నుండి బొట బొట రక్తం కారుతున్నది. కాని ఆ విషయం కాళాకు తెలిసినట్లు లేదు. ఆ రక్తం కాబూలీ వాడి శరీరం మీద పడుతున్నది. కాళా కోదర్ చేతిని విదిలించివేశాడు.

"చెయ్యి చూచుకో. గుండు తగిలింది" అన్నాడు రణఛోడుడు. అప్పటికి గాని కాళాకు తన గాయం సంగతి తెలియలేదు. "ముందు ఈ భూతాన్ని కట్టివేయండి" అన్నాడు.

అంతా తలగుడ్డలు విప్పి కాబూలీ వాని చేతులు బంధించివేశారు. కాని ఇదేమిటి? కాబూలీ వాడి కళ్లు నిప్పులు కక్కడం మానివేసి కన్నీళ్ళు కారుస్తున్నవే? అతని పెదవులమీద ఆ చిరునవ్వేమిటి?

ముఖియా ఇంటికి పోవలసిన వాళ్లంతా-నానా రణఛోడుడి చెవిలో ఏదో వూదడం వలన కాళా యింటికి చేరుకొన్నారు.

గ్రామస్థుల అధైర్యాన్ని, పిరికితనాన్ని చూచి నిజంగానే కాళా పశ్చాత్తాప పడుతున్నాడు.

పెద్దలంతా నానా ఇంట్లో వేరుగా చేరారు.

"ఇక మనం ఏమి చేయాలి?" సలహా సంప్రతింపులు ప్రారంభ మైనవి

"ముందు మా సలహా తీసుకొన్నారా? మాకు ఈ విషయంలో ఏమీ బాధ్యత లేదు" అన్నాడు నానా.

అంతా ఆలోచనలో పడ్డారు. రణఛోడుడు ఒక సలహా చెప్పాడు.

"మనం ఈ కాబూలీవాణ్ణి సంతోషపెడదాము. లేకపోతే వ్యవహారం చెడుతుంది" అన్నాడు.

"మీ ఇష్టం" అన్నాడు శంకర్.

ఇద్దరు ముగ్గురు "అసలే ఆకలితో చస్తున్నాము. ఇంట్లో గిద్దెడు గింజలు లేవు. మనం ఎట్లా సంతోషపెట్టగలం?" అని అడిగారు. "ఏ గేదెనో, దూడనో ఇవ్వగలం" అన్నాడు ఇంకొకడు.

ఏమైనా కాళాకు మన ఉద్దేశ్యం చెపుదామనుకొన్నారు. కాళా ఇంటికి వెళ్ళి ఈ విషయం చెప్పారు.

అప్పటికే కాళా నిరాశజెంది వున్నాడు- "మీ దోవ మీది" అన్నాడు. ఆ విషయం అంతలో ఆగిపోయింది.

"మరి ఈ ధాన్యాన్ని ఏమి చేయాలి?" అని అడిగాడు కాళా.

అతని అభిప్రాయం అందరికీ అర్థమయింది.

"గుండు దెబ్బ తిన్నది. ధాన్యం వదలడానికి కాదు" అన్నాడు కాళా.

నలుగురూ మళ్లీ ఆలోచించారు.

ఏమైనా 'కాళా' ధాన్యాన్ని వదలడు. సిపాయిలను ఎదిరిస్తాడు. కనుక ఈ స్థితిలో కాళాను సమర్థించడమే మంచిదని నిర్ణయానికి వచ్చారు.

భగా నిలబడ్డాడు. "ఆకలికి ఎట్లాగో రేపో మాపో మనం చావక తప్పదు. ఆ పని ఈరోజే జరుగుతుంది. అందువలన మేము నీతోనే వుంటా" మన్నాడు కాళాతో.

నానా తప్ప అంతా కాళా పక్షంలో చేరారు. నానా ముఖం వేలవేసుకొని ఒక్కడూ తన యింట్లోకి వెళ్ళి కూర్చున్నాడు.

"ఇప్పటికైనా అవకాశమున్నది. ఇటువుండే వాళ్ళు వుండండి. లేని వాళ్ళు వెళ్లండి" అన్నాడు కాళా.

అందరూ కాళా పక్షంలోనే నిలబడ్డారు.

ఊళ్లో వున్న ఇళ్లు ఎన్నో లెఖ్ఖ వేశారు. ఆ ప్రకారం ధాన్యం ఎంతెంత పంచిపెట్టాలో గూడా తేల్చారు. అందరి ముఖాలూ ధాన్యం లభించగానే ఆనందంతో వెల్లి విరిసినవి. "కాళాకు రెండు భాగాలు ఇవ్వమ"న్నాడొకడు.

కాళా ఆపదలో నుండి బయటపడ్డాడు. అతని కుడిచేయి పనికి రాకుండా పోయింది.

తిరగళ్ళు తిరుగుతున్నవి. కొంతమంది పచ్చి ధాన్యమే బొక్కుతున్నారు. ఆ దృశ్యాన్ని చూచి కాబూలీ బొట బొట కన్నీళ్లు కార్చాడు. బీదతనాన్ని చూచి భరించలేక పోయినాడు.

తిరగలినుండి ఇంకా పిండి బయటకు రానేలేదు, రెండు ఘడియల్లో ధాన్యమంతా జనం పొట్టల్లోకి చేరిపోయింది.

అంతవరకూ కాబూలీ వాడివైపు ఎవ్వరూ చూడలేదు. ఆ తరువాత అతడి దగ్గరకు వెళ్లారు.

"మీరు భయపడకండి. మీ ప్రాంతంలో ఈనాటికి ఒక్క మగవాణ్ణి చూచాన"న్నాడు కాబూలీ. "ధాన్యం మీది. మీరు తీసుకొన్నారు" అని గూడా అన్నాడు.

"ఈ సంగతి మొదటే అర్థం చేసుకొంటే బాగుండేది గదా?" అన్నాడు భగా.

"నేను నౌకరును. నన్ను నమ్మి యజమాని పంపించాడు" అన్నాడు బూలీ.

"తలక్‌చంద్‌కు ఏమి జవాబు చెప్పుతావు?" అని అడిగాడు కోదర్.

"ఇక అతడికి నా ముఖం చూపించను" అన్నాడు కాబూలీ.

కాళాకు కాబూలీవాడి మీద ఇంకా పూర్తిగా విశ్వాసం కలగలేదు.

"మేము మోసం చేసేవాళ్లం కాము, వెన్నుమీద పొడవడం మాకు తెలియదు. పోట్లాడుతాము మళ్లీ మరిచిపోతాము" అన్నాడు కాబూలీ.

"నాకు చావంటే భయమేమీ లేదు. ఈ కరువుమూలాన అనేకమంది చచ్చిపోతున్నారు" అంటూనే "భగా! అతని చేతులు విడిపించు" అన్నాడు కాళా.

కోదర్ భగాలు తమకు ఇష్టం లేకపోయినా నెమ్మదిగా అతని చేతులు విడిపించారు. కాబూలీవాడు లేచి నిలబడ్డాడు. కాళా వైపుకు తిరిగాడు. వాడు ఏమి చేస్తాడోనని జనం భయపడ్డారు. కాళాకు గూడా మనస్సులో భయంగానే వున్నది. కాని ఆశ్చర్యకరమైన విషయమేమంటే – కాబూలీ కాళాను గాఢంగా ఆలింగనం చేసుకొన్నాడు.

ఇద్దరి కళ్ళూ కన్నీళ్లు కారుస్తున్నవి.

"నీవంటి ధైర్యశాలిని నేను ఇంతవరకు చూడలేదు. నిన్ను చూస్తే నాకు నా కుమారుడు జ్ఞాపకం వచ్చాడు" అని కాబూలీ బొటబొట కన్నీరు కార్చాడు.

15

"ఖుదాకు నా మీద దయ కలిగింది. లేకపోతే నీవంటి ధైర్యశాలి నా చేతుల్లో. . ."

బళ్లు ఖాళీగా బయలుదేరినవి. కాబూలీ తన చేతిలోని తుపాకీని రెండో సిపాయికి యిచ్చాడు. "ఈ తుపాకీ తలక్‌చంద్‌కు ఇచ్చి ఇక నా ముఖం అతనికి చూపించనని చెప్పు" అన్నాడు.

జనమంతా అక్కడ కూర్చున్నారు. అంతా హుక్కా తాగుతున్నారు. పొద్దుగూకబోయే సమయానికి కాబూలీవాడు లేచాడు.

"పొద్దుగూకుతున్నది. ఇప్పుడెక్కడికి?" అని అడిగాడు కాళా.

"బిడ్డా! నాకు పొద్దుతో సంబంధం లేదు" అన్నాడు కాబూలీ. అతని గొంతుక నిండివున్నది.

"ఇప్పు డెక్కడికి వెళ్లుతావు?" ప్రశ్నించాడు కాళా.

"నాకే తెలియదు. మా దేశం నుండి బయలుదేరినపుడు ఎక్కడికి వెళ్లు తున్నానో ఆలోచించానా? లేదు. ఇప్పుడూ అంతే" నన్నాడు కాబూలీ.

"ఈరోజు వుండు. రేపు ఉదయం నీ దోవ నీది. నా దోవ నాది. నీవు తలక్‌చంద్ ఉద్యోగం వదులుకున్నావు. మేము రేపు ఈ గ్రామాన్నే వదులుతున్నా" మన్నాడు కాళా.

కాని కాబూలీ అంగీకరించలేదు. ఎక్కువ బలవంతం చేస్తే పెద్దగా ఏడ్చేటట్లున్నాడు. అతణ్ణి ఆపడం ఇక సంభవంగాదని కాళా అర్థం జేసు కొన్నాడు. కాళా ఇంట్లోకి వెళ్లి తన తుపాకీ తెచ్చి కాబూలీవాడికిచ్చాడు.

"బాబాయీ! నీ తుపాకి నాది. నా తుపాకీ నీది" అన్నాడు కాళా.

"మంచిది" అని తుపాకీ చేతిలోకి తీసుకొన్నాడు కాబూలీ.

"నీవు నాకు చేసిన మేలు ఇది" అని కాళా తన చెయ్యి చూపించాడు.

"బిడ్డా! అది వీరత్వానికి చిహ్నం" అన్నాడు కాబూలీ.

కాబూలీ కాళాను గాఢంగా ఆలింగనం చేసుకొన్నాడు. చూస్తున్న వాళ్లంతా బొట బొట కన్నీరు కార్చారు.

"ఎవరం బ్రతుకుతామో, ఎవరం చస్తామో! కనిపెట్టి వుండు" అన్నారు జనం.

ఊరి చివరిదాకా కాబూలీవాని వెంట వెంట కాళా గూడా నడిచాడు. కాబూలీ సెలవు తీసుకొన్నాడు. కాళా ఎత్తైన గుట్టమీద నిలబడ్డాడు. పశ్చిమ దిక్కుగా అదృశ్యుడవుతున్న కాబూలీని రెప్పలార్పకుండా చూస్తున్నాడు.

## 36
# కష్టపు రోజులు

అది వైశాఖ మాసం. ఈ చెవిలోనుండి గాలి ఆ చెవిలోకి కొడుతున్నది. భూమిమీద పచ్చిగా ఒక్క గడ్డిపరక గూడా కనిపించడం లేదు. చెట్ల ఆకులన్నీ ఎండిపోయి వున్నవి. దుమ్ము విపరీతంగా ఎగురుతున్నది.

వీస్తున్న వేడి గాలి రైతుల హృదయాలను గూడా ఎప్పుడో మాడ్చి వేసింది. వర్షం కురిసే సూచన ఎక్కడా కనిపించడం లేదు. ఇంకా జ్యేష్ఠమాస మంతా ముందే వున్నది.

కాళా, రణఛోడుడు మొదలైన వాళ్ళంతా డేగడియా గ్రామం వలస చేరుకొన్నారు. ఐదారు వందల గడపలున్న ఆ గ్రామంలోకి వందల కొలది జనం పరిసర గ్రామాలనుండి చేరుకొన్నారు. అతికష్టంమీద కాళాకు ఒక ఇల్లు దొరికింది. పదిహేను పదహారు కుటుంబాలు ఆ ఇంట్లోకి చేరినవి. కాళా అత్తగారి కుటుంబం – అంటే రాజు కుటుంబం గూడా ఆ ఇంట్లోకే చేరింది. జ్యేష్ఠమాసం గడిస్తే ఆషాడంలో చూచుకోవచ్చు అనుకొన్నాడు కాళా. రెండు బళ్ల ధాన్యం కష్టంమీద పోగు చేసుకొచ్చాడు. ఒక్కొక్క కుటుంబానికి రెండేసి మణుగులు ధాన్యం లభించింది. శంకర్, రణ ఛోడుడి కుటుంబాలు పెద్దవి. నానా భార్య కుంటిది గూడా రణఛోడుని ఇంట్లోనే చేరింది. అందరి బాధ్యతా కాళామీద పడింది. అన్ని కుటుంబాలూ కాళా సలహా ప్రకారం నడుస్తున్నవి.

రోజులు కష్టంగా గడుస్తున్నవి. అంతా జీవన్మరణ సమస్యను ఎదుర్కొంటున్నారు. అందరూ కలిసి ఒకే వంట ప్రారంభించారు. వంట యింటి బాధ్యతను కాళా ఐదుగురు ఆడవాళ్లకు అప్పగించాడు. రణఛోడుని భార్య, భగా తల్లి, కోదర్ తల్లి, ఇంకా ఇద్దరు ఆడవాళ్లూ ఆ ఐదుగురు. పొయ్యిలోకీ కావాలి. పొయ్యిమీదికీ కావాలి. అప్పుడప్పుడు అన్నం సరిగ్గా వుడికేది గాదు. రొట్టెలు బాగా కాలేవు గావు. భలీకీ, భగా భార్యకూ ఆ తిండి ఎక్క లేదు. తగాదాలు ప్రారంభమైనవి. ఉప్పెక్కువని ఒక రోజూ, తక్కువని ఒక రోజూ ఒకటే తగాదాలు. అంట్లెవరు తోమాలి? అదొక పంచాయతీ. ఈ తగాదాలు ఎవరు తీరుస్తారు? విసుగుబుట్టి కాళా అంట్ల

కాబూలీ అదృశ్యుడైనాడు. కాళా కళ్లు తుడుచుకొన్నాడు.

ఇది గూడా ఒక భవాయీ నృత్యం. ఒక గంటముందు ఇద్దరం ఒకరి కొకరం శత్రువులం. ఒకరినొకరు చంపుకొనే ప్రయత్నం చేశాము. ఇపుడు ఇద్దరం ఒకరికొకరం ప్రాణ స్నేహితులం. ఇది భవాయీ నృత్యం గాక మరేమిటి?

తనలో తానే నవ్వుకొన్నాడు కాళా.

పని మగవాళ్లకు అప్పగించాడు. కాళా గింజల కొరకై కాలికి బలపం గట్టుకొని తిరుగుతున్నాడు. ఎవ్వరికీ ఏమీ పని దొరకడం లేదు.

ఐదో రోజు అతికష్టంమీద ఒకడికి నూనె గానుగమీద పని దొరికింది. కాసిం సిఫారసు దానికి అవసరమయింది. ఇంకొక ఐదుగురికైనా పనివ్వమని కాళా ఆ గానుగ యజమానిని కాళ్ళా వేళ్లా బడి బ్రతిమలాడాడు. లాభం లేకపోయింది.

పనిలేదు. పని దొరికితేనే సగం పొట్టయినా నిండుతుంది. "కాశీ కాకా! పొట్ట కొరకే ఈ రామాయణమంతా. సగం ఆకలి తీరాలి" అని కాళా ఎంత బ్రతిమాలినా లాభం లేకపోయింది.

"పిచ్చివాడా! అసలు ధాన్యమంటూ వుంటే గదా? పని యిచ్చినా లాభమేమిటి?" అన్నాడు కాశీకాకా.

చివరికి విసుగు జెంది తన వూరు పోయి విత్తనాల కొరకై అట్టె పెట్టిన గింజల్ని తెద్దామనుకొన్నాడు.

"వర్షం కురిస్తే?"

ఆశ విచిత్రమైనది.

పక్కన ఎవరో ఇల్లు కడుతూ వుంటే అక్కడికి వెళ్ళాడు. పని దొరుకుతుందేమోనని ఆశ.

అక్కడ జనం విపరీతంగా మూగివున్నారు. వచ్చిన జనాన్ని ఇంటి యజమాని సంబాళించ లేకపోతున్నాడు. కూలి రోజు రోజుకు తగ్గిపోతున్నది. సవా శేరు ధాన్యం కూలి పావు శేరయింది. చివరికి నవటాకు వరకు వచ్చింది. అయినా జనం ఎగబడుతున్నారు. అది గూడా దొరకడం లేదు.

డేగడియా గ్రామం జనంతో నిండిపోయింది. ఎక్కడ చూచినా జనమే. పోలీసు వాళ్ళకు భయం పట్టుకొన్నది. ఊళ్లోని షావుకార్లంతా దరఖాస్తు వ్రాసి పంపించారు. గ్రామంలో ఏ నిమిషంలోనైనా లూటీ జరగవచ్చును.

ఎనిమిదో రోజు గ్రామమంతా అట్టుడికినట్లు ఉడుకుతున్నది. పోలీసులు–అందులోనూ తెల్లవాళ్ళు – తుపాకులు దించుతున్నారు. కొత్తరకం తుపాకులవి. గుండ్లు నింపడానికి గూడా సమయమక్కర్లేదు. గుర్రం నొక్కగానే తుపాకుల వర్షం కురుస్తుంది.

మరుసటి రోజు ఊరంతా తెల్లవాళ్ళు కాపలా కాయడం ప్రారంభించారు.

ఆ కాపలా వాళ్ళ వంకకు చూచి క్షణకాలం జనం ఆకలి గూడా మరిచారు.

దేగడిచూ గ్రామం లూటీ అవుతుందని పోలీసులకు భయమా? కాళాకు చాలా నిరాశ కలిగింది. "ఓ పిచ్చి సిపాయిల్లారా! తుపాకులకు బదులుగా ధాన్యం బళ్ళల్లో నుండి దింపితే మేము మీకు కృతజ్ఞులంగా వుండే వాళ్ళం. మృత్యు దేవత నాట్యం చాలక తుపాకులు గూడా తెచ్చారా? జనాన్ని చంపడంలో చూపిస్తున్న తెలివిని జనాన్ని బ్రతికించడంలో చూపిస్తే ఎంత బాగుండును!!" అనుకొన్నాడు.

"ఈ అన్యాయం చూడండి. కొట్లల్లో ధాన్యమున్నది. జనం ఆకలికి చచ్చిపోతున్నారు. తుపాకుల వల్ల ఏమీ చేయలేక పోతున్నారు. పండించిన రైతులు ఆకలికి చస్తుంటే –పండించని షావుకార్లు సుఖంగా వుంటున్నారు. భగవంతుని ఇంట్లోనే ఈ అన్యాయమా?" ఏమేమిటో ఆలోచిస్తాడు కాళా.

కాని ఆలోచనల వలన ప్రయోజన మేమున్నది? వాస్తవ మేమంటే దినం శేరు ధాన్యం తినే పొట్టకు నవటాకు లభించడం లేదు. నిత్యం వందల కొలది జనం ఆకలికి తట్టుకోలేక మృత్యువాత పడుతున్నారు.

"పండించి పండించి మనం ఈ షావుకార్లకొట్లు నింపుతున్నాము. తలక్ చంద్ ఇంట్లో బంగారం మూలగడానికి మన కష్టం తోడ్పడుతున్నది" అన్నాడు కాళా.

కాళా తెల్లవార్లూ ఏమేమిటో తనలో తానే మాట్లాడుకుంటూ వుంటాడు. ఒక రోజు భలీ లేచింది. "సంతోషించాం. ఇక పడివుండు. ధాన్యమంతా పంచి పెట్టావుగా? నాశనపువాడా! ఇంకా ఎందుకు ఈ రొద?" అన్నది.

భగా చెల్లెలు రూఖీ అందుకొన్నది– "వదినా! నీ వెందుకు అరుస్తావు? ఆకలితో చచ్చేవాళ్ళు చస్తారు. నీకేమీ పరవాలేదుగా" అని సైగ చేసింది.

ప్రతి దినం అర్ధరాత్రి కాగానే ఇంటి తలుపు తెరుచుకొనేది. రూఖీ, భలీ వగైరా ఆడవాళ్ళు ఇంటి బయటకి వెళ్ళేవారు. కొంతమంది మగవాళ్ళు నిద్రబోతే కొంతమంది చూచీ చూడనట్లు వూరుకొనేవారు.

కాళాకు నిద్ర రావటం లేదు. కాళా ఎట్లా నిద్రబోగలడు? ఆడవాళ్ళు ఈ విధంగా పతితురాళ్లయి పోతుంటే సహించేదెలా?

తాను ఏమి చేయాలి? ఆత్మహత్య చేసుకోవాలా? రెండో రోజు నుండి అడవాళ్ళను ఇల్లు కదలనివ్వ గూడదనుకొన్నాడు.

ఉదయమే అందరికీ తన నిర్ణయం తెలియజేశాడు. కాని మిగిలిన వాళ్ళు అతనితో ఏకీభవించలేదు.

"మనం ఆపలేమన్నాడు" శంకర్. "ఇది విపత్కాలం. ఈ సమయంలో మనం ఎవ్వరినీ అదుపులో పెట్టలేము" అన్నాడు.

రెండు, మూడు రోజుల్లోనే శంకర్ మాట నిజమేనని కాళాకు తెలిసి పోయింది.

భగాకు ఒకచోట పని దొరికింది. "రెండు కొట్లు కాపలా కాస్తే ఒక రొట్టె కూలి. కాని నాకు మూడు రొట్టెలు దొరుకుతున్న వ" న్నాడు భగా.

కారణం ఇంటి యజమానురాలు అన్నాడు.

"ఇంటి యజమాని ఏమి చేస్తున్నాడు?" అని అడిగాడు కాళా.

"వాడు ఇంట్లో వుంటాడు. మనకు పని మంచెమీద. ధాన్యం గూడా అక్కడే వుంటుంది" అన్నాడు భగా.

"కరువు కాలంలో ఏమేమి జరుగుతుందో ఎవరు చెప్పగలరు?"

అతడు తన హృదయాన్ని తాను ప్రశ్నించుకొన్నాడు. "ఆకలివలన జరగరాని పనులు జరుగుతున్నవి. కడుపు నిండితే..."

అది ఒక్కటే సమస్య.

డేగపీయా గ్రామంలోని గల్లీ గల్లీకి తిరిగాడు. ఇంటింటికీ పోయి— "ఆకలికి చచ్చిపోతున్నాను. ఒక ముద్ద పెట్టించమ్మా! పనివ్వమ్మా!" అని అడిగాడు.

ఒక రోజు రెండు జాముల సమయంలో ఒక విధవరాలు ఆవుకు గ్రాసం పెడుతున్నది. అవి తనకిప్పించమని బ్రతిమలాడాడు కాళా.

"నాశనపు వాడా! ఆవు నోటి కింది గ్రాసం నీవు తింటావా?" అని " విధవరాలు రెండు తిట్లు తిట్టి- "అయితే పాత్రలు తోము. రెండు రొట్టెలిస్తా" అన్నది.

కాళా అమితానందం పొందాడు.

పాత్రల్ని అద్దంలాగా మెరిసేటట్లు తోమిపెట్టాడు.

నీళ్ళు పోస్తుంటే ఆ విధవరాలికి ఆ పాత్రల్లో తన ప్రతిబింబం కని పించింది. "చేతులు కడుక్కో. నీది ఏ జాతి?" అని అడిగింది.

"పటేళ్ళం" అన్నాడు గర్వంగా కాళా.

ఆ రోజు పూర్తిగా కాకపోయినా అతని పొట్ట సగం నిండింది. ఆమె తన కోసం రాత్రికిగాను అట్టిపెట్టుకొన్న భోజనం కాళాకు పెట్టింది.

ఆమె ఆ రోజు తన మీద చూపించింది మానవత్వం మీది దయ అని తెలుసుకొన్నాడు.

ఏమైనా మానవులు మానవత్వాన్ని గూడా వదలివేస్తున్నారు. సంయమాన్ని త్యజిస్తున్నారు. మానావమానాలనూ, గౌరవ ప్రతిష్ఠలనూ మూటగట్టి మేకుకు తగిలిస్తున్నారు. వారి ముందున్న సమస్య వొక్కటే వొక్కటి. ఈ పొట్ట పూడడమెలా? ఆకలి తీరే విధమేమిటి?

శంకర్, రణఛోడుడు మొదలైన వాళ్ళు గౌరవ మర్యాద వదిలి వేశారు. గడ్డ పలుగు, పార తీసుకొని కోడి కూయగానే లేచేవారు. ఒక రోజు కూలి దొరికితే నాలుగు రోజులు దొరికేది గాదు. ఏ రెండు రొట్టెలో దొరికితే పొట్ట నింపుకొనేవాళ్ళు. లేకపోతే కాళ్ళు ముడుచుకొని పడుకొనేవాళ్ళు.

కుక్కలూ మనుష్యులూ రొట్టెకొరకై పోట్లాడుకొనడం గూడా తరచు జరగడం ఆరంభించింది.

ధాన్యం పండించిన వాళ్ళ గతి ఇది.

ధాన్యపు కొట్ల ముందు తుపాకులు బారులు దీర్చి కూర్చున్నవి.

లూటీ జరగడమెలా? లూటీ జరుగుతుందనే పుకారు మాత్రం గ్రామమంతా వ్యాపించి వున్నది.

కొంతమంది తుపాకులకూ కొంతమంది ఆకలికీ చచ్చి పడిపోతున్నారు.

ఒకరాత్రి కొంచెం చీకటి బడింది. కాళా బావ గిద్దెడు గింజలతో ఇంటికి పోతున్నాడు. పక్కనున్న కిటికీలోనుండి "కుక్క కుక్క" అని ఎవరో అరిచారు. అతడు కిటికీ వైపుకు రెండడుగులు వేశాడు. ఇంతలో ఎవరో "దొంగ దొంగ" అన్నారు. గస్తీ తిరుగుతున్న పోలీసు గుండు పేల్చాడు. అతడు కుప్ప కూలాడు.

కాళా అందుకు గూడా సంతోషించాడు. చితి ముందు నిలబడి కనీసం ఒక్కరికైనా విముక్తి లభించిందనుకొన్నాడు.

రాజు భోరు భోరున ఏడ్చింది. తానేమి చేయగలదు?

తెల్లవాళ్ళను గురించి-"మీరు దేవతలను కొన్నాము. మీరు రాక్షసులు" అన్నాడు. ఎవరు వింటారు? కాళా గోల ఎవరికి కావాలి?

సాహసించి ఏమైనా చేద్దామంటే కోదర్ భగాలు గూడా తనతో సహకరించడం లేదు. తుపాకులు షావుకార్లకే సహాయం చేస్తున్నవి. ఖలీ గూడా తన దోవ తాను చూచుకొంటున్నది. ఎవరికి వారే. ఎవ్వరికీ ఎవ్వరూ లేరు.

కాళాను గురించి ఆలోచించే వాళ్లెవరున్నారు?

ఒక్క రాజు మాత్రం కాళా విషయంలో శ్రద్ధ వహిస్తున్నది. కాళాకు జీవితం మీద నిరాశ కలుగుతున్నది. అతనికి రెండే వస్తువులు కనబడుతున్నవి. ఒకటి రాజు, రెండోది మృత్యువు.

మృత్యువు సమీపిస్తూనే వున్నది. బతికిన రెండు ఘడియాలూ సంకోచం లేకుండా రాజుతో కలిసి తిరుగుదామనుకొన్నాడు.

మృత్యువు క్షణాలను లెక్కిస్తున్నది రాజు.

ఒకరికొకరు ధైర్యం చెప్పుకొని ఆ ఇద్దరూ — కష్టపు దినాలను గడుపుతున్నారు. ఒకరి తల ఇంకొకరి వొడిలో వాల్చి మృత్యువును ఆలింగనం చేసుకొనడానికి సిద్ధంగా ఉన్నారు.

# 37
# రోట్లో తల

జ్యేష్ఠమాసం పూర్తికాగానే వర్షం కురుస్తుందనే ఆశ కాళాకు చావలేదు. మేఘరాజు నిద్రబోతున్నాడో లేక ఏమి చేస్తున్నాడో ఎవ్వరికీ తెలియడం లేదు.

భూమి మీద మృత్యుదేవత ప్రళయనాట్యం చేస్తున్నది. ఎక్కడ చూచినా శవాలే. ఎవరు తగలబెడతారు? ఎవరు పూడ్చిపెడతారు? ఎవరు సూతకం పడతారు?

విత్తనాల గింజలు గూడా తిండికింద ఉపయోగ పడుతున్నవి. రాజు, ఆమె తోడికోడలు, పిల్లలిద్దరు, భలీ తాను ఇంతమంది బ్రతకడమెట్లా? రాజు తోడికోడలూ, ఆమె బావా మృత్యువుపాలైనారు. ఒక రకంగా సంతోషించినా కాళా చాలా విచారించాడు.

ఆషాఢం గూడా గడచిపోయింది. మేఘం జాడలేదు. ఎండ తీవ్రంగా ఉన్నది.

ఇక బ్రతకడానికి లూటీ చేయడమొక్కటే ఉపాయమనుకొన్నాడు కాళా. కాని ఒక్క చేత్తో తానేమి చేయగలడు? భగా, కోదర్లకు ఆ సాహసం లేదు.

ఇట్లా వుండగానే డేగడియా గ్రామంలోని షాహుకార్లంతా కలిసి ఒక ఆలోచన చేశారు. కొత్త యిళ్లు కట్టడం ప్రారంభించారు. దానితో కొంత మందికి పని లభించింది.

రైళ్లు వేశారు ఇంగ్లీషువాళ్లు. పట్టణాలలోకి పొమ్మని కొంతమంది రైతులకు సలహా చెప్పారు. కాని వాళ్ళెక్కడికి పోగలరు? డేగడియా గ్రామం రావడమే వాళ్లకు పెద్ద విషయం. అహమదాబాదు, బడోదావంటి పట్టణాలు వాళ్ల దృష్టిలో పరలోకాలు. అయినా కొంతమంది ప్రయాణం చేశారు. వారు గమ్యస్థానం చేరుకొన్నారో లేదో భగవంతునికే తెలియాలి. ఎవరు ఎక్కడ ఎందుకు తిరుగుతున్నారో ఎవ్వరికీ తెలియదు. ఎవ్వరూ పట్టించుకోరు. లేకపోతే మహమ్మదీయునితో కుంటిధి లేచిపోతే నానా పట్టించుకోకుండా వుండేవాడా?

దేగడియా గ్రామంలోని వైష్ణవులు ఒక ఉపాయం ఆలోచించారు. శేఠ్ సుందరదాసు వారికి నాయకత్వం వహించాడు. తులసీదాసు దోహా ఆయన అందరికీ వివరించాడు.

"తులసీ హాయ్ గరీబ్ కీ కబీ నా ఖాలీ జాయ్
మురీ ఢోర్ కే చామ్ సే లోహా భస్మ హోజాయ్

బీదవాళ్ల దుఃఖం ఊరికేపోదు. చచ్చిన గేదె చర్మంతో ఇనుము గూడా భస్మమైపోతున్నది.

దేగడియా గ్రామంలోనివారు సుందర్ శేఠ్ సలహా విన్నారు. కొట్లల్లోని ధాన్యాన్ని బయట పెట్టారు. సగం అట్టిపెట్టుకొని మిగిలిన సగం సుందర్ శేఠ్‌కు అప్పగించారు.

సదా వృత్తి ప్రారంభమయింది. మొదట సంఖ్య తక్కువగా వుండేది. రాను రాను సంఖ్య పెరిగిపోయింది. రాజు కాళాను వారిలో చేరమని ప్రోత్సహించింది.

"కొట్లల్లో మనం పండించిన ధాన్యమున్నదని నేను చెప్పలేదా?" అన్నాడు కాళా.

"చెప్పావు"

"ఆ ధాన్యం మనదే గదా?"

"కావచ్చును. కాని ప్రయోజనమేమిటి? ప్రస్తుతం వ్యాపారస్థులు దాన్ని పంచిపెడుతున్నారు. తీసుకొనడానికి మనకు సందేహమెందుకు?" అన్నది రాజు.

"మన ధాన్యం మనకే బిచ్చంగా లభిస్తుందని అర్థం అవునా?"

"అవన్నీ తరువాత ఆలోచించవచ్చును. ఇద్దరు పిల్లలూ చావుకు సిద్ధంగా ఉన్నారు" అన్నది రాజు.

"నేను నీతో గూడా వస్తాను. కాని చెయ్యిజాచి బిచ్చమడగను" అన్నాడు కాళా.

"నీ కొరకు గూడా నేను చెయ్యి జాపుతాలే" అన్నది రాజు.

"పిచ్చిదానా! ఈ పావుశేరు పులగంతో నా పొట్ట నిండుతుందను కొంటున్నావా? రెండు శేర్లు తినే పొట్ట నాది. పిచ్చి రాజూ! మృత్యువును ఎదుర్కొంటున్న ఈ రోజుల్లో రైతుబిడ్డ చేత ముష్టి ఎందుకు ఎత్తిస్తావు? వద్దు రాజూ! వద్దు నీవు వొక్కతివే వెళ్లు" అన్నాడు.

కాని రాజు మాట కాదనలేక ముందుకు సాగాడు. పులగం కొరకై వరసగా నిలబడివున్న దరిద్ర నారాయణుల్ని చూచాడు. స్త్రీలూ, పురుషులూ అర్ధనగ్నంగా–ఎముకల పోగులుగా నిలబడివున్నారు. వారిలో అన్ని జాతులవాళ్లూ వున్నారు. అయితే పెద్ద సంఖ్యలో ఠాకుర్లున్నారు. మహమ్మదీయులు గూడా ఉన్నారు. వారిని చూడగానే కాళా కాళ్లు ఆగిపోయినవి.

రాజు "నా వెనక నిలబడు. ఈ చిన్నపిల్లల మీద దయ చూపించు" అని కాళాను బ్రతిమిలాడింది.

కాళా నిలబడి నలువైపులా తేరిపార జూచాడు. గద్దెమీద సుందర్ శేఠ్ తెల్లటి ధోవతి, జరీ అంచు ఉత్తరీయమూ ధరించి కూర్చొని వున్నాడు. కొంత మంది వ్యాపారస్థులు శేఠ్ చుట్టూ కూర్చొని వున్నారు.

తుపాకీ చేతితో పట్టుకొని ఆ పక్కన జమేదార్ కుర్చీమీద కూర్చొని వున్నాడు. కొంతమంది సిపాయీలు గస్తి తిరుగుతున్నారు. "వచ్చిన వాళ్లు వాళ్ళ వరుసలోకి వస్తే ఇదిగో తుపాకీ" అని తుపాకీ చూపిస్తున్నారు.

రాజూ, కాళా వరుసలో నిలబడ్డారు. నానా గూడా ఆ వరసలో ఉన్నాడు. ఆకలి ఎంత చెడ్డది! కాళా కళ్లు కన్నీళ్ళతో నిండినవి. అతని తల తిరిగిపోతున్నది. తమ ముందు చేతులు జాపిన వాళ్ళముందే తాము ఈ రోజు చేతులు జాపే స్థితి ఏర్పడింది. అద్దెనా పావు శేరు పులగం కొరకు ఈ జీవితం వ్యర్థం అనుకొన్నాడు.

"శంకర్ రణఛోడుడు ఇద్దరూ చేతులు జాపడానికీ, ఈ దృశ్యం చూడడానికీ ఈ లోకంలోనే లేరు. మిగిలింది తాము" అనుకొన్నాడు.

పది నిమిషాలు గడచినవి. కాళా నెమ్మదిగా వరసలోనుండి పక్కకు తప్పుకొన్నాడు.

"ఒరేయి కుంటివాడా! ఎక్కడికిరా పోతున్నావు?" అని ఒక సిపాయీ గద్దించాడు.

"ఇంటికి" అన్నాడు కాళా.

"ఒరేయి భూతం! నిలబడు" అన్నాడు సిపాయి.

కాళా నిలబడ్డాడు.

"ఒరేయి నీవు గవర్నరువా? పులగం వద్దా? ఏమి తింటావురా?" అన్నాడు సిపాయి.

కాళాకు ఆశ్చర్యం కలిగింది.

"గవర్నర్ని అయితే బిచ్చం తీసుకొనేవాణ్ణే. నేను రైతు బిడ్డను. నాకీ బిచ్చం అక్కర్లేదు. నీవు చంపదలచుకొంటే నీ యిష్టం" అన్నాడు కాళా.

జనమంతా కాళా వైపుకు చూస్తున్నారు.

సుందర్ శేఠ్ జమేదార్ల దృష్టి గూడా కాళామీద పడింది. సిపాయిలు కాళా చుట్టూ గుమిగూడక పూర్వమే సుందర్ శేఠ్ కాళాను తన దగ్గరికి పిలిపించుకొన్నాడు.

"పటేలూ! ఏమిటి కథ? నీకు పులగం అక్కర్లేదా?" అని అడిగాడు.

కాళా ఏమి జవాబిస్తాడు! వాళ్ళకు రైతు హృదయం తెలియదు. ఈ ధాన్యమంతా మేము పండించినదేనని మేమంటే వెంటనే తుపాకులు బయటికి తీయిస్తారు.

మనస్సులోనే కాళా-బిచ్చానికంటే ఈ తుపాకుల్ని నాశనం చేయడానికి చెయ్యి ఎత్తగలిగితే బాగుండుననుకొన్నాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నావు?" అని సుందర్ శేఠ్ అడిగాడు. అతని మాటల్లో సానుభూతి వ్యక్తమవుతున్నది.

కాళా కన్నీరు కార్చాడు. "శేఠ్‌జీ! మేము పండించిన ధాన్యం మా కళ్ళ ముందుండి - మాకీ గతి పడితే మా హృదయం ఎలా దహించుకొని పోతుందో ఆలోచించండి" అన్నాడు.

కాళా వెక్కి వెక్కి పెద్దగా ఏడ్చాడు.

శేఠ్‌తో మాట్లాడుతూ ఏడుస్తున్న కాళాను చూచి నానా "విధవముండ ఏడుపు. ఆ ఏడుపేమిటి?" అన్నాడు.

"జమేదార్ ఎవడురా వాడు?" అని నిలబడ్డాడు. కాని సుందర్ శేఠ్ మధ్యలోనే అందుకొన్నాడు.

"నీకు బహుశా పులగం తీసుకొనడానికి సంకోచంగా వున్నట్లున్నది. సదావృత్తి ప్రారంభించవలసి వచ్చినందుకు మాకు గూడా సిగ్గుగానే వున్నది. మీరు రైతులు. పృథ్విని పాలించేవాళ్ళు. మిమ్మల్ని మేము రక్షించగలమా? కాని ఆ మేఘ రాజుకు దయలేకుండా పోయింది. పిచ్చి వాడా! మన చేతిలో ఏమున్నది? ప్రకృతి ముందు మనమెంత వాళ్ళం? శక్తి విహీనులం. ఒక్కసారి నీవు నా వంకకు చూడు" అన్నాడు శేఠ్.

కాళా తలెత్తి చూచాడు.

"రేపటి నుండి నీవు ఇక్కడికి వచ్చి ఈ గది వూడ్చి ఈ ప్రదేశమంతా శుభ్రం చేయి. పరిశ్రమ చేసి తినడంలో తప్పేమీ లేదు గదా?" అన్నాడు శేర్.

కాళా శేర్ ఔదార్యానికి తలవొంచి నమస్కారం చేశాడు. వెళ్ళి వరుసలో నిలబడ్డాడు.

కాళాను చూడగానే ఆ పక్కనున్న సిపాయికి కంట్లో కారం పెట్టుకొన్నట్లనిపించింది. కారణం భగవంతునికే తెలియాలి. కాని ఏమి చేయగలడు? కాళామీది కోపం ఇంకొకరిమీద చూపించడం ఆరంభించాడు.

పావు శేరు పులగం తీసుకొని పోతున్న కాళాకు నవ్వు వచ్చింది. "ఈ పులగం ఏ మూలకు?" అనుకొన్నాడు.

రాజు కాళాకు నచ్చజెప్పింది. "భూతాలలోకల్లా మహాభూతం ఏమిటో తెలుసునా?" అని అడిగింది.

"ఆకలి" అన్నాడు కాళా.

"కాదు. చింత. అది మనుష్యుని గుండెల్ని పీల్చి పిప్పి చేస్తుంది" అన్నది.

"అవును, అదీ నిజమే" అంగీకరించాడు కాళా.

"పెద్దవాటిల్లో కల్లా పెద్దదేమిటో తెలుసా?" కాళా ప్రశ్న వేశాడు.

"ఆకలి"

"కాదు, మొదట నేను గూడా అంతే అనుకొన్నాను. ఈ రోజు నుండి అభిప్రాయం మార్చుకొన్నాను" అన్నాడు కాళా.

"ఆకలికంటే గూడా పెద్దది భిక్షం. ఆకలి ఎముకల్ని మాంసాన్ని హరిస్తుంది. కాని ఈ భిక్షం ఆత్మనే హరిస్తుంది" అన్నాడు.

కాళా మాటలు విని రాజు భరించలేక పోయింది. ఆమెకు చాలా దుఃఖం కలిగింది. అయినా పైకి గంభీరంగా "నీవు నోరు మూసుకొని ఒక మూల పడివుండు. మా దుంప తెంచుతున్నావు" అన్నది.

రాజు మాటతో కాళాకు నిషా దిగినట్లనిపించింది. పశ్చాత్తాపాన్ని వెలిబుస్తూ పసిపిల్లవాడిలాగా రాజుముందు నిలబడ్డాడు.

ఆషాఢం గడిచిపోయింది. ఈ బిచ్చంతో – సదావృత్తితో ఎంతకాలం గడుస్తుంది?

సదావృత్తికి పోయి ఇంటికి వచ్చిన కాళా ఒక రోజు ఇంటి వాకిట్లో స్పృహ తప్పి పడిపోయాడు.

రాజు భయభ్రాంతురాలయింది. చుట్టుపట్లవున్న వాళ్లనందర్ని పిలిచింది.

కోదర్, భగా, రూఖీ, భలీ అంతా పరుగెత్తుకొని వచ్చారు.

రాజు కాళా తల వొత్తుతున్నది. కోదర్ కాళా ముఖం మీద నీళ్లు చల్లుతున్నాడు. భలీ తిడుతున్నది. "నాశనపు వాడా! నీకు ఇంతపని జరగవలసిందే? ఊళ్లోవాళ్ళ భారమంతా నెత్తిన వేసుకొన్నావు" అంటున్నది.

కాని భలీ మాటల్ని ఎవ్వరూ లక్ష్యపెట్టలేదు.

రూఖీ మాత్రం చిరునవ్వు నవ్వుతూ పూల లంగా సరిజేసుకొంటూ "భలీ! నోరు మూసుకో.. చచ్చేవాళ్ళు చస్తారు.. నీ కేమీ లోటులేదుగా!.." అన్నది.

## 38

## ఆకాశంలోనుండి అమృతం

ఆషాఢం గడిచింది. వర్షంమీది ఆశ సన్నగిల్లింది. ఎండుటాకులు రాలినట్లు జనం చచ్చి రాలిపోతున్నారు. ఎక్కడ చూచినా ఆకలీ, మృత్యువూ తాండవమాడుతున్నవి.

కాళా వర్షం కొరకై ఎదురు చూచి చూచి విసుగుజెందాడు. విదియ, తదియ, చవితి గూడా గడచిపోయినవి.

పంచమి గూడా గడవగానే కాళా కాళ్లు విరిగిపోయినట్లయింది. ఇక ఈ భూమిని ఎవరు రక్షిస్తారు?

అయినా ఏదో ఆశ! నవమి, దశమి, ఏకాదశి గూడా గడచిపోయినవి. మానవుని ధైర్యానికి గూడా హద్దుంటుంది. ఎవరికీ ఏమీ తోచడంలేదు. రాజు ఏమి చేస్తుంది? ఇద్దరు పిల్లల భారం ఆమె నెత్తిమీద వున్నది.

ఆకులూ అలమలూ ఏరితెచ్చి రోజులు గడుపుతున్నది. తన గ్రామం వెళ్లి ఎద్దుల్ని ఏదో చేసి డబ్బు తెద్దామనుకొన్నాడు కాళా. కాని రాజు అందుకు అంగీకరించలేదు. "మనం బ్రతికేది ఒక రోజో రెండు రోజులో. ఎక్కడికీ వెళ్లవద్ద"న్నది రాజు.

రాజు కాళాకంటే గూడా బలహీనంగా వున్నది. ఆమె నెత్తిమీద ఇద్దరు పిల్లల భారమున్నది. జీవితమంటేనే ఆమెకు భయం ఏర్పడింది.

భలీ రూఖీలు పకపకలాడుతున్నా — కోదర్ భగా మొదలైన వాళ్లెవ్వరూ పట్టించుకొనడం మానివేశారు.

కాళా ఆలోచించాడు. ఇక బ్రతకడం కష్టం. మృత్యువు మనకు తప్పదు. కనుక రాజూ తానూ ఆ వటవృక్షం కిందకు పోయి అక్కడే మృత్యు ముఖంలో పడితే మంచిదనుకొన్నాడు. ఇద్దరి ప్రాణ పక్షులూ రెక్కలూ రెక్కలూ కలుపుకొని గానం చేస్తూ స్వర్గానికి బయలుదేర గలవు అనుకొన్నాడు.

రెండో రోజు పావుశేరు పులగం నీళ్లతో తాగి రాజును గూడా ప్రయాణం చేశాడు. అందరి దగ్గరా తాను సెలవు తీసుకొన్నాడు. రాజు బయలుదేరింది. పిల్లల్ని వదలలేక పెద్దగా ఏడ్చింది. ఆమె కాళ్లు ముందుకు సాగలేదు.

''భార్యలు భర్తల్నీ, భర్తలు భార్యల్నీ వదులుతున్నారు. తల్లులు పిల్లల్ని వదులుతున్నారు. నీవు ఈ పిల్లల్ని ...'' కాళా మాటల్ని రాజు మధ్యలోనే అందుకొన్నది. ''నేనూ వదులుతున్నాను...'' అంటూ రాజు ఎవరో ఈడ్చుకొని పోతున్నట్లుగా కాళా వెంట ముందుకు సాగింది.

వారి మనస్సుల్లో వున్న బలమైన కోరిక వాళ్లను నడిపిస్తున్నది. అంతేగాని వారి శరీరాలలోని శక్తి గాదు. దోవలో కాళా ఏమీ మాట్లాడ లేదు. మాటి మాటికీ మేఘాలున్నవేమోనని ఈశాన్య దిక్కుకు మాత్రం చూస్తున్నాడు. ఎక్కడా ఏమీ కనబడడం లేదు. కొంతదూరం పోయిన తరువాత మౌనాన్ని వదిలాడు. మాటలు ప్రారంభించాడు.

''ఇక మృత్యువు తప్పదు. రాజూ! ఆకలి ప్రాణాలను పెకలిస్తున్నది'' అన్నాడు.

రాజు కాళా ముఖం వైపుకు చూచింది. కాళా ముఖం మీద నిస్సహాయ స్థితీ, విచారమూ తాండవిస్తున్నవి. ఆమె దడ దడ లాడింది.

కాళా కళ్లతో కళ్లు కలవగానే ఆమెలో మళ్లీ ధైర్యం ప్రవేశించింది.

''నీవు మగవాడివి. ఆకలితో యుద్ధమిది. అధైర్య పడగూడదు'' అన్నది.

''ఎంతటి విపత్తులోనూ నీవు ధైర్యంగా వుంటావు రాజూ!'' అన్నాడు కాళా.

రాజు బొట బొట కన్నీళ్లు కార్చింది.

''భూమి మీద నుండీ ధాన్యం తగ్గిపోతున్నది. నీళ్లు తగ్గిపోతున్నవి. కాని నీ కళ్లల్లోని కన్నీరు మాత్రం తగ్గడం లేద''న్నాడు కాళా.

''అసలు ఈ జీవితమే అతుకులబొంత. అది గూడా అంతం కాబోతున్నది'' అంటూ ఏ చెట్టు బెరడైనా దొరుకుతుందేమో చూద్దా మన్నది.

కాళా నడవలేక నేలమీద కూర్చున్నాడు. నెమ్మదిగా పడుకొన్నాడు. వెర్రినవ్వు నవ్వాడు. ''మానవ జీవితమెత్తి ఈ చెట్ల బెరళ్లు తిని చాలా రోజులు బ్రతికాను. ఇక నావల్ల గాదు. నేను ఇక కదలలేను. నీవు వెదకి తెచ్చుకో'' అన్నాడు.

''రాజూ! ఇక నేను లేవలేను. నా పని పూర్తి అయినట్లే'' అని రెండు

చేతులతో ముఖం కప్పుకొని "నీవు వెళ్లు. నా చావు వార్త స్నేహితులకు చెప్పు" అన్నాడు.

"అయినా ఈ వార్త ఎవరికి చెప్పుతావు? భార్యకా?.. వద్దు. వద్దు. చచ్చిపోతూ నేను ఎవ్వరి మీదా నిందా రోపణ చెయ్యను. తప్పంతా ఈ పాపిష్టి పొట్టది. మానవ జీవితం మంచిదే. ఆకలే చెడ్డది" అని వెల్లకిలా పడుకొన్నాడు.

ఆ దృశ్యాన్ని చూచి రాజు భయపడింది. వటవృక్షం తాలూకు కొమ్మ పెను గాలికి విరిగి కాళా వక్షః స్థలం మీద పడినట్లనిపించింది.

రెండు ఆత్మలూ భోరు భోరున ఏడుస్తున్నవి.

కోరగానే మృత్యువు లభిస్తుందా? లభిస్తే మానవజన్మ ఎప్పుడో సార్థక మయ్యేది. ప్రబల ఝంఝూవాతంలో గూడా మృత్యువు తొందరగా మానవుణ్ణి సమీపించదు. అలసిపోయిన కాళా వక్షఃస్థలం మీద తన వక్షః స్థలాన్ని ఆనించి కాళా తల నిమిరుతూ "దురదృష్టవంతులమైన మనల్ని మృత్యువు గూడా తొందరగా సమీపించదు. ధైర్యం వహించు. జీవితంలో చివరి ప్రయత్నం చేద్దా" మన్నది రాజు.

కాళా నిజంగానే లేవలేని స్థితిలో వున్నాడు. చిగురు గానీ, నీళ్లు గానీ, దొరికితే..

చిగురు ఎక్కడ దొరుకుతుంది! నీళ్లు అనే విషయం జ్ఞాపకం రాగానే ఆమెకొక ఆలోచన తోచింది.. కాళా కళ్లు తన వక్షఃస్థలం మీద ఉన్నవి.

రాజు అది చూచి దీర్ఘంగా నిట్టూర్చింది. కాళా కళ్లల్లో ఏవో చిరునవ్వు లాంటిది కనిపిస్తున్నది.

తన ఉరోజాలను కాళా నోటి దగ్గరకు చేర్చింది. కాళా నరాలలో విద్యుత్తు వ్యాపించింది. మోచేతి బలంమీద లేవబోయినాడు. కాని అంతకు ముందే రాజు స్వయంగా అతని మీదకు వంగింది..

రాజు స్తనాలలోనుండి పాలు బయటికి వస్తున్నవో లేక కాళా నోట్లోనే అమృతం వున్నదో భగవంతునికి తెలియాలి. అతని దాహమంతా తీరి పోయినట్లయింది. శరీరం చల్లబడింది. అతని కళ్లలో చైతన్యం వ్యాపించింది. అతని ముఖంమీద చిరునవ్వు తాండవించింది.

రాజు తన్మయురాలై కాళా ముఖాన్ని చూస్తున్నది. అమె చేతులు అతణ్ణి పెనవేసుకొని వున్నవి.

ఈశాన్య దిక్కుకు రెప్పలార్పకుండా చూస్తున్న కాళా కళ్లు అకస్మాత్తుగా ప్రకాశించినవి "రాజూ! చూడు. విను" అన్నాడు.

కాళా అకస్మాత్తుగా లేచి కూర్చున్నాడు.

రాజు గూడా ఈశాన్య దిక్కుకు చూచింది. ఆనందంతో ఆమె హృదయం నిండిపోయింది. కాళా లేచి నిలబడ్డాడు. గంగను తెస్తున్న భగీరథుడులాగా వున్నాడు.

ఈశాన్య దిక్కున చిన్న మబ్బు లేచింది. అది పెద్దదయింది. ఆకాశం మీదను వ్యాపించింది. చిన్నగా ఉరిమింది. ఒక్క మెరుపు మెరిసింది. మానవుడు చేస్తున్న భవాయీ నృత్యాన్ని చూచి మేఘం భయపడిందా, ఆనందించిందా, కోపగించిందా !!..

ఏమైనా ఆ కోపం, ఆ ఆనందం మానవజాతికి క్షేమకరమయింది. ఆనందదాయకమైనది.

అయినా మేఘం వర్షిస్తుందో లేదో!! సందేహం. అమృతబిందువులు ప్రారంభమైనవి. కాళా శరీరంమీద నీటి చినుకులు పడుతున్నవి. అతని శరీరంలోని రోమ రోమంలో నవ చైతన్యం వ్యాపించింది.

ఆ పృథ్వీ పుత్రునికి తానేమి చేయాలో తోచలేదు. తాను నాట్యం చేయాలా? లేక అవధూతలాగా కూర్చొని వుండాలా? పాటలు పాడాలా లేక కన్నీళ్లు కార్చాలా?

కాళా పిచ్చివాడైనాడు.

రాజు స్థితి గూడా అలాగే వున్నది.

ఆమె హృదయం ఉప్పొంగి పోతున్నది.

"లే. పద. నడువు. చీకటి పడుతున్నది" అన్నది రాజు.

కాళా ఆరోగ్యవంతుడైనాడు. "చీకటిపడితే ఏమవుతుంది?" అని రాజు కళ్లల్లోకి చూచాడు.

"జీవితానికి మార్గం దొరికింది. ఎడారివంటి ఆకాశం అమృతాన్ని వర్షిస్తున్నది. రాజూ! చీకట్లో కాళ్లు ఇక తొట్రుబడవు" అన్నాడు.

క్షణకాలం నిశ్చేష్టురాలయింది. కాళా అంతరాత్మ మాట్లాడుతున్నదని అర్థం జేసుకొన్నది.

"ఎడారి వంటి ఆకాశం అమృతాన్ని వర్షిస్తున్న మాట నిజమే. పద. ఇక లే. నడువు. నఖరాలు చేయకు" అన్నది.

కాళ్లా ఏదో అనబోతున్నాడు. రాజు తన రెండు చేతులతో అతని నోరు మూసివేసింది.

"ఇక నడువు" అన్నది.

మెరుపులు మెరుస్తున్నవి. ఉరుములు ఉరుముతున్నవి. ఆకాశం భూమీ ఏకమైపోయినవి. ఏమి వర్షం! ఏమి వర్షం! మేఘాలు తాండవనృత్యం చేస్తున్నవి.

కాళ్లా ముందుకు నడుస్తున్నాడు. రాజు అతని చెయ్యి పట్టుకొని అతని వెంట వెంట నడుస్తున్నది.

"ఇక ఈ పురుషుణ్ణి యమధర్మరాజు గూడా ఓడించలేడు—చంప లేడు-" అనుకొన్నది.